


చెన్నపట్టణము, నవంబరు ౧౯౨౭

సంపుటము ౪ | ప్రభవ సంవత్సరము కార్తికమాసము | సంఖ్య ౧౧


# ఝరీతరణము


మద్దిపట్ల వేంకటరమణయ్య గారు


ప్రథితమేవాడరాజ్యసంభరణశాలి,
వీరనిలయ సిసోదియావారిధీందుఁ,
డల్ల రాణా ప్రతాపసింహాధిపుండు
నెడు నొక్కఁడుఁ జైత్రకాశ్వంబుమీఁద.

తలపరాజయానలశిఖాదహ్యమాన
హృదయుఁడై యేఁగుచుండె నర్వీధవుండు [?]
నడచుచున్నాఁడొ హయ మెక్కినాఁడొ కాక
యెఱుఁగలేకుండఁ దను దాను మఱచిపోయి.

ధాటిఁ దూఁపువలె దూఱుటయె కాని
నఁ బిక్క చూపని మేలుతేజి
నాఁడు విడి హాల్దిఘాటు రణస్థలంబుఁ
బఱచెడు నలంఘ్యదైవవిపాకమునను.

అరుగునది దుర్గమంబైన యటవిసీమ;
త్రోవఁ జూపలేఁ డొక్కపురోగముండు;
తెటుకునను గొండకొమ్మున దారి యాఁగె;
మిగుల నొఱకమై కొండయు ముగిసె నచట.

తొంగిచూచెను తాడిలోఁతునను గ్రింద
నెడతెగని ఘోషమున సెలయేఱు పాఱు;
భయదమై మృత్యువదనగహ్వరము భాతి
నేఁబదడుగుల వెల్పున నెసఁగె లోయ.

చెంత వినఁబడెఁ బెనుకేక లింతలోన
వెనుదిరిగిచూచె మన్నీఁడు; కనఁగనయ్యెఁ
"పోకు మోసక్షత్రియుఁడ! పాఱిపోకు" మంచు
వెంబడించెడు రిపులయాశ్వికదళంబు.

తొమ్మిదీటెలయెడము మార్తురకుఁ దనకు;
నుఱుకవలె నద్దరికిఁ గాక దొరకవలెను
గఱకుఁదురకల క్రూరంపుఁ గరములకును;
తరమె యొక్కని కెదిరి యందఱను దఱుము?

మెల్ల వారువంబు మెడఁ దట్టె నా రౌతు;
వ్రాలి ముద్దుగొనియె ఫాలతలము;
"నాపటాణీమిన్న! నాకూర్మిచైతకా!
మనలఁ దరిసె నదిగో మలకదండు.

సిదురింఖానముద్ధూత నిబిడధూళి
నందుకొనలేవు గద యెట్టిహయములైన;
హెచ్చుఁగద ధైర్య మిక్కట్టు లెచ్చ వీకు;
ఏటి లెక్క నీకీవాఁగు దాఁటివేయ?

సురిఁగిపోవఁగరా దది పిఱికితనము
ఏఱు తరియించి దాఁటింపు మీవిపత్తు"
ననుచుఁ బురికొల్పెఁ బరమసాహసుఁ డతండు
ప్రాణములకంటెఁ బ్రియమైన వారువంబు.

వల్లె యనురీతి శీర్షంబు నల్ల నూఁచి
కాళ్లు నాల్గును ముందఱఁ గలుపుకొనియె;
తటమునంచునఁ ద్రుటిసేపు తాళి మావు
కాలిచేఁ గంటితో నావలివలికి దవ్వె.

కొమ్మకొనఁ బిట్ట యెగురుచుఁ గూయుచాఁ
నరగ నకిలించె నొకమాఱు జవనహయ
పెనుతుపానున లేచెడు వీచిపోల్కి
నాకసమునకుఁ జంగునఁ జౌకళించె.

వీతి వేగాతిశయముచేఁ జెల్లగిల్లి
దరిని గల గండ్రశిల లేట దొరలి డుల్లె;
ఆహుమాయిరాహుతుల గాయముల నల్ల
కలుషితము సేసె విమలపు సలిలమెల్ల.

కరము కదలకుండఁ, గళ్లె మాడకయుండఁ,
జలన మొందకుండఁ జరణయుగము,
కూరుచుండె రాజకుంజరుఁ డలవోక
చక్కఁ జెదరకుండ జక్కిపైని.

నీలజీమూతమునఁ దటిన్మాలవోలెఁ
దళుకుమంచును మెఱసెఁ గత్తళముతోఁ
దయ్యమో భూతమో నాఁగ ధరణిభర్త
కంటి కగపడకుండఁగాఁ గడచె నేఱు.

ఈతఁగానితోఁ గెరటంబు భాతిఁ జక్క
నేలికను బూని యద్దరి వ్రాలె జక్కి;
తత్ఖురళిపాతమునఁ జేసి ధరణీధరము
మ్రోఁగ నమ్మోటపెట్టిన దాఁగలిగతి.

ముక్కుపై వ్రేలు గదియించి బొమ్మలట్ల
మలతుదను నిల్చిపోయెను మలకపిండు;
బళిర, సెభాసు, బాపురే, వహ్వ యనుచు
వారినోళుల నొకపెట్టఁ బలుకు లొదవె.

"మావునకును దగ్గ రావుతుం డితండు
రావుతునకుఁ దగ్గ మావు నిదియు
ఎవనివశము పట్ట నీశూరవరు" నంచు
మరలె వెనుక కంతఁ దురకపౌఁజు.

...ంగు ముందున కిడలేక యూఁగిపోయె
...న మును డస్సియున్న యాకత్తెలాని;
...కుచున్నను నిలక కాళ్లూఁగసాగ
తాఁకునఁ జెనుతెల్లు కాఁడలట్లు.

...న మాడిన చందాన మేననెల్ల
...దజలబిందుమౌక్తికశ్రేణి పర్వ;
...లిమిలిత్తులయోజఁ బ్రక్కలను మిగుల
నెగురవేయుచు రొఁజె నాయొక్కరింత.

చప్పునను డిగ్గి యొకమీఁదు సైంధవంబు
వర్మమూఁది తద్వార మూడ్వంగఁ దొడఁగె;
అంతలోన నాసాంబ్రాణి యవనిఁ గూలె
వాన నానుగోడవలె గుభాలు మనుచు.

...కా! చైతకా!" యంచు ఉస్మైత లేకుఁ
డనుఁగుమోమును దనయొడియందుఁ జేర్చి
కనుల నీరొల్కఁ బుల్కుపుల్కునను దొరను
గాంచి యాతేజి కడసారి కన్నుమూసె.

"సుతులు తెగినను నమ్మిన హితులు తెగినఁ
గుడిబుజమువంటి మొనగాండ్రు పడిన నాజిఁ
జాటిసేయను నీవు జీవముల నుంటఁ
బ్రాపు నాకేది నీవె నన్ బాయ నింక?

ఓటమిని రాజ్యభ్రష్టత్వ మొకఁడె కల్గెఁ
గలుఁగగాలేదు ధీరతాస్ఖలన మేమి
అకట! నీమృతిచే నిప్పు డదియు నొదవెఁ
బల్లటిలె మానసము ధృతిపాఁతు గదలి.

భూరి పాషిష్ఠవస్తు వీబోమిడికంబు
తన్ను సేవించు విశ్వాసధనుల నైన
నిండుప్రాణముల్ చూచుచునుండఁ గొనెడు
స్వీయలాభపరాయణహేయబుద్ధి.

నన్నుఁ గాపాడి విడనాడినావె జీవ
మయ్యయో!" యంచు ఱేఁడు చింతాబ్ధి మున్గె
అతని స్మృతిపటాంతరమందు నపుడు తోఁచెఁ
జైతకకృతంబు లద్భుతచర్య లెన్నొ.

---

# యామునస్మృతి

మక్కపాటి వేంకటరత్నకవి గారు

ఏతమాలచ్ఛాయనే కదా! గోపాలుఁ డాప్తులతోఁ జల్దులారగించె?
ఈతీరభూములందే కదా! గొల్లబాల ప్రేతలతో శిఖిపింఛకరాళి?
ఈపవిత్రోదమందే కదా! నౌకావిహారంబుఁ గావించె నచ్యుతుండు?
ఈనికుంజములయందే కదా! క్రీడించె రాధావధూటితో మాధవుండు?
శారదీయనిశాంత జ్యోత్స్నామనోజ్ఞ-మైన యీశాద్వలస్థలమందె కాదె
విశ్వమోహన మహనీయ వేణుగాన-మొలయఁ గావించె మున్ను శ్రీకృష్ణమూర్తి.

---

# భాషాసంప్రదాయములు

శ్రీ వరవస్తు వెంకటరామానుజస్వామి గారు, యమ్. ఏ.

(నాలుగవ సంపుటము, నాలుగవ సంచిక తరువాయి)

## ౧౨. భాషోత్పత్తి

పైశీర్షికతో నిదివరకు గీర్వాణభాష చేరియున్న 'ఇండోయూరపియన్' భాషాకుటుంబమునుగూర్చియు, నందలి కొన్ని ప్రత్యేకశాఖలనుగూర్చియు గొన్ని విషయములు తెలియజేయబడినవి. సందర్భవశమున భాషావిభాగములనుగూర్చికూడ గొంతవఱకు చర్చింపబడినది. ప్రస్తుతము భాష యేవిధముగా నేర్పడినదో, అది యెల్లప్పుడును మారుచుండుటకు గారణము లెట్టివో విమర్శింపబడును.

భాషయనునది యొకరియభిప్రాయమును మఱియొకరికి తెలియజేయు వ్యక్తధ్వనిరూపమగు సాధనమని చెప్పవచ్చును. దీనినిబట్టి భాషకు రెండుముఖ్యమైన గుణములు గలవని తెలియంగలయును. భాషయనునది యభిప్రాయబోధకమును వ్యక్తధ్వన్యాత్మకమును నై యుండవలయును. మన మాటు మాట లభిప్రాయబోధకము లగునప్పుడే భాష యనిపించుకొనును. లేనిచో, జంతువులయొక్కయు, పక్షులయొక్కయు [illegible]వంటి నిరర్థకధ్వనినిగూడ భాష యనవలసివచ్చును. అక్కడ మున్నైదనొక భాష యది యర్థమగువారికే భాష యనుపించుకొనునుగాని మిగిలినవారికి, తెనాలి రామకృష్ణుడు చెప్పినట్లు, సోలలో పోసిన గవ్వలశబ్దమువలె వినబడును. కాబట్టి యభిప్రాయబోధకము లైనప్పుడే మన ముచ్చరించుశబ్దములు భాష యనుపించుకొనుచున్నవి. ఇట్లే యభిప్రాయబోధకము లగువ్యక్తధ్వనులే భాష యనుపించుకొనును కాని మిగిలినసాధనములు భాష యనుపించుకొనజాలవు. మనయభిప్రాయములను పైవారికి వ్యక్తధ్వనిరూపము కానట్టి మఱికొన్ని సాధనములచేగూడ తెలియజేయవచ్చును. వ్రాతమూలమున నొకరియభిప్రాయములను మఱియొకరికి తెలుపవచ్చును కాని వ్రాత యభిప్రాయములను పరంపరగా తెలియజేయునుగాని ప్రత్యక్షముగా దెలుపజాలదు. వ్రాత వర్ణములద్వారముగా నభిప్రాయమూలక మగుచున్నది. వర్ణాత్మకభాష సిద్ధించినగాని లిపి సిద్ధింపనేరదు. చిత్రములవలన మనయభిప్రాయములను పరులకు ప్రత్యక్షముగా దెలుపవచ్చును; కాని యీగి[illegible] నీరూపపదార్థములను, సంబంధములను దెలుపుట దుర్ఘటము. చిత్రములు మాత్రము శబ్దాత్మకభాషవలె సాంకేతికము కాక సర్వజనులకును శిక్ష[illegible] యవసరము లేకయే యభిప్రాయములను తెలియజేయును. గణితశాస్త్రమునందువలె 1, 2, 3, x, y, z, మొదలగు సంజ్ఞలచే మనయభిప్రాయములను దెలియజేయవచ్చును. కాని యీవిధముగా మనము సర్వకాలములయందును వ్యవహరించుట కష్టసాధ్యము. హస్తచేష్టాదిసంజ్ఞలచే మాత్రము మనము సామాన్యాభిప్రాయములను పైవారికి సులభముగా దెలియజేయగలము. విశేషాభిప్రాయములు అనగా శాస్త్రీయవిషయములు తెలియబడకపోవచ్చును. కాని లోకయాత్రాసంబంధమగు విషయములన్నియు చేష్టలచే దెలుపవచ్చును. చిత్రములవలె నివికూడ స్వలో[illegible] గ్రాహ్యములు గాని శిక్షాగ్రాహ్యములు కావు. ఒక[illegible]మగు చేష్టచే నన్ని దేశములలోను నన్ని జాతులవారికి నొకేయర్థము సూచింపబడును. ఈకారణముచేతనే మన భాష తెలియనివారితో సంభాషించుటకు మనము సంజ్ఞల నుపయోగింతుము. మఱియు 'అమెరికా' (America) ఖండమున గొన్ని జాతులవారు సంజ్ఞలతోనే యభిప్రాయములను బోధించుకొందురని 'జేమ్సు' (James), 'కీమర్'

(Fisher) మొదలగు పాశ్చాత్యులు వ్రాసియున్నారు. సంజ్ఞలు మనుష్యునికి స్వభావసిద్ధములు. మనుష్యుడు భాష నుపయోగించుటకు బూర్వకాలమునుండియు వీని నుపయోగించుచున్నాడు. వీనివలననే ప్రప్రథమమునుండియు మనుష్యుడు జంతువులనుండి విభేదము నందుచున్నాడు. వర్ణాత్మక భాష నుపయోగించునప్పుడు కూడ మనము తదనుగుణములగు చేష్టలను జేయుచునే యుందుము. దూరమున మాటలాడుచున్నవారి మాటలు మనకు వినబడకున్నను వారి చేష్టలవలన వారు మాటలాడు విషయమును గొంతవఱకు మనము గ్రహింపవచ్చును. ఇట్లు వర్ణాత్మకశబ్దములమూలముననే కాక తదితర సాధనములచేగూడ మనయభిప్రాయములు బోధింప శక్యములగుచున్నను వానిని మనము భాషయని వ్యవహరింపము. వ్యక్తధ్వన్యాత్మకమగు సాధనమునే భాషయని వాడెదము. కాబట్టి యభిప్రాయబోధక వర్ణాత్మకశబ్దమే భాష యగుచున్నది. అభిప్రాయబోధకము కాకపోయినను, వ్యక్తధ్వనిరూపము-అనగా వర్ణాత్మకము కాకపోయినను, భాష యనుపించుకొనదు.

ఇచ్చట వ్యక్తధ్వని యనగా నేమో విచారింపవలసియున్నది. మన ముచ్చరించువర్ణములు స్వరములనియు, వ్యంజనములనియు రెండువిధములుగా విభాగము చేయబడియున్నవి. వీనిలో స్వరములన్నియు ఆవు, పిల్లి, కుక్క, గుఱ్ఱము, మేక, కప్ప, కాకి మొదలగు పశుపక్ష్యాదుల యఱపులలో వినబడుచున్నవి. కాబట్టి స్వరములు మనుష్యజంతుసామాన్యములు కాని మనుష్యులచే మాత్ర ముచ్చరింపబడుటలేదు. అచ్చులవలెనే యూష్మములనుగూడ నెంతకాలమైనను నడతెగక యుచ్చరింపవచ్చును. అంతస్థలుకూడ వీనిని బోలియున్నవి. ఇవి యుచ్చారణమున స్వరములకును, స్పర్శలకును మధ్యస్థముగా నుండును. ఈయంతస్థలును, నూష్మములును పశుపక్ష్యాదుల యఱపులలో వినబడుచుండును. పైయూష్మజాతులవర్ణములను జన్మించునప్పుడు నిశ్వాసమునకు ముఖమార్గమున పూర్తిగాను ప్రతిబంధక మెచ్చట నుండదు. స్పర్శ లుచ్చరించునపు డట్లుకాక, ఒక్కక్షణము నిశ్వాసవాయువు వర్ణోత్పాదకావయవముల పూర్తియగుస్పర్శచే నాపబడును. ఇట్టివర్ణములు స్వతంత్రముగా నుచ్చరింపబడక యచ్చులతోనైనను, నంతస్థములతోనైనను గలిసియే వినబడుచుండును. ఈస్పర్శలు పశుపక్ష్యాదిజంతువులయొక్క ధ్వనులలో వినబడుటలేదు. ఇవి మనుష్యమాత్రోచ్చారితములు. ఇవియే మనుష్యుని జంతువులకంటె గొప్పవానినిగ జేయుచున్నవి. ఇవియే యర్థవ్యంజకములు. ఇవి యుండుటచేతనే మనుష్యు లుచ్చరించుధ్వనులు వ్యక్తము లగుచున్నవి.

భాషాశాస్త్రమున కృషిచేసినవా రందఱును భాషోత్పత్తినిగూర్చి యాలోచించి యూహలు చేసియున్నారు. మనమహాభారతపురాణాదిగ్రంథములలో భాష యీశ్వరునిచే సృష్టిచేయబడినదని చెప్పబడియున్నది. అప్పటివారు ప్రపంచమునందుండు మనుష్యపశుపక్ష్యాదులను నీశ్వరసృష్టములని తలంచుటచే నట్టిజనులచే నుపయోగింపబడు భాషకూడ నాతనిచే సృజింపబడినదని తలంచిరి. కాని యీశ్వరునిచే సృజింపబడిన యొకజాతి వస్తువు లన్నియు ప్రపంచమునం దెల్లెడలను నొకవిధముగా నుండగా భాషమాత్రము ప్రతిదేశమునను భిన్నభిన్నములుగా నుండుటకు సరియగుయుక్తి కనబడుటలేదు. భాష మనుష్యునకు స్వభావసిద్ధమని చెప్పుటకుగూడ వీలులేదు. అట్లైనచో ప్రతిపురుషునకును నాహారము తినుట, నడచుట మొదలగువానివలె భాషకూడ నేర్చ నవసరము లేకయే రావలసియుండును. అట్టి యనుభవ మెవరికిని లేదు. భాష ప్రయత్నపూర్వకముగా నేర్చుకొనినగాని యేమనుజునకును రాదని చెప్పవచ్చును. మఱియు భాష మనుష్యునకు స్వతస్సిద్ధమైనచో జనకుల భాషయే వారిశిశువులకును రావలసియుండును. కాని సందర్భములనుబట్టి భాషాంతరముగూడ శిశువులు గ్రహించుట కలదు. ఆంధ్రదంపతు లేదైన నొకకారణముచే మహారాష్ట్రదేశమున నివాసముచేయుచున్నచో వారిశిశువులకు జనకులభాష యగు నాంధ్రభాషయే కాక యాదేశమున వ్యవహరింపబడుచున్న మహారాష్ట్రముగూడ వచ్చును. మఱియు బాధిర్యముకల పిల్లలకు భాష వినబడకుండుటచే మూకత్వము సంభవించుటకూడ కలదు. అట్టివారికి చికిత్సవలన బాధిర్యము పోయినచో నటుపై భాష యలవడును. కాబట్టి భాష దైవసృష్ట

మనికాని; మనుష్యులకు స్వభావసిద్ధమనికాని పాశ్చాత్య భాషాశాస్త్రజ్ఞు లంగీకరింపరు. వారు ప్రపంచ మీశ్వర సృష్టమనికూడ నంగీకరింపరు. పిపీలికాదిమనుష్యపర్యంతము నుండుజీవకోటియంతయు బూర్వపూర్వావస్థాపరిణామభేదముచే నేర్పడినదని చెప్పుదురు. ఆరీతినే భాషకూడ మనుష్యులయవ్యక్తధ్వనులనుండి క్రమముగా నేర్పడినదని వారియభిప్రాయము. మనుష్యుడు పూర్వావస్థయందు విశేషముగా జంతువులను బోలియుండెను. అప్పుడితడు జంతువులవలె రాగద్వేషాదుల నవ్యక్తధ్వనులచే దెలియజేయుచుండెను. కుక్కమొదలగు కొన్ని జంతువులు వానియఱుపులభేదముచే గోపము, సంతోషము మొదలగుభావములను తెలియజేయుటయే కాక పరిచితులను స్వాగతముచేసి శత్రువులను భయపెట్టుటకూడ గలదు. ఈవిధముగానే మనుష్యుడుకూడ దత్పూర్వావస్థలో దనమనోభావముల నవ్యక్తధ్వనులచే దెలియజేయుచుండెను.

మనుష్యుడతిసూక్ష్మజీవమునుండి మనుష్యస్థితి ననేకసహస్రసంవత్సరముల కెట్లు పొందెనో దానినంతయు మాతృగర్భమున పిండము తొమ్మిదిమాసములలో బొందుచున్నదని జీవశాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. అనగా గర్భస్థపిండము మనుష్యచరిత్రమును సంక్షేపముగా దెలుపుచున్నదని చెప్పవచ్చును. ఇట్లే శిశువుల భాష నేర్చుకొనువిధము భాషోత్పత్తిక్రమమును గొంతవరకు దెలుపగలదని భాషాశాస్త్రజ్ఞులయభిప్రాయము. పిల్లలు భాష పూర్తిగా వచ్చుటకుపూర్వము వారియభిప్రాయములు ననుకరణమువలన తెలియజేయుదురు. పిల్లియను పదమును నేర్చుకొనుటకుపూర్వమే యాజంతువును దాని యఱుపు ననుకరించి 'మియాం'అని తెలియజేయుదురు. ఈవిధముగానే ప్రాథమికావస్థలో జనులు తమయభిప్రాయముల గొన్నిటి నితరులకు దెలియజేసియుందురు. 'సంస్కృతము'లోని "కాక," "కుక్కుట" మొదలగు శబ్దములును, 'చీనా' భాషలోని "మియా" మొదలగు శబ్దములును, 'పాపుఅ' (Papua) భాషలోని "బోర్-కా" శబ్దములును నిట్లు పుట్టినవనుట నిస్సందేహము. ఇట్లు జంతువులనామములే కాక కొన్ని క్రియావాచకములుకూడ జనించుచున్నవి. సంస్కృతములోని 'హాస్, హా.' మొదలగుధాతువు లిట్లు జనించియుండవచ్చును. ఇట్టియనుకరణ మనుకృతశబ్దమునకు సమానముగా నుండ నవసరము లేదు. అట్లుండుటకూడ గష్టము. ఒకేశబ్దము నేకుల కనేకవిధములుగా వేఱికి వినబడుచుండును. కావున నొకశబ్దము నేకులచే ననేకవిధములుగా ననుకరింపబడవచ్చును. ఒకపక్షియొక్కశబ్దమే యొకజాతివారిచే 'బుల్ బుల్' అనియు, మఱియొకజాతివారిచే 'క్లోక్లో' అనియు, నింకొకజాతివారిచే 'హ్వాట్ హ్వాట్' అనియు ననుకరింపబడుచున్నది. ఎట్లనుకరింపబడినను నాయాసంఘములవారి కాపక్షిని స్ఫురింపజేయుచున్నది. అంతమాత్రము చేసిన జాలును. అప్పు డది యాపక్షికి నామము కాగలదు. ఈరీతిగా ననుకృతశబ్దము లసమానములైనను వాని యనుకరణములచే నేర్పడినభాష యనేకవిధములుగా నుండవచ్చును. విశేషముగా మార్పులను జెంది యభివృద్ధిగాంచియున్న మనభాషలలో ననుకరణశబ్దము లిప్పుడు మనకు దిరోహితములైయున్నను, శిశువులభాషలలోను, వారివంటి యనాగరికజాతులభాషలలోను నీ యనుకరణశబ్దములు విశేషముగా గనబడుటచే భాషయొక్క బాల్యావస్థలోకూడ నం దనుకరణశబ్దములు విశేషముగా నుండినవని చెప్పవచ్చును. ఇట్లఱుపులచేతను, ననుకరణములచేతను, వానియొక్క యనేకవిధములగు మేళనములచేతను ప్రాథమికజనులు తమయభిప్రాయముల నొండొరుల కెఱిగించుచుండిరి. కాలక్రమమున మనుష్యులయభిప్రాయము లభివృద్ధిచెంది వారినాగరికత హెచ్చగా, వానిని దెలియజేయుటకు పదములు చాలకుండుటచే వారిలో గొందరు కొన్నిక్రొత్తపదములను గల్పించియుందురు. అవి కాలక్రమమున సర్వజనవ్యవహృతములైనచో భాషలో ప్రవేశించును. లేనిచో నశించును.

మఱియు మనుష్యుల కాశ్చర్యాదిభావములు కలుగునప్పుడు తదనుగుణము లగుధ్వనులు వారిముఖములనుండి వెలువడుచుండును. మనుష్యులకు నాగరికత హెచ్చిన కొలదిని వా రట్టిధ్వనుల నణచుకొనుచుందురు. కాని విశేషనాగరికులుకూడ నతితీక్ష్ణములగు భావముల ననుభవించునప్పు డట్టిశబ్దముల నుచ్చరింపక మానరు. ఇక జంతువునుండి విశేషము భేదింపని ప్రాథమికజను లట్టిధ్వను

లకు విశేషముగా పాలగుట యాశ్చర్యము కాదు. అట్టి ధ్వనులు కాలక్రమమున నాయా భావములను దెలియజేయుశబ్దములుగా బరిణమించి భాషలో ప్రవేశించును. అనేకభాషలలో నశిష్టమును సూచించుపదము లోష్ఠ్యములతో ప్రారంభింపబడియుండుటచే సంస్కృతములోని 'ష్ఠీవ'యనుధాతువుకూడ నిట్లు జనించినదే యైయుండవచ్చును. మఱియు మనుష్యులు పనులుచేయునప్పు డూరకొనుటకంటె నాయాపనుల కనుగుణములగు ధ్వనులను జేయుచు బనిచేయుట సులభమనిపించును. ఇదికాక సంజ్ఞలు చేయునప్పుడు పైవా రాసంజ్ఞలను గమనించుటకుగా నాసంజ్ఞలతో శబ్దములను జేయుట సహజమై యున్నది. క్రమముగా నీశబ్దము లాయాపనులను బోధించునవియై భాషలో ప్రవేశించును. ప్రప్రథమమున సంజ్ఞతో చేయుసంజ్ఞ ననుసరించు 'అన్' అనుశబ్దము క్రమముగా పండ్లు తినుట, అన్నము మొదలగువర్థములను దెలుపుశబ్దములకు మూలమగుచున్నది. ఈరీతిగానే 'వై, వాత, వాయు' మొదలగుశబ్దములుకూడ జనించియుండవచ్చును.

ఇట్లు చేష్టలతోను, అవ్యక్తధ్వనులతోను ప్రారంభమైనభాష క్రమముగా ననుకరణశబ్దములతోడను, భావచేష్టాద్యనుగతశబ్దములతోడను గూడినదై, యనేకవిధములగు వివిధమార్పులచేత నభివృద్ధినొంది చేష్టలను, నవ్యక్తధ్వనులను క్రమముగా విడనాడి భాషక్రింద నేర్పడి తిరుగ నది కాలక్రమమున నీదిగువ వర్ణింపబోవు కారణములచే మార్పులను బొంది శాఖోపశాఖలుగా విజృంభించి యొకభాషాకుటుంబముక్రింద నేర్పడును. ఈరీతిగానే 'ఇండో-యూరపియన్' మాతృభాషకూడ జన్మించి క్రమముగా నభివృద్ధి బొంది దేశాంతరములలో నెల్ల వ్యాపించి యనేకభాషలుగా మారి యొకపెద్ద కుటుంబముగా నేర్పడినది. దీనికి 'ఇండో-యూరపియన్' భాషాకుటుంబమనియు, 'ఇండో-జర్మానిక్' భాషాకుటుంబమనియు పేరు.

### ౧౨. భాషావిపరిణామము

భాష యనునది యభిప్రాయబోధక మగు వర్ణాత్మకశబ్దము లేక వ్యక్తధ్వని యని యీవరకే చెప్పబడినది. మనుష్యులయొక్క యభిప్రాయములు సర్వదా మారుచునే యుండును. కాబట్టి వానిని దెలియజేయు భాషకూడ నెల్లప్పుడును మారుచునే యుండును. మఱియు వర్ణములు జిహ్వాద్యవయవములవలన బుట్టుచున్నవి గదా! అయవయవములలో శీతోష్ణస్థితి, ఆహారము, వృత్తులు మొదలగు ననేక కారణములచే మార్పు కలుగుచుండును. కాబట్టి వానివలన జనించు శబ్దములుకూడ తదనుగుణముగా మారుచుండును. అనగా భాష యెల్లప్పుడును మారుచుండును. దానికి మారుటయే స్వభావము. మఱియు బాలురు వృద్ధులు ఉచ్చరించుశబ్దముల ననుకరించి భాషను నేర్చుకొనెదరు. వర్ణోచ్చారణావయవములు ప్రతిమనుష్యునకును భిన్నముగా నుండుటచే సరియగు ననుకరణ మసాధ్యమగును. ఆకారణముచే నుచ్చారణము ప్రతిమనుష్యునకును భిన్నముగా నుండును. వృద్ధులయుచ్చారణమును బినికదా యనుకరింపవలసియుండును. శ్రోత్రేంద్రియములలో భేదముండుటచే నొకవర్ణ మొకనిచే నొకవిధముగాను, మఱియొకనిచే మఱియొకవిధముగాను గ్రహింపబడవచ్చును. ఆశబ్దము ననుకరించుటలో వారిద్దరికిని భేదము కలుగును. ఇట్లు భాష మారుట కిన్ని విధములగు కారణములు గలవు. కాన ప్రతిభాషయు నెల్లప్పుడును మారుచుండుట యాశ్చర్యము కాదు. కాని యేభాషయైనను మార్పునొందక కొంతకాల ముండిపోయినచో మన మాశ్చర్యము పొందవలసియుండును.

భాష మారుట కనేకకారణము లున్నను వానిలో ముఖ్యమగువానిని కొన్నిటి నీక్రింద జేర్చి, యవి భాష నేవిధముగా మార్చునో తెలియజేసెదను:

౧. అనుకరణము లేక యన్యతరాకర్షణము:— అనుకరణేచ్ఛ మనుష్యజాతిసాధారణము. బాలురు వృద్ధులు చేయుపనుల ననుకరించుట మనమందఱము నెఱుగుదుము. నాగరకులకంటె ననాగరకులలో ననుకరణపు టలవాటు విశేషముగా నగపడుచున్నది. నాగరికులలో గూడ నీగుణము కొంతవఱకు గలదు. వారియలవాటు లన్నియు (fashions) నీగుణమును బురస్కరించుకొని యేర్పడినవే యని చెప్పవచ్చును. ఆవిధముగా వారి భాషకూడ నీయనుకరణేచ్ఛవలన విశేషము మార్పులను

పొందుచున్నది. కొన్ని జాతులవారు తమభాషను బూర్తిగా విడిచి వారిచుట్టుప్రక్కల నుండువారిభాషలో వ్యవహరించుట కలదు. ఇట్లు 'అమెరికా' దేశమునందుండు ననేకులు తమభాషలను వదలి 'యూరొప్' ఖండములోని 'ఇంగ్లీషు' మొదలగుభాషల నవలంబించియున్నారు. కాబట్టి భాషాసామ్యమునుబట్టి జాతిసామ్యమునూహించుటకు వీలులేదు. భాషాసామ్యము పరస్పరసంబంధమునుబట్టి యేర్పడును. ఒకజాతివారైనను వివిధదేశములలోనుండి సంబంధాభావమువలన వేరువేరు భాషలను వ్యవహరించుచుండవచ్చును. కొందఱు తమభాషను బూర్తిగా విడిచి భాషాంతరమును గ్రహింపకపోయినను భాషాంతరపదములను విశేషముగా దమభాషలో నుపయోగింపవచ్చును. 'ఇంగ్లీషు' భాషలో 'లాటిన్' పదములు విశేషముగా నున్నవి. తెలుగు మొదలగు ద్రావిడభాషలలో ననేకసంస్కృతపదములు ప్రవేశించియున్నవి. రెండుజాతులవారికి సంబంధము కలిగినప్పుడు వారియాచారవ్యవహారములందువలె వారిభాషలలోగూడ బరస్పరసాంకర్యము కొంత కలుగకమానదు. ఇట్లు పదములేకాక వర్ణములుకూడ నొకభాషనుండి మఱియొకభాషలోనికి బ్రవేశించును. ద్రావిడభాషకు స్వతఃసిద్ధములు మూర్ధన్యవర్ణములు పరస్పరసంబంధమువలన 'ఇండో-యూరోపియను' కుటుంబములోని భాషయగు సంస్కృతభాషలో బ్రవేశించినవి. వాక్యరచనారీతిని, బ్రత్యయములను నొకభాషనుండి మఱియొకభాష సాధారణముగా గ్రహింపదు. భాష వాక్యరూపముగా నుండునుగనుక వాక్యమునందలిపదముల పరస్పరసంబంధమును దెలుపురీతి ప్రతిభాషకును విలక్షణముగా నుండును. కాని యప్పుడప్పుడట్టి సాంకర్యముకూడ గనబడుట కలదు. ఉత్తరహిందూదేశములోని 'హిందీ, బెంగాలీ, అస్సామీస్' మొదలగు భాషలు 'ఇండో-యూరపియన్' కుటుంబములో జేరినవైనను ద్రావిడభాషాసంప్రదాయముల కొన్నిటి నవి యవలంబించియున్నవి. ఉ. 'అస్సాం. manuh-bilak, మనుష్యులు; manuh-bilak or, మనుష్యు-ల-యొక్క; manuh-bilak-oloi, మనుష్యు-ల-కొఱకు; manuh-bilak-ok, మనుష్యు-ల-ను; manuh-bilak-ot, మనుష్యు-ల-యందు; manuh-bilak-e, మనుష్యు-ల-వలన.

అనుకరణముయొక్క బలము అన్యతరాకర్షణములో (Analogy) విశేషముగా గనబడును. అన్యతరాకర్షణమనగా నొకపదముయొక్క రూపముగాని యర్థముగాని మఱియొకపదముయొక్క రూపముతోగాని యర్థముతోగాని సరిపోవునట్లు మారుట. పదములయొక్క వ్యుత్పత్తి జనులకు దెలియనప్పుడు పరస్పరసంబంధము లేనిపదములను సంబద్ధములని భ్రమపడి యేకరూపముగాగాని సదృశరూపముగాగాని వారు చేయవచ్చును. ఒకజాతిపదములు హెచ్చుగా వ్యవహరింపబడుటచే మఱియొకజాతిపదములుకూడ వీనికి సదృశరూపములుగా జేయబడవచ్చును. దీనికి అన్యతరాకర్షణము కారణమని చెప్పెదరు. 'ఇంగ్లీషు' భాషలో ననేకధాతువులకు భూతకాలమున -(e)d అనుప్రత్యయము చేర్చబడుచుండుటచే, come అనుధాతువునకుకూడ నట్లే came అనుటకు మారుగా comed అనురూపము పామరులచే నెక్కువగా ప్రయోగింపబడుచున్నది. ఇట్లే -(e) s అను బహువచన ప్రత్యయమును భాషాంతరపదములకుగూడ జేర్చి యాయాభాషలలోని రూపములకు మారుగా క్రొత్తబహువచనరూపములు వాడబడుచున్నవి. సంస్కృతమునగూడ నిట్లు రూపాంతరము లేర్పడియున్నవి. అదంతశబ్దములలో నెల్ల తృతీయాబహువచనమున -భిస్ అను ప్రత్యయ మగపడుటచే వేదమున నదంతశబ్దములకుగూడ నీప్రత్యయము చేర్చి 'కర్ణైః' అను మొదలగు రూపములకుమారుగా 'కర్ణేభిః' అను మొదలగు రూపములు ప్రయోగింపబడియున్నవి. ఇట్లే నకారాంతశబ్దముల యాకర్షణచే నజంతశబ్దముల షష్ఠీబహువచనరూపములలోను, గొన్నినపుంసకశబ్దముల బహువచనరూపములలోను నకారము ప్రవేశించినది. మఱియు సర్వనామశబ్దముల సాహచర్యమువలన నకారాంతశబ్దముల తృతీయాషష్ఠీవిభక్తుల యేకవచనములలో గ్రమముగా -ఏన, -స్య అనుప్రత్యయములు వ్యవహారములోనికి వచ్చినవి. ఈప్రకారముగానే ధాతురూపములలోగూడ నన్యతరాకర్షణమువలన గ్రొత్తరూపము లేర్పడినవి. 'అద్, అస్' మొదలగుధాతువుల ననుసరించి 'భూ' మొదలగు ధాతువులుకూడ లటుత్తమపురుషైకవచనమున -'అ' యను ప్రత్యయమునకు మారుగా -'మి' యనుప్రత్యయమును గ్రహించినవి.

అస్మి, eiMi, esmi - గచ్ఛామి, basko; భరామి, fero.

ఇట్లు వర్ణములయందును, పదములయందును గాక స్వరములలోగూడ మార్పు కలుగవచ్చును. వైదికసంస్కృతభాషాజన్యములగు నుత్తరహిందూదేశములోని 'హిందీ,' 'బెంగాలీ' మొదలగుభాషలు తజ్జనకములగు భాషల స్వరసంప్రదాయమును వదలి ద్రావిడభాషల సంప్రదాయమును గ్రహించినవి. వైదికభాషలో నుదాత్తము; అనుదాత్తము, స్వరితము అని మూడుస్వరములు గలవు. తజ్జన్యములగు నుత్తరహిందూదేశపుభాషలలో స్వరదార్ఢ్యము ననుసరించినస్వరములు రెండే కలవు.

పదముయొక్కస్వరూపమే కాక యర్థముకూడ దఱచుగా మారుట కలదు. ఏదైన నొకక్రొత్తపదార్థము జనులకు గనబడినచో నది తా మెఱిగినపదార్థములలో దేనిని బోలియున్నదో చూచి దాని కాపేరు నిడెదరు. కుందేలువంటి జంతువును సీమకుందేలనియు, మిరియమువలె కారముగానుండు కాయను మిరెప (మిరియపు) కాయయనియు, గాకివలె నుండు పక్షులను మాలకాకి, చెమరకాకి యనియు వ్యవహరించెదరు. గోవువంటిజంతువు గవయముకదా. హస్తమువంటి యవయవము కల జంతువును హస్తి యనెదరు. పదార్థాంతరములయందు ప్రసిద్ధములగు క్రియాగుణములు కలవానికి వానినిబట్టి నామకరణము చేయుటకూడ గలదు. అక్కారణముననే, గచ్ఛతీతిగౌః; పరుగిడునది పరుగుడు; కరోతీతి కరేణుః. పురాణగాథలన్నియు నీవిధముగా నేర్పడినవే యని చెప్పవచ్చును. నైసర్గికస్థితులు మనుష్యులచర్యలతో సరిపోల్చి వర్ణింపబడియున్నవి. కాలక్రమమున నీవిషయమును మనుష్యులు మఱచి యవి యథార్థమని తలంచి వానిని దేవతలుగా భావింప నారంభించిరి. దీనికి వ్యతిరేకముగా భాషలు తమ కప్రసిద్ధములగు పదములను దమ కెఱిగిన పదములలోనికి మార్చుటకూడ గలదు. ఇట్లే కుహాకదానము కుక్కదాన మైనది. అంకురారోపణము అంకురార్పణ మైనది. ఆర్యసోమయాజులు ఆరుసోలలు, అయ్యలసోమయాజులు అయిదుసోలలు నైనవి. 'హేమిల్టన్' (Hamilton) వంతెన యరవములో 'అమ్మటన్' (Barber) వంతెన యైనది.

2. స్పష్టప్రతిపాదనేచ్ఛ లేక దార్ఢ్యపాదనము:— స్పష్టప్రతిపాదనేచ్ఛకూడ భాషావిపరిణామములో నవ్యాకరాకర్షణమువలె బలమైన హేతు వగుటయే కాక సామాన్యముగా నీరెండు కారణములును గలిసి యగపడుచుండును. మన మాటలయొక్క ముఖ్యోద్దేశము మనయభిప్రాయములను పై వారికి దెలియజేయుట కనుక మనయభిప్రాయములు పైవారికి సరిగా దెలియనప్పుడు మనము మాటలను గట్టిగాను, స్వచ్ఛముగాను నుచ్చరించుటకు బ్రయత్నము చేయుదుము. అప్పుడు వర్ణములన్నియు స్పష్టముగా వినబడుటయే కాక పదములలో క్రొత్తవర్ణములు ప్రవేశించుటకూడ సంభవించును. కావుననే 'స్వర్ణము' 'సువర్ణ' మైనది. క్ష్మ, క్షమ యైనది. ఇట్లే మనభాషను బాగుగ నెఱుగనివారితో సంభాషించునప్పుడు మనము పదములను గట్టిగాను, స్పష్టముగాను నుచ్చరింతుము. శీఘ్రముగా గ్రహించువారితో మాట్లాడునప్పుడు కొన్ని పదములను వర్ణములను విడిచిపెట్టుటకూడ సంభవించును. స్పష్టప్రతిపాదనేచ్ఛచేతనే యేకార్థపదములను రెంటి నప్పుడప్పుడు మనము వాడుట కలదు. "అధికస్య అధికం ఫల"మ్మనువ ట్లొకేయభిప్రాయము ననేకపదములతో దెలిపినయెడల దానికి స్పష్టత సంభవించును. ఈరీతిగానే 'యగ్గనిప్పు, చాదరేకులు, చెయిక్రోలుము, గజకరభము' మొదలగుపదములు వాడుకలోనికి వచ్చినవి. కొన్నియెడల నిట్టిపర్యాయపదములు క్రమముగా నర్థభేదములను గ్రహించి ప్రత్యేకపదములుగా నేర్పడును. ఉ. యశస్సు, కీర్తి-ఒకేపదము స్వల్పభేదములతో నిట్లు వివిధార్థములలో వాడబడుట కూడ గలదు. ఉ. మిత్రః, మిత్రమ్. కయ్యము, కార్యము.

3. అలసత లేక లఘూకరణేచ్ఛ:— మనుష్యులకు స్వభావసిద్ధమైన యాలసతవలన పదములయొక్క స్వరూపమే కాక యర్థముకూడ మార్పును బొందవచ్చును. మనుష్యులకు గష్టపడుట కిష్టముండదు. ఎల్లప్పుడును వారు సుఖమును గోరుచుందురు. కాబట్టి పదముల నుపయోగించునపుడు వానియర్థములను బాగుగా పరిశీలింపక మూలదృష్టితో నుపయోగించుచుందురు. వారు వివక్షించు నర్థ మాపదమునకు ముఖ్యార్థము కాక పోవచ్చును. కాని కాలక్రమమున నదియే ముఖ్యార్థముగా మారును.

'అసహ్య' మనుపద మిట్లే యర్థమున మార్పును పొందినది. ఈవిధముగానే విశేషార్థబోధకపదము సామాన్యార్థకముగాను, సామాన్యార్థబోధకపదము విశేషార్థకముగాను మారుచుండును. శయ్యాశబ్దభవమగు 'సెజ' యను పదము మహారాష్ట్రభాషలో గుఱ్ఱములు పండుకొనుటకు వేసిన పరిగడ్డిపడక యనునర్థమున వ్యవహరింపబడుచున్నది. సామాన్యస్త్రీవాచకముగా నుండిన 'సాని' యనుశబ్ద మిప్పుడు వేశ్యావాచకముగా మారినది. 'గోరసాని' మొదలగు కొన్ని సమాసములలో మాత్రము ప్రాచీనార్థమును బోధించుచున్నది. దీనికి వ్యతిరేకముగా నదీవిశేషవాచకమగు గంగాశబ్దము నదీసామాన్యవాచకమై తుదకు జలవాచకమైనది. మృగశబ్ద మిట్లే జంతువాచకమైనది. వ్యాకరణమున, అనగా ప్రత్యయములలో గూడ, నీయలపల మార్పును గలుగజేయును. కొన్ని శబ్దములకు రెండుమూడువిభక్తులలో నొకేరూప మగపడుచున్నది. విభక్త్యర్థములు ప్రత్యేకపదములచే బోధింపబడుచున్నవి. లేట్ వ్యవహారమునుండి నశించినది. లిట్, లఙ్, లుఙ్ లక్షణము పాటింపబడుచుండుట లేదు. ఇట్లే లిఙ్ లోట్లును, లుట్ లృట్లును.

పదములయర్థమునకంటె, వ్యాకరణమునకంటె పదస్వరూపమునందు నీయలపల విశేషముగు మార్పును గలుగజేయును. సులభముగా నుచ్చరింపబడని వర్ణములు సులభముగా నుచ్చరింపబడు వర్ణములలోనికి మారుచుండును. కొన్నివర్ణములు పూర్తిగా లోపించి పదములు లఘూకరింపబడుచుండును. లఘూకరణేచ్ఛ యాలసతవల్లనే పుట్టుచుండును. ఇట్టివర్ణలోపముచే గలుగు లఘూకరణము ప్రకృతిప్రత్యయములుస్పష్టముగా కనబడుభాషలలో కంటె నస్పష్టప్రత్యయభాషలలో హెచ్చుగానుండును. మరియు గ్రాంథికభాష లిఖితమై స్థిరపడియుండుటచే దానికంటె వ్యావహారికభాషలో విశేషముగా మార్పు కలుగుచుండును. గ్రాంథికభాషయగు సంస్కృతభాష యిప్పటివఱకును నొకేరీతిగా నుండగా వ్యావహారికభాష ప్రథమమున ప్రాకృతభాషలోనికిమారి తిరుగ గాలక్రమమున 'హిందీ, బెంగాలీ' మొదలగు భాషలలోనికి మారినది. ఈరీతిగానే భాషాంతరసంబంధము విశేషముగా లేనిభాషలు మిగిలినవానికంటె స్వల్పముగా మారుచుండును. కావుననే 'లిథుయేనియన్' భాష 'ఇండో-యూరపియన్' భాష లన్నిటిలోను స్వల్పముగా మార్పులను పొంది ప్రాచీనావస్థలో నున్నది.

వర్ణములలో మార్పనేకవిధములుగా నుం[illegible] వర్ణాగమ వర్ణలోపములనుగూడ వర్ణవిపరిణామములక్రిందనే పరిగణింపవలసియుండును. ఈమార్పులవలన బదముల వ్యుత్పత్తిని దెలిసికొనుట కష్టముగా నుండును. 'హిత' యనురూపము 'ధా' ధాతువుతో సంబంధించినదనియు, 'స్ధ' యనురూపము 'అస్' ధాతువునుండి వచ్చినదనియు భాషాశాస్త్రము తెలుపనిచో రెవరు చెప్పగలరు? అయినను సంస్కృతభాషానియమముల ననుసరించియే యారూపము లాయాధాతువులనుండి న్యాయముగా వచ్చినవని నిరూపింపవచ్చును. వర్ణవిపరిణామస్వరూపము తెలియజేయుటకు దానికొన్ని భేదము లిచ్చట వర్ణింపబడును.

వర్ణసమీకరణము (Assimilation):—ఒకవర్ణము దానికి పూర్వమునగాని, పరమునగాని యుండు వర్ణముయొక్క బలముచేత నావర్ణములోనికిగాని, దానికి సమానమగు వర్ణములోనికిగాని మారవచ్చును. రెండు భిన్నవర్ణముల నుచ్చరించుటకంటె సమానవర్ణముల నుచ్చరించుట సులభము కనుక నీమార్పు సుఖాకాంక్షవలన గలుగుచున్నదని చెప్పవచ్చును. సంస్కృతభాషలోని సంధికార్యములు చాలవఱకీజాతిలోనివై యున్నవి.

ఉ. అన్ + న=అన్న; విద్యుత్ + జిహ్వా=విద్యుజ్జిహ్వా.

శశ (ప్రాచీనరూపము, శస)

షట్ + నవతి=షణ్ణవతి.

ప్రాకృతభాషలలో నిట్టివర్ణవిపరిణామములు విశేషముగా నగపడుచుండును. ఆభాషలలో సంయుక్తాక్షరములు నిలువవు. వానిలో మొదటిదికాని రెండవదికాని మిగిలినదానిలోనికి మారి ద్విత్వవర్ణ మేర్పడుచుండును.

ఉ. సం. చక్ర — ప్రా. చక్క
,, అగ్ని — ,, అగ్గి
,, సార్థ — ,, సత్థ
,, మన్మథ — ,, వమ్మహ

దీనికి విపరీతముగా నప్పుడప్పుడు సమానమగు రెండువర్ణములలో నొకటి యుచ్చారణసౌకర్యార్థము వేరువర్ణములోనికి మారుటకూడ గలదు.

ఉ. అశ్మః; సం. పురుష. ప్రా. పురిస

వర్ణపరివృత్తి (Metathesis):— ఒకానొకప్పుడు త్వరవలన గొన్నివర్ణములతరువాత నుచ్చరింపవలసిన వర్ణమును మనము ముందుగా నుచ్చరింతుము. వ్రాతలో కూడ నిట్టిపొరపాట్లు మనకు సంభవించుచుండును. మన యాలోచన ముందు పరుగిడుటచే వెనుకపదములను వ్రాయుటకు పూర్వమే ముందుపదము నొకదానిని మనము వ్రాయుట సంభవించును. అట్లే వర్ణములయుచ్చారణములోగూడ స్ఖాలిత్యము సంభవింపవచ్చును. అప్పుడు వర్ణములు వ్యత్యాసముగా నుచ్చరింపబడును.

"వాణారస్యాం మఘూవంశశేఖరస్నేహల" యని సమంతభద్రుడు ప్రయోగించియున్నాడు. ఈరూపమునుండియే 'ఇంగ్లీషు' భాషలోని 'బనారెస్' (Benares) అనుపేరేర్పడినది. ప్రాకృతభాషలలోను, 'హిందీ, మరాఠీ' మొదలగు భాషలలోను, 'కరేణూ, ఆలాన' యనుపదములు 'కణేరు, ఆణాల' యనురూపములలో నున్నవి. మహారాష్ట్రి శబ్దము ప్రథమమున 'మరహట్ట' యనురూపమును పొంది, తరువాత 'మరాఠీ' యనురూపమును బొందినది.

వర్ణలోపము:— త్వరగా మాటలాడునప్పుడు చేర్చిపలుకబడు వర్ణములు కొన్ని లోపించుట కలదు. సుబంతవిభక్తిరూపములలోను, ధాతువులయొక్కరూపములలోను నిట్టివర్ణలోపము తఱచుగా సంభవించుచుండును.

ఉ. రాజన్ + ఆ = రాజ్ఞా
జ + గమ్ + ఉః = జగ్ముః

కొన్ని పదములలో నొకేవర్ణము రెండుపర్యాయములు వరుసగా వచ్చినయెడల త్వరచే నొకటి విడువబడుట కలదు.

శేవవృధః = శేవృధః
జహీహి = జహి
శిష్పపింజరః = శిష్పింజరః

పదాదిని సంయుక్తాక్షర మున్నచో నుచ్చారణసౌకర్యార్థ మందొకయక్షరము విడువబడుట సంభవించును ఇట్లే 'శ్చంద్ర, స్తనయిత్ను, స్తాయు, స్తేనస్' మొదలగుశబ్దములు 'చంద్ర, తనయిత్ను, తాయు, తేన,' మొదలగురూపములను బొందుచున్నవి.

వర్ణాగమము:— పైరీతి నుచ్చారణసౌకర్యార్థము పదాదియందలి సంయుక్తాక్షరములోని యొకయక్షరము విడిచిపెట్టబడక, తత్పూర్వ మొకయచ్చును చేర్చి దానినుచ్చరించుటకూడ గలదు. 'ఇంగ్లీషు' భాషలోని 'స్కూల్' (School) అనుపదము మనభాషలలో 'ఇస్కూలు' లైనది. సంయుక్తాక్షరములతో ప్రారంభము కాని పదముల యాదినిగూడ నిట్టచ్చులు వచ్చిచేరుట కలదు. అరవభాషలో నిది విశేషముగా నగపడుచున్నది.

సం. రామః, అర. ఇరామన్
సం. లక్ష్మణమ్, అర. ఇలక్కణం

సంస్కృతములోని 'శ్లోక' యనుపదముకూడ నీరీతిగానే యేర్పడియుండవలయును. ప్రాకృతమున స్త్రీ శబ్దము 'ఇత్థి' యనురూపమును బొందుచున్నది. అట్టి యచ్చునకు ప్రాతిశాఖ్యలలో 'స్వరభక్తి' యని సంజ్ఞ కలదు. ఇది తఱచుగా రేఫలకారములకు గాని యనునాసికవర్ణములకుగాని పరముగా వచ్చుచుండును. ఇట్లు, 'ఇంద్ర, యజ్ఞ' యనుపదములు 'ఇందర, యజన' యని యుచ్చరింపబడుట కలదు. సంయుక్తాక్షరము లుచ్చరించుట కష్టమగుటచే నిట్లు మధ్య నొకయచ్చును చేర్చి వానిని విడదీసి యుచ్చరించుట సంభవించును. హలంత శబ్దము లజంతములుగా మారుటకుగూడ నిదియే కారణము. పదాదియందలి ణకారస్థానముల నకారమువలె నుచ్చరించుట మన కనుభవసిద్ధము.

పైని జెప్పబడిన మూడుకారణములే కాక భాష మారుటకు మఱికొన్నికారణములుకూడ గలవు. ప్రజలయొక్క వ్యాపారములు, వారు నివసించుదేశము యొక్క నైసర్గికస్థితి, శీతోష్ణస్థితి మొదలగునవన్నియు వారియుచ్చారణమున మార్పులను గలుగజేయుచుండును. ఇట్లు భాష మారుట కిన్నివిధములగు కారణములున్నను దీనికి ప్రతికక్ష్యగా భాషను మారకుండజేయుటకుగూడ ననేకకారణములు కలవు. జనులకుండు పరస్పరసంబంధ

ముచే నొకరియుచ్చారణమును జూచి మఱియొకరు తమ యుచ్చారణములోని మార్పులను దిద్దుకొనుచుందురు. జనులకు పరస్పరసంబంధమును గలుగజేయు నినుపదారి బండ్లు, పాఠశాలలు, గ్రంథముద్రణము మొదలగునవన్నియును, కొంతవఱకు భాషలో మార్పుల రానీయకుండ నాపును. అయినను మార్పును గలుగజేయు కారణములు ప్రబలములగుటచే భాష మారుచు నేయుండును. నాగరికతాఫలితములగు నినుపదారులు మొదలగువాని నెరుగని జనులలో భాష శీఘ్రముగా మారుచుండును. మఱియు బరస్పరసంబంధమునకు ప్రతిబంధకములగు నదులు, పర్వతములు, రాజ్యాంగదేశవిభాగములు మొదలగునవికూడ భాషావిపరిణామమునకు గారణము లగుచున్నవి ఇట్టి వానిచే వ్యవహితులగువారు మొదట నొకేభాష మాటలాడుచుండినను గొలదికాలములోనే భిన్నభాషల వ్యవహరించువా రగుదురు. వారికి పరస్పరసంబంధము దుస్సాధ్యమగుటచే వారిభాషలు భిన్నభిన్నములగు వ[illegible]లను బొంది వేరువేరువిధములుగా మారుచుండును. ఇట్లు కాలక్రమమున నొకభాషనుండి యనేకభాషలు జన్మించుచుండును. ఒకభాషను వ్యవహరించువారికి మఱియొకభాష యర్థమగునంతకాల మవి భాషాభేదములను (Dialects) అనిపించుకొని యట్లర్థముకాని స్థితిని బొందినప్పుడు ప్రత్యేకభాషలని (Languages) వ్యవహరింపబడును. ఇట్టి పరస్పరసంబంధము కల భాషలకు భాషాకుటుంబమని వ్యవహారము కలదు.

---

# బంగారుఫలము

అధికార్ల సూర్యనారాయణరావు గారు

జానకీసఖి చేత బూని నొకనాడు
శృంగార మగునొక్క బంగారుఫలము;
తిలకించుకండ్లకు తొలినోముఫలము,
పట్టెడుచేతికి బహుళవైభవము,
గడియించునాత్మకు కైలాసనుఖము,
శృంగారమైన యాబంగారుఫలము.
"ఉవిద! నీచేతిలో నున్న ఫలమేమి?
ఎట్లుండు భుజియింప? నెవ్వారికొరకు?"
అనుచు నే బ్రశ్నింప వనిత కన్నులను
దివ్యమా తేజంబు దీపించుచుండ,
ఫలముకాంతులబోలు లలితహాసంబు
వదనసీమను గాయ, పలికె నీరీతి:
"అర్థించువారికే ఐశ్వర్య మబ్బు,
ఇచ్చువారలభాగ్య మిక చెప్పనేల?
కనువారికే సర్వకలుషహరణంబు,
తినువారి పుణ్యంబు గణుతింపనేల?
సంతాపదావాగ్ని జల్లార్పగలదు;
అనుపమానందసౌఖ్యము లీయగలదు;
తినెడివా రొకరైన తిరు, నిద్దరికి
ఆత్మ మలమలమాడ్చు నాకలిబాధ;
ధరణిలో నాకున్న ధనమెల్ల నిదియె;
చెలికాడ! నీ కిచ్చు శ్రీయెల్ల నిదియె;
కలసి తినుచో దేవఫలము కాగలము;
వలచువారలబలము ప్రణయసత్ఫలము.

# ఉత్తర రామ చరిత్ర

అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

భవభూతి రచితమైన యుత్తరరామచరిత నాటకమునకుఁ బ్రకృతి వాల్మీకి రచితమైన శ్రీమద్రామాయణోత్తరకాండమందలికథయై యున్నది. ఆకథాంశములను గొన్నిటిని సూచించియుఁ, గొన్నిటిని విడనాడియుఁ, గొన్నిటిని లాతిపర్యవసానముల కుపయోగించుకొనియుఁ, గొన్నిటిని మార్చియుఁ, గొన్ని క్రొత్తలు కల్పియు భవభూతిమహాకవి నాటకమును వ్రాసియుండెను.

పట్టాభిషేకానంతరమున శ్రీరాముని నంది జనులు నుతించుటను వాల్మీకి వాకొనెను. ఆవిషయమును భవభూతి మహాకవి ప్రస్తావనలో నటునిచేత "తేనహి నిర్పాపయితా రాజ్ఞ స్సుపరిశుద్ధా ముపస్థానపద్ధతిం భావః!" అని సూచన సేయించి దానిచే సీతాపవాద మెల్ల యెడల వ్యాపించియున్న దను నంశమును వాల్మీకిప్రోక్తమును ప్రసంగ సంగతితోఁ జెప్పించుచున్నాఁడు. "సర్వథా ఋషయో దేవతాశ్చ శ్రేయో విధాస్యంతి" అనివాక్యార్థసూచన చేయుచున్నాఁడు. మఱియు "యేనామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం జానంతి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః" అని యితరస్థలమునఁ జెప్పఁబడిన కవియౌద్ధత్యము గూడ నీప్రసంగముననే "వాచాం సాధుత్వే దుర్జనో జనః" అని లోకుల పామరత్వము మీఁద విసువుకొనుటచే వ్యక్తపఱుపఁబడె. పట్టాభిషేకమునకు వచ్చిన జనకుఁడు మున్నగు రాజులు మొదలైనవా రందఱును వెళ్లిరనియు, వానరులును, రాక్షసులును రెండుమాసములుండిపోయిరనియు వాల్మీకి వ్రాసెను. అది యంతయుఁ బ్రస్తావనలో సూత్రధారుఁడు "కి మిదానీం విశ్రాంతచారచరణాని చత్వరస్థానాని" అని యడిగినప్పుడు నటునిచేఁ జెప్పించెను.

ఈప్రసంగములోఁ గలిపి ఋశ్యశృంగుని యజ్ఞమునకు వసిష్ఠుఁడును, అరుంధతియు, కౌసల్యాకైకయీసుమిత్రలును బోయిరని తనచేఁ గల్పింపఁబడిన యంశమును జెప్పెను. ఈకల్పన సీతను, గర్భభారాలసను, గాఅడవులకుఁ బంపుటయందలి యసంభవతను దీసివేయుచున్నది. తల్లులును, వసిష్ఠుఁడు,నరుంధతియు నయోధ్యలో నుండిరేని వారు నిరోధించరా? కావున నిది యసంభవము అనిపించుచున్నది. అట్లనిపించకుండుట కీకల్పన పనికివచ్చుచున్నది. ఇదిగాక "యుక్తః ప్రజానా మనురంజనే స్యాః" అను వసిష్ఠునిసందేశమున కాయన దూర

స్థుఁడై యుండినప్పుడే పామరజనాపవాదము గూడ సహింపఁగూడ దనునర్థముఁ జేసికొనుటకు శ్రీరాములవారి కవకాశము కలిగినది. లేక వసిష్ఠులవారే సమీపమున నున్న "సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం మతమ్" అనుసిద్ధాంతము నెట్లు సమన్వయించి శ్రీరామచంద్రునకుఁ గలపియుండునో ఇట్టియాశంకలెవ్వియు నడ్డుకొనకుండ భవభూతిమహాకవి శ్రీరామాజ్ఞానువర్తులైన రామలక్ష్మణ భరత శత్రుఘ్నాదులనుమాత్రమే యయోధ్యలో నిలిపి వసిష్ఠాదులగు పెద్దలను దూరమునకుఁ దలుముచున్నాఁడు. జనకుఁడు వెళ్లుటను వాల్మీకి కథారూపమునఁ జెప్పి యూరకుండెను. భవభూతి దానిని సీతారామపాత్రౌచిత్యపోషణ ద్వారమున రసపోషణ కుపయోగించుకొనుచున్నాఁడు. తండ్రివియోగమున జానకికి వైమనస్యము కలిగినది. ఆమె వైమనస్యమును బోగొట్టుటకు శ్రీరామచంద్రుఁడు ధర్మాసనమును విడిచిపెట్టి వాసగృహమున కేఁగె. సీత గురుబంధువియోగములు సంతాపకరములగుచున్నది. దీనిచే నాయికకుండవలసిన శాలీనత సీతయందుఁ జూపఁబడినది. శృంగార నాయకులలోని యనుకూలునిరీతి శ్రీరాముని యందుఁ బ్రదర్శింపఁబడినది. ఈవియోగమునే సంతాపకరముగ భావించి విమనస్కురాలగు సీత శ్రీరామచంద్రవియోగమున కెంతగా సంతాపమందియుండునో అని వర్ణింపఁబడఁ బోవుసీతాశోకమున కీకల్పన పరిపుష్టి నొసఁగెడిని. అల్లఈపాటసీతావైమనస్యమున కోర్వఁజాలని శ్రీరామచంద్రుఁ డడవిలోసీతనొంటిగ డింపించి యెంతగా శోకవ్యాకులుఁ డయ్యెనో! అని శ్రీరామునియందుఁ బ్రదర్శింపఁ బడఁబోవు శోకసమృద్ధికిసైత మీకల్పన చేయూఁత నొసఁగుచు రసపోషక మనఁబడుచున్నది.

అష్టావక్రుని రాక శ్రీమద్రామాయణమునఁ గన్పట్టలేదు. భవభూతి కల్పించినాఁడు. ఈకల్పనలో బావమఱఁది యజ్ఞమునకుఁబోక సీతావినోదమునకై శ్రీరాముఁ డింట నుండె ననుటచే సీతయందు శ్రీరామునికిఁ గలప్రేమ వ్యక్తమగుచున్నది. "ధర్మాసనా ద్విశతి వాసగృహం" అనుటచే రాజధర్మభర్తృధర్మములకు సమప్రాధాన్య మిచ్చి యీకల్పనచేబంధుప్రేమకన్న సీతాప్రేమ కాధిక్యమొసఁగుచు శ్రీరామునిచ్చట ననుకూలనాయకునిగఁ ప్రదర్శించుట కవిహృద్యమైనది. మఱియు నీయష్టావక్రాగమనకల్పనలో గర్భిణి యగు సీతకోరిక దీర్చుటయందలి యావశ్యకత తల్లులయొక్కయు, శాంతయొక్కయు, నరుంధతియొక్కయు సందేశమువలనఁ దెలుపుచున్నది. దీనివలన సీత నిద్ర లేచునప్పటికి లక్ష్మణుఁడు రథముతో సన్నద్ధుఁడై యుండినప్పుడు తనతో వచ్చెద నన్న శ్రీరాముఁడు రాలేదేలొకో యని సీత కనుమానము కలుగలేదు. తన కోర్కెఁ దొందరగాఁ దీర్చవలసిన దగుటచే శ్రీరాముడితరకార్యవ్యగ్రతచే రాలేదని తలఁచి శ్రీరాముఁడు లేకుండఁ దాను వెళ్లుటకు సమ్మతించనేమో సీత. అభిజ్ఞానశాకుంతలము షష్ఠాంకములో వసుమతీదేవి నిట్లు "కార్యజ్ఞా కార్యోపరాధం మే పరిహారతి" అనిభర్తృకార్యానుకూల్యము గలదానినిగా మహాకవి

కాళిదాసుఁడు చూపినాఁడు. ఇదియునుం గాక యీయుష్టావక్రప్రసంగములోని వసిష్ఠసందేశ మొకటి ముఖ్యముగ లోకాపవాదభీతుఁడు గాఁబోవు రామచంద్రుని విచారసాగరములో నొకప్రవాహమునకు నెట్టుటకు వీలగు చున్నది. శ్రీరాములవారికి సీత నడవులకుఁ బంపుటచేఁ గల్గు మహా కఠినత్వమును గురు భక్తిరసముచేత లోపింపఁ జేయుచున్నది. భద్రుఁడు సీతాపవాదమును శ్రీరాములతోఁ జెప్పెడిదినముననే ప్రాతఃకాలమున నంతఃపుర మందు శ్రీరాముఁడు గర్భిణియగు సీతను 'నీ కేమికోరిక గలదు? చెప్పుము' అనెను. 'గంగా తీరతపోవనముల సంచరింపఁ గోరిక గలదు. [illegible]త్రియైనఁ దపోవనమున నివసింపవలెను.' అని సీత కోరుకొనెను. ఇది యిట్లు చూపుట భవభూతికిష్టము కాలేదు. సీత తపోవనసంచార కాంక్షకుఁ గారణమును బ్రదర్శింప నమకట్టి చిత్రదర్శనమును దననాటకములో సమకూర్చెను. చిత్రములోఁ బూర్వము చూడఁబడిన యడవులు, కొండలు, నదులు, బయళ్లు మొదలైనవి చిత్రింపఁబడియున్నవి. వానినన్నింటిని వివరముగాఁ జూచి యప్పటిసందర్భము లన్నియు స్మృతికి వచ్చినపిమ్మట యెంతెంత లేసి కష్టములైనను స్మరింపఁబడునప్పుడు వినోదముగనే యుండును; కాన వనసంచారకౌతూహలము జానకికిఁ గలిగినదని చెప్పవలెనని నాటకకవి యుద్దేశము. ఇదిగాక యీనాటకమున సంభోగశృంగారము మొట్టమొదట సమృద్ధిగ వర్ణింపఁబడుచుండుటచేతను, చిట్టచివరఁగూడ నదియే ప్రదర్శింపఁబడుఁ గావునను, ద్వితీయాద్యంకములం దెల్ల మొదలఁ గరుణవిప్రలంభము వర్ణింపఁబడుఁ గావునను, ప్రవాసవిప్రలంభమును స్మరణరూపమునఁ గొంత చూపించి సీతారాముల పరస్పరవియోగాసహిష్ణుత నత్యంతసంతాపపారవశ్యములతోఁ గన్పింపఁజేయవలయు నను కవియూహయు నీచిత్రదర్శనముచేతనే నెఱవేఱినది. ఇంక నన్యోన్యసందర్భములలో సీతారాముల యుత్తమగుణములెల్లఁ బూసగ్రుచ్చినట్లు చూపఁబడినవి.

---

## సందేశము

శ్రీమతి టి. సరస్వతి గారు

౧

ద్విపద:—

నీలనీరదపంక్తి నీరసంబయ్యె
వజ్రనిర్ఘోషంబు వ్యర్థమైపోయె
కలకహంసకలకంఠ కలకలస్వనము
కర్ణపర్వంబయి కలశవారాశి
అమృతగానంబులో నైక్యమైపోయె
పాలమున్నీటిలో పవళించియున్న
కమలనాభుండట్టె కనువిచ్చినాడు
కమలాలయంబైన కమలాకరంబు
కలుషించిపోగాంచి కన్నీరునించి
జడమయిపోయిన సత్యలోకంబు

పంకిలంబై యున్న ప్రకృతిమార్గంబు
చల్లారిపోయిన జ్ఞానదీపమ్ము
సంస్కరింపగనెంచి చక్రంబుపైన
సాత్త్వికదృష్టులు సారించినాడు.
శాంతిపుష్ట్యుక్తులు జపియించుకొంచు
విద్యుద్వ్యామోహిత విశ్వజగంబు
మేఘుంబులను బాపి మేల్కొల్పినాడు
అరులచక్రంబుతో నరికట్టినాడు
చూచివచ్చెదుగాని లేచిరావోయి
శారదదేవత సాక్షాత్కరించె
రావోయిరావోయి రత్నాలతునక!

౨

రాజరాజేశ్వరి రాజసమూర్తి!
ఆంధ్రవీతిపూజ లంగీకరించి
చల్లనిదరహాస చంద్రికల్ గురిసె
చంద్రికలో నూత్న సారస్యమెనసె
చంద్రమండలమూర్ధ్ని సౌందర్యమొలికె
రణదుందుభులుమ్రోగ రాజచంద్రాజ్ఞ
జాతీయసైన్యంబు సన్నద్ధమయ్యె
వీరహైందవగీతి విస్తృతంబయ్యె
స్వాతంత్ర్యకేతన చ్ఛాయలలోన
జయజయస్వనములు శ్రావ్యంబులయ్యె
ఉత్సాహవార్ధిలో ఉద్యోగవీచి
స్వచ్ఛందనృత్యంబు సవరించుచుండె
చండప్రతాపుడై మండె భాస్కరుడు
ఆయుధపాణివై అరుదెంచుమోయి
రంగమ్మునకు నుష్ణరక్తంబు దాల్చి
రాజపుత్రుండవై రావోయి వత్స!

౩

అనుకూలపవమాన మభిముఖంబయ్యె
సంకల్పలతికలు సఫలంబులయ్యె
రైతులకష్టాలు రతనాలు పండె
శాలిభూముల స్వర్ణసస్యముల్ నిండె
జనయిత్రి శ్రీదివ్య సాన్నిధ్యమందు
రాజన్యసభలోన రాజకీయజ్ఞు
లభిమానఘనులయి ఆత్మలర్పించి
ప్రాణసర్వస్వంబు పందెంబునొడ్డి
చతురంగమాడంగ చనుదెంచినారు
ఆబాలగోపాల మార్యపుత్రకులు
వేయికన్నులతోడ వేంచేసినారు
ధర్మదేవత తొంగి తలయెత్తిచూచె
వీక్షించెదవుగాని వెడలిరావోయి
వాయువిమానంబు వాకిటనిల్చె
కాంతిపథంబున కదలిరావోయి!

౪

నీలతమస్విని నిశ్చలంబయ్యె
నిశ్శబ్దమై సృష్టి నిద్రాణమయ్యె
చుక్క రేరేనికై దిక్కులుచూచె
ఆలయాంతస్సులో అంధకారంబు
ఆర్ష వాటికలలో అజ్ఞానతమము
విజ్ఞానదీప్తితో విదళించుకొంచు
స్వీయరోచిస్సుతో భేదించుకొంచు
శతసహస్రజ్యోతి జాజ్వల్యమాన
తేజస్స్వరూపంబు దిగ్భ్రాంతిగొలుప
దీపావళీపుణ్య దివసంబువచ్చె
సుప్రసన్నములైన జ్యోతులలోన
దేవీపరంజ్యోతి తిలకింపవచ్చు.

భీష్మతమస్విని బెదరింపలేదు
క్రూరనిశాచరుల్ వారింపలేరు
కార్తికశుభదీప కళిక గ్రహించి
స్నేహపూర్వంబుగా జేరరావోయి
రావోయిరావోయి రత్నాలతునక!



ఉ. ఈ విధి నేఁ జిరంబుగ వరించిన మూర్తులు లోకదృష్టి కెం
తే వెడచేసెనై చెను మదీయకృతార్థత పెంపు నాదు సం
భావనమెల్ల నొక్క లఘుపాత్రమునందున ముంచివైచె దిక్
ప్లావితమౌ యశంబు నొకపాటకు నమ్ముడువుచ్చె నంతయున్! [కొం. జ.]

చిత్రకారుడు: శ్రీ డబ్ల్యూ. ఏ. ఆర్యదాసుగారు, చెన్నపురి.



మృగతృష్ణ

చిత్రకారుడు : శ్రీ కే. వెంకటప్పగారు-మైసూరు.



కూపపరిసరము

చిత్రకారుడు: శ్రీ ఏ. డి. తామసుగారు.

ఇది యిటీవల బొంబాయినగరమున జరిగిన చిత్రకళాప్రదర్శనమున ప్రదర్శింపబడిన చిత్రములనుండి కైకొనబడిన సుందర త్రి
చిత్రముల ప్రతికృతులు.

[టైమ్సు ఆఫ్ ఇండియా, ౧౮-౧౦-

# కాళిదాసకవి కార్తికేయభక్తుఁడు

సి. శివయ్యశాస్త్రి గారు

కాళిదాస కవీంద్రుఁడు కవిగణనావసరమున ప్రథమగణనం గన్నవాఁడు. తనకవితాకుసుమవాసనల నీయాదేశమునకు సకలాశావకాశముల వాసింపఁజేసిన యసమానుఁడు. ఇమ్మహనీయుని జీవితచరిత మింతకు విబుధ వివాదగ్రస్తమై యిదమిత్థ మను పలుకునకుఁ గడుదవ్వున నున్నది. ప్రకృతవ్యాస మీకవి తల్లజుని యిష్టదైవముం గూర్చినది.

రూపకత్రయము నాందీశ్లోకములు శివపరములగుటఁ గొందఱు శైవుఁడందురు. గ్రంథములయం దెందును శివప్రాముఖ్యముం బొందుపఱుపకున్కిని, బొందుపఱుపఁబడినశివస్తుతులు శైవములయియున్నను కేవల తత్త్వమాత్రప్రతిపాదకము లగుటం జేసియు వేదాంతి యనియు, మీఁదుమిక్కిలి యద్వైతి యనియు నందురు కొందఱు. నాందీపద్యములు శైవములై యున్నంత నభిమతదైవము శివుఁడని నిర్ణయించుటకు వలనుగలుగునా యని సందియంపడువాఁడను. సుదృఢముగ శైవులని నిర్ణయింపఁబడిన కవయితలు పలువురు తమకావ్యములయందు విష్ణువును నుతియించియున్నారు. అల్లసానిపెద్దన్న వైష్ణవుఁడయ్యు శంకరుని స్తుతించినవాఁడు. నంది తిమ్మన శైవుఁడయ్యు విష్ణుస్తోత్రము సల్పినాఁడు. శ్రీనాథుఁ డారాధ్యబ్రాహ్మణుఁడయ్యు గ్రంథములయం దెల్లెడల విష్ణుస్తవ మొనర్చియుంటయు సుప్రసిద్ధము. కావ్యముల యుపక్రమోపసంహారములు చాలవఱకు సంప్రదాయ బద్ధములు. కారణాంతరములును నుండకపోవు. కావున గ్రంథాదిపద్యములంబట్టియె కవి యభిమతదైవము నిర్ధరించుట కాంక్షితఫలముం గాంచుట కురవగు తెలివు కాదనుకొందు.

కాళిదాసుఁ డను పేరుం బట్టియు, లోకవ్యాప్తములగు కథలం బట్టియు నీకవి గాళీభక్తుఁ డనుటయుం గలదు. లోకమునందలి పరంపరాగతములగు కథలు కేవల కల్పితములని నిరాకరింపఁదగదు. కాని యవి యలవడిన యాధారముల బలాబలముల ననుసరించి యుండును. ప్రబలాధారము లితరము లలవడినతఱిఁ గథలుం గలసినఁ గలమునకుం గొంత బలమగు. కలియకపోయిన వానికి స్థలము లవడుట కానిపని. కాళికాలయమున శయనించిన మన కవీంద్రుని నోటం గాళీమహాదేవి వీటీరసము నించుట నితని కీలలితకవిత యలవడ

నని, "త్రస్యైవ కశ్చిత్కవయాంబభూవ తాం బాలసారేణ పరో జనన్యాః" అని నీలకంఠ దీక్షితకవి గ్రంథస్థము సహితము గావించి యున్నాఁడు. కాని కాళీభక్తుండగుట నిటు జనులచే వ్యవహరింపఁ బడిన "కాళీదాసుం"డని కాదే యుండవలయు?

"జ్యాపో స్సంజ్ఞా ఛందసో ర్బహుళం," అనుపాణిన్యనుశాసనమువలన "వైదేహీబంధోః" అను మొదలగువానివలె సాధువైన దండిమా? ఇయ్యది సామాన్యానుశాసనము గాక యందందుఁ గన్పట్టు క్వాచిత్కప్రయోగములకు సాధుత్వముం గల్గించుపొంటె నిబద్ధమైనదనుట సుస్పష్టము. జనులు సామాన్యశాస్త్రమునఁ బ్రాప్తించు "కాళీదాసుఁ"డను సరళరూపముం బరిత్యజింపవలయునని యెందో మాఱుమూలల నడఁగియున్న యీవిశేషానుశాసనము నాధారముఁ జేసికొని పట్టి బలాత్కారముగ హ్రస్వపఱుపవలసినంతటి నిర్బంధ మేమి వచ్చినది? మాతాపితృనిర్దిష్ట మనుకొంద మన్న నిఁక నెన్నఁడో తమకుమారుఁడు కాళికాదేవికి భక్తుఁడు కాఁగలఁడని దివ్యజ్ఞానమున నూహించినారనుటయు నసంభవము. ఇట్లు హ్రస్వసహితముగఁ బొందుపఱుచుటకు మాత్రము కారణము వ్యాగ్యము.

కతిపయకారణములం గాళిదాసకవీంద్రుని యభిమతదైవము కార్తికేయుండై యుండు నొక్కొ యని యొకయూహ పొడమెడు. కాళిదాసుఁ డాదికవియగు వాల్మీకిమహాముని శిష్యుఁడగుట సుప్రసిద్ధము. ఎన్నఁడో చన్న వాల్మీకియు, నాఱవశతాబ్దమువాఁ డనుచున్న కాళిదాసుఁడును విభిన్నకాలీనులగుట, శిష్యత్వ మెట్లు పొసఁగు ననుకొనకుఁడు. కవియుం గావ్యమును నొక్కటె యగు. కావ్యముం గాంచిన కవిం గాంచవలసిన యక్కఱ య[ుండ]దు. కవికిఁ గావ్య మపరావతారము. కవికి శిష్యుఁ డనుటయుఁ, గావ్యమునకు శిష్యుఁ డనుటయుఁ దుల్యములే. లలితోపమానరమణీయమై, మృదుపదసముదయమునకు సదనమై రాజిల్లు రామాయణము కాళిదాసునికవితకు మూలాధారమనుట నిర్వివాదాంశము. రామాయణమున రాముఁడు జానకి నెడబాసి కాననమునం గ్రుమ్మరుచు, ఖగనగాదులకుఁ దనకాంతోదంతముం దెల్పుచుఁ, గరుణారస ముట్టిపడం గావించినవిలాపమును గాళిదాసకవి తన విక్రమోర్వశీయము నాలవయంకమున సొంపుగ జతపఱిచియున్నాఁడు. అరణ్యకాండమందలి-

"కచ్చిత్ క్షితిభృతాంనాథ,
సీతా సర్వాంగసుందరీ,
రామా రమ్యవనోద్దేశే
మయా విరహితా త్వయా."

అనుశ్లోకమునందలి 'కచ్చిత్' పదమును మాత్రము వీడి పర్వతప్రతిధ్వనిరూపప్రత్యుత్తరమున కనుకూలముగ 'సర్వ' అనుపదమును నెలకొల్పి పద్యమును సర్వమునే గ్రహించినాఁడు. మఱియుఁ బరమపావనంబగు సుందరకాండమందలి రామనామాంకితాంగుళీప్రదానకథను సంగ్రహింపఁగుతుకియై, తన శాకుంతలమున మూలమున లేని యంగుళీయక వృత్తాంతమును నెలకొల్పి, 'అభిజ్ఞాన శాకుం

తల' మని పేరిడినాఁడు. వేయేల? కాళిదాస మహాకవికి వాల్మీకియే గురువు. అమ్మహాకవి యాదికావ్యమునందుఁ గాళిదాస కవికిఁ గల భక్తి గౌరవము లపారములు. ఆకావ్యముతోడ నీకవికిఁ గల నిరవధికపరిచయము నకు మేర యిడఁ దరముగాదు. కానఁ బరికించు కొలఁదిఁ బదోద్ధరణములకును, బథానుకరణములకును, బద్యప్రయోగములకును నెన్నియేని నుదాహరణము లలవడుచుండు.

ఇఁకఁ గాళిదాసకవీంద్రుని కార్తికేయ పక్షపాతముంగూర్చి యించుక కలముం గదలింతము.

మనకవిశేఖరుఁ డాదికావ్యముతోఁ జిరపరిచితుఁడగుట తొలుతఁ బాలకాండమందలి-

"కుమారసంభవశ్చైవ
　　ధన్యః పుణ్య స్తథైవ చ"
"భక్తిశ్చ యః కార్తికేయే
　　కాకుత్స్థ భువి మానవః,
ఆయుష్మాన్ పుత్రపౌత్రైశ్చ
　　స్కందసాలోకతాం వ్రజేత్."

అను కుమారోపాసనాఫలశ్రుతిం జదివి దృఢతరవిశ్వాసముం గనుపఱుప స్కాందపురాణమందలి స్కందసంభవకాండసాహాయ్యమునం దొలుదొల్తఁ గుమారసంభవకాండమును రచియించెను. పిమ్మట సుందరకాండమునందలి హనుమత్సందేశము మనసున నుంచుకొని మేఘదూతకావ్యమును రచియించెను. దానితోఁ దనివిసనక రామాయణ ప్రధాననాయకుఁడగు రామచంద్రుని పూర్వులగు సూర్య

[illegible]
గ[illegible]
కుమ[illegible]
తాది[illegible]
కుమా[illegible]
కా[illegible]
వ్రాయ[illegible]
వ్యములును [illegible]
రఘువంశకావ్య[illegible]
విహారవిక్రమాభిషే[illegible]
రుల జన్మవిక్రమవిహారాదుల కుం[illegible]
బొందుపఱిచియున్నాఁడు. మచ్చునకుఁ గొన్నిటి నుదాహరించెద.

"సురసరిదివ తేజో వహ్నినిష్ఠ్యూత మైశం."
"యో హేమకుంభ స్తననిస్సృతానాం,
　స్కందస్య మాతుః పయసాం రసజ్ఞః."
"అమూన మద్రే స్తనయా శుశోచ,
　సేనాన్య మాలీఢ మివాసురాస్త్రైః."
"బ్రాహ్మే ముహూర్తే కిల తస్య దేవీ,
　కుమారకల్పం సుషువే కుమారం"
"ఉమావృషాంకౌ శరజన్మనా యథా."

వెండియు రాజకుమార రాజాత్మజాదులగు పదంబు లనేకంబు లుండఁ బల్మఱుఁ గుమారపదమునే ప్రయోగించువాఁడు.

"కుమారభృత్యా కుశలై రనుష్ఠితే,
　భిషగ్భిరాప్తై రథ గర్భభర్మణి."
"జనాయ శుద్ధాంతచరాయ శంసతే,
　కుమారజన్మామృతసమ్మితాక్షరం."

."

...వాః

...ర్ద్రైః,

...నవశశిభృతా
వాసవీనాం చమూనా
మత్యాదిత్యం హుతవహముఖే
సంభృతం తద్ధి తేజః."

అనుశ్లోకము కాళిదాసునకుఁ గల కుమారస్వామ్యభిమానమును తెల్పక చెప్పుచున్నది. కానిచోఁ, "పుష్పాసారైః స్నపయతు భవాన్" అని చెప్పుట చొప్పడునే?

విక్రమోర్వశీయపంచమాంకమున—

"ఆయుషో యౌవరాజ్యశ్రీః
స్మారయ త్యాత్మజాయ తే,
అభిషిక్తం మహాసేనం
సేనాపత్యే మరుత్వతా."

అని పురూరవసుని యౌవరాజ్యాభిషేకము కార్తికేయునకు నింద్రుఁ డొనర్చిన దేవసేనాధిపత్యముతోఁ బోల్పఁబడియున్నది. విస్తృతికి భీతిలి విరమింపవలసియున్నది గాని యిట్టివి యిన్ని యేని గన్పట్టు.

కనుకఁ గాళిదాసకవి రామాయణమందలి కుమారోపాసనా ఫలశ్రుతిం బఠించి ప్రథమమునఁ గుమారగౌరవాపాదక మగు కుమారసంభవ కావ్యమును విరచించుట చేతను, ఇతరములగు రఘువంశ మేఘసందేశ విక్రమోర్వశీయాదులందలి కుమారోపమానములచేతను, లాఁతిపదములున్నను బల్మిఁ గుమారపదమునే యుపయోగించియుంటను, సర్వమునకును గార్తికేయునే నిదర్శనముగా నిడుటఁ బట్టుదలఁ గలవాఁ డౌటచేతను గార్తికేయ భక్తుఁడై యుండునా యని యొక యూహ వొడముచున్నది.

కవులు తా ముపాసించు దైవములం దమ కావ్యములయందలి నాయకుల కుపమానములుగఁ బొందుపఱుచు నాచార మిట్టి యూహ నించుక బలపఱుచు ననుకొందు. కార్తికేయ భక్తుఁడని నిర్ణయించుటఁ గాళిదాసుఁడను నామమును(కాళస్య శివస్యాపత్యం పుమాన్= కాళీ=కార్తికేయః, తస్య దాసః=కాళిదాసః.) అని సమన్వయించుటకు వీలగుచున్నది.

ఊహలకు మానవుఁడు బద్ధుఁడుగాఁడు. ఊహ లోకానేకతఁ గేవల సాహసమూలకము లగుటయు సంభవించు. హృదయకుహరమున నుప్పతిల్లిన యూహల నుత్తమాత్తయుల సాధకబాధకముల నిడి యౌచిత్యమరయుటయు మానవున కుచితతరము. ఊహలే మాత్రమేని సౌచిత్యనిర్ణయకారకములో, ప్రేరకములో యయిన మనుజుఁడు కృతకృత్యుఁడు. కాన సహృదయుల సరళహృదయములే సత్ప్రమాణములు.




శ్రీరంగం నల్లాన్‌చక్రవర్తి రఘునాథాచార్యులయ్యవార్లుగారు

సరసకవివతంసుఁ బరమహంసుని నిన్నుఁ-బడసి పుత్త్రుఁగాఁగ భరతభూమి
సాటిదేశములఁ బ్రశస్తిగాంచెఁ గదమ్మ-విశ్వదాభిరామ వినుర వేమ.

ఉ. ఆయతశక్తియుక్త మఖిలాఘభిదానిపుణంబునైన నా
రాయణపాదపద్మమున యం దుదయించిన వంశమందు భ
ద్రాయితమూర్తితో లసదిరాపటుధారలతో సుకీర్తితో
నాయమరాపగోపముఁడవై చెలువొందితివౌర వేమనా!

చ. నినుఁ గని కీర్తిగన్న జననీజనకుల్ ధరలోన నెవ్వరో
యని పలురీతులన్ వెదకి యప్పటికిన్ ఫలసిద్ధిఁ బొంద కె
వ్వని మత మెట్లొ యల్లె నుడువన్ దొరకొన్న జనంబులోన నె
వ్వనిపలుకుల్ గ్రహింపఁగలనాఁడను వేమనయోగి, చెప్పుమా.

ఉ. భోగపరాయణుండవయి పూర్వవయస్సును గొంతపుచ్చి యా
పై గురువర్యుఁ గొల్చి యతిభక్తిని విద్య గ్రహించినందునన్
బాగుగ భోగమందుఁగల బాధలు నీమదికెక్క మాకు నా
యోగతులన్ వచింపఁగ సమర్థుఁడవైతివి నీవు వేమనా!

చ. మతములనన్నిటిన్ గలిపి మాటికి మాటికిఁ దిట్టినాఁడ వు
ద్ధతిమెయి వేమనార్య, యటులౌటను నీతలఁపేమొ కాని నీ
మతమది ద్వైతభిన్నమని మానసమందుఁ దలంచినాఁడ "నే
నతఁడ, యతండు నేన" యని యచ్చట నచ్చట నీవు పల్కుటన్.

శా. కాయ మశాశ్వతంబనియె కాదు ధనంబునుగూడ నశ్వరం
బే యనియొక్క కాదు జగమెల్లను మిథ్యయ యంచు నొక్క

నీయెడ లగ్నమయ్యె నల నిర్గుణతత్త్వమునందుఁ గాదు కా
దో యమివర్య, వేమ, భవదూర్జితలాలసచేతనే సుమీ.

మ. అరయం జెప్పెడి దొండుఁ జేయునది యొండై నన్ "వయం ధర్మశా
స్త్ర రహస్యాన్యఖిలాని విద్మ" యను తత్త్వజ్ఞతమ్మన్యులం
దరికిన్ బాగుగ సిగ్గువచ్చునటులన్ వాకొన్న ధర్మంబు లా
చరణంబెట్టి యనంతరం బొరుల కిచ్చున్ దెల్పితో వేమనా!

ఉ. జ్ఞానివి కాన నీ వితరసన్న్యసనవ్యధితాత్ములట్లు నె
మ్మేనను గావిదోవతుల మేటి బడాయిగఁ దాల్పఁబోక కౌ
పీన మొకండె తాల్చుచును వెండియు నొక్కొకవేళ నద్దియున్
మానియునుం జరించెదవు మానితవర్తన, యోగివేమనా!

ఉ. ధారుణి శయ్యగా స్వభుజదండమె తల్గడగా విరక్తియే
దారగ నాత్మదర్శనమె తంత్రముగాఁ బరమాత్మభూయమే
సారఫలంబుగా గురునిశల్ క్షణముల్ వలె వేగు నీకు సం
సార విమోచనప్రవణసార్థవహుండవు కాన వేమనా!

చ. పరమము నిర్గుణంబు నగు బ్రహ్మముదప్ప మఱెద్దియున్ హృదం
తరమున నెంచ వట్టియమినాథుఁడ వీ విటు లెల్లదిక్కులన్
దిరిగి సునీతిబోధన మదే పనిగా నొనరించుచెన్న సో
దరులగు నాంధ్రదేశ్యుల హితంబును గోరితె కాదె వేమనా!

చ. ఇహమునకుం బరమ్మునకు నెంతయు దూరగులై చరించు ని
మ్మహిఁగల వర్తమాన కవిమానులయట్టుల కాక కాంచితి
విహమున సౌఖ్యమే వలచితేని భృశం బిడు హేమతారకం
బహితజిగీషు, వేమ, పరమందు సుఖంబిడు బ్రహ్మవిద్యయున్.

క. నీవురసవాదవిదుఁడవు-కావున హేమంబుఁ జేయఁ గలిగితి వైనన్
తావక సోదరులగు మా-కావిద్య నొసంగకుండు టర్హమె వేమా!

ఉ. ఈవల హేమతారకము నిచ్చితివేని జనమ్ము శాశ్వతం
బై విలసిల్లు బ్రహ్మము నొకప్పుడు నెంచఁగఁబోక నశ్వరం
బై వివిధార్తిహేతువగు నట్టియిహంబె వరించునంచు వే
మా, విమలాత్మకా, యొసఁగ మానితివేమొ సువర్ణతంత్రమున్.

# ప్రాచీన భారతీయ లోహపరిశ్రమలు

బొంబాయిరాజధానియందలి రాగి, ఇత్తడి సామానులు—౧౯ శతాబ్దపు టుత్తరార్ధము





౧. (ఎ), (బి). రాగిపాత్రలను జేయునాతడు



౨. రాగి, ఇత్తడి సామానులను చేయుటకు వలసిన ఆయుధములు

ఉ. అచ్చతెనుంగు బాసపయి నాదర మెక్కువ కాన నీకు నీ
విచ్చకువచ్చినట్లు రచియించినపల్కులె పద్యరూపమై
ముచ్చట మూటకట్టు జనమున్ ముదమొందఁగఁ జేయు వేమనా,
సచ్చరితవ్రతా, నిగమసారవిదున్నత, సర్వసన్నుతా!

చ. తెలుఁగుకవిత్వమందు గడిదేరిన లాక్షణికుల్ సుధీమణుల్
పలికిన పద్యబంధపరిపాటి నొకానొకవేళ మీఱితెనన్
తెలుపఁగ నన్నిపద్యములు తథ్యము నీతిని బోధచేయుచున్
సులభముగా వివర్ణులను చూఱకొనందగు వేమ, నీ కృతిన్.

ఉ. నాఁటికవీంద్రులందు సిరినాథుఁడు సీసము, తిక్కయజ్వ పై
పోటిగఁ గందపద్యములు ముద్దులు గుల్కఁగ నల్లిరందు రా
మాటలకేమిగాని కవిమండలియంతయు మెచ్చునట్లుగా
నాటవెలంది నల్లునెడ నన్యుఁడు నీ కెనరాఁడ వేమనా!

ఉ. ఒక్కొకచోటఁ బండితుల యూహలకే విషయంబు కాదు వే
ఱొక్కొకచోటఁ బామరుల యూహలకే యది గోచరించు ని
ట్లక్కజమైనభావము తనంతట వేమన, నీకుఁ దోఁచుటల్
వాక్కమలాక్షి నీదు తలవాకిట కాపుర ముండుటన్ గదా.

ఉ. ప్రాయముగాఁ బురాణకవివర్యులు లక్షణలక్ష్యబద్ధులై
పాయని పారతంత్ర్యపరభావపథానుసృతుల్ త్యజించి శో
భాయుతమున్ స్వతంత్ర మగు భావము కబ్బమునం దిమిడ్చి జా
తీయకవీశ్వరప్రథమతీర్థుఁడ వైతివి నీవు వేమనా!

ఉ. యుక్తిగఁ బల్కువారిపయి యుక్తిగఁ బల్కి జయించుచుండె లో
కోక్తుల నింపుగాఁ దనుపయుక్తపదంబులఁ దెల్పుచుండె చి
చ్ఛక్తి మెఱుఁగ మహోరజతతంత్రములన్ బొనరించుచుండె నీ
ప్రాక్తనపుణ్యకర్మ పరిపాకమునన్ లభియించె వేమనా!

మ. అవనిన్ వైద్యులు వైద్యుఁగాఁ బరమవేదాంతుల్ సువేదాంతిఁగాఁ
గవివర్యుల్ కవివర్యుఁగా నిఖిలసంస్కర్తల్ సుసంస్కర్తఁగా
శివభక్తుల్ శివభక్తుఁగా యతికులశ్రేష్ఠుల్ యతిశ్రేష్ఠుఁగా
నవయోగుల్ నవయోగిఁగాఁ దలఁతు రేనాఁడున్ నినున్ వేమనా!




## సురేశ్వరాచార్యు లెవ్వరు?

మానవల్లి రామకృష్ణకవి గారు, యం. ఏ.

అద్వైతమతవ్యవస్థాపకు లగు శ్రీశంకరభగవత్పాదులకు ముఖ్యశిష్యు లగుసురేశ్వరాచార్యులు బృహదారణ్యకభాష్యవార్తికమును, తైత్తిరీయభాష్యవార్తికమును, నైష్కర్మ్యసిద్ధి యనుప్రకరణగ్రంథమును రచించిరి. ఇందులో మొదటిది చాలఁ బెద్దగ్రంథము. దానిలోఁ బీఠికాభాగమునకు సంబంధవార్తిక మని పేరు. ఈమూఁడుగ్రంథముల నధ్యాయాంతగద్యభాగముల శంకరభగవత్పాదశిష్యు లగుసురేశ్వరులచే విరచిత మగు నాయాగ్రంథమున నని యున్నది. ఈసురేశ్వరులు పూర్వాశ్రమమున నేనామముతోఁ బ్రసిద్ధ వడసిరి? ఈసందేహము నెల్లరకుఁ జాటించుటయే యీవ్యాసోద్దేశము. మేమును మామిత్రులు సీవిషయమై యాంగ్లేయభాషాపత్రికలలోఁ గొంత చర్చించినారము. తద్భాషాపరిచయము లేనిశిష్టులకై నూతనలబ్ధాధారహేతువులఁ గూర్చుచు నాంధ్రభాషలో దీని విశదీకరించుట చర్వితచర్వణదోష మంతగాఁ గానేరదు.

సురేశ్వరులు మండనమిశ్రు లనియు, విశ్వరూపాచార్యుఁ డనియు, ఉంబేకుఁ డనియు, భవభూతి యనియు వివిధప్రవాదములు గలవు. వీరెల్లరు గ్రంథకర్తలు. వీరి నిబంధనము లిప్పుడు లభించుచున్నవి. మండనమిశ్రులు విధివివేకము, భావనావివేకము, విభ్రమవివేకము, స్ఫోటసిద్ధి, బ్రహ్మసిద్ధి యను నైదు గ్రంథములు రచించిరి. వానిలో దేనిఁ జూచినను గ్రంథాధ్యాయాంతముల "ఇత్యార్యమండనస్య కృతిషు" అని కాని, "ఇత్యాచార్యమండనస్య కృతిషు" అని కాని కానఁబడుచున్నది. విశ్వరూపాచార్యులపేర యాజ్ఞవల్క్యస్మృతివ్యాఖ్యాన మగపడుచున్నది. దానిలోఁ బ్రకరణాంతమున గద్యమున, "విశ్వరూపకృతవివరణ బాలక్రీడ యాం" అని యున్నది. ఉంబేకుఁ డనువాఁడు కుమారిలభట్టవిరచిత మగు శ్లోకవార్తిక మను గ్రంథమునకు సుమారు రెండువేలశ్లోకములకు మాత్రమే తాత్పర్యటీక యనువ్యాఖ్యానము రచించినట్లు తద్గ్రంథలబ్ధిచే దెలియుచున్నది. మఱియు మండన

మిశ్రకృత మగుభావనావివేకమునకు వ్యాఖ్యాన మొకటి యుంబేకకర్తృత్వముతోఁ బ్రచురింపఁబడియున్నది. మొదటిదానిలో "ఇతిభట్టోంబేకవిరచితాయాం తాత్పర్యటీకాయాం" అనుగద్యము కూర్పఁబడెను. భవభూతి యనుకవిమాలతీమాధవము, ఉత్తరరామచరితము, మహావీరచరితము అనుమూఁడునాటకములు రచించె నవి సుప్రసిద్ధములేకదా! భవభూతికి శ్రీకంఠపదలాంఛనుఁ డనుబిరుదము గలదు. శ్రీకంఠుఁ డనునొకయాచార్యుఁడు బ్రహ్మసూత్రములకు భాష్యము రచించెను. పైఁ బేర్కొన్న నామములన్నియు సురేశ్వరునివా యని సందేహము. వేర్వేఱు పేళ్ల వేర్వేఱు గ్రంథము లుండ నవియెల్ల భిన్ననామములతో నొక్కఁడే రచించెనా యని విస్మయము కలుగక తప్పదు.

ఇఁక వీరి యైక్యమును బ్రతిపాదించుపంక్తులు విచారింతము.

ఉంబేకుఁడు భవభూతి యనుటకు— (౧) మాలతీమాధవాదర్శపుస్తకములో, "ఇతి భట్టకుమారిలశిష్య పదవాక్యప్రమాణ పారీణ భట్టోంబేకవిరచితే మాలతీమాధవే" యని గద్యము కనఁబడినట్లు శంకరపండితులుగారు గౌడవధగ్రంథపీఠికలో వ్రాయుచున్నారు. దీని వలన భవభూతి కుంబేకనామము కలదనియు, నతఁడు కుమారిలశిష్యుఁ డనియుఁ దేలినది. (౨) చిత్సుఖాచార్య విరచిత మగు తత్త్వప్రదీపిక యను గ్రంథమున నాప్తవాక్యప్రమాణము నిర్దేశించుచుఁ దద్గ్రంథకర్త మాలతీమాధవకర్త యగు నుంబేకు నాప్తుఁగా గ్రహింపఁ దగునా యని పూర్వపక్షము సేయుచున్నాఁడు. మఱియు నవినాభావ నిర్వచనముచర్చించునప్పుడు "సంబంధో వ్యాప్తిరిష్టాత్ర లింగధర్మస్య లింగినా" యను కుమారిలశ్లోకమున కుంబేకుఁ డిట్లు చెప్పెనని చిత్సుఖాచార్యులు వ్రాయఁగాఁ దచ్ఛిష్యుఁడగు ప్రత్యగ్రూపాచార్యుఁడు దానికి వ్యాఖ్య వ్రాయుచు, "ఉంబేకో భవభూతిః"అని వివరించెను. (౩)భట్టోంబేక కర్తృత్వముతో నుండెడు శ్లోకవార్తిక వ్యాఖ్యానమున మొదటి శ్లోక మిట్లున్నది:

యే నామ కేచిదిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతు తే కిమపి తాన్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే మమతు కో౾పి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ.

ఈశ్లోకమే మాలతీమాధవమున నటీసూత్రసంభాషణమున "తస్యకవేరియంవాచో యుక్తిః— యే నామ.....పృథ్వీ" యని కానవచ్చుచున్నది. ఇందుచే భవభూతి కుంబేక నామము సిద్ధమగుచున్నది.

ఇతఁడు కుమారిల శిష్యుఁడా?— (౧) భట్టోంబేకుఁడు శ్లోకవార్తిక వ్యాఖ్యానమున శ్యేనచయన ప్రశంసలో భట్ట కుమారిలుఁడు మీమాంసాభాష్యకారుఁ డగుశబరస్వామి మతమునకు విరుద్ధముగాఁ బ్రవచింపఁగా దాని ఖండించుచు నీక్రింది శ్లోకమును గురువచన ఖండన సమర్థకముగా సూచించెను:

"గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః, ఉత్పథప్రతిపన్నస్య న్యాయ్యం భవతి శాసనమ్" అని.

ఇది వ్యాసభారతములోనిది. దీనిచేఁ దా గురుపంక్తి ఖండింపఁదగు నని సమర్థించె. (౨) శ్లోకవార్తికమున కుంబేకుఁడు ౨౩౦౦ శ్లోకములవఱకు వ్యాఖ్య రచించి విడిచిపెట్టఁగా భట్టకుమారిల పుత్రుఁడగు జయమిశ్రుఁడుదానిఁ బూరించెను. దీనిచే నుంబేకుఁడు కుమారిల జయమిశ్రుల నడుమకాలమున నున్నందున నతని శిష్యత్వ ముండిన నుండవచ్చును.

సురేశ్వరులు విశ్వరూపాచార్యు లనుటకు హేతువులు:—(౧) సురేశ్వర కృతమని ప్రసిద్ధికెందిన నైష్కర్మ్యసిద్ధికి మళయాళ దేశాదర్శములలో, "ఇతి గోవింద భగవత్పూజ్య పాదశిష్య విశ్వరూపాచార్య కృతాయాం నైష్కర్మ్యసిద్ధౌ" అని యున్నది. (౨) విద్యారణ్యులవారు వివరణప్రమేయ సంగ్రహమున—

"అధ్యాపస్యాహామితి మమేతి చాకార ద్వయం స్నేహతారతమ్యా దుపపద్యతే, తత్తారతమ్యం చ తదేతత్ ప్రేయః పుత్రాత్, ఇత్యస్యాః శ్రుతే ర్వ్యాఖ్యానావసరే విశ్వరూపాచార్యై ర్దర్శితం—

'విత్తా త్పుత్రః ప్రియః పుత్రాత్ పిండః పిండాత్తథేంద్రియమ్, ఇంద్రియేభ్యః ప్రియః ప్రాణః ప్రాణాదాత్మా పరః ప్రియః' ఇతి."

అని విశ్వరూపాచార్యశ్లోక మని యుదాహరించిరి. ఇది సురేశ్వరుల బృహదారణ్యక వార్తికమున మొదటియధ్యాయమున నాల్గవ బ్రాహ్మణమున నున్నది. దీనిచే విద్యారణ్యులు సురేశ్వరవిశ్వరూపుల యేకత్వ మంగీకరించిరి. (3) మలయాళ దేశమున వ్యవహారమున నున్న యాచార్యవిజయ మను శంకరవిజయమునఁ దద్గ్రంథకర్త గోవిందుఁడు విశ్వరూపాచార్యుఁడు శంకరులతో వాదించి పరాభవము నెంది సన్న్యసాశ్రమము స్వీకరించి సురేశ్వరనామమున శంకరుల రెండుభాష్యములకు వార్తికములు రచించెనని చెప్పుచున్నాఁడు.

భవభూతి సురేశ్వరుల యేకత్వము—యాజ్ఞవల్క్యస్మృతికి బాలక్రీడ యనువ్యాఖ్య విశ్వరూపాచార్యులు రచించిరికదా. దానికిని మూఁడువ్యాఖ్యలు గలవు. అందుఁ గర్తృనామరహిత మగునొకదానిలో మొదట—

"యత్ప్రసాదాదయం లోకో ధర్మమార్గ స్థితః సుఖీ, భవభూతిసురేశాఖ్యం విశ్వరూపం ప్రణమ్య తమ్."

అని మూలకర్తృనమస్కార మగపడుచున్నది. దీనిచే భవభూతియు, సురేశ్వరుఁడును, విశ్వరూపుఁడు నొక్కఁడ యని తద్వ్యాఖ్యాత యభిప్రాయము.

పైపంక్తులవలన భవభూతి కుంబేకుఁ డని నామము. అతఁడు గోవిందభగవత్పాదుల శిష్యుఁడు; విశ్వరూపసురేశ్వరనామములఁ బ్రసిద్ధిచెందెను. ఇందు నేను సూచించునది యేమన, "భవభూతి" యనుశబ్దరచనచే నితని కాపేరు కావ్యములలోఁ బ్రఖ్యాతమైనట్లు భోజచరితములో నున్నది. ఉంబేకుఁడనుటయు

యితేనియింటివారివ్యవహారనామము. ఇతఁడు శంకరులతో వాదించి యోడి వారిగురువు లగు గోవిందపాదులవలన నాశ్రమాంతరము స్వీకరించి విశ్వరూపాభిధానము చెందెను. సురేశ్వరనామము యతులలోని బిరుదనామముగా గ్రహింపఁదగు.

ఇఁక మండనమిశ్రసురేశ్వరులయైక్యవిషయము విచారింతము. విద్యారణ్యులవారి శంకరవిజయమున శంకరులు కుమారిలభట్ట దర్శనము చేసి యతఁడు జీవ ప్రాయశ్చిత్తవిధిలో నుండఁ దా రచించినసూత్రభాష్యము చూపి దానికి వృత్తిఁ గూర్పుమని కోరఁగా నాస్థితిలో నతఁడు వ్యాఖ్య వ్రాయనేరక యతనిమిత్రుఁ డగుమండనమిశ్రునియొద్దకుఁ బొమ్మని చెప్పఁగా నాచార్యు లాకాశయానమున మాహిష్మతీపురమునకుఁ జనియె ననియు నచ్చట మండనునితో వాదించి యోడించి యతనికిఁ బరమహంసాశ్రమ మిచ్చి సురేశ్వరనామముతో నతనిశాఖ యగుతైత్తిరీయమునకును, బృహదారణ్యమునకును దా రచించినభాష్యములకు వార్త్తికములు రచింప ననుజ్ఞ యిచ్చినట్లున్నది. దానిలో మండనమిశ్రులఁ గుమారిలుఁడు సూచించుచున్నట్టమున—

ఉంబేక ఇత్యభిహితస్య హి తస్య లోకై
రుంబేతి బాంధవజనై రభిధీయమానా;
హేతోః కుతశ్చిదిహ వాక్సురుపాభిశప్తా
దుర్వాససాజని వధూర్ద్వయభారతీతి.
—(౭-౧౧౮)

అని యతనిభార్య యగుద్వయభారతికి "ఉంబ" యనియు నతని కుంబేకుఁ డనియు పేర్లున్నట్లు శంకరవిజయకారుఁడు చెప్పుచున్నాఁడు. మఱియు నతఁ డందే—

సర్వాసు శాస్త్రసరణీషు స విశ్వరూపో
మత్తోఽధికః ప్రియతమశ్చ మదాశ్రమేషు;
తత్ప్రేయసీం శమథ నేంద్ర విధాయ సాక్ష్యే
వాదే విజిత్య త మిమం వశగం విధేహి.
7-112.

అని చెప్పినట్లున్నది.

మఱియు—

ఇత్థం స ఉక్తో భగవత్పదేన
శ్రీవిశ్వరూపో విదుషాం వరిష్ఠః;
చకార భాష్యద్వయవార్త్తికే ద్వే
హ్యాజ్ఞా గురూణాం హ్యవిచారణీయా.
(13-68)

అనుటచే విశ్వరూపోంబేకనాముఁడగు మండనమిశ్రుఁడు శంకరులతో వాదించి యోడి తురీయాశ్రమము గ్రహించి సురేశ్వరుఁ డయ్యెనని శంకరవిజయకారుని తాత్పర్యము. అతఁ డైతిహ్యము విన్నయట్లు రచించెనని తోఁచుచున్నది. మండనమిశ్రుఁడే సురేశ్వరుఁ డనుటకు వేఱె యాధారములు లేవు.

ఉంబేక మండనమిశ్రు లొక్కరే యని వాదించుటలో నొకటిబాధకము మండనమిశ్రునిభావనావివేక మను గ్రంథమునకు భట్టోంబేకవిరచిత మగు వ్యాఖ్యాన మగపడుటయే. దోషమేమి, మూలకారుఁడే స్వోపజ్ఞ వ్యాఖ్య గూర్చె నందురేమో! మూలమే కారికావృత్తిరూపమున నున్నది. ఆ రెంటికిని వ్యాఖ్య వివరణము. ఎట్లైనను రెండునామధేయములఁ

కర్తృత్వమేల శాసింపవలయును? శైలియు భేదించుచున్నది. ఉంబేకమండనుల యైక్యమును సూచించిన గ్రంథములు విద్యారణ్య శంకర విజయమును, చిద్విలాసకృతమగు శంకరవిలాసమును మాత్రమే. వీనిలో రెండవది మొదటి దానికిఁ బ్రతిలేఖ. అట్లైనచో శంకరవిజయ ప్రామాణ్యము చర్చింపఁదగు.

శంకరవిజయము విద్యారణ్య కృతమని దానిలో నున్నది. గ్రంథకర్త తాను వ్యాసాద్రి కవికృత మగు శంకరవిజయము ననుసరించెనని చెప్పుచున్నాఁడు. అయ్యది దానికి మూలమైనచో నది లభించునా? అది తంజాపుర[illegible]స్తకభండారమునను, గేరళమునఁ దిరుచ[illegible] మఠమునను నున్నది. దానిలో మండనమిశ్రుల ప్రశంసయే లేదు. గోవిందకృతమగు నాచార్య విజయమున విశ్వరూపాచార్యులు సురేశ్వరులైనట్లున్నది కాని మండన మిశ్రుల ప్రశంస లేదు.

పై యంశములను బట్టిచూడ శంకరులు విశ్వరూపుల నోడించి సురేశ్వరులఁగాఁ జేసి వార్తికముల వ్రాయించెననియు, సురేశ్వరుఁడు చతుర్థాశ్రమమును గోవింద భగవత్పాదుల యొద్ద స్వీకరించెననియు, విశ్వరూపనామ మొక శేక పరమహంసాశ్రమనామమై యుండుననియు [illegible] బూర్వాశ్రమమున నతని పుట్టుకపేరు [illegible]ఁడనియుఁ, బద్య మొకటి రచించుటచే భవభూతి యనియు వెలసెననియుఁ దేలుచున్నది.

భట్టకుమారిలుఁడు చతుర్థాశ్రమమును స్వీకరించినట్లు శంకరవిజయాదులఁ గానరాదు. కాని నైష్కర్మ్యసిద్ధి వ్యాఖ్యానమున "తాం ప్రత్యవ్యక్త మేవేతి ముక్త్వాన్యత్సిద్ధాంతం దర్శయతి పరమహంసాశ్రమానుష్ఠానపూర్వ మమలాగ్రంథే భట్టాచార్యాః పునః ప్రయాతి వేదాంత నిషేవణేన ఇత్యాదినా" యని చెప్పఁబడుటచేఁ గుమారిలుఁడు కడపట సన్న్యాసాశ్రమము ధరించినట్లు తోఁచుచున్నది. ఈ శ్లోకపాదము శ్లోకవార్తికమున నాస్తికవాద నిరాకరణఘట్టమున నున్నది. "ఆత్మాస్తితాం భాష్యకృదత్ర యుక్త్యా దృఢత్వ మేతద్విషయ శ్చబోధః; ప్రయాతి వేదాంత నిషేవణేన" అని.

మండనమిశ్రులే సురేశ్వరులన శంకరవిజయకారునకుఁగల కారణము లేవన: మండన మిశ్రుల బ్రహ్మసిద్ధిలోని ద్వితీయ తృతీయ కాండములలోని యంశములే సురేశ్వరుని సంబంధవార్తికములో నున్నవి. అవి బౌద్ధ ప్రభాకర మతఖండనయుక్తులు. వారిరువురు నొక్కరే యని యంగీకరింపకున్న సురేశ్వరులు మండన మిశ్రుల బ్రహ్మసిద్ధిలో నుండి గ్రంథచౌర్యము చేసినట్లేర్పడును. ఈకారణమున శంకరవిజయకారుఁడు వారిరువురు నొక్కఁడేయని శాసించెను. శాస్త్ర గ్రంథములలోఁ బూర్వపక్షానువాదమున నే కాక పరగ్రంథ పంక్తులు పూజ్యార్థమునఁ గూడ ననువాదము సేయుదురు. బ్రహ్మసిద్ధిపైఁ బ్రభాకర శిష్యుఁడగు శాలికనాథుఁడు "అద్వైతాభిమానీ తు భవా నాత్యంతికమేవ నిషేధ మఖిలవ్యక్తి సోఽయమాత్మీయ ఏవ బాణో భవంతం ప్రహరతి—

"లబ్ధరూపే క్వచి త్కించి త్తా
దృగేవ నిషిధ్యతే;
విధాన మంతరేణాతో న
నిషేధస్యసంభవః."

అని బ్రహ్మసిద్ధిలోని శ్లోకము నుదాహరించి దూషించుచున్నాఁడు. మఱియు "తత్రాస్యాః పండితమ్మన్యోఽమన్యతే" యని బ్రహ్మసిద్ధికారుని జాతినిర్ణయమును నిరాకరించుచున్నాఁడు. ఈఖండనములకు సురేశ్వరుఁడు ప్రతిసమాధానములఁ జేర్చి బ్రహ్మసిద్ధికారుని యుక్తులతో నీసమాధానములఁ గూర్చి ప్రభాకర భర్తృప్రపంచ మతఖండనమును సంపూర్ణము చేసెను. ఇట్టి యనువాదమునే గ్రంథచౌర్యముగా లోకము గ్రహించునేమో యని మండనమిశ్ర సురేశ్వరైక్యమును బ్రతిపాదించిన శంకరవిజయకారుఁడు విశ్వరూపుఁడే మండన మిశ్రసురేశ్వరు లని కథ కల్పించి యుండును.

మండనమిశ్ర సురేశ్వరులమతము లభిన్నములుగా సంక్షేపశారీరకగ్రంథకారుఁ డగు సర్వజ్ఞాత్ముఁడు చెప్పుచున్నాఁడు. మఱియు మండనుఁడు భర్తృహరి ప్రతిపాదిత మగుశబ్దబ్రహ్మస్ఫోటవాదము ననుసరించి బ్రహ్మసిద్ధియు, స్ఫోటసిద్ధియు రచించె. సురేశ్వరుఁడు స్ఫోటమును నిరాకరించె. మండనుఁడు జ్ఞానకర్మసముచ్చయవాది. సురేశ్వరుఁడు కర్మ నిరసించి జ్ఞానమే ప్రతిపాదించె. మఱియు మండనమతమునే చాలవఱకు వాచస్పతిమిశ్రుఁడు గ్రహించి శంకరభాష్యమునకుఁ బ్రస్థానభేదమును భామతీగ్రంథమున సూచించెను. సురేశ్వరమతము నిష్టసిద్ధికారాదులు, నానందగిరియు ననుసరించి వార్తికకారమతమని శంకరభాష్యమునకుఁ బ్రస్థానాంతరము కల్పించిరి. పంచపాదికావివరణకారులు తద్భాష్యమునకు మూఁడవప్రస్థానమును నిశ్చం[illegible]రి. వివరణ, వార్తికకార, భామతీమతములు మూ[illegible]డునుగలిసి ప్రస్థానత్రయమని మాయభిప్రాయము. కొందఱు భామతి, కల్పతరు, వివరణములు గలసి యీనామము చెందెనని చెప్పుదురు. ఈమూఁడు గ్రంథములు నేక మత (మండన మత) ప్రభవిష్ణువులే కావున వానికి వేర్వేఱఁ బ్రస్థానశబ్దము చెల్లఁజాలదు.

---

## నిశ్చింత

దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు

పరిపరిగతుల సర్వవ్యాపకుని నిన్ను వెదకఁబోయితి నెంత వెఱ్ఱి నయ్యా,
నీనామరహితత నే నెఱింగియు నట్టె పిలువఁబూనితి నెంత వెకలి నయ్యా,
ఆకారశూన్యుఁడ వౌ టెఱింగియు నిన్ను నరయఁ గోరితి నెంత మొఱకు నయ్యా,
సర్వసముఁడవన్న సంతన నెఱిఁగియుఁ బొగడసాగితి నెంత మొరటునయ్యా,
అవగతంబయ్యె నిగమరహస్యమెల్ల-ఆకళింపయ్యెఁ బ్రకృతిగూఢార్థమెల్ల
నేని నీవాట నేటికి నెఱుఁగనయ్యె-స్వాంత మింతకుఁ దండ్రి! నిశ్చింతమయ్యె.



# వినోద విమర్శము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

బ్రహ్మశ్రీ నడకుదుటి వీరరాజు పంతులు గారు శ్రావణభారతిలో సర్వలక్షణసార సంగ్రహమునుగూర్చి వ్రాసినవ్యాసము విలువ గలది. అందలి విషయములను గూర్చి నాకుఁ గల యభిప్రాయభేదముల నించుక యెఱింగించు కొనుచున్నాఁడను.

౧

## గసడదవాదేశ విచారము

"ఎల్ల ప్రథమలమీఁదను వచ్చు నెల్ల శబ్దంబుల పరుషంబులకును నెల్లచోటులను గసడదవాదేశము నిత్యమేయనియుఁ గావున నే తిమ్మకవిచంద్రుని లక్షణము ప్రమాణయుక్తమనియు దానం జేసి 'సవి కృతిశబ్దాత్పరతః సాసంస్కృతికానాం భవన్తి గసడదవాః' అను సూత్రమాధారరహితమనియు సిద్ధాంత మగుచున్నది" ని వారు వ్రాసిరి. సంఖ్యాపరిమాణ వాచక మీఁదమాత్రమే యెల్ల పదంబులకచటతపలకు నెల్లచోట్లను గసడదవాదేశము నిత్యము గావచ్చుననియు,తక్కిన ప్రథమాంతముల మీఁద అవ్యయములమీఁద క్రియలమీఁద నీయాదేశము బహుళముగా వచ్చుననియుఁ బెక్కు ప్రయోగములఁ బరిశీలించి నేను నిర్ణయించుకొంటిని. వీనికి వలసిన ప్రయోగములను బసవపురాణపీఠికలోఁ జూపితిని. ప్రథమమీఁది కచటతపలకు గసడదవాదేశము లేని ప్రయోగములు గూడఁ బెక్కులు గలవు. కొన్ని యవ్యయములపై నీయాదేశము కల్మి నిత్యముగాఁ గానవచ్చును. మఱికొన్ని యవ్యయములపై నీయాదేశము లేమినిత్యముగాఁ గాన వచ్చును. క్రియలపై నటునిటుగూడఁ బ్రయోగములు గలవు. ద్రుతాంతములు గాని క్రియలు గూడ, కలదు, లేదు, ఇత్యాదులు బ్రథమాంతములతోఁ దుల్యములని యే నా తలఁపు. శబ్దవ్యుత్పత్తిని బరిశీలింప నవి ప్రథమాంతములే యగును. నే నిట్లు చెప్పుట కాధారమయిన ప్రయోగములఁ గొన్నింటిని బసవపురాణపీఠికలోఁ జూపితిని గాన చర్వితచర్వణమని యిక్కడఁ జూపనయితిని. అక్కడ నేనుజూపిన ప్రయోగములెల్లఁ బ్రాసమునుబట్టి యున్నవే. కవిజనసంజీవనీకారాదు లీయాదేశము ప్రాసస్థానప్రసక్తమే యనుట యాకాలమున కీయాదేశముశిథిలమగుటనుసూచించును. ప్రాచీనులు ప్రాసస్థలములందొకవిధముగాను,తక్కినస్థలము

లందు వేఱొకవిధముగాను బ్రయోగములఁ జేసిరనుట కాధారము గానరాదు. ప్రాసేతర స్థలములందుఁగూడఁ బ్రాచీను లీయాదేశమును బాటించిరి. శిలాతామ్రశాసనము లీవిషయమును నిరూపించుచున్నవి. కాని ప్రాసస్థలములందు నేను జూపిన ప్రయోగములంబోలెఁ బ్రాసేతరస్థలములందునుగూడ నీయాదేశమును బాటింపక పోవుటయుఁ గొన్ని శాసనములందుఁ గాననగును. సంబోధన ప్రథమమీఁద నీయాదేశము లేమి నిత్యము.

గీ. పలికినప్పుడు దేనియ లొలికిపడెడు
జళుకుఁజూపులఁ గ్రొమ్మించులులుకుపడెడు
ములికినాటిది గాఁబోలుఁ జెలి! కిరాట!
కలికి సిలుకలకొలికి యీ తెలికి జోటి!
—క్రీడాభిరామము.

ఇక్కడ 'చెలి!' సంబోధనము తర్వాత 'కి' 'గి' కాలేదు. సంఖ్యాపరిమాణవాచకములమీఁద నీయాదేశము నిత్యముగాఁ గలదనుటకు వింతవింత ప్రయోగము లనేకములు శాసనములందును, గ్రంథములందును గలవు.

చ. హృదయము లుల్లసిల్లఁ బురి
నింతులు మేడల నుండి పాడఁగా
నది విని క్రోలుచుం బరవ
శాత్మకమై స్వమృగంబు పెద్దయుం
గదలకయున్నఁ గుంటువడి
కాదె మృగాంకుఁడు రేలు గొన్ని గొ
న్ని దిశల నభ్రవీథికన
నిల్చుఁ బ్రభాతము డాసినప్పుడున్.

ఈపద్యము కేయూరబాహుచరిత్రము ప్రథమాశ్వాసము లోనిది. ముద్రితమయిన పుస్తకములోనిది గానరాదు. ఆదేశము కల్మికి శ్రీవీరరాజుపంతులుగారు చూపిన ప్రయోగములు చాలియేయున్నను విడువఁబడినపద్యము గాన దీని నిక్కడ వెల్లడించితిని. వికృతిశబ్దములకంటెఁ బరమయిన సాంస్కృతికశబ్దముల కచటతపలకు గసడదవాదేశ మింత స్పష్టముగా బహుస్థలములఁ బ్రాచీనభాషలోఁ గానవచ్చుచున్నను 'నవికృతిశబ్దాత్పరతః సాంస్కృతికానాం భవన్తి గసడదవాః' అను సూత్రము గలయాంధ్రశబ్దచింతామణి నన్నయభట్టరచితమే యనియు, దాని చొప్పున సాంస్కృతికశబ్దములకు నాదేశము రాదనియు వాదించు పండితు లింకను గలరు!

౨

స్నానశబ్దవిచారము

కూచిమంచి తిమ్మకవి యుద్ధరించిన ప్రయోగములు:—

స్నానముచేసి ధౌతపరిధానము గట్టి
—హరవిలాసము

స్నానమును సంధ్యయును బితృతర్పణంబు
—విష్ణుభజనానందము

స్నానంబుదీర్చి ధౌతములైనవస్త్రముల్.
—మత్స్యపురాణము

సరియయినవే; కాని స్నానశబ్దమునఁ [illegible] మాతృకమున 'తకారము' గలదనుట (స్త్నానమనుట) మాత్ర మంగీకారార్హము గాదు. ఈ పాఠములే కల్పితము లని యెగురఁగొట్టఁ జూచిన వజ్రాయుధపత్రికావిలేఖకుల వ్రాఁత

(ఆవ్రాఁత నేను జూడలేదు.) యు నంగీకారార్హము గాదు.

శ్రీవీరరాజుపంతులుగా రుద్ధరించిన ప్రయోగములు తిమ్మకవియుద్ధరించిన ప్రయోగములతోఁడివే; ప్రామాణికములే. కాని 'స్నాన' పదమున తకారముగలదనియు 'స్త్నానమని' యుండవలసియుండగా నజ్ఞానముచే లేఖకులు తకారమును విడనాడుచున్నారనియు వ్రాయుట మాత్రముసాహసమనినాతలంపు. పంతులుగా రిట్లువ్రాసిరి:—

"మహాకవులు స్త్నానశబ్దమును తకారమునకు యతి సెల్లునట్లు ప్రయోగించియుండ, లేఖకమహాశయులు తమయజ్ఞానముచే నంటున్న తకారమును విడిచిపెట్టి 'స్నాన'మనియే వ్రాఁతప్రతులయందు లిఖించినారు. కావుననే పైపొత్తములను ముద్రింపించిన పండితులు స్త్నానశబ్దమును తకారరహితముగనే (స్నాన-అని యతిని బరికింపకయే) యచ్చొత్తించినారు. (చూ. వావిళ్లవారిరుక్మాంగద, కాశీఖండములు; సరస్వతీపత్త్రికనుండి వెలువడిన హరవిలాసము. 1901.) మఱియు, "స్త్నానంబు దీర్చి..." అను మత్స్యపురాణప్రయోగమును లేఖకులు తకారశూన్యముగ వ్రాసియుండుటచేతనే, కవితాపత్త్రికయందు మత్స్యపురాణమును బ్రకటించిన శ్రీవేంకటరామకృష్ణకవులో, వారికి లభించిన తాటియాకుఁబ్రతిని వ్రాసిన లేఖకుఁడో దానియతి కుదరకపోవుటచేఁ గాఁబోలు, (గీసపాదముగు టంజేసి) 'తానంబుదీర్చి' అని సవరించి యతిని సరిపుచ్చినారు!

ఇంతమంది కవులు * స్త్నానశబ్దమును తకారయుక్తముగఁ బ్రయోగించియుండఁగా, అంతమందిలేఖకులు దానిలోని తకారమును వదలివేసియుండఁగా, స్త్నానశబ్దమున తకారము నెవ్వరో చేర్చినారని తలంచుట యసమంజసము గాదా?

కావున తిమ్మకవి యిచ్చిన మూఁడుప్రయోగములనుబట్టియు, పై కాశీఖండ, రుక్మాంగదచరిత్రముల ప్రయోగములను బట్టియు స్త్నానశబ్దమున తకారము గలదనుట సిద్ధాంతమగుచున్నది."—

త ర్వాత పంతులుగారు స్నానశబ్దమున తకారము గలదనుటకు ప్రాతిశాఖ్యసూత్రము నుజూపిరి. వారుచూపిన ప్రాతిశాఖ్యసూత్రము ఛందస్సునకుఁ జెందినదిగాని భాషకుఁగాదు. ఛందోలక్షణములు భాషకు సరిపడవు. మునిత్రయమువారు పెక్కుపట్టులందు 'ఛందసి-భా

* శ్రీపీఠికాపురసంస్థానాధీశ్వరులు నన్నిచోడని కుమారసంభవము వ్రాఁతప్రతియొకదానిని గొంతకాలముక్రింద వ్రాయించి తెప్పించియున్నారు. ఆప్రతియందు దశమాశ్వాసము 77-వ పద్యమున, "క. ఆహారి విడిచి నిసర్గ, స్త్నేహంబునఁ బాలుతెంచెఁ జెచ్చెర........." అని స్త్నేహశబ్దము తకారయుక్తముగ వ్రాయఁబడియున్నది. (ముద్రితపుస్తకమున తకారము తొలఁగింపఁబడినది. చూ. 10-ఆ., 442-పద్యము.) దీని యతిస్థానము తకారమును దెలుపకున్నను, ఆపొత్తమును బూర్వమునుండియుఁ బరంపరగా వ్రాయుచువచ్చిన లేఖకులు మాతృకాపాఠ స్త్నేహామును మాత్రము విడువక యందున్నతకారము నట్లే యుంచుచువచ్చిన దాని కెంతేయు సంతసింపవలసి యున్నది.

పాహూమ్'అని వేఱువఱేబి లక్షణములఁ జెప్పిరి. మునిత్రయమువారు మొదలగు సంస్కృత వ్యాకరణకర్తలు భాషాస్వరూపమును బాగుగా గుర్తించి సుసూక్ష్మములగు నుచ్చారణభేదములనుగూడఁ జూపుచు లక్షణకల్పనము చేసిరి! సంస్కృతభాషామహారణ్యమున స్వైరవిహారముసల్పినసర్వజ్ఞసింహములుగాని వారుసామాన్యులుగారు! ఋషులు, ఋషికల్పులు, నిరంకుశులు, వశ్యవాక్కులు నగు వ్యాసవాల్మీకికాళిదాసాదికవులుగూడ నీ "స్త్నాన"రూపమును బఠింపరయిరి! వేలకొలఁదియేండ్లనుండి వెలయుచున్నట్టియు, నతివిపులమయినట్టియు, సంస్కృతభాషావాఙ్మయమున నెక్కడను స్త్నానరూపము గానరాకుండఁగా, నిప్పటి కేనూఱేండ్లకుముందున్న శ్రీనాథుఁడు సంస్కృతభాషా మర్యాదావిరుద్ధముగాఁ దెలుఁగుఁ గవిత్వములో వైదికవర్ణక్రమోచ్చారముగల స్త్నాన పదమును బ్రయోగించెననుట భావ్యమా? స్త్నానముతోపాటు పంతులుగారు స్త్నేహమునుగూడ వ్రాసిరి. హవిష్పృతి ఘృతాచీ— పూష్ణ్ణే స్వాహా—సర్వస్త్మై—ప్రాశ్ ఛ్షిషూత్ (సంహిత) యదశ్త్నాతి (కాఠకము-ఇట్టిరూపము సంహితలో లేదట)—సంవథ్సరమ్—రఖ్షోహణో— ఇత్యాది వర్ణక్రమ శబ్దోచ్చారరీతులను గూడ నిక భాషలోఁ జొప్పింపవలసినదే! స్నానశబ్దమందలి 'స్నా' వలె స్నేహశబ్దమందలి 'స్నే' కూడ నెక్కడనేని త, థాదులతో యతిమైత్రిని జెందుట కానవచ్చెనా? దీనిని యోజింపవలదా? వేదస్వరోచ్చరిత పదములను, వేదోదిత శబ్దములను, వేదపరిభాషాయుక్త వాక్యములను నిరంకుశముగా నాంధ్రకవులు వాడిరని పంతులుగారు చూపిన ప్రయోగములలో తొల్తటిప్రయోగము తెనాలిరామలింగక[illegible] నిరుపయోగము. అది వేదమంత్రానుకరణము. అందు 'త్రియంబకం యజామహే' అనియే చెప్పవలెను. తక్కినవి మందాకినీనదిలో స్నానముచేయు వైదికబ్రాహ్మణుల పలుకుల ననుకరించి వర్ణించుటలో నౌచితీనిర్వాహమునకై కైకొనఁబడినవి. అట్టిపట్టులందు వైదికబ్రాహ్మణులు వైదికోచ్చార పరిచయాధిక్యముచే స్నేహ, స్నాన, సంవత్సర, ప్రశ్నాదిశబ్దములను స్త్నేహ స్త్నాన, సంవథ్సర, ప్రశ్న్చాది విధవర్ణక్రమోచ్చారముతో నుచ్చరించినట్లు ప్రయోగించినను హృద్యాతిహృద్య మగును కాదా? ఇట్టిప్రయోగములు పంతులుగారి వాదమునకుఁ బ్రయోజకము లగునా?

శ్రీనాథాది ప్రయోగములు ప్రామాణికములంటిరి. స్నానశబ్దమున తకారము లేదంటిరి. ఇఁక యతిసెల్లుట యెట్లు? అని ప్రశ్నమేని, ఇదిగో ఉత్తరము!

తెలుఁగు లాక్షణికులు పలువురు తద్భవవ్యాజయతి యని యొక యతిని బరిగణించిరి. విజ్ఞానమునకు విన్నాణము, విజ్ఞాపనమునకు విన్నపము, యజ్ఞమునకు జన్నము, [illegible]కు ఆన మొదలగువిధములఁ దద్భవ రూ[illegible]ములు గలవుగాన 'జ్ఞ' తద్భవత్వమున 'న'గా మాఱుచున్నది. ఇది వ్యాజముగాఁ 'జ్ఞ'కును, 'న'కును యతి చెల్లుచున్నది. జ్ఞలో 'న' కారములేదు. వేదమునందును లేదు.

అట్టి 'జ్ఞ'కుఁ దద్భవవ్యాజమున 'న'కారమునకు యతిసెల్లినది! ఈయతి నన్నియకృతిలో లేకున్నను నన్నియ కేఁబదియేండ్లకుఁ దర్వాత నున్నవాఁడగు పావులూరి మల్లన గణితములో నున్నది.

"సూనుల నల్వురం బడసె సూరిజనస్తుత సత్య భారతీ, జ్ఞానులఁ బద్మగర్భవదనంబులు నాలుగుఁబోలె వారిలో "జ్ఞా"లాత్మజునకు లెల్లతను మల్లన ప్రయోగము నొక్కదానినే పరిగణించిరి. ఈయేక ప్రయోగమునుబట్టి లక్షణమును గల్పించుట యుక్తముగా దేమో యని సంశయించి వెదకితిని. నన్నియకు నూఱేండ్ల తర్వాతివాఁడగు నన్నిచోడని కుమారసంభవమునఁ గూడ నీట్టియతి గానవచ్చినది.

...నస్వరూపమై సర్వాత్ముఁడున్నఁ దా
జ్ఞేయస్వరూపమై నెఱసి యుండు.
—సప్తమాశ్వాసము

కాన యీయతిప్రామాణికమే. 'జ్ఞ'కు 'న'కు యతిచెల్లినట్లు, 'జ్ఞ'కు, 'క'కుఁగూడ యతిచెల్లునని కొందఱనిరి. 'ప్రజ్ఞ'-'పగ్గ' గాఁదద్భవరూపముండుట కలదుగాన, యిదికూడఁ బరిగ్రాహ్యమేయనవచ్చును. అప్పకవ్యాదులపరిశీలితముగా విడనాడిరి గాని యీతద్భవవ్యాజయతి యొక్క జ్ఞ-న—జ్ఞ-క-లకు మాత్రమే కాక, తాన మనితద్భవతగల స్నానశబ్దమునకు నింక నిట్టివానికిఁగూడఁ జెల్లఁదగినది. స్నానశబ్దమున 'స్నా'లో తకారము లేకున్నను దద్భవత్వమున 'త'గా మాఱునను టుచే 'స్నా'కును, 'త'కును శ్రీనాథాదులు యతిని జెల్లించిరి.

అనాఁడీయతి తద్భవత్వమును బడయు పదములకే యేర్పడినదయియుండును. తాన మని తద్భవతఁ బొందఁదగిన స్నానశబ్దమునకే యానాఁ డీయతి గలదుగాఁబోలును. స్నేహమున కున్నట్లు గానరాదు. 'జ్ఞా'ధాతువులోని 'జ్ఞ'విజ్ఞానవిజ్ఞాపన సంజ్ఞాదిపదములలో 'న' గా మాఱుచున్నది గాన 'జ్ఞా' ధాతుజన్యము లగు నెల్లశబ్దములలోని 'జ్ఞ' లకు 'న' తో యతి మైత్రి గల్గెను. తద్భవవ్యాజయతు లిట్టి వింక నేవేని యుండవచ్చును.

ఎక్కడే నొకటి రెండుచోట్ల స్నానమని లిపియుండుఁగాక! అది శాస్త్రవిరుద్ధ మయి యుండఁగా నెట్లు ప్రమాణమగును? ఆవ్రాసినవారు, స్నానపదమందలి 'స్నా'తో 'త'కుయతి మైత్రిని జూచి యాపదమునఁగూడ 'త' కలదుగాఁ బోలునని తలంచి యట్లువ్రాసియుండఁ గూడదా?

'చాకలి'కి- త్సాకలి 'చల్ల'కు 'త్సల్ల' 'లచ్చారావు'కు 'లత్సారావు' - మొదలగు విధములవ్రాఁతలు నేఁడును గలవు! తాటియాకు ప్రతులలోని, శాసనములలోని, వింతవ్రాఁతలు లెక్కకు మిక్కిలి కలవు. పంతులుగారును వాని నెఱుఁగుదురు. అవియన్నియును బ్రామాణికములే, యని సాధింపశక్యముగాదుగదా! ఆయాదేశకాలములం దటువంటి యటువంటి యుచ్చారణరీతులు, లిపిరీతులు సామాన్య వ్యవహారమున నుండెడివని యెఱుఁగనగును. అట్టివానిని బట్టికూడ రూపభేదములు, వికృతులు వెలయుచుండును. శాస్త్రకారులు వానిలో గ్రాహ్యములఁ బరిగణింతురు! 'తాన' మనువికృతి యిట్టివిధమునను బుట్టియుండవచ్చును. వికృతిపదములోని యక్షరము లెల్లఁ బ్రకృతి పదములో నుండి తెలునని పంతులు గారును దలంపరు.

---

# పన్నా

(చరిత్రాత్మకము)

కొత్త జగ్గయ్య చౌదరి గారు

వెలదు 'పన్నా'యనెడు పుణ్యకాంతమూర్తి-సాహసౌదార్య గాంభీర్య శౌర్యములకు
నాటపట్టయి రాకొలమరిదుఁ బేరు-గన్న 'సంగ్రామసింహు' వంగడపు దాసి.

గీ. నీచకులమునఁ బుట్టిన నెలఁతయైన-నుత్తమ కులాంగనలయందు నుండఁదగిన
విమల సద్గుణగణముల వెలయు నామె-సర్వలోకైక నిర్మలాచారగతుల.

చ. విలసిత సద్గుణంబులు, వివేకధనంబు, నుదారవృత్తి, పె
ద్దలయెడ భక్తిసంపదయుఁ, దాల్మియు, నేర్పును, చిత్తశుద్ధి యా
కలికికి భూషలై మెఱయుఁ గావున మెచ్చనివార లుండ; రే
కులమునఁ బుట్టినన్ బుధులు కోరెడి దాగుణమేకదా సదా.

గీ. ఫణుల శిరములపై దివ్యమణులు, గాజు గనులలో రత్నములు, ఘోరవనములందు
నోషధులు, హీనకులముల నుత్తములును-గలుగుట స్వభావ మనునుడి కల్లయగునె ?

క. తన కన్నంబిడి ప్రోచెడి-జనవిభు, సంగ్రామసింహు, సత్యవ్రతునిన్
వినయప్రబుద్ధయై స-త్యనురక్తిన్ దవిలి కొలుచు నహరహ మెలమిన్.

సీ. వేతన మొసఁగిన వేళ సంతోషించి లేనివేళలఁ గోప మూనఁ బోదు
పీనమెత్తేసియు విసుగును జెందక తనకు విధించిన పను లొనర్చు
జననాథుసేవకే తనజీవితం బెల్ల ధారవోయంగఁ దాఁ దలఁచుచుండు
ప్రభువంశమునకు నపాయంబు గల్గుచోఁ దనకొంప పోయిన దని వగర్చు
పుడమిజనములు గొనములప్రో వటంచు-వినుతి యొనరించుచుండఁ గావనిత నెపుడు
స్వీయధర్మంబు నేవేళఁ బాయకుండు-వారి నెవరు నుతింపరు? వసుధపైని.

సీ. పద్మనందుని వంశపాలనమ్మునకునై శ్రమఁగొన్న 'మంత్రిరాక్షసు'నకైన
'జస్వంతసింహు' వంశముఁ బ్రోచి స్థిరకీర్తిఁగనిన యా 'దుర్గదాసు'నకునైన
ప్రాజ్యమహారాష్ట్ర రాజ్యంబు నిలుపనెంచిన 'నానఫడనవీసు'నకు నైన
తన రక్షకుని చేతఁ దప్పింప నిజశక్తి ధారవోసిన 'యుగంధరు'నకైన

స్వామి కార్యైక నిర్వాహసమయములను-గలుప. మేమైనఁ గలిగినఁ గలుగవచ్చుఁ
గాని యట్టిది యొకయింత గానఁబడదు-శ్లాఘ్యతమమైన యాయమ చరితమందు.

ఉ. అబలాశిరోమణి గుణాళి నెఱింగినవార లౌట భూ
జానియు వానికాంతయుఁ బ్రశాంతియుతాత్మకు లౌచు నెప్డు స
న్మానముఁ జేయుచుందురు కుమారికవోలె ననూనరాగసం
ధానవిధాన తత్పరతఁ దత్సతి భాగ్యవిశేష మెట్టిదో?

తే. అమ్మహీనాథు సుతుని క్షేమాదికముల-నరయుచు నిజాత్మజునికన్న నధికమైన
ప్రేమఁ బెంచుట వారల బిడ్డ నాపె-పోషణమునందె యుంచిరశేషగరిమ.

క. ఈరీతిఁ గొంతకాలము-పారముదాకలనఁ గడచెఁ, బదపడి యాధా
త్రీరమణుఁడు ముదిమిఁ గనె-శారీరపటుత్వ మెల్ల సన్నగిలంగన్.

చ. ముదుసలి యాటచేతఁ దన ముందటిశక్తి తొలంగె; నెప్పు డా
పదలనె శంకఁ జేయుట స్వభావముగాఁ దనరారెఁ; బ్రేమ పెం
పొదవఁగఁ బెంచినట్టి సుతు నోమెడివా రెవరంచుఁ దాఁ బదిం
బదిగఁ దలంపసాఁగె నరపాలకశేఖరుఁ డాత్మలోపలన్.

గీ. వత్సరముపైన వేఱొక్క-వత్సరంబు-పైఁబడుకొలంది నమ్మహీపాలు జవము
బలమును దినక్రమమ్మునఁ దొలఁగుచుండె-దివ్వెయందలి తైలంబు దీయునటుల.

చ. చనచన నా నృపాలకులసాగరచంద్రుఁడు కొన్నినాళ్లకున్
దనువుఁ దొఱంగి దివ్యసురధామముఁ జేరె జనాళు లెల్ల ర
య్యనఘుని చావుకై పటుతరార్తిని గుందఁగ, నెంతవారికిన్
దనువు లశాశ్వతమ్ములు గదా యనుసూక్తి నెఱింగి రెల్లరున్.

చ. అటు ధరణీధవుండు మృతి నందఁగ నాతని యర్ధభాగ ము
త్కటమగు చింతతోడఁ గనుఁదమ్ముల జాలున వేఁడి బాష్పముల్
బొటబొట రాల్చి, మూర్ఛ గని, సొక్కి, యెట్టులో సేదదేఱి, పి
మ్మట దరిఁ జేరి యేడ్చెడికుమారకు నక్కునఁ జేర్చి గ్రుచ్చుచున్.

తే. "మద్విభుని సహితముగ నే మహిఁ దొఱంగు-తఱి సమీపించె నిప్డు నీచిఱుతవాని
నెవ్వ రోముఁగలారలో యెఱుఁగ"ననుచుఁ-జెంతనే యున్న 'పన్నా'ను జేఱి పలుక.

చ. పొరలెడి దుఃఖసాగరముఁ బుక్కిటఁ బట్టుచు 'పన్న' బాలునిన్
గరముల నంది ప్రేమమెయిఁ గౌఁగిటఁ గ్రుచ్చుచుఁ బల్కె నిట్టు లా

ధరణీపురాంతతో "జననీ! తావకసంతతీవంటిదాన నా
కెటుకేగియు నన్ను నీసుతు సుఖేచ్ఛనుగూర్చి తలంక నేటికిన్.

చ. "నను బిననాఁటనుండి కరుణాభర మొప్పఁగఁ బెంచి పెద్దదా
ని నగుననుచుల్ పొనర్చిన వినిర్మలభావపరంపరాభిశో
భినివగు నీదురంతపరివేదనఁ గాంచియు నక్కటక్కటా
తనువును బాయలేనయితి దైవకృతంబునఁ జేసి తల్లిరో!

చ. "ఇంతకుఁ గర్మసూత్రబల మీవిధి నుండఁగ నెవ్వ రేమి గా
వింతురు? చిట్టిబాబునకు వేడుకలైనను దీరనీక వి
శ్రాంతిని గూర్చె నైహికవిచారములన్ దమకున్ విధాత తా
నెంతటి నిష్ఠురాత్మకుఁడొ? యెంత వివేకవిహీనుఁడో కదా!!

తే. "పసినిసువితండు పెద్దయై ప్రాజ్యరాజ్య-భార మూని ప్రజాపరిపాలనంబు
సేయుటను గాంచి సమ్మోదతోయనిధిని-మునిఁగి యాడుటకై నోచుకొనరు మీరు.

క. "కాన దురంతపుదుఃఖము-బూనంగావలసె మనకుఁ; బుత్త్రునిసౌఖ్య
శ్రీనియతి కెంతమాత్రం-బేనియు లోపంబు గలుగనిత్తుమె తల్లీ!

చ. "తలఁకకు మింక నీమదిని దావకపుత్త్రుని రక్షణార్థ ము
త్పలనయనా! వచించెద యథార్థ మొకం డిదె, వీనిసౌఖ్యసం
కలనము కేకొ అంతయును గల్గఁగనీయను బ్రాణ ముండఁగా
బలి యొనరింతు నాసుతుని ప్రాణము లేనియు; విశ్వసింపుమా.

క. "కావునఁ జింతాదంతుర-భావము విడనాడి నీదుపతితో స్వర్గ
శ్రీవిభవ మంద నిం కన్-బావన సహగమన మొనరుపఁగఁ జను"మనుచున్.

తే. ప్రియకుమారకు నొకపరిఁ బ్రీతిమెయిని-గౌఁగిటన్ గ్రుచ్చి, కందోయిఁ గారు నీట
జిలక మాడించి 'పన్న' చేతుల కొసంగి-చనియె సహగమనంబును సలుప నామె.

(సశేషము)



# ప్రాచీన భారతీయ లోహపరిశ్రమలు

బొంబాయిరాజధానియందలి రాగి, ఇత్తడి సామానులు—౧౯ శతాబ్దపు టుత్తరార్థము



3. ఉదపాత్రపై చిత్రములను వ్రాయు...



౪. దేశీయమగు తకిలెనయంత్రము



## క్రొత్తపల్లి సూర్యరావు గారు

### పదునాలవ యంకురము

ఆఁడుదానికి - అందునను నిర్గంధకుసుమమునకు, సగముకాలము పైఁగా నన్యదేశములలోఁ గడపినదానికి విశాఖపట్టనమండలములోఁ బ్రస్తుతము తక్కినజిల్లాలలో వలె విద్యావ్యాపనము తక్కువ యని తెలియుచున్నది. ఒక్క వృత్తాంతపత్రిక లేదు. ఒక్క విద్యాసభ లేదు. సమాజములని కొన్ని యున్నవి. అవియన్నియు సంస్కరణాభిలాషులు స్థాపించినవి. పాశ్చాత్యవిద్యాధికులు, సనిసులు విహరించువిహారస్థానములుగాని సరస్వతీవిహారస్థానములుగావు. ఇంటిలోఁగూర్చుండు నీకేమి తెలియునందురేమో. పదిమందిలోఁ దిరుగుమావారు కొంచెమైన నెఱుఁగరా! ప్రసంగవశమునఁ జెప్పుచుందువారు. ఆయనకీ పుంత యేమి తెలియునందురా, నమస్కారము! పూర్వము కొందఱు కవులుండిరి. జగద్విఖ్యాత పండితు లున్నారు గాని వారా సంస్కరణములజోలి తలపెట్టరు. స్త్రీలలో సంస్కరణాభిలాషిణులును దక్కువయేకాని యుద్యోగవశమున వచ్చి విదేశీయులభార్యల సహవాసమునఁ గొంద ఱా లేచుచున్నారు. పాప మిక్కడివారి కేగోలయుఁ గలియదు. లేవదీయువా రేమిచెప్పిన నదియే వీరిమార్గము గాని స్వతంత్రముగా నేమియుఁ బలుక లేరు. నిత్యానిత్య విచారము, సత్యాసత్యనిర్ధారణము వీరియొద్ద లేదు. పురుషులైన నుద్యోగవిశారదులే కాని శారదావిశారదులు లేరన వచ్చును. ఒక్కరు చెప్పినారు, కొందఱు పత్రికాధిపతులు పురపాలకసంఘము మొదలగువారు బడులు పెట్టించి విద్యావ్యాపనము చేయుచున్నారుగదా యని పెక్కు తావులవారికి వ్రాసినట్టే-మాపత్రికలను మీయధికారము క్రిందిపాఠశాలలకుఁ దెప్పించి మాకుఁ గొంత ప్రోత్సాహము కలిగింపుఁడని కోరఁగా మీపత్రికలభాష మాకర్థముగాదని వ్రాసినారఁట-ఇంతకంటెఁ బ్రబల దృష్టాంత మేమి కావలయును? కవులు కొందఱున్నారుగాని వారిదియుఁ గ్రొత్తమార్గమే. కతిపదము లుండఁగూడదు, నియమ ముండఁగూడదు. తోఁచినట్లు వ్రాయుటయే వారిదారి. ఇట్టిమగవారుగల తావుల స్త్రీలభాషాభివృద్ధి యడుగవలయునా. ఏనారీమణిచేతఁజూచిన బ్రాహ్మవివాహము, ఏవనితహస్తమునను దురాచార సంస్కరణోపన్యాసము - ఏ నాతియొద్దను గాంచినను, పునర్వివాహమండనము - ఇవి భాషావిషయములోఁ బడ్డుపడునా!

ఇతరస్థలమునుండివచ్చిన యొక్క యుద్యోగియిల్లాలుమాత్ర మిక్కడఁ గొంతకవిత్వవిలసనము కలిగించుచున్నది. అనుభవము లేనివారు కావునఁ బలువురు పురుషులే-సీకంటము సీకంటమే, చేపకంటము చేపకంటమే-ఆఁడుదానికవిత్వము వినవక్కఱలేదు. ఎవ్వరిచేతనో చేయించుకొని వచ్చినది. ఇందు మేనమామ పోలికలున్నవిగాని స్త్రీకవిత్వమునకుఁ బలముగాదని వదంతులు కలిగించిరి. కొంతకాలముక్రిందట నిక్లై యొక్క గొప్పవాఁడు తానురచించినగ్రంథము నచ్చువేయించినాఁడు-దానిఁగాంచి యితనికిఁ గవిత్వమురాదు. తనదగ్గఱనున్న యొక్క పిల్లవాఁడు రచించినది - తన పేరు పెట్టుకొన్నాఁ

డన్నారు. దగ్గఱనున్న పిల్లవాఁడు కవిత్వము చెప్పుచుండఁగాఁ దగుమనుష్యుఁ డామాత్రము నేర్చికొనకుండునా! అని యెవ్వరును దలఁపలేదు. ఈమె కవిత్వము నేర్చిన మాట సత్యమే. మగలచే వ్రాయించికొనివచ్చి సభలోఁ జదువువారు-కొందఱు నుందురు. నా యెడమచెవి త్రాడు తెగినది కట్టుకొనుదాఁక నిలువు మనుపట్టివారు-కావునఁ బదిమందిలోఁ జదువ సాహసింపరు. మాతాత చెప్పువాఁడు-పిఠాపురములో నొక్కయాశుకవి కామరాజుగారి యొద్దకి వచ్చి-నే నాశుకవినని "కమలహిత తేజ కవిరాజ కామరాజా" అని చదివినాఁడఁట- ప్రక్కఁగూర్చిమీఁదఁ గూర్చున్న పేరరాజుపంతులుగారిని జూపించి వీరిమీఁద నొకపద్యము చెప్పుఁడనఁ "గమలహిత తేజ కవిరాజ పేరరాజ" యన్నాఁడఁట - కట్టకట్టి కవిత్వకంథ నెత్తిమీఁదఁ బెట్టుకొన్నవా రమభవశాలులుగారు. సహజముగా హృదయమునఁ బుట్టవలయును. ఈకవయిత్రి యెంత నేర్చినదో-అంతేకాని యొక్కపుస్తకము చేతితోఁ దాఁకదు. కంటితోఁ జూడదు - నోటితోఁ జదువదు - ఇంక భాషాభివృద్ధి యెట్లగును! విద్యాకృషి చాలించినది. కవిత్వముమీఁదఁ బడినది. చూచినదానిమీఁద నెల్లఁ బద్యము-ఒక్కసభలోఁ గట్టకడపటఁ జదివినపద్యములు పత్రికలోఁ బడినవి. సభ చాలించునపు డొక్కరు లేవ వద్దు, కూరుచుండుఁడు. రాజహంసమ్మగారు పద్యములు చదివెదరని యఱచినారఁట - అలబలముతో లేవఁబోవు సభఁ గొందఱు లేచినవారు లేచినట్లే నిలిచిరి. లేవఁబోవువారు కొంద ఱర్ధముక్తాసనత నుండిరి. కూర్చుండినవారు కూర్చుండినట్లే యుండిరి. రాజహంసమ్మగారు గొడుగువంకి యెడమచేతికిఁ దగిలించుకొని- నడుమనుండి తప్పుకొనివచ్చుటలో నొక్కటి రెండు కుర్చీలకాళ్లు తగిలి పడఁబోయినపిమ్మట కంటిసులోచనములు తీసి నైచి చేతఁబట్టుకొని తిన్నఁగాఁ బీఠముకడకు వచ్చి చదివిరి. ఆపద్యము లివి:—

సీ. దీపము ల్వెట్టిరి దిక్కులఁ జీఁకట్లు
పడియెను వచ్చిరి పౌరులెల్లఁ
గుర్చీలు వేసిరి కూర్చుండి రందఱు
ముందుగా సంగీతమును బిదపను
సంస్కృతశ్లోకము చదివిరి శాస్త్రులు
చప్పట్లుగొట్టిరి సభికులంత
ఎక్కిరి పీఠంబు నెచ్చుకంఠముతోడ
నిచ్చి రుపన్యాస మెవరో కాని
క్రొత్తదానవగుటఁ బ్రొద్దున నే పద్య
మల్లియుంట వీరియాఖ్య నాకుఁ
దెలియలేదు మొదటఁ; దెలిసె నిప్పుడు గాని
పద్యమందుఁ గూర్ప వల్లఁ గాదు.

అని చదువఁగనే బలేబలే చక్కఁగా నున్నది. స్వభావోక్తి కిది యుదాహరణము- అని యధ్యక్షుని కరతాళములు- తక్కినవా రెవ్వరును ముందుపద్యము వినవలెనని కాఁబోలు— తెలియకపోవుటచేతనో— మిన్నకుండిరి. నే నొక్కఁడనేనా నాతో నెవ్వరును జప్పట్లు గొట్టలేదని యధ్యక్షుఁడు సిగ్గుపడుచుండ-రెండవపద్యము—

గీ. జ్యోతిషంబు రాదు సూచన చెప్పెద
నింక మీరు లేచి యింటి కేఁగి
భోజనంబు చేయఁబోయెద రిఁక మిమ్ము
నిలిపి కష్టపెట్ట నేరనయ్య!

ఈపద్యము విని వహ్వా-ఇట్టి యూహాగలపద్య మేమగవారును జెప్పలేరు. క్రొత్తకల్పన-అని చప్పట్లుగొట్టిరి. తర్వాత నొక్క పెద్దవారు లేచి సభవారిపక్షమున నధ్యక్షుని శాంతమునకుఁ బొగడి రాజహంసమ్మగారివంకఁ దిరిగి స్త్రీలలో మనరాజహంసమ్మ- అక్కగారు-అన్నారు: ఎల్లవారు-కాదుకాదు, మీరు పెద్దలు-దీవింపవలెను- అని. మన రాజహంసమ్మ - చెల్లెలు! ఏమి బాగుగానున్నదా!-మనకుఁ జెవులపండువుగాఁ బద్యములు చదివినది. మనలో స్త్రీలు చాలమంది పదిమందిలోనికి వచ్చుటకే బెదరెదరు-ఇంకఁ బద్యము లెట్లు చదివెదరు! పద్యములు చదువుటకు శక్తిగలవారే లేరు. కవిత్వము చెప్పుట యెక్కడి మాట-కాఁబట్టి యీమె యీపట్టణములో నున్న దినములలో-మనమన భార్యలైన సోదరీమణులను-ఈమె చేతి క్రిందఁ గొన్నినాళ్లు చదువు వృద్ధిచేసికొనుటకై యత్నించునట్లు మనము చూడవలయును. మన మేలుకొనకు-ఈ [illegible] జాలనాళ్లు మనయూరులోనే యుద్యోగములో నుండునట్లు భగవంతునిఁ బ్రార్థింతము-

కాదుకాదు-అధికారులకు వ్రాసి వేఁడుకొందము అని ముగించిరి.

ఈపద్యములు ముద్రింపఁబడిన బొంబాయి తెనుఁగుపత్రికపట్టుకొని రాజహంసమ్మవదినెగారు పట్టనములో వాళ్లువాళ్లు-ఎక్కువమ్మను దిగువమ్మను. గ్రహచారవశమున మాయిల్లు వారియింటికి సమీపము-అనుదినము మాయింటికి వచ్చి అన్నగారు! ఈపద్యములలోఁ దప్పులున్నవా! అబ్బే! తప్పులెక్కడ! తీఁగెతీసినట్లున్నవి. ఆహా! అమృతత్వము! చక్కఁగానున్నవి. అని మావారు చెప్పినపిమ్మట-ఈభాగ్యమునకు నేను మామేనమామ వ్రాసిపెట్టినపద్యములు తెచ్చి చదివితినని లోకులు-ఇదియేమి సంస్కృతమా! సంగీతమా! స్త్రీకంఠమని పురుషకంఠమని నవ్వుచున్నారు. అని యామె చెప్పెను. అక్కగారు! బహుచక్కఁగానున్నవి. మీకేమిచేతఁగాదా! మీయింటినిండఁ బుస్తకములే! మీయింటిలోని పుస్తకములు చూచినవారు మీకుఁ గవిత్వము రాదనుకొనిన మనకేమి? బావగారికిగోడవరేమియు నక్కఱలేదు. ఆయనమాత్రము-తానే రచించి సభలోఁ జదివించినాఁడనని చెప్పువాఁక మనకొక్క కేసనుకొన్నను లోపమేమి? లోకముచూచి యోర్వలేదు. ప్రతివిషయమునకు లోకము వెనుకప్రక్కను గుంటిమాటలాడుచుండును. అని సమాధానపఱిచిరి. ఈ కవయిత్రి విక్టోరియారాణిగారిమీదఁ జెప్పినపద్యములు కొన్ని స్వభావోక్తిసూచకములు-పద్యములన్నియు జ్ఞప్తి యందులేవు. సీసములోఁ గొంతకడపట "...టికి తకుడబ్బాలు తీవిమీఁద, బాలుపంపించుచున్నావు బాలురకును, పెంచుచున్నావు బిడ్డలఁ బెంచినట్లు, లండనుపురంబునందుండు రాజ్యలక్ష్మి, వినుతయెడ్వర్డుతల్లి సాధ్వివుతల్లి" ఈపద్యములు ముద్రితములైనట్లు తెలియును.

మావారు నన్ను నీవుకూడఁ గవిత్వము మొదలుపెట్టుము. మీమేనమామ కవీశ్వరుఁడుగదా! పోలికలు రావా యన్నారు.

మామేనమామలు గోదావరిలోనున్నారు. ఆయనయే బ్రతికియుండిన నీవెఱ్ఱివారిట్లు లేతురా? నాకుఁ గణముకాఁగడాలుపెట్టి వెదకిన నక్షరముముక్క లేకుండఁ బోవునా-మీరుసరి, యేదిక్కును లేనివారంటిని.

వారు—నా కంఠమునకు లేదుగాని యిక్కడకు వచ్చినప్పటినుండి యీవెఱ్ఱికొంత పుట్టుచున్నది.

నేను—ఆఁడువారినిజూచి కవిత్వము చెప్పఁదొడఁగుట-మంచివెఱ్ఱియే-మీకు మగవారిసావాసమేది.

వారు—లేకేమి, డ్రయివరు, గార్డు, బొగ్గులవాఁడు-ఎంతమంది నిత్యము నాతో రైలుతో రైలెడు జనులు.

నేను—బాగుగాఁ జెప్పినారు. ఎవ్వరిప్రపంచము వారిది-మీరు రైలుకవిత్వము చెప్పుఁడు. ఆఁడు కవిత్వమునకుబదులుగా—

ఇట్లుదోవిధముగా విశాఖపట్టనములోఁ బ్రొద్దులు పుచ్చుచున్నారము. కుఱ్ఱవానికిఁ జదువుకొనుటకు మేమింటిలోఁ బలకలు బలపములు పెట్టుకొని బరులు, గుణితము, పేరులు - మాచదువు తిరుగఁ దోడవలసిన యవసరము వచ్చినది. వానితోపాటు బాలశిక్ష, సుమతిశతకము, నీతిమంజరి వల్లించినారము. మావాఁడు బడినుండి యింటికి వచ్చి, యయ్యవారు చెప్పిన పాఠములలోని సారము మాకుఁ జెప్పుచుండువాఁడు. అయ్యవారుతనము చేయుటకుఁ బంతుళ్లను దిద్దు పాఠశాల యొకటి యక్కడఁ గలదు. పిల్లవాండ్రను గంతులువేయించుటకు, మట్టిపిడకలు చేయించుటకు, వ్రాళ్లు పేనుటకు నేర్పుగలవారేకాని యాపాఠశాలలో శిక్షింపఁబడిన యయ్యవారికొక్కనికి పదము- ఇది తెనుఁగా, సంస్కృతమా తెలియదు. అర్థము తెలియదు. వ్యాకరణజ్ఞానము: పుంలింగ స్త్రీలింగము లెఱుఁగరు. బాలురకు నేర్పునది యేమి- నల్లబల్లమీఁది దానిని వ్రాసికొమ్మని- రెండు డెలుకలను వ్రాసికొనిరమ్మని - ఒకరివెనుక నొక్కరు నడువుఁడని- నిలువుఁడని కూర్చుండుఁడని మాత్రము-ఒక్కనాఁడు ఘనపదార్థము ద్రవపదార్థము నని చెప్పి- నీవింటినుండి వచ్చునపుడు రెండు ఘనపదార్థముల పేళ్లు, రెండు ద్రవపదార్థముల పేళ్లు వ్రాసికొనిరమ్మని యయ్యవారు మాశాస్త్రికిఁ జెప్పినారఁట-ఇంటికి వచ్చినాఁడు. నాన్నా! నీళ్లు ద్రవపదార్థము, మజ్జిగద్రవపదార్థము, బెల్లము, తిరుగలి యివి ఘనపదార్థములు గావా యని యడిగినాఁడు. ఓసీ బెల్లము నోటిలోఁ బడవైచుకొనిన ద్రవమగును గావున

ద్రవపదార్థము రాయని తండ్రి నవ్విరి. నాన్నా! అట్లయిన మఱి శైలు ద్రవపదార్థమా ఘనపదార్థమా-ద్రవపదార్థము వలెఁ నేలను బ్రాఁకును. ఘనపదార్థమువలెఁ గదలకుండ గట్టిగా నుండునని-యడిగినాఁడు. మే మిద్దఱమును గడుపులు చెక్కలగునట్లు నవ్వుకొన్నారము. ఇన్ని సంవత్సరములు వచ్చినవిగాని యింతగట్టిగా నెన్నఁడును నవ్వలేదు. కుఱ్ఱవాండ్ర యజ్ఞానపుమాటలలో నానందము పట్టఁజాలకుండఁ బుట్టుచుండును. వాస్తవముగా సంతానము నరులకున్న భూషణములలోఁ దొలుతటిది. మా పిల్ల-అమ్మా! యెందుకే నవ్వినారు! అని యడిగినది. దాని కేమనిచెప్పి యర్థమగునట్లు బోధింపఁగలను? బాలురప్రశ్నలకుఁ బెద్దవారు కొన్నింటికిఁ బ్రత్యుత్తరము చెప్పఁజాలరు. మావానితో మేము పాఠములు, నర్థములు, పద్యములు నేర్చుకొంటిమి. రాత్రులలోఁ దండ్రి యూరిలో నున్నపుడు తండ్రి- లేనియపుడు నేను- చదివించుచుండువారము. ఒకనాఁడు-నన్ను-అమ్మా! "తిలకింపఁగ భూమిలోనఁ దిరముగ సుమతీ" అనఁగా నర్థమేమని ప్రశ్నించినాఁడు. వానికర్థము మనస్సునకుఁ బట్టునట్లు చెప్పలేకపోయితిని. పుస్తకములో నున్న యర్థము-తిలకింపఁగన్=చూడఁగా; భూమిలోనన్=ఈ లోకములో; తిరముగన్=నిశ్చయముగ; సుమతీ! పదార్థమునుబట్టి భావము వాని కెట్లు తెల్పిన బోధపడును! క్రమక్రమముగా ననుభవమునుబట్టి భావమగును - ఏదో చెప్పి సమాధానము చేసితిమనుఁడు. ఈ ప్రసంగము మా పొరుగునమున్న యొక్కరితోఁ జేసితిమి. అయ్యో! ఆమహాత్ముఁడు మాపై నెగిరిపడినాఁడు. "మూఢులు చేయుపని యిది, బొడ్డూడని కుఱ్ఱవానినోటఁ బస్యము ఖా! నోరుతిరుగునా! అర్థమగునా! మొదటినుండి మనలోనున్న దురభ్యాసమే యిది. చక్కఁగాఁ దెనుఁగు మాటలు చెప్పి—అదిగో నదియే చిక్కు. మాటచెప్పి వాఁడు వ్రాసిన ట్లూరకుండక, నడచి యనుదానిని నడిచి యని, నిలచి యనుదానిని నిలిచి, యని యరగను అనుదానిని ఎఱుఁగను అనిదిద్ది వానిబుద్ధి మార్చివైచుచు మొద్దును జేయుచున్నారు. వాని నోటికివచ్చిన ట్లెల్ల మాటలాడనీయవలయును. చేతికివచ్చిన ట్లెల్ల వ్రాయనీయవలయును. ఇదితప్పు-అదియొప్పని దిద్ది వానికిఁ జెప్పఁగూడదు. అర్థము చెప్ప నక్కఱలేకుండఁ జదువుకొనఁదగిన పుస్తకము లెన్నో యున్నవని కాశీయాత్రచరిత్రము మొదలైన కొన్ని పేరులు చెప్పినారు. మీపిల్లలను మీచేతులతోఁ బాడుచేసికొనుచున్నారని, తర్వాత మీరు విచారించెదరని కారాలు మిరియాలు నూఱినారు. చూచినా... యీజిల్లాలోని విద్యావిశేషములని మావారు నాతోఁ బలికిరి. మాపెఱ్ఱి మేము మానలేదు.

మూఁడేం డ్లక్కడ నున్నారము. సముద్రప్రాంతమగుటచే నాకారోగ్యముగా లేదు. ఒక రుజ యంకురించినది. తీవ్రముకాదు; నెల కొక్కసారి కాళ్లు మెఱుఁగు చూపుట-ఏనుఁగుకాలో, బోదకాలో-యగునని మెట్టో యని నేనేప్పు. నందుకొనలేక, మందులకొఱకుఁ దిరుగలేక వారు-సంరక్షణ జరుగక పిల్లలిద్దఱును - దైవమా యిన్నిదినములు మఱచిపోయిన ట్లింకను గొన్నినాళ్లు మఱచిపోరాదా యని యపుడు దైవప్రార్థన - విధిని దుడిచి వైచికొనఁగలమా. శేషాద్రిశాస్త్రులుగారని గొప్పవైద్యు లుండువారఁట - వారిశిష్యుఁడని యొకనిం బిలిచి చూపించినారు. అనుపానములు ద్రింగలేక నేను, నూఱి, కాఁచి, వడియఁగట్టి యీయలేక వారు-విసుగుకొనుట - మాయమ్మను రప్పించినారము. మాయత్తగారు కొన్నినాళ్లున్నారు. ఎవ్వరు వచ్చినను నాకు స్వాస్థ్యము కుదురలేదు. కొన్నినాళ్లుండి వారిద్దఱును వెళ్లినారు. తర్వాత మాచిన్నమ్మమ్మను రప్పించి యింటిలోఁ బెట్టుకొన్నారము. ఆమెకుఁ గడుపునొప్పి రోగము-మూఁడుమూఁకు ప్రొద్దులకుఁ గడుపులో శూల. సోడాగండ నీళ్లలోఁ గలిపికొని త్రాగుట; గట్టునఁ ద్రేఁచుట-మారోగముల కామెరోగము జత-శివశివ! మావారికి మతిస్థిమితము లేక నాళ్లు నెలలు సెలవుపెట్టినారు. మా పుట్టినింటఁ గొన్ని నాళ్లు-మా యత్తింటఁ గొన్ని నాళ్లునుండి యాచుట్టుప్రక్కల వైద్యులచే నౌషధము పుచ్చుకొంటిని-ఏమైనఁ బయిశాంతికే యైనదిగాని మూలముట్టుగాఁ బోఁగొట్టు వైద్యు లగపడలేదు. ఒకక్రొత్తరీతివైద్యుఁడు ధ్వనినిబట్టి మందులిచ్చెదనని, మొగము వైఖరిం జూచి యిచ్చెదనని వచ్చినాఁడు. నాకుఁ గోపము వచ్చినది. మందీయకుండఁ గుదిర్చెదవాయని యడుగఁదలఁచితిని. నారోగము రైలుపాగ పడక, రైలుపోఁత నిద్రాభంగము

చేసి వచ్చినదని చెప్పినాఁడు. చప్పిడిపథ్యము చేసినఁ గుది ర్చెదను మంచియౌషధ మిచ్చెదనని చెప్పినాఁడు. రైళ్ల నిద్రాభంగము చేయుటయేమి, ఉప్పులేనిచప్పిడియేమి– నాయనా నాకు మందు వలదు; ప్రాణములు వలసంటిని. దేహము శుష్కించెను, బలహీనమెక్కువ; నడువఁజాల ను, తిండి తగ్గినది. అరుచి, ఒక్కొకప్పుడు వమనము. ఇదియే వారికిని దొరకఁబడలేదు; చివరకు గుంటూరు తీసికొనివెళ్లవలయును: అక్కడ వేపచెట్లగాలి మంచిది; గుంటూరునీళ్లు మంచివి; అక్కడ దొరసాని ఆసుపత్రి పెట్టినది. మంచిసాధకురాలు– ఇది గాకున్న నది– అని మావారికి నెవ్వరో స్నేహితులు చెప్పినారఁట. చిన్న మ్మమ్మను దీసికొని గుంటూరు వెళ్లితిమి. ఆయనయూహ యిది దౌహృదలక్షణమని–గ్రహచారము, చెప్పుకొన్న సిగ్గు–వమనము, నరుచి, బలముగా నుండియు నలుసల, స్వల్పాహారము. చూచినవారెల్ల నల్లేయని తలంచిరి. వారియూహకుఁ దగినట్లుగా నైదు నెలలు నేను బాధ పడితిని.

గుంటూరులో నప్పటికి స్నేహితులే కాని యిప్ప టివలె బంధువులు లేరు. బంధువులను మించిన మిత్ర కోటి కలదనిన నతిశయోక్తి కాదు. రైలుసమీపమునఁ బేటలో సత్రములో బసచేసితిమి. అక్కడివా రంద ఱును, మీరూరకే నీరుగాలి కుదుర్చునని యుండక వైద్యముకూడఁ జేయింపుఁడు, దొరసానికిఁ జూపు మన్నారు. ఒక్కనాఁడు తీసికొనివెళ్లి చూపించినారు. ఆహా! ఆమె యాదరణము! అక్కడ నున్నవారి వాత్స ల్యము! ఆసుపత్రిభవనము! వారు చేయు చికిత్స యక్కఱ లేకయే రోగములు పటాపంచ లగునట్లు గనఁబడియెను. నారోగ మిక్కడఁ దప్పక కుదురునని నేను నలఁచు కొంటిని. ఇక్కడఁ గుదురకున్న నెక్కడను గుదురదని సంతోషపడితిని. పరీక్షించి దొరసాని నన్నాసుపత్రి లోనే యుంచుమని చెప్పినది. అన్నము రెండువేళలఁ బట్టుకొనివచ్చి పెట్టుచున్నది. మానినది మంచు– అట్లే చేయుటకు సమ్మతించినారు. కొన్నినాళ్లయిన పిమ్మట శస్త్రము చేయవలయు నన్నది.

నా కజీర్ణరోగము ముందా, శస్త్రముచేయవలసిన దాని కారణము ముందా యని యాలోచన. అజీర్ణము నకు హేతువు లేదు; నిత్యశనివారములు, నిత్యాదివార ములు, శోకములేని సోమవారము, మూఁడువాళ్లఁ బ్రతివారములో నొంటిపూఁట భోజనము. రాత్రియైనను రొట్టెలు పిట్టులు నే నెఱుఁగను. ఈపోష్య ముండఁగూడ దని కంఠశుద్ధి – డొక్కశుద్ధి – ఒక్కపండు, కొంచెము నీరు, అంతియకాని యందఱు ననుకొనురీతి గఱ్ఱునఁ ద్రేఁచునట్టు నుప్పుపిండిఫలహారము నే నెన్నఁడును జేయ ను. నాబుద్ధికిబట్టి యజీర్ణమునకుఁ గారణము తెలియదు గాని యొంటిపూఁటఁ దిని యొకపూఁట దినకుండుట చేతనే కలుగునేమో యజీర్ణము. దొరసాని చెప్పువఱకు మావారికి నాదిరోగము కాదనియే.

పాపము మాచిన్నమ్మమ్మ కడుపునొప్పితోనే గుంటూరులోఁ జైత్రవైశాఖములు రెండునెలలు మాతో బాధపడినది. గుంటూరు మనప్రాంతములకు నీలగిరియని చెప్పవచ్చును. కృష్ణానది నాశ్రయించియుండిన కతమునఁ బర్వతములలో నిమిడియున్నను వసంతఋతువులో గుంటూ రును మించలేక కొంత బెజవాడ పరితాపపడుచుండును. నాయనలార! మాకు గుంటూరులో బహుసౌఖ్యముగా నడచినవి రెండునెలలు–కొళాయి లున్నవిగాని యవి దిన ములో రెండుమూఁడుగంటలకంటె నీరుండుకాల మెన్నఁ డును లేదు. ఏవీథివారు తమ కిష్టులో వారికిమాత్ర మవి రెండుమూఁడుబిందెల నీళ్లుపోయును. మఱియొకరిద్దఱు వచ్చిరా; యొండచే నోరెండి తానే నావలనఁగాదని కిమ్మనకనిరంకఁ బ్రజలగతి యేమి? బావు లున్నవి. ఎండి పోయిన కాలములలోఁ ద్రవ్వఁబడిన యూటనూతు లున్న వి. ఆబావులలో నాబోటిది బాల్చి పడవేయలేదు, వేసి పట్టిదే లాగలేదు. ఉత్తరదేశములో నున్నపుడు దళసరి డొంగాలు, బాల్చీలు; ఇక్కడ బొక్కెనలు. బాల్చీ గుంటూరులో రూపాయి, త్రాడు రెండురూపాయిలు. బిందెఁడునీరు గిలకమీఁదఁ దోడి బిందె యొకబుజమునఁ బెట్టుకొనిన బాల్చీ, త్రాడును నావంటిది మోయలేదు. బిందెకంటె చెట్టింపుబరువు. బిందెమోయుట కొక్కతె, త్రాడుమోయుటకొక్కతె యుండవలయును. బాల్చీతోఁ దగవులుపడుచు నాలుగైదుసారులు నూతిగజములలోఁ తునుండి లాగలేక–పోష్యగాఁడు, బిఱుచుకొని తినుట కష్టమని గారె యొక్కమాటే తినమొదలుపెట్టినాఁడ

నన్నట్లు బిందెకే త్రాడుగట్టి బావిలోఁ బడవైచి యొక్కసారియే లాగి నిరాయాసముగాఁ దీసి యొకవైపున బిందె, రెండవవైపునఁ ద్రాడును బెట్టుకొనిపోవు సబలలు నున్నారు. దీనిం గాంచియే గుంటూ రారోగ్యముం జేయునందురేమో కాని యక్కడను రోగిణులు, రోగులు గావలసినంతమంది కనఁబడినారు.

నారోగము కుదిరి యింటికి ఆసుపత్రినుండి వచ్చినపిమ్మట-అమ్మమ్మకు దొరసాని వైద్యము చేయింపవలె ననుకొంటిమి. నాకు వలదే! దొరసానిని ముట్టుకొనలేనే-దానిచేతినీళ్లు త్రాగలేనే-నాకేమి, రోగము పదేండ్లనున్నది-కుదరదు. దీర్ఘరోగము-కుదరకున్న నాకొఱ కేడ్చువారెవరే! అని చెప్పుచుండెడిది. ప్రతిదినము సత్రములోని బావినీళ్లతోడుట యెనిమిదిగంటలకన్నము వండుట-తొమ్మిదిగంటలకాసుపత్రికిఁ దెచ్చి నాకు పెట్టుట-తిరిగివచ్చి స్నానముచేసి తానును, మనుమఁడును, బిల్లలును భోజనముచేయుట. యుదయమునఁ గలపని; సాయంకాలమున సరిగా నాలుగంటలకంతయు వండి తెచ్చిపెట్టిపోకున్న గేటు మూసివైచెదరని భయముచే శ్రద్ధగాఁ గాలప్రకారము రెండునెలలు నాకొఱకు నియమపూర్వకముగాఁ బనిచేసి చెఱలో నున్నట్లు బాధపడినది.

## పదునేడవ యంకురము

గుంటూరుప్రశంస యింకొక్కసారి చేయనిండు. చైత్రవైశాఖమాసములలో నెండ చెప్పనలవిగాదు. తొమ్మిదిగంట లైనప్పటినుండి యుదయముననే తల్పులు మూసికొని లోన వట్టివేళ్ల తడికలు గట్టించుకొని నీళ్లు చల్లించుకొనుచుఁ గూర్చుండవలసినదే. సాయంకాల మైదుగంట లైనపిమ్మట నేమో కొంత యెండవేఁడిమి తగ్గును. బావిలోనుండి యొక్క గబ్బురుగొట్టమును నోటిలోనికిఁ జొప్పించుకొని పీలుచుచుండవలసినదేకాని యా దాహమునకు మంచినీరు కావలయునని యొక్కరితోఁ జెప్పుట, వారు తెచ్చుట-యింతవఱకుఁ బ్రాణములు నిలుచునా యనుశంక నావంటిదానికి. అదియేమి గుంటూరో తల్లీ! ఎండలలో నెండలు, వానలలో వానలు, చలియప్పుడు చలి-అక్కడివారిలో సుకుమారు లన్నిపనులును దొమ్మిదిగంటలలోనే సరుదుకొనవలసినదే-ఇపుడు తలఁచికొనిన జాలివేయును. అరఁడలుపేట వీథులలోను కుంచము ప్రమాణగట్టిన మామిడిగున్నలున్నవి. వానిని జూచిన కన్నులే కన్నులు. అట్టివా యెండలో నెండిపోయినవి. రెండు నెలలుండి యాస్పత్రినుండి యింటికి వచ్చిన తర్వాత చూచినాము. ఏ మెంతచింతయో బ్రదికి యున్నదిగాని సుకుమారములగు సహకారము లాతాపములో నిల్చునవా? రైలుస్టేషనున్నది బాబూ'అది మాఱుపేరుగల నరకము. ఎప్పుడు చూచినను మిరెపకాయల యెగుమతి-గొట్టు. ప్రత్తి పొగాకుగాటు-ధనియముల రాసులు-అంతవేసవిలో వర్తకులును, వారియొద్ది సేవకులును మిరెపకాయలను మధ్యాహ్నసమయమున నక్కడనే తూచి బస్తాలలో వేసి-వేయునవుడు కోళ్లతో దంచి కాళ్లతోఁ గ్రుమ్మి-రైలులోఁ బడవేయుట-చూచిన నీపనివాండ్రు దేవునిముద్దుబిడ్డలు కాఁబోలును వారికొక్క తుమ్ముకూడ రాదు; ఆ కూసమైన లేదని వారి యారోగ్యస్థితికొక్క నమస్కారముచేయ బుద్ధిపొడమును. ఇంతకంటె నెక్కుడు చెప్పితినా కోపము వచ్చును గుంటూరువారికి; కోపమురానే వచ్చినది. ఏ పీఠాపురము స్టేషనులోని రొయ్యపొట్టు బస్తాలకంటెఁ దీసిపోయినదా యీ మిరెపకాయల గుంటూ రన్నారొకరు పీఠాపురము మాదిగాదు. రాత్రిపూఁట యిండ్లలోఁ బండుకొనలేము - ఆఁడువాండ్రను నగలభయముచే నిండ్లలోఁ బెట్టి తాళమువేసి తాము వీథులలో మంచము వేసికొని యీమూలనుండి యామూలకుఁగల యిండ్లవారి నొకరినొకరు పిల్చుకొనుచు విసనకఱ్ఱలు చేఁబట్టుకొని మగవారు విహారము. కొంచె మప్రమాదులై యుండినఁ బ్రక్కగుడ్డ యెత్తుకొనిపోవుదొంగలు. కాఁబట్టి పీఠాపురంబునను వంతులవెంబడిని తమయిండ్లకు ప్రహరికిరుగట-ఆయరండలు పేటలో నిభయముఁ దలఁచుకొన్న నాకు గుండె లిప్పు డదరును.

అట్టితరుణములో వీరు కూరకని నారకని దూరము నున్న యంగళ్లకుఁబోయి శ్రమపడిరి. నేనెంత లెండు, ఉన్నన్నిదినములు నాసుపత్రిలోనే యున్నదానను. మేడమీఁద నుండుటచేత నేనంత కష్టపడలేదు. మామునలమ్మ నెక్కువబాధ. పెట్టమొదటఁ దెచ్చిన సామగ్రితోనే, నాయనమ్మకు వాగొక్క యర్ధణా సోడాపోడరు

తెచ్చిపెట్టినారు. ఆకూలనొప్పికి వేళపాళలు లేవు. ఇష్టమువచ్చినపుడు వచ్చుటయే. వచ్చుచున్నపుడేపనియుం జేయలేక యింటిగుండ గలిపి నోటిలోఁ బోసికొని మ్రింగి గోడనుఁజేరబడి నారాయణా నారాయణా యనుచు మూలుగుతో నాలుగైదునిమిషములుండుట—సోడా త్రేన్పు రాఁగానే లేచి మెల్లఁగాఁ బనిపాటలకై బోవుచుండుట - ఇట్లు దినమునకు నాలుగైదుసారులు. గుంటూరు వచ్చినతర్వాత నీప్రకారము నాలుగైదునాళ్లు పోనిచ్చి రాత్రివేళ నొప్పివచ్చుట మానినది. ఇంకొక యర్ధణాకు గుండ తెచ్చినారు. కొన్నినాళ్లకు పగటిపూఁట రెండుసారులు మాత్రమే నొప్పివచ్చుచుండెను. పదేనుదినములవాఁటికి దురాయికట్టునలె-చిన్నమ్మమ్మకు మందు వైద్యము లేకుండఁగనే కడుపునొప్పి పోయినది. నాకొక్కనెల యౌషధమిచ్చి తర్వాత శస్త్రము చేసినారు. నాలుగైదుదినములకుఁ గట్లు విప్పినారు. రానురాను బాధతగ్గినది. ఇంటికిఁ బంపివైచిరి. ఇంకమీఁద జబ్బుండదని దొరసాని చెప్పినది. మమ్మెక్కడమ్మకి యిమ్మని ం లేదు. మాకీ రెండునెలలకు మున్నూఱురూపాయలైనవి. నెలవుపుచ్చుకొనఁ బోవునపుడు మాత్రము మీ రాసుపత్రికేమైన ధర్మముచేసెదరా యనిమాత్రము నవ్వుచు—మమ్మందఱ నన్నితావులకుఁ దీసికొనివెళ్లి—ఔషధశాల, రోగులుండుభాగము, వంటయిండ్లు, బాలురుండు తొట్టెలు, కాలుసేతులు ఖండింపఁబడిన స్త్రీలుగల మంటపములు-ప్రసవమందిరములు, అందున్న పలువితముల గర్భిణీస్త్రీలను జూపించి, వీరు నీ కీయూరి వారా యూరివారని తెలుపుచు, మావారినిగూడ నాగర్భిణీస్త్రీల నడిమికిఁ దీసికొనిపోయి, యింగ్లీషు నేమోచెప్పి, మమ్మందఱ నింకొక్కగదిలోనికిఁ దీసికొని వెళ్లినది. అక్కడ సీసాలలో నక్కెరరోగము, మాత్రకృచ్ఛ్రములచే బాధపడినవారి పొత్తికడుపులు కోసితీసినరాళ్లు, పేరులు వ్రాసిపెట్టియున్నవి కనఁబడినవి. అహా యెంతటిపని చేయుచున్నారని పరమాశ్చర్యము నొందితిమి. మరల యథాస్థానమునకుఁ దీసికొనివచ్చి కూర్చుండుమని మాకుఁ గుర్చీలువైచి లోనమండి యొక వెండి పళ్లెరము తెచ్చి మాయెదుటఁ బట్టుకొని నిలిచినది. రెండు కమలాఫలములు, నేఁబదిరూపాయలును పళ్లెములో వేసి మావారు దొరసానికి సలాముచేసిరి. మేమందఱమును సలామమ్మా సలామంటిమి. ఆమెకూడ నిండుసలాములు, మీరింత యిచ్చెదరనుకొనలేదు. నాతలంపునకు మించినది యిచ్చినారని సంతోషించి నాకొక్క తెలుఁగుబైబిలిచ్చినది. దానివెల యేనిమిది అణాలు. మావారి కొక్క యింగ్లీషుబైబిలిచ్చినది; యేమో మతమువిషయమై మాటలాడినది. నీవు మా యేసుక్రీస్తును నమ్మెదవా. నీ యభిప్రాయ మేమని వారి నడిగినది. కార్యార్థులము. ఎవ్వరి మతము వారికి. మీరు చేయుచున్నపనులు శ్లాఘ్యములు. ఇతరమతస్థులలో నింత, యెదుటివారిం గాంచినఁ దమవలెఁ జూచికొని యాదరించు ననసూయాస్వభావము లేదు. దివ్యమైనమతము మీది. మా మతములలోకంటె మీయొద్ద,మీమతములోనున్న విశేషము సర్వసమత్వము. మామతమునందును నింతకంటె నెక్కుడు విశేషమున్నదిగాని, బహిరంగముగ నాచరించువారు కనఁబడరు. మా మతస్థులకంటె మీవారల్పసంఖ్యాకులగుటనో యేమో మీరు చేసిన పనులన్నియు నెప్పటికప్పుడు స్పష్టముగాఁ దెలియవచ్చును. మాకృష్ణుఁడేమి, మీక్రీస్తేమి పేరులు భేదమేకాని, మాదేవుఁడని మీదేవుఁడని మాకు లేదు. మే మద్వైతులము. అందఱకు దేవుఁడొక్కఁడే—మతభేదము, నామభేదము నని యామెకుఁ గలఁతపుట్టునట్లు గబగబ నాలుగుముక్కలు చెప్పినారు. "మంచిది బైబిలు చదువుఁడు, ఏసుక్రీస్తు దేవునికుమారుఁడు, ఇక్కడ మేము స్త్రీలకు బాలురకు, ఆసుపత్రి పెట్టితిమి, దేవుని కృపచేత రోగములు కుదురునట్లు చేయుచున్నా"మని "మంచిపోకుఁడు" అని సలాముపెట్టి పళ్లెము పట్టుకొని లోనికిఁ జనినది.—గేటుదాఁకఁ బోయిన మమ్మఁ బిలిచి 'నే నపుడపుడు త్తరములు వ్రాసెదను. ఆసుపత్రిరోజని సంవత్సరమున కొక్కనాఁడు వచ్చును, మీరేమైనఁ జందా పంపుచుండుఁ' డని కోరినది. మా పేరులు, విలాసము వ్రాసికొన్నది.

దొరసానికిఁ దెలిసినయెడలఁ జంపివేయును, అక్కడఁ బనిచేయువాండ్రందఱు నిర్ధనులు. తిండికొఱకే పనిచేయుచున్నారు. అందఱును బనిచేయుట తిండికొఱకేకాని—వీరిది దుస్థితి. రాత్రియుఁ బగలు మంచములయొద్దనుండి సమస్తోపచారములుఁ జేయుదురు. ఎన్ను

రుగా వచ్చి వెళ్లుచున్నారా యమ్మా! యని సలాముపెట్టి సాగనంపుదురు. వారి కొకరికిఁ దెలియకుండ నొకరికిఁ జేతి కొకరూపాయ యిచ్చితిమి. వారికిఁ దృణము మహోపేరుపు. ద్వారపాలకుఁడు బసను వచ్చెదను స్వామీ యన్నాఁడు. బసలో వాని కొక్కరూపాయ, సరి క్రొత్త కోటొక్కటి యిచ్చితిమి. ఒకనాఁ దూరు చూచుటను నిల్చినారము. రెండవనాఁడు స్నేహితుల యింట నిర్బంధింపఁబడితిమి. మూఁడవనాఁడు బెజవాడ వచ్చి చిన్నమ్మమ్మ గంటా రనాచారమునకై కృష్ణలో స్నానము చేయించి - ఆసాయంకాలమే తాడేపల్లిగూడెములోనే రైలుదిగి ముందు మా యత్తవారింటికి వెళ్లినారము. పిల్లవాని కుపనయనము గావించితిమి. సెలవు దినములు కావచ్చుటచే నన్నక్కడ దిగవిడిచి, అమ్మా, జాగ్రత; నాన్నా, ఉత్తరములు వ్రాయుచుండుమని మమ్ము విడువలేక తచ్చాడుచు వెళ్లినారు. అత్తగారు నన్నొక్కపని చేయనీయలేదు. ఆ వృద్ధదశలోనే నన్నుఁ బదునైదుదినములు కాపాడినారు. భోజనముచేసి మధ్యాహ్నము చావడిలోఁ జాఁపవేసికొని మామగారు రేనో గ్రంథము చూచుకొనుచుండువారు. నేను, నన్నుఁ జూడ వచ్చు నిరుగుపొరుగువారు, వారికోడండ్రు—అత్తగారు—లోగుమ్మములోఁ గూర్చుండి లోకాభిరామాయణము. పిల్లలు తాతగారియొద్దఁ గూర్చుండి తాతా! రైలెప్పుడైనఁ జూచినావా? రైలుకూఁత వింటివా యని యడుగువారు—ఆయన! ఓసీ! రైలునకు గుఱ్ఱములను గట్టెదరా! యెద్దులను గట్టెదరా! నీళ్లు త్రాగునుగదా, గడ్డి యెప్పుడైనఁ దినునా? యని యడుగువారు.

మనుమఁడు—తాతా, రైలుకు గుఱ్ఱాలెందుకు, ఎద్దులెందుకు?

తాత—మఱి యెట్లు నడచునురా?

మనుమఁడు—నీళ్లుపోసి బొగ్గులువేసి మరత్రిప్పి వేసినఁ బరుగెత్తును.

మనుమరాలు—కాదురా! అన్నయ్యా! లోచన్ సింగు పచ్చజెండా చూపకుండా నడవదురా.

తాత—లోచనసింగే కాని నేను జెండా చూపిన నడువనంటే—అమ్మా, నీవు చెప్పవే, బండి కెద్దులా గుఱ్ఱాలా కట్టెదరు.

మనుమరాలు—లేదు తాతయ్యా! గార్డు ఊఁదును, రైలు నడచును.

తాత—ఏమో నేను నమ్మను, లోచనసింగు వెనుకనుండి త్రోయునేమో—నేను జూచికాని నమ్మను.

మనుమరాలు—నన్నెత్తుకొని యొకనాఁడు జెండా ఆడించినాఁడు—కదలినది.

తాత—లోచన్‌సిం గవ్వరే! అమ్మాయీ!

ఈమాటకు సమాధానము, నేను, మామగారు వినవట్లు వచ్చినవారి కోడండ్రతో—లోచనసింగువి[illegible] డ్డిఁకుఁ బ్రేమ యెక్కువ. ఒక్కనిమిషమై[illegible] వానిని విడువరు. ఖరగ్‌పూరులో నున్నపుడు, రాత్రియుఁ బవలును వాఁడు మాయింటిలోనే యుండువాఁడు. నాకు జబ్బుచేసినపుడు నెలదినములు వానికి సెలవిప్పించి, విశాఖపట్టణము వానిని బిలిపించినారు అనియుఁ జెప్పి, దర్వాత నపుడపుడు జరిగినవిషయములు, మాకు నుబ్బు రాని ఆగరాపారా, బంగాళీబాబులు, ఆవుమాడలు, గ్రుడ్డిపిల్ల, కలకత్తావిశేషములు, వేణుగోపాలశతకము వలెఁ బదిపది చిల్లరమాటల కొక్కసారి రామయ్యగారు, మావారి నాదరించుట—మొదలైన పూర్వవృత్తాంతము, లాటరీ వేయుట, గోపిగానిని దిట్టిపోయుట చెప్పుచుండు దానను. [సశేషము]



# ఏల మీరు కామినియా తైలమునుమాత్రమే వాడవలెను?

(రిజిస్టరు చేయుబడినది)




ఎందుకనగా:

కామినియా తైలము వెంట్రుకలకు చాలలాభకరమైనది.

కామినియా తైలము వెంట్రుకలు ఊడిపోవుటను ఆపును.

కామినియా తైలము వెంట్రుకలు పొడవుగాను, దళము గాను కాంతిగాను పెరుగుటకు తోడ్పడును.

కామినియా తైలము సువాసనతైలము మాత్రమే కాదు. అయితే వెంట్రుకలు పెరుగుటకు కావలసిన ఓషధులు ఇందులో గలవు.

కామినియా తైలము పుర్రెపై చల్లదనమును గలిగించి మెదడుకు విశ్రాంతి నిచ్చును.

చదువుడు, ఆలోచింపుడు, ఆర్డరును పంపుడు.

కలకత్తాలోనున్న ఫార్వర్డుపత్రిక తెలిపినది:—"ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీవారిచే ంపబడిన అత్తరులు, వాసనతైలములు విభజింపబడి, పరీక్షచేయబడుటవలన అందులో హానికరమైన వస్తువులు లేదని రుజావుపరచబడినది. కామినీయా వాసనతైలమునందు మనోహరమైన అత్తరు చేర్చబడినది. మెదడుకు చలువను గలిగించును."

సి. రయు. ఆర్. కార్వెల్లొ, ఎస్. ఏ. పర్జను, పెరా ద్వీపమునుండి వ్రాసినది:— "కామినియా తైలము ఒక్కలి మంచిదనియు, తృప్తికరమైనదని నిస్సందేహముగా కనుగొంటిని. ప్రత్యేకముగా చుండుకు, పుర్రెకు జ్వరలో గుణమును గలిగించును. ప్రస్తుతము వాడుచున్న నా రోగులకందరికిని దీనిని శిఫార్సుచేసితిని."

| | |
|---|---|
| బుడ్డి 1 కి ధర ర్పు. 1—0—0 | వి. పి. ఖర్చులు ర్పు. 0—6—0 |
| బుడ్లు 3 కి ధర ర్పు. 2—10—0 | ,, ,, ,, 0—12—0 |

హెచ్చరిక:—ప్రతిపట్టణమునందును, గ్రామమునందును యున్న సుప్రసిద్ధమైన దుకాణములందు కామి యా తైలము విక్రయించబడుచున్నది. మీరు అనుకునట్టి దుకాణమునందు దొరకనిచో అతని పేరును మాకు తెలుపుచూ, ఆర్డరును మాకు నేరుగా పంపుడు. కొందరు వర్తకులు ఎక్కువలాభమునకై ఆశపడి పేరులేని ర్తకునుఋతులు గలవి, తక్కువరకమువి "శ్రేష్ఠమైనదని" తెలుపుదురు. గనుక అట్టి తంత్రములను నమ్మి మోస కుడు. ఎల్లప్పుడును కామినియా తైలమునే పట్టుపట్టి తెప్పించి వాడుడు. ఇతరమైనవాటిని తెప్పించవద్దు.

## ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ,

285, జుమ్మామసీదు, బొంబాయి.

# సోలమన్ చక్రవర్తి

నాళము కృష్ణారావు గారు

చారుతరకీర్తి సోలమన్ చక్రవర్తి
విక్రమంబున ధారుణీచక్రమెల్ల
పాలనము సేయుచుండఁగ వచ్చెవాని
సింహపీఠిక చెంతకు 'షీబ' రాణి.

వాని మహనీయ సురుచిరవర్తనంబు
వాని యనుపమ శేముషీ వైభవంబు
వాని రమణీయ మధురవాక్పాటవంబు
ంచు వేడుకతో నరుదెంచె రాణి.

కొలువున తేనిసన్నిధిని నిలిచె
పువ్వుగుత్తులఁ గేల్దోయిఁ బూని రాణి;
ప్రకృతి సుకుమార సౌందర్యభరిత మొకటి
రమ్యకృత్రిమ నవకళారచిత మొకటి.

'ఏది సహజంబొ, యిం దేది కృత్రిమంబొ
నుడువుఁడీ' యని ధరణీశు నడిగె రాణి;
పువ్వుగుత్తులవంక కీల్బొమ్మవోలె
తేఱిచూచుచు నృపుఁ డట్టె యూరకుండె.

సభ్యులెల్లరు తలలూచి సంభ్రమమున
ముక్కుపై వ్రేలి నిడికొని గ్రుక్కు మిక్కు
రనకయుండిరి; క్రమ్మఱ నడిగె రాణి
అధిపుహృదానంబు పొడఁగని యాత్మ నలరి:

'ఏది సహజంబొ ఎయ్యది కృత్రిమంబొ
అరసి వేగమె దేవర యానతిండు
అఖిలశాస్త్రవిశారదు లైన మీకు
ఎఱుఁగరానట్టి మర్మముల్ ధరణిఁ గలవె?'

ఏమియును మాఱు పలుకక భూమివిభుఁడు
దేనికో వేచియున్నట్లు దెసలు చూచె;
వినఁబడియె నంత గద్దియవెనుక నున్న
ద్వారమవతల భ్రమరఝంకారరవము.

చిఱునగవు నెమ్మొగమ్మునఁ జెంగలింప
'తలుపు తెఱు' డని మెల్లగఁ బలికె తేడుఁ;
పెదవి దాఁటెనో లేదో భూవిభునిపలుకు
పరుగువాఱి కవాటమ్ము తెఱచె భటుఁడు.

ఝమ్ముఝమ్మని చంచరీకమ్ము లెగసి
రభసమున నాసభామందిరమ్ముఁ జొచ్చి
జాణ యగు రాణివామహస్తమున నున్న
కుసుమమంజరిచుట్టును ముసరికొనియె.

అదియె నిక్కంపుపూగుత్తి యనుచుఁ దోఁప
సార్వభౌముఁడు మందహాసమ్ము చేసె;
ప్రజల ముసిముసినగవులు గుజగుజలును
ఒక్కపెట్టునఁ గొలు వెల్లఁ బిక్కటిల్లె.

అచ్చెరువు ఆచ్చపాటును బిచ్చలింప
శిరము ముందుకుఁ గుంచి యాషీబరాణి
పుడమిరేలిక మ్రోలను మోకరిల్లి
వేయినోళుల వినుతించె విభునిప్రజ్ఞ.

---




పూడిపెద్ది వెంకటరమణయ్యా గారు

"మ. అతఁడావాతపరంపరాపరిమళ వ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురన్ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొకమరున్నారీశిరోరత్నమున్."

నిజంగా యీక్షణంలో ప్రవరుడు మహాఅదృష్టవంతుడంటాను. ఆగాలి పీల్చినవాడు సుఖంలో తేలి మైమరచిపోతాడుగానీ మరేమైనావుందా? కాని జెట్టిముండాకొడుకు ప్రవరుడలా అయ్యేడుకాడు! పెర్లాకు పలోమ్ములాగు జనాన్వితమిచ్చోటనిమాత్రం తెలుసున్నాడటే! ఇలాటి ఆలోచన కప్పుడవకాశం యెలా కలిగిందో! స్వర్గద్వారం తెరుస్తూవుంటే ద్వారపాలకుల స్వభావనిర్ణయంచేస్తూ నిలబడ్డవాడొక్కప్రవరుడే కనబడ్డాడు! ఈమనుచరిత్ర చదువుతూవుంటే ఆహిమవన్నగప్రాంతం, అక్కడి ఉద్యానవనాలూ, వాటిలో అపూలమొక్కలూ, వాటిమధ్యను తిరిగే అవరూధినీ, ఇవన్నీ తలుచుకుంటే నాకు సీమలోని ఆకెవకటీరోజులు జ్ఞాపకంవస్తున్నాయి! హేంప్షైరులోని బంగళా ముందుతోట క్లారాతోకూడా నాకళ్లకు కడుతూంది! నాకళ్లు జల్లుమంటూంది! అవన్నీ అవేరోజులు! అప్పుడుగానీ నే నీమనుచరిత్ర చదివివుంటే క్లారాను తప్పకుండా పెళ్లాడివుందును. లోపల కొట్లాడుతూన్న విలాస శృంగారాలు పైకుబకడానికి కావ్యపఠనయం వుండాలంటాను—కవికానివాడికి—నిజంచెప్పవలసివస్తేఆయింగ్లీషు స్త్రీలకున్న విలాసాల్లో పాతికోవంతయినా మన హైందవస్త్రీలకు లేవంటాను. అందులోనూ నాఅదృష్టం కాబోలు శ్యామల వట్టిమొద్దు. ఒక్కటయినా విలాసచేష్ట లేదుగదా. అది యెంతసేపూ యీమనుష్య జన్మం యేదోవ్యవహారం తెలిపిచేసుకోడాని కొత్తే మని న్నీ ఎలాగో పొట్టమోపుగా నిలబడి యీవ్యవహారం దక్కబెట్టుకుపోదామనిన్నీ చూస్తూన్నట్టుంటుంది. ఈ సృష్టిఅంతా శ్యామలలాగే వుంటే ఇక దాన్ని అనుభవించేవాడెవడు? ఆమీద దానికది ఓగ్గో విరక్తో నేను చెప్పలేనుగాని నాతో కలిసిమెలిసి పూలతోటలో తిరగడానికయినా ఒప్పుకోదు! జన్మంయెత్తేక నాలుగూ అనుభవించాలా? వద్దా? ఈయావనం నాలుగురోజులూ కళ్లుమూసుకుంటే తరవాత అంతా వట్టిదే! ఏముంది? అనుభవించడం చేతకాకపోయిన తరవాత యీసృష్టి సామ్రాజ్యానికి పట్టంకట్టుకుంటేమాత్రం యేంలాభం!...

ఈసంగతులన్నీ పూసగుచ్చినట్టు శ్యామలతో చెప్పేను. చెప్పేదేమిటి? క్లారా కెవరు చెప్పేరు? వకవకలాడే ఆ నడుంమీద తూగుతూన్న భారంతో కొంచెం వంగి పాదాలు నేలకంటీ అంటడంగా నడుస్తూ క్లారా అనాడు నావేపు కున్నితంగా సవిలాసంగా అమృతతుషారంలాగు వెన్నెలతీగెలాగు పారేసిన ఆ క్రీగంటిచూపు క్లారా కెవరు తీర్చిదిద్దేరు? సహజంగా వుండాలి. నేను తిరిగీ ఇండియాకు ప్రయాణం అవుతున్నానని క్లారాతో చెప్పేసరికి ఆమెముఖవికాసం—

"ఉ. ఎక్కడియయ్యారు కాల్ నిలువ
		కింటికిఁ బోరొండ నంచుఁ బల్కె- దీ
	వెక్కటి మీకుటీరనిల
		యంబులకున్ సరి రాకపోయె నే
	యిక్క డిరత్నకందరము
		లెక్కడినందనచందనోత్కరం
	బెక్కడి గాంగసైకతము
		లెక్కడి యీలవలీనికుంజముల్."

అన్నపద్యానికి వ్రాసినబొమ్మలాగే వుంది! నేనూ ప్రవరుడులాగు నాశ్యామలే నాకు స్వర్గంఅని, నామీద నదేమో విలాసాలూ చమకులూ భ్రమ్మరిస్తుందని తిరిగివచ్చేను. వచ్చేసరికి ఏముంది? మట్టిబొమ్మ! వట్టిపెద్దమ్మ! ...ఎంతధనముంటే రేమిటి? పురుషుడి కెంత తెలివితేటలుంటేరేమిటి? ఇల్లాలిలో శృంగారవిలాసాలు లేకపోతే ఏంప్రయోజనం! నాకు శ్యామలమూలాన్ని ఏమీ సుఖంలేదని మాఅమ్మతో చెప్పేను. మాఅమ్మ దానిని దిద్దుతానంటుంది. ఏందిద్దుతుంది? అపురూపంగా పూచిన గులాబిపువ్వుకోసి నేనందిస్తే శ్యామ లందుకోదు సరిగదా, దూరంగా పారిపోతుంది! అప్పుడు నామనస్సెంతచివుక్కుమంటుందో మాఅమ్మ కేం తెలుస్తుంది? ఆవిడ అస్తమానం "సర్దుకోవాలి నాయనా, చిన్నపిల్లపి"గ్గంటుంది. అయితే ముసలికాలంలో నా ముచ్చట్లు తీరుస్తుంది?

"ఉ. చూచితిరుళ్లం ద్రుళ్ళోత్కటక
		మాచిరిమోకపదారవిందయై
	లేచి కనంబులుక్ దుఃఖము
		లేనడు మల్లలనాడ నయ్యెడక్
	బూచిన యొక్కపోకనును
		బోదియఁ జేరి విలోకనప్రభా
	వీచికలం దదీయపద
		వీకలశాంబుధి వెల్లిగొల్పుచున్."

సిగ్గయితే యిలావుండాలి! సిగ్గులో సౌఖ్యతరంగాలు వెల్లివిరియాలి! సిగ్గులో శృంగారదేవత నాట్యం చెయ్యాలి! నాకిలాటివిశ్వర్యం ఎలాపడుతుంది?... శ్యామలమూలాన్ని నాకు రోజురోజూ జీవితంమీద అసహ్యం వస్తూంది. కొంపదీసి సన్యాసినైపోతానేమో?......ఏంసన్యాసం? వెఱ్ఱిముండాసన్యాసం! సన్యాసికావడం అంటే జీవచ్ఛవం కావడం అన్నమాటే! అంతేకాక ఒకవ్యక్తికోసం ఇంకొకవ్యక్తి సౌఖ్యపరిత్యాగం చేసుకోవడమంత వెఱ్ఱిపని అదేగాని మరొకటి లేదు. ప్రాపంచికవిషయంలో శ్యామ లోకకోసనూ నే నొకకోసనూ వున్నాము. మాయిద్దరికీ యిక కలయి కెలా కుదురుతుంది? ఎన్నివిధాల ఆలోచించినా నేను సుఖపడడాని కేమీ త్రోవ కనబడకుండా వుంది! ప్రకృతిని స్వసుఖానికి ఉపయోగించుకోగలిగినవాడే పండితుడు; వాడే జ్ఞాని. అంతేగాని కూపస్థమండూకంలాగు కూలబడ్డ జన్మ మెందుకూ!...నిన్నరాత్రి నే నీమాటలన్నీ చెప్పి శ్యామల్ని చక్కా వెన్నెల్లో వుద్యానవనవిహారంచేద్దాం రమ్మన్నాను. దానికి జవాబుగా శ్యామల వెఱ్ఱివెఱ్ఱిగా వెగటువెగటుగా నవ్వింది! ఆనవ్వుతో నేను నిలువునీరైపోయేను! నేను చదివిన ద్రౌపది నవ్వుకంటే శ్యామలనవ్వు తీక్ష్ణంగా కనిపించింది. పాపం! రారాజైన దుర్యోధను డానవ్వు సహించలేకపోతే తప్పా? నేను న్నా శ్యామలనవ్వుకి ఉగ్రుడనై పోయేను. వెంటనే యేదో తెగతెంపు చేసుకుందామనుకుని మళ్లా మా ముసలిదానిముఖం చూచి వూరుకున్నాను...ఈయౌవనం కాస్తా పిల్లముఖాలు చూడడంతో గడిచిపోతే యిక సుఖంఅనుభవించడానికి హెచ్చరి కేముంటుంది?...ఏమయితే అదే కానీ! నే నొకదొరసానిని పెళ్లాడివస్తాను. కావలసినంత డబ్బుంది; విద్యవుంది; నేను తలుచుకుంటే యేం చెయ్యలేను? దొరసానికోసం సీమ మళ్లా వెళ్లనక్కరలేదు? విశాఖపట్నంబీచిని వాళ్లు తెగదొర్లుతూవుంటారు. మంచివిలాసవతిని ఎంచుకో పెళ్లాడేస్తాను. అన్యాయంగా యెం

దుకు సౌఖ్యపరిత్యాగంచేసుకోవాలి? విశాఖపట్నంలో కట్టించి ఒక మేడ కొంటాను. దానిచుట్టూ ఉద్యానవనం వుండనేవుంటుంది. నౌకర్లనీ చాకర్లనీ పెడతాను. రెండోవాళ్ల వూసు లేకుండా నేనూ నాదొరసానీ యిరవైనాలుగ్గంటలూ సౌఖ్యసముద్రంలో కెరటాలమయి తేనుకొంటూ ఉయ్యాల లూగుతాం. విలాసోద్యానంలో వింతవింతపూలు పూస్తాం. శృంగారదేవతకి సున్నితం చేర్పుతాం. ఆనందాని కొక వింతఅందం తెస్తాం. "ఆనందో బ్రహ్మ" యని వరూధిని జ్ఞాపకంచేస్తూంది. కాని నే నిలావుంటే నన్నే దొరసాని పెళ్లాడుతుంది హిందువుణ్ణి గదా!... క్రైస్తవుణ్ణివయిపోతాను. ఒక ఆదివారం నాడు చర్చిలో కెళ్లి స్నానంపుచ్చుకుంటాను. మిషనరీదొర్లిలా నెత్తిమీద నన్ను పెట్టుకుని మరీ క్రైస్తవుడుగా మార్చేస్తారు. క్లారా కోసం సీమలో నాకీబుద్ధి పుట్టిందిగాని శ్యామన్నితలుమకో వూరుకున్నాను. ఇప్పుడాఆశకూడా తీరింది. దానికారణాన్నే చర్చిలో ప్రవేశిస్తున్నాను. తరవాత నన్నేమిచేస్తారో చూస్తాను!

## ౨

ఈయింగ్లీషుఆడవాళ్లకి శృంగారాలు పెట్టని సొమ్ములు. వాళ్ల అవయవసౌష్ఠవంకూడా మహాలలితంగా కనబడుతుంది. నిన్న సాయంత్రం చర్చినుండి వస్తూవుంటే నాప్రైసు నన్ను ముద్దుపెట్టుకుంటూన్నప్పుడు నే నెక్కడో మాయమైపోయేను. జన్మంయెత్తినందుకు సార్థకం అయిం దనుకున్నాను. ఇంగ్లీషువాళ్లలోయిన్నిలాలిత్యాలున్నాయికాబట్టే వాళ్లకి రాజ్యాధిపత్యం వచ్చింది. నారాణీస్థానం ఆక్రమించడానికి ప్రైసుకంటె తగిన ఆడదేదీ? హిందువులకు లోకాన్ని అనుభవించడమే తెలియదు. వాళ్లెంతసేపూ ఆధ్యాత్మికమేకాని ఐహికంతో సంబంధం కలుగచేసుకోమంటారు. సుఖం అనుభవించాలిగాని యెక్కడైతే యేమిటి? వెఱ్ఱివుండావాళ్లు! అపలువని జాకెట్టుముడతలలోంచి, ఆలేసుఅల్లికలలోంచి తుషారంలో వెన్నెలలాప్రకాశిస్తూన్న ఆప్రైసుశరీరసౌందర్యం అనుభవించడంకంటె యీనాకమ్మలకింకేం కావాలి? అవి దండలా? వలిచేసిన దవ్వముక్కలు కావూ?... చాలాసేపయింది ప్రైసెక్కడికివెళ్లింది చెప్మా" అని మతాంతరుడైన శృంగారరసప్రవాహమున నీదులాడ జాకీదొరగామారిన జగన్నాథరావు త్రుళ్లిపడ్డాడు. ప్రైసు తూరీగలాగు వుండివుండి యెక్కడికో యెగిరిపోతూ వుంటుంది. జగన్నాథరావు కదివచ్చలేడు. భార్యాభర్తలంటే ఒకతీగెలోని రెండుజంటలలాగు ఒకరిలో ఒకరు కలుసుకుపోవాలి. దానిచిగురు ఎఱ్ఱదనం దీనిమీదా దీనిపూలవికాసం దానిమీదా ప్రతిఫలించాలి. ఏది పుష్పించిందో యేది చిగిర్చిందో తెలియకుండా వుండాలి. ఎవరిఅలుకకులుకులు వాళ్లు ప్రత్యేకించి అనుభవించేటట్టయితే యికప్రణయైక్యత యెలా కుదురుతుందని జాకీదొరగారివూహ! "అప్పలసామీ" అని జగన్నాథరావు బట్లరును పిలిచేడు. వాడుగాగానే "దొరసాని యేదీ" అని అడిగేడు. ఎవరితో మాటాడబోయిందని అప్పలసామి బదులుచెప్పేడు. జగన్నాథరావు తెల్లబోయేడు. 'నాతో మాటనొసక్కైనా చెప్పకుండా మళ్లీ యిది యెక్కడికి పోయింది చెప్మా! కాఫీవేళయిపోతూంది!' "నాతో చెప్పమని దొరసాని నీకేమేనా చెప్పిందా?" అని జగన్నాథరా వప్పలసామి నడిగేడు. ఎవరో మార్టిన్ దొరను చూడడానికి దొరసాని వాల్తేరు వెళ్లిందనిన్నీ, ఎన్నిగంటలకు తిరిగివచ్చేదీ తెలియదనిన్నీ, "మిమ్మల్ని తనకోసం కనిపెట్టుకోవుండక కాఫీతాగివేయమని చెప్పింది" అనిన్నీ బట్లరు చెప్పేడు. ఆమాట విని జగన్నాథరావు తిరిగీ ఆలోచనలో పడ్డాడు. 'ఎవడో యీమార్టిను? నాకు కాఫీ యెలా నోటికిపోతుంది? నాప్రైసు ప్రక్కను కూర్చుని తనచిన్నివ్రేళ్లతో కప్పు నోటికి కందిస్తూ తనకమ్మనియూర్పులు నాచెక్కిలిమీద విడుస్తుందనుకున్నాను. అనేకవిధాల యిప్పుడిప్పుడు సౌఖ్యపల్లవాలను తొడుగుతూన్న నామనోరసాలంమీద ప్రైసు కోకిలాకంఠనినదం వినబడకపోతే యింక నా జన్మానికి వసంతోదయం యెక్కడిదీ? అట్టే ఆలస్యం చేయననుకుంటాను. ఆలస్యమయితే అయిందిగాని ప్రైసు రాందే కాఫీ యెలాతాగుతాను?...ప్రియురాలికోసం వేచియుండడంలోనూ ఒకతమాషా అయినసుఖం వుంది. ఇప్పుడు ప్రైసు ప్రైసు మరింత హెచ్చుతుంది. కాని నాకెందుకీయనవసరవియోగం? అవసరం వుంటే ఏనలుడులాగో, శ్రీరాములులానో ప్రైసుకోసం వెతుకులాడడంలో లాలిత్యం, దుఃఖంలో కలిసిపోయేసుఖం వుంటుందేమో? ఇన్ని లాలిత్యాలు వుండి యేంచెప్మా

యీయింగ్లీషుభార్యాభర్తలకు ప్రత్యేకత కనబడుతోంది! ఇది యింగ్లీషుమర్యాదక్రింద తేలింది. తేత్తే సేమిటి? పైబిలు ప్రమాణం కాదుగదా! సుఖానికడ్డువగిలే యిలాంటి మర్యాదలు కొన్ని విడుచుకోవలసిందే. ఈమర్యాదవల్ల పైరిసు ప్రవర్తనలో కొంచెంలౌలిత్యం తగ్గుతూంది. అవి దేమేమో జాక్‌దొరగారాలోచించుకుంటూ వుండగా వరాండాలో టక్కు-టిక్కు-మని అడుగులచప్పుడువినబడింది. పైరిసువస్తూందని జాక్ దొరగారి ముఖమింతయింది. దిగ్గునలేచి యెదురుగుండా వెళ్లేడు. నవ్వుతూ పైరిసు చేయందుకొని ముద్దుపెట్టుకోపోయేడు. "అబ్బ నేను చాలాఅలిసిపోయేను. ఇప్పుడు నన్నేమీ మాట్లాడించకు" అని చేయి విదల్చుకుంటూ తనగది లోనికి పైరిసు పోయింది. జగన్నాధరావు కొంచెం చిన్నపోయేడు. మళ్లా మనస్సును సమాధానంచేసుకున్నాడు. "పాపము! మల్లిపువ్వులాంటి పైరిసు బహుసున్నితమైంది" అనుకుంటూ కాఫీబల్లదగ్గరకుపోయి కొంచెం కాఫీ తాగి తిరిగీ కుర్చీలోకూలబడ్డాడు. తిరిగీ ఆలోచనలోపడ్డాడు. 'మార్టిననే పేరుగలవాడు పైరిసు బంధువులలో లేడు. ఇంతచీకటినే వాడిబంగళాకు యీమె యెందుకు వెళ్లాలి? అడిగితెలుసుకుందామంటే తప్పు! తనంతట తానైనా నాతో చెపుతుందా? అలాఅయితే ముందే చెప్పును. నేనామెగదిలోకి వెళ్లడానికి వీలులేదు. రమ్మని కబురంపుతే కొప్పడుతుంది కాబోలు. నాలా తనకుకూడా వియోగం తెలియదా?' అంటూ! ఆలోచించుకుంటూ జగన్నాధరావు ముండ్లమీద పోర్చ్చినట్టు కూర్చున్నాడు. ఆమె యెప్పుడు పైకివస్తుందా అని ఆగదికేసి కళ్ళు విశాలంగావిప్పి చూస్తున్నాడు. బట్టలు మార్చుకుని, జల తిరిగీ దువ్వుకొని, బుగ్గలకు గులాబీరంగద్దుకొని, క్రొత్తజోడు తొడుక్కొని పైరిసు టక్కు-టిక్కు-మనుకుంటూ బల్లదగ్గరకు వచ్చింది. ఇంతసేపూ వియోగాంధకారంలో కొట్లాడుతూన్న జగన్నాధరావు కన్నులకామె వెన్నెలబొమ్మలాగు కనబడు నేమో, ఆబుగ్గలమీది చంద్రకాంతప్రసూనాలమీద వానిచూపు తుమ్మెద లెంత విలాసంగా తిరుగులాడునో, ఆమాడ్కి-తీవలలో నెన్ని ప్రణయగీతాలాలపించిపోదునో కాని, పాపం, జగన్నాధరావు మనస్సు మనస్సులా లేదు. పైరిసలావచ్చి క్రీగంటని జాక్ దొరగారిముఖవిలాసం చూచి చూడనట్టు కుర్చీలో కూర్చుని కాఫీకప్పు మూతిదగ్గర పెట్టుకుంటూ ఎందుకోకాని చిన్నగవ్వు నవ్వింది. చిన్నపోయియున్న జగన్నాధరావు మనస్సున అది చాలావాడిగా తాకింది.



ఆనవ్వు కర్థంఏమిటి చెప్మా అని ఆలోచించేడు. జాక్ దొరను కాఫీతాగడానికి రమ్మని పైరిసు పిలవలేదు. సరిగదా, కాఫీపుచ్చుకున్నావా? అని అతనిని అడగనేనా అడగకుండా తాను కాఫీ తాగేస్తూంది మీదుమిక్కిలి నవ్వుకుంటూందికూడాను. జగన్నాధరావుకీ ఈదుడుకుతనం మరింత లావయిపోయింది ఏదోవిధంగా పైరిసు ప్రవర్తనకు సమాధానం వస్తేనేకాని నాకేమీ తోచదనుకున్నాడు. సుఖంకోసం యింకోఅవతారం యెత్తిన నాకీతగాందోళ నెందుకన్నాడు. ఇంతకీ నేను లోలోన నవ్వుకుంటూవుంటే మరింత నరకం అన్నాడు. ఎలాగో లాగు నాలుగుప్రశ్నలూ అడిగి నాసౌఖ్యానికి యిలాంటి అంతరాయం లేకుండా చేసుకుంటానని, "పైరి! యీయుదయం నీవు చాలాసుఖంగా గడిపేవనుకుంటా"నన్నాడు. ఆమాటలలో గద్గదికలాటిధ్వని వుంది. పైరిసు పోల్చింది. "ఔను, నన్నిలాఅడిగినందుకు నీకోనేకవందనా"లంది పైరిసు. ఆజబాబులో వోకవిధమైనశక్తి బయలేరి జాక్‌హృదయాన్ని తాకింది. వెంటనే అది బండరాతిని కొట్టిన బిల్లపెంకులా చెల్లాచెదరయిపోయింది. కీం

దువుగాపుట్టి హిందువుగా పెరిగి హైందవమర్యాదల కలవాటుపడ్డ వాడి కాజబాబు ఎలా కనిపిస్తుంది! జగన్నాథరావు వడవడావడికేడు. మైత్రి నది కనిపెట్టింది. ముగం చిట్లించుకుంది. కొంతసేపటికి జగన్నాథరావు సాహసం తెచ్చుకుని, "మైత్రీ! నీకోసం దియీ వుదియం అల్లా చాలా శ్రమపడ్డాను సుమా! ఎక్కడికి వెళ్లేవో చెప్పనేనా చెప్పేవు కావు! ఎవరా మార్టిన్ దొర? నీకు బంధువుడా? నన్ను నీతో కూడా తీసికొనివెళ్లేవు కాదేమి? నేనుకూడా అతనిపరిచయం చేసుకుందునే! అదికాక, మైత్రీ! నేనాత్రంగా చూస్తూన్న సమయంలో నువ్వు కనబడకపోతే నాకెలా వుంటుందో చెప్పు! నీవు నన్ను కాస్త కనిపెడుతూ వుండాలిగాని యిలా చేస్తూవుంటే యెలాగ?" అనేసరికి మైత్రిసు దిగ్గున బల్లదగ్గరనుంచి లేచింది. "జాక్ దొరా, నీమాటలకూ నీ ప్రశ్నకీ నాకేమీ అర్థం బోధపడలేదు. ఆడవాళ్లూ మనుష్యజాతిలో వాళ్లే. వాళ్లకీ కొన్ని సొంతపనులుంటాయి. ఇరవైనాలుగుగంటలూ మగవితో కనిపెట్టుకో వుండడానికి నేను హిందూభార్యను కానని మాత్రం నీవు జ్ఞాపకం వుంచుకోవాలి. ఇప్పటి నీయీ ప్రవర్తన నాకేమీ నచ్చలేదు. నీ చూపులూ మాటలూకూడా అనుమానాన్ని సూచిస్తున్నాయి. దానివల్ల నాకు చాలాపరాభవం అయింది. నీవిలా నన్ను క్రిందు చేయడానికి నీ కధికారం లేదు. నీతప్పు నీవు తెలుసుకుని దానిని ఒప్పుకొని నామన్నన పొందు లేకకాని నేను నీతో సమానంగా యీ యింట్లో మసలలేను" అని తీవ్రంగా చెప్పి కందగడ్డలా యెఱ్ఱపడిన ముఖంతో తనగదిలోకి పోయింది. జగన్నాథరావు నిలువునీరయిపోయాడు. పెదవి వణికింది; ముఖంమీద ముచ్చెమటలూ గ్రమ్మేయి. కన్నులు చెమ్మగిల్లేయేమో! ఊఁ అని జగన్నాథరావు కుర్చీలోంచి లేచి వరాండాలోకి వచ్చేడు. చేతిరుమాలుతో ముఖంతుడుచుకున్నాడు. ఇలాచిరాక్కించుకున్నాడు, 'అబ్బ! మేడిపండయిపోయింది మైత్రిసు! యెంత టెక్కు చూపించింది! దీనిధర్మమా అని నాకు పెఁదరాడే తెలివితెప్పించింది. ఇప్పుడిప్పుడు మొగ్గతొడుగుతూన్న నా ప్రణయలత ఇట్టే తెంపేసింది. సున్నితంలేని శృంగారం యేంచెయ్యనూ! ఆడుదానికి శరీరంకంటె మనస్సు మనస్సుకంటె మాటలూ సున్నితంగా వుండాలిగాని అటుంచియిటైతే యెలాగు? ఇంగ్లీషు ఆడమనస్సు యిలాగే వుంటుందా? క్లారా యెప్పుడూ నాకిలా కనబడలేదు. అయితే పెళ్లి యీదాకా వున్న లాలిత్యం పెళ్లయినతరవాత పోతుంది గాబోలు. దరిద్రుడు వానలో తలగడుక్కుందామనుకునేసరికి వడగళ్లు కురిసిందట. ఇక నా కీజన్మకి సుఖంలేదు గాబోలు! నాకూ మైత్రిసుకీ సరిజతపడదు. నేను దానిమన్నన పొందాలట! నేచేసిన తప్పేమిటో? ఇలా అయితే నే నెలా గడుపుకోవడం? శృంగారంకోసం పోతే దుఃఖం వెంటాడుతూందేమిటి! అయినా ఆడుదానికింత స్వేచ్ఛ తగదంటాను. ఆడది మగవాడిని గుఱ్ఱాన్ని తోలినట్టు కమ్చీపట్టుకుని తోలితే యెలాగు? ఈభాగంలో మహమ్మదీయస్త్రీలు నయమంటాను. దర్జా వాళ్లు అసూర్యంపశ్యలై వుంటారు. అందానికి లోటు లేదు. పోతుతీగ వాళ్ల కంటపడుదుగదా. అకట్టుకున్న వాడే జుర్రుకోవాలి శృంగారమంతాను. జనానాలోని ఆవుద్యానవనంలో ప్రియుడితో కూడా ప్రొద్దుపోతుంది. వాళ్లకీ ఆటంకాలూ వుండవు... చెడ నీ చెడ్డాను, మహమ్మదీయులలో కంటూడా కొంత చూస్తాను. ఈ ముండతో చెప్పకుండా లేచిపోతాను. తరవాత అది తలబ్రద్దలుకొట్టుకోనీ, నాకేమిటి? కుక్క చుట్టుకున్న కుండకి శుద్ధేమిటి?'

## 3

జాక్ దొరగారయిన జగన్నాథరావుగారు ఇస్లామియా సాహెబుతో నాలుగువిధాలా నచ్చచెప్పి జన్నా సాహెబయేడు. వేళతప్పకుండా నమాజ్ చేస్తున్నాడు. నాటినుండీ తనకు వడ్డీ యివ్వనక్కరలేదని బాకీదార్ల పేర రిజిష్టరీవుత్తరాలు వ్రాసేడు. వ్రేళ్ల వుంగరాలు తీసేశాడు. అఫాయిజమా, మీగాళ్ల వరకూ ఆలాల్చీ, అబోడి తలమీద దబ్బకాయ చిప్పటోపీ, ఆభుజంమీద గులాబి రంగుపువ్వుల యెఱ్ఱరుమాలూ, కాలిజోళ్ళూ జగన్నాథరావు పెచ్చితురకలాగే వున్నాడు. సాయిబుకు తగిన బాబుకోసం చూస్తున్నాడు జన్నా. అమీరుక్కర పెళ్లీడు పిల్ల వుందని విన్నాడు. తనకామెనీయవలసిందని బడేమియాచే సిఫార్సు చేయించుకున్నాడు. పెళ్లాడేడు. జన్నాకి బూబును చూడాలి అని పెళ్లికామ్యనాలోనే తహతహలాడుయింది గాని వాళ్ల లాబూబును కంటపెడతారా? తరవాత యెలాగైతేనేం బూబూసాయిబూ



భైరవరాగము:— రూప అనుపమ సుందర అంగవిభూతి ధరే ససిసీస విరాజే । గంగజటానికే
మస్తకలసేగలముండనమాల భుజంగ నిసాజే । ధ్యానలిజాతె ప్రభాతహి గావర
నారినసంగవిలాస సమాజే । భైరవరాగకో యావిధ ధ్యాయియాయే అంతరపాప నసావనకా
జయపురచిత్రము : దివాన్ బహదూరు గోవిందదాసు చతుర్భుజదాసుగారి యనుమతిని




శ్రీ శివశంకరశాస్త్రి గారు

ఆమె మానవయువతియే యగుట నిజము:
కాని ఆయమపల్కులు కర్ణగోచ
రమ్ము లైనంత నాకు నిర్జరమనోజ్ఞ
మధురసంగీత నాదముమాడ్కి దోచు!

ఆమె మానవయువతియే యగుట నిజము:
కాని ఆయమరూపంబు కానవచ్చి
నంత నే నాకు సర్వలోకైకనయన
హారి సౌందర్యదేవతయట్లు తోచు!

ఆమె మానవయువతియే యగుట నిజము:
కాని ఆయమమెత్తనిమేను సోకి
నంత నే నాకు పారవశ్యమ్ము కలిగి
అద్వితీయబ్రహ్మానందమట్లు తోచు!

స్నిగ్ధహృదయాబ్జ యైన నా జీవితేశ్వ
రీ కృపాలోకనము ప్రసరించువరకు
భ్రమరరూపమ్ముతో నామె శ్రవణపాళి
చాటపాడుచు వేడుదు ప్రత్యహంబు.

స్నిగ్ధహృదయాబ్జ యైన నా జీవితేశ్వ
రీ కృపాలోకనము ప్రసరించువరకు
సుమపరాగమ్ము నై యామె సుందరాంఘ్రి
పంకజము లంటి సేవింతు ప్రత్యహంబు.

అన్యభావము లన్నిటి నవల ద్రోసి
చిత్తసద్మమునం బ్రతిష్ఠించి దేవి,
నిన్ను ధ్యానించుచుంటిని నిరత మేను:
నీకుమాత్రము నామీద నెనరు లేదు!

ప్రవిమల ప్రేమరససుధాపానమత్త
వివశహృదయుండ నై లజ్జ విడిచి దేవి,
స్తవము చేయుచునుంటి నిత్యంబు నిన్ను:
నీకుమాత్రము నామీద నెనరు లేదు!

దైవవశమున నీసన్నిధాన లాభ
మొదవగా దేవి, గర్వము నుజ్జగించి
పాదములమీద వ్రాలితి భక్తితోడ:
నీకుమాత్రము నామీద నెనరు లేదు!

ఆర్ద్రహృదయముతో ప్రియురాలు మున్ను
నా కొసంగిన ప్రణయచిహ్నముల నెల్ల-
మరణకాలమునందు సమ్మదముతోడ
ఎడదపై జేర్చి ప్రాణముల్ విడుతుగాక!

నిఖిలసౌందర్య సముదాయ నిలయమైన
ప్రణయినీ దివ్యముఖ చిత్రపటముమీద-
మరణకాలమునందు సమ్మదముతోడ
వీక్షణము నిల్పి ప్రాణముల్ విడుతుగాక!

అఖిలమధురాతిమధుర నామాతిశాయి
యైన ప్రియురాలి నామధేయమ్ము నేను-
మరణకాలమునందు సమ్మదముతోడ
తడబడక పల్కి ప్రాణముల్ విడుతుగాక!

---



# దీపావళి

(ఒక కథ)

యస్. వి. రామమూర్తి గారు, బి.ఏ.

౧

నాడు దీపావళి. సంధ్యాకాలము. లక్ష్మీనగరమందలి పెంటపాగులతో నిండిన పాడుగృహములు సయితము శక్తికొలదిని ప్రకాశవంతములై యుండెను. రాజమార్గమందలి బాలురును, బాలికలును తెల్లనివస్త్రములందు దీపపుప్రమిదలనుంచి మందిరోపరిమార్గమును బట్టి నడుచుండిరి. దీపములకంటెను వారి ముఖారవిందము లెక్కువ ప్రకాశవంతములై యుండెను. ప్రతిగృహమును దీపమాలికలచే సుశోభితమై యలరారుచుండెను. ఒక్క సత్యదేవునిగృహముమాత్ర మంధకారమయమై గంభీరముగ నిలువబడియుండెను. ఆగృహము తనపూర్వపు టౌన్నత్యమును మరచిపోలేదు. ఆసువిశాలగృహపుటో భాగమున పూర్వము ద్వారపాలకులు సశస్త్రపాణులై యితరులు లోనికి పోకుండ వారించుటకు నిలువబడినచోట ప్రస్తుతకాలమున జిల్లేడుపొదలు దట్టముగా మొలచియుండెను. ఒకానొకప్పుడు పైయంతస్తులనుండి వెలువడుచుండిన నవయౌవనవతుల మధురగానరుతమునకు మారుగ నేడచ్చోటినుండి పావురముల కుహూధ్వానములు వినవచ్చుచున్నవి. గృహకుడ్యములు భర్తృరహితయగు కాంతాహృదయమునవలె విదీర్ణములగుచుండెను. కాల మెట్టిమార్పులనైనను జేయుచుండును గదా! కాలానుసారముగ ప్రకృతిలోని పదార్థములు క్రమముగా జీర్ణించి, ఒకటొకటిగా లుప్తమగుట ప్రపంచధర్మమైయున్నది.

అమావాస్యరాత్రి. ఇతరగృహములలోని సముజ్జ్వలకాంతులకు నోడి వెన్నిచ్చి పెరుగిడిన యంధకారము సత్యదేవపండితునిదగు ఆవిశాలగృహాంతర్భాగమున దాగొనియుండి నట్లుండెను. ఆసమయమున సత్యదేవపండితుడు తనగదిలో సన్ననిదీపపు వెలుతురునందు కూర్చుండి ఆలోచనా నిమగ్నుడై యుండెను. నాటిశోకమానసము నుండియు నాతని యర్ధాంగియగు పార్వతి రోగపీడితయై మంచము పట్టియుండెను. అదియే ఆతనివిచారమునకు కారణము. పాపము, సత్యదేవుడు దారిద్ర్యమును, దుఃఖము ననుభవించుటకు సంసిద్ధుడై యుండెను. కాని, ఈవిషాదవిపత్తు నాతడెట్లోర్చుకొనును? తనప్రణయనిధానమును, ప్రాణాధికయు నగు ప్రాణేశ్వరి పార్వతి శరీరసంకటమున కాత డెట్లోర్చుకొనును? అతడు ప్రతిదినమును పార్వతి పరుండిన మంచముచెంతనే ప్రక్కన కూరుచుండి, యామె శుష్కితముఖకమలమును గాంచుచు లోలోపలనే దుఃఖించుచుండును. ఎప్పుడైనను పార్వతి తనజీవనముపై నాశవదలి, నిస్పృహాసూచకవాక్యముల ననినచో, నాతడు ఎంతో ప్రయత్నముపై తనదుఃఖమును ప్రచ్ఛన్నము గావించి, "భయములేదు, పార్వతీ! శీఘ్రకాలములో నీవు స్వస్థత చెందగలవ"ని యామెకు ధైర్యము గొలుపుచుండును.

సత్యదేవపండితుడు పేరుప్రఖ్యాతులుగల కుటుంబములోనివాడు. ఆతనిపూర్వులు ప్రతిష్ఠితధనసంపన్నులు. జమీందారులతో వడ్డీవ్యాపారము జేయుచు అమితముగ ధనోపార్జనము గావించియుండిరి. వారివ్యవహారము లెప్పుడును గొప్పభూస్వాములతోడనే జరుగుచుండెడివి.

1857 వత్సరమున భారతదేశమందలి యుపద్రవముల సందడిని వారివద్ద అప్పుగొనినవా రందరును అప్పుల నెగవేయుటచే వారి కమితముగ ధననష్టము సంభవించెను. అంతకుపూర్వము మానవుల విశ్వాసగౌరవములు ప్రస్తుతకాలమందువలె అతిచౌకగా నమ్ముడుపోవుచుండెడివి కావు. పత్ర మెట్టికాగిత మైనను, రిజిష్ట్రీషను డిపార్టుమెంటు లేకున్నను 1857 సం.వరకును



"పార్వతి పరుండిన మంచముకెల
నై వున కూరుచుండి యామె
శుష్కిత ముఖకమలమును గాంచుచు
లోలోపలనే దుఃఖించుచుండును."

ఒకరివద్ద యప్పుటికి కొని ఒకరు ఎగవేసి యుండిరనుమాటయే లేదు. మాటనమ్మకముపై లక్షలక్షలాది రూపాయల వ్యవహారము జరుగుచుండెడి సుదినములవి. 1857 వత్సరమున భారతదేశమునం దుద్భవించిన "సిపాయిల తిరుగుబాటు" అను మహాప్రళయమున రూపుమాసిన ఎస్టేటు లనేకములు. ఖజానాలు కొల్లగొట్టబడెను. అన్నిటితో పాటు సత్యదేవుని పూర్వుల సంపదయును నన్నగిలెను. పిమ్మట కొన్ని దినములకు దేశమున శాంతి నెలకొలుపబడినను కాలము మారిపోయినది. దేశపరిస్థితులు మారునపుడు — దేశీయ జీవనవిధానమును మారుట సహజమేకదా! మానవులమాట నమ్మకము చెడినది. లిఖిత రూపములగు పత్రము లాచరణలోనికి వచ్చినవి. అందును తెల్ల కాగితములు, ఎఱ్ఱకాగితముల భేదమొకటి వచ్చినది. అప్పుపత్రము లన్నియును పనికిరాకపోయెను. పనికిరాకపోవుట యవసేమో, ఎవ్వరికిని తెలియదు. "అప్పుపత్రమేమి, పనికి రాకపోవుటేమి? ఋణముదీసికొనిన వారు వాని చెల్లించక తీరునా; ఎరుపు తెలుపు కాగితములలో నేమున్నదే!" అని యాలోచించెడి ఋణస్థుడొక్కడును లేకుండెను. "అప్పు తీర్చుకున్న అంతే చాలును, బ్రదుకుజీవుడా" యని ఋణస్థులందరును మొండికెత్తి మూడెంకకైచి కూరుచుండిరి. అందుచే ఋణదాతలపత్రములు నాలుక గీచుకొనుటకైనను పనికిరాని వయ్యెను. ఆవు పోయినను, కట్టుత్రాడు కంబమునకు మిగిలినట్లు ధనముపోయినను సత్యదేవపండితునికి తనపూర్వుల సంపత్ప్రానకములగు వడ్డీపత్రములమూటమాత్రము మిగిలినది. అతని భాగ్యక్షీణముతో పాటు ఆపత్రములందలి యక్ష

రము లస్పష్టము లయ్యెను. అయినను సత్యదేవు డాపత్రములను తన ప్రాణముకంటె నధికముగ భావించుచు వానిని భద్రపరచుచుండును. ప్రతివత్సరమును దీపావళి గడచిన పాడ్యమినాడు ప్రతియింటను లక్ష్మీపూజ జరుగుచుండునపుడు మనసత్యదేవపండితు డాలక్ష్మీపూజకు మారుగ లక్ష్మీస్మారకచిహ్నములగు సుమారు అరువది లక్షలరూపాయిల విలువగల ఆపత్రములను పూజించుచుండెడి వాడుక కలదు.

౨

అమావాస్యరాత్రి. దీపములు తమయల్పజీవనముల బరిసమాప్తి నొందించుకొనుచు మానవజీవితపు టంత్యపరిణామమును జ్ఞప్తికి దెచ్చుచుండెను. ఏదైపు జూచినను జూదగాండ్ర సమూహములే. జూదమున నారాత్రి గెలిచినవారికి సంవత్సరము పొడుగునను యోగమటయే నట. బంగారునాణెముల భాగ్యచక్రగతి గవ్వలపాటుపై నాధారపడియుండెను. ఆకారణమున 'గవ్వవిలువ చేయ' దను లోకోక్తి అసత్యమగుచుండెను. అత్యల్పవేళయందుండినవారి జీవనమునొకప్పుడు నిర్భాగ్యులయు, నిరుపయోగులయు జీవనముపై నాధారపడియుండుట ప్రపంచధర్మమేకదా! ఆనాటిరాత్రి సారాదుకాణములందు సారాయికిమారుగ నీళ్లు విక్రయింపబడుచుండెను. రాజమార్గమందు సంచరించుచుండిన ప్రజలందరును ఒకరిధనమును జూదమున గెలువవలయునను సదుద్దేశముతోడనే యుండిరి. అట్టి నిశీథసమయమున మనసత్యదేవపండితుడు తనభార్యపరుండియున్న గదిలో నామె ప్రక్కను కూరుచుండియుండెను. నాటి ప్రాతఃకాలమునుండియు పార్వతిస్థితి యేమియు బాగుగ నుండలేదు. విషమజ్వరముచే నామెకు గంటగంటకు మూర్ఛ వచ్చుచుండెను. మధ్యమధ్య స్మృతి కలిగినపుడామె మెల్లన కన్నులవిచ్చి క్షీణస్వరమున—"నేడు దీపావళికదా!—"అని యేమో చెప్పబోయి మరల కన్నుల మూసుకొనుచుండెను. ఇదంతయు జూచి, సత్యదేవునికి ధైర్యము సడలెను. పార్వతి జీవించునను నాసయతనికి లేకుండెను. అయిన నెట్లయినను పార్వతిని—తనయర్ధాంగలక్ష్మియగు పార్వతిని—మృత్యుముఖంబునుండి మరలించుటకు తగిన ప్రయత్నము జేయ నిశ్చయించుకొనెను. ఆమె సారెసారెకును నస్పష్టముగ బల్కుచుండెడు 'నేడుదీపావళికదా?' అనుప్రశ్నమున కుత్తరముగ నాతడు, 'ఔను, నేడే దీపావళి' యనుసరికి, పార్వతి తనయశ్రుపూరితదృక్కులను గృహమున కటునిటు బరపి, "మనగృహమున దీపము లుంచలేదేమి? అయ్యో! నేడు గృహమున నంధకార ముండరాదు. మీకు సాధ్యము కానిచో నన్ను మంచము[illegible]నుండి మెల్లన లేవనెత్తుడు. నేనైనను ఇంట దీపములు ముట్టించెదను" అనియెను. పాపము, సత్యదేవు డెట్టి ప్రత్యుత్తర మొసంగవలయునో తెలియక, హృదయవిదారకములగు నామాటలకు వెక్కి వెక్కి యేడువసాగెను.

లక్ష్మీనగరమున శంకరశాస్త్రి ప్రసిద్ధవైద్యుడు. ఆయూర నుండిన సంజీవనీఔషధాలయ మాతనిదే. అందొక ముద్రణాయంత్రముకూడ కలదు. ఉన్న తనమాత్ర ఔషధములను గూర్చిన కరపత్రములను ముద్రించి ప్రకటిత మొనర్చుట కా ముద్రణాయంత్ర మాతనిచే నెలకొలుపబడియుండెను. పౌరులరోగము లన్నియు కల్పితము లనియు, అబద్ధము లనియు నాతనియుద్దేశము. అందుచే పొలిటికల్ ఎకానమీ శాస్త్రానుసారము ఈ కల్పితరోగము లనెడు పౌరులవిలాసములపై [illegible]పన్ను (సుంకము) విధించిన నంత దేశక్షేమ మగునని [illegible]తని నమ్మకము. "నిర్ధనులైనను సరే—సుంక మీయలేక వారు చచ్చినను సరే—వారేల రోగులు కావలయును?—ఈదొంగరోగములచేతనే భారతదేశమున కిట్టి దుర్దశ కలిగిన" దని యాతనియూహ. అందుచే రోగుల యొద్ద ధనమును గ్రహించుటయు నొకవిధముగా దేశోద్ధారకకృత్యమే యను శంకరశాస్త్రిగారి యాలోచన. ధర్మార్థము మందుల నొసంగెడు పాశ్చాత్యౌషధాలయములవలననే దేశమందు బలహీనులసంఖ్య దినదినాభివృద్ధి గాంచుచున్నదని మ-రా-రా-శ్రీ వి. శంకరశాస్త్రిగారి యభిప్రాయము.

మన సత్యదేవపండితుడు నెలదినముల నుండియు పార్వతి రోగనివారణార్థమై శంకరశాస్త్రిగారి సంజీవనీ ఔషధాలయమునందే మందుగొని భార్య కొసంగుచుండెను. కాని, ఆయౌషధసేవవలన పార్వతిరుగ్మత యేమాత్రమును కుదురలేదని మన మీవరకే యెరింగితిమి.

భయంకరమగు అమావాస్యరాత్రి. నిశీథసమయము. అర్ధరాత్రము దాటియుండుటచే నభోభాగమండలి

తార లక్ష్యంకప్రకాశవంతములై యుండెను. నగరమం దొకటొకటిగ లుప్తమగుచుండిన దీపములను జూచి పరిహసించుచున్నవేమో యనునట్లు తారలు మినుకు మినుకు లాడుచుండెను. అట్టి సమయమున భార్యతలపైపు న్యాయెత్తినవానివలె కూరుచుండియుండిన సత్యదేవపండితుడు నిశ్చితమనస్కుడై లేచి వైద్యశేఖరుడగు శంకరశాస్త్రి యింటికి పయనమయ్యెను.

## 3

శంకరశాస్త్రి తనగదియందు కూరుచుండి నూతనముగ తనచే సంపుటిచేయబడిన "అమృతబిందు" ఔషధముసుగూర్చిన విజ్ఞాపనపత్రమును లిఖించుచుండెను. ఆపత్రములోని భావప్రాగ్భావమును, ఆకర్షణశక్తియు గాంచినచో శంకరశాస్త్రికి, సుప్రసిద్ధభిషఙ్మణియను నమమాట యటుండనిండు, సులేఖకవిద్యానిధి యని మాత్రము చెప్పకదప్పదు. ఆతడపుడు సిద్ధపరుచుచున్న కరపత్రములోనియంశములనిట పొందుపరిచియున్నాము:

[illegible]తబిందు అమృతబిందు అమృతబిందు

అన్నిరోగములకును అమూల్యమగు ఔషధము. శారీరకవ్యాధులకు శంకరునిశూలము; అస్వస్థతాంధకారమునకు ప్రచండభానూదయము. ఈయౌషధరాజము, మున్ను రామానుజుడగు లక్ష్మణదేవరను పతివునిగ నొనర్చిన సంజీవిపర్వతస్థానమునకు సమీపమునయున్న యొకానొకపర్వతమున కొకానొకసిద్ధుడు తనఘోరతపఃప్రభావమున మహేశ్వరుని కృపచే నెరింగియుండెను. పిమ్మట ఆమహానుభావునిచే మాకది వాత్సల్యపూర్వకముగ ప్రసాదింపబడినది. ఇది అన్నిరోగిచిటికలవలెనే యని యూహింపరాదు.

అమూల్యమగు మాయమృతబిందు సుఖరోగములకు సుఖకరమగు నౌషధము. బహుసంఖ్యాకులగు అప్సరోంగనలకు వశవర్తుడైన సహస్రాక్షుడు సయితము దీనిని సేవించుచుండెడివాడని నారదాంజనేయ మేడవయాశ్వాసమున స్పష్టముగ నున్నది.

మాఅమృతబిందు కఫరోగములను కానరానీయదు. శ్లేష్మరోగములపై చెప్పరానిప్రభావము. వాతజాడ్యములకు వాత. పైత్యరోగముల పేరుమాపును. వేయేల! రుగ్మతలన్నిటిని రూపుమాపజేయుగల శక్తికలది. దేహము రోగపీడితమై యున్నపుడే మాయమృతబిందును సేవింపవలయునని యూహింపరాదు. ఈ యౌషధరాజము ముందు రాబోవు రోగములను వారింపగల మహోపకారి. ప్రతియింట నాబాలగోపాల మందరిచేతను తప్పక సేవింపదగినది. పథ్యము లేదు. వెలసీసా ఒకటికి ౨ రూపాయలు మాత్రమే. గుణమునకు గ్యారంటీ. మోసపోకుండ సీసాపై ముద్రించిన మా 'నాగుపాము' మార్కును గమనించియే కొనుడు. సీసాలు వలయువారు—ఆధునికధన్వంతరి, బ్రహ్మశ్రీ వి. శంకరశాస్త్రి, సంజీవని ఔషధాలయం, లక్ష్మీనగరం అని వ్రాయవలయును.

ఇట్లు:
దేశసేవాపరతంత్రుడు,
వి. శంకరశాస్త్రి.

వైద్యుడు శంకరశాస్త్రి తనవిజ్ఞాపనపత్రమును వ్రాయుట ముగించి, బిగ్గరగా చదువనారంభించెను. అప్పుడాతని నేత్రములందు స్వాభిమానమును, ఆశయు నుట్టిపడుచుండెను. ఇంతలో వెలుపలనుండి ఎవ్వరో యాతనిపిలిచినట్లు వినవచ్చెను. స్వరమునుబట్టి ఆతడు సత్యదేవుడే యని వైద్యు డూహించెను. ప్రసన్నవదను డయ్యెను. రాత్రికాలమున మ-రా-రా-శ్రీ వి. శంకరశాస్త్రిగారికి డబుల్ ఫీజు ఇవ్వవలయును. లాంతరు గైకొని వెలుపలికి వచ్చి చూచుసరికి, అనుకొనినట్లు సత్యదేవపండితుడు విషణ్ణవదనుడై కానవచ్చెను. వెనువెంటనే సత్యదేవుడు వైద్యునిపాదములపై వ్రాలి—"శాస్త్రిగారూ! మీ రెటులైన ననుగ్రహింపవలయును. నా భార్య పార్వతి కొనయూపిరితో నున్నది. ఎటులైనను ఘటము నిలువబెట్టుడు. కారుణ్యము వహించి కష్టపడి ప్రయత్నింపుడు. అటుపైని నాయదృష్ట మెట్లున్న నట్లగును. మీరు ఇపుడు మాయింటికి విచ్చేసి ఆమెను పరీక్షించినచో నాకు ధైర్యము కలుగును. ఆమె మరణించినను చేయవలసినకార్యము చేసినందులకు నాకు కొంత మనశ్శాంతి కలుగును. ద్రవ్యరూపముగా మిమ్ము సంతోషపెట్టుటకు నాప్రస్తుతస్థితి చాలదు. అయినను నాయావజ్జీవమును మీపరిచర్య చేయుదును. ఆజన్మాంతము మీ

యాశో గానము గావించుచు. ధన మొసంగుటకు మాత్రము నాకు శక్తిలేదు. పరమేశ్వరుని సాక్షిగ పలికిన నావాక్యములమన్నించి ఒక్కసారి—కేవల మొక్కసారి దయచేయుడు" అను దీనాలాపములకు శంకరశాస్త్రికి మొదట కొంచెము కనికరము కలిగెనను, అది అంత్యావస్థయం దుండిన దీపికాజ్వాలవలె ఒక్కసారి మెరసినను, వెంటనే శాశ్వతముగ చల్లారెను. ఆయుత్తరక్షణమున ఆతని హృదయరంగమున స్వార్థతాంధకారము గ్రమ్ముకొనెను. పాపము, సత్యదేవుడు భగ్నమనోరథుడై యింటికి వెసలుబలసివచ్చెను.

## ౪

అమావాస్య రాత్రి. వృక్షము లందును నిశ్శబ్దమే.



"పరమేశ్వరుని సాక్షిగ పలికిన నావాక్యముల మన్నించి ఒక్కసారి—కేవల మొక్కసారి దయచేయుడు."

జూదమందు గెలిచినవారు నిద్రించుచుండిన తమసంతానములను మేల్కొలిపి సంతోషసూచకముగ మిఠాయి మున్నగు పారితోషికముల నొసంగుచుండిరి. ఓడినవారు క్రోధితులగు తమకాంతలను క్షమాపణ చేసికొనుచుండిరి.

ట్టిసమయమున నొకఘంటాశబ్ద మాయంధకారమును, నిశ్శబ్దమును ఛేదించుకొనుచువచ్చి ఆనగరమంతటను నిండెను. కాలపురుషుని నిరాటంకమగు తాండవమువకా ఘంటాశబ్దము తాళధ్వనివలె వండెను. తుదకాశబ్దము సత్యదేవపండితుని గృహాగ్రభాగమునన్న ప్రాతయిండ్లదరికివచ్చి లుప్తమయ్యెను. తిరిగి యెప్పటివలెనిశ్శబ్దమే.

అట్టిసమయమున మనసత్యదేవుడు నిరాశాసముద్రమున మునిగియుండెను. ప్రాణాధికయగు పార్వతికొనఘమిప్పించునంతటి శక్తియైన నాతనికి లేకపోయెనే యను విచారమాతనికి మెండయ్యెను ఇక నేమి చేయగలడు? నిష్ణుడగు వైద్యుడు శంకరశాస్త్రి ఎంతబ్రతిమాలినను రాకపోయెనే! ఏమిప్రయోజనము? పాషాణము ద్రవించునా? మోడు చిగురించునా? పట్టిది. తనపూర్వుల పేరుప్రతిష్ఠలపై నాధారపడియున్న సత్యదేవునియహంకార మొక్కసారి శిథిల మయ్యెను. ఆతనికి నాడొక క్రొత్తవిషయము తెలిసెను. అరుణతిలకముల రూపాయల అప్పుపత్రములు అరుణదిగివ్వల విలువదైయినను చేయవని ఆతనికి తోచెను. ఆతడు తనపెట్టెయందు భద్రముగ ముఖములుగుడ్డలో మూటగట్టి దాచియుంచిన ఆయప్పుపత్రముల నొకటొకటిగా దీసి చేరువనున్న దీపముఖమున భస్మముచేయనొడగెను. భోగము లనుభవించిన మానవశరీరము తుదకు చితిపై నుంచబడి యాహుతియగురీతిని ఆకాగితములు వరుసగా తమముఖములుగుడ్డ ముద్దుశీవనమును ఆదీపికాజ్వాలయందు పరిసమాప్తినొందించుకొనుచుండెను. ఇంతలో నెవ్వరో సత్యదేవపండితుని వెలుపలనుండి కొంతెత్తి పిలిచిరి. ఆతడు త్రుళ్లిపడి కలవరపెత్తెను. లేచి వాకిలిలోనికి వచ్చి, చీకటిలో తడవుకొనుచు ద్వారము వద్దకు వచ్చి, తలుపులు తెరచి చూచునప్పటికి ఎవ్వరో చేతులందు దివిటీలగొని నిలబడియున్నట్లును, మార్గమున నొకచెట్టుక్రింద సైరావతములబోలు బుష్టభముల తేరగు రెండెడ్లబండియు నాతనికి దృగ్గోచర మయ్యెను. ఇంతలో నాబండిలోనుండి యొక సుందరయువకుడు క్రిందికి దిగెను. ఆతనితలపై నెఱ్ఱనిపట్టుపాగయును, నొసటిపై నర్ధచంద్రాకారముగ గంధపుబొట్టును, దాని నడుమ నొకయెఱ్ఱనిచుక్కయు నుండెను. పెదవులపై కోరమీసమును, ముఖారవిందమునుండి వెలువడుచున్న కాంతులును, వర్చస్సును జూడ నాతడొక గొప్పకుటుంబములోనివాడని స్పష్టమగును. ఆతనియంగరఖా, పైజామా, నడుమబందునుండి వ్రేలాడుచుండిన ఖడ్గమును, కంఠమందలి బంగారుగొలుసును ఆతని యుప్పటివేషమును పూర్తిగావించెను. ద్వారమునందు నిలువబడియున్న సత్యదేవపండితుని జూచినంతనే యాతడు సవినయముగా నమస్కారము చేసెను. ఆతని వినీతభావమునకు కొంతవరకు లజ్జితుడై సత్యదేవపండితుడు, "అయ్యా, తమరెచ్చోటినుండి విచ్చేయుచున్నారు? మీ పేరేమి? ఇట్లడిగినందులకు క్షమింపుడు" అనుచు మెల్లన ప్రశ్నించునపరికాయువకుడు వినమ్రుడై, "నా పేరు రామసింగు. నేను మీ దాసుడను. ఈదాసుని నివాసము రాజపురము. అచ్చోట నేనొక జాగిరుదారుడను. మీ పూర్వులు మా వంశీయులపై నమితానురాగమును జూపియుండిరి. కొలది మాత్రమైన యిప్పటి మాప్రతిష్ఠసంపదలకు మీపూర్వవంశజులే కారణము. వారికృప లేకున్న నే నిట్టి యున్న స్థితికి వచ్చియుండను. మీ పవిత్రనామమును నా బంధువులవోట వినియుండి, మీదర్శనము చేసికొనుటకై వచ్చితిని. తమదర్శనభాగ్యము నాకు లభించినది. నాజన్మము సఫలమైనది" అని ప్రత్యుత్తర మొసంగెను. సత్యదేవపండితుడు తెల్లబోయెను. రామసింగుమాట లాతనికర్థముకాకుంటచే వెర్రిచూపులుచూడ నారంభించెను. ఆతనినేత్రము లశ్రుజలపూర్ణము లయ్యెను. అది కలయో నిక్కువమో యాతడు యూహింపలేకపోయెను; కాని, పైపైకిప్రతిష్ఠ సత్యదేవుని హృదయమందలి కోమలభాగము కటంజేసి యాతడు కొంతవరకు రామసింగు వాక్యములకు గర్వపడ నారంభించెను. అందుచే, కొలది కాలము క్రిందట నాతనిముఖమునం దేర్పడిన దీనత మటుమాయమయ్యెను. గంభీరభావ మేర్పడ, "మీరు వన్నూరక పొగడుచున్నారు. మాపూర్వుల నుచితమగు గౌరవము నందుటకు నాకర్హత లేదేమోయని భావించుచున్నాము" అనునంతలో రామసింగునౌకరులు గృహాంగణమున నొక రత్నకంబళమును బరచిరి. ముఖ్యపాత్రలిరువురును దానిపై నధిష్ఠించిరి.

తరువాత వారిసంభాషణమందు సత్యదేవపండితుని పితామహుడు రామసింగు పితామహునకు ఏబది వేలరూపాయలు వడ్డీకిచ్చియుండినట్లును, రామసింగు గయకు జని, తనపూర్వులకు శ్రాద్ధాదిక్రియ లొనర్చ బూనియున్నట్లును, అట్లు చేయుటకు బూర్వము వారిని ఋణవిముక్తులజేయదలచియున్నదనియును, అందుచే ఆర డెబదివేలరూపాయలు సత్యదేవునకు చెల్లించుటకు వచ్చియుండెననియు స్పష్టమయ్యెను. సవినయముగ, సద్భక్తి

పూర్వకముగ నామహాశయుడు రామసింగు, పండితజీ వైపు ముఖము త్రిప్పి, "నాపూర్వుల పత్రములన్నియు మీవద్ద నున్న వనుకొందునా?" అనసరికి—ఏమిచెప్పను?— మన సత్యదేవుని ముఖమండలము వర్ణనాతీత మయ్యెను. దేహమంతటను చెమట గ్రమ్మెను. తల తిరుగ నారంభించెను. "నాడు దీపపుజ్వాలయందు కాలి భస్మమైనపత్రములలో నీపత్రముకూడ దహింపబడియుండునా, దేవుడా?" అనునొక పెద్దసంశయ మాతని హృదయమందు పడెను. అందుచే, అతనిగుండెలు తటతట కొట్టుకొన సాగెను. అత డేమియో గుటకలువేయ నారంభించెను. "ఇంకను కొన్నిపత్రము లటులనే యున్నవికదా! అదృష్టవశమున ఆపత్రము వానిలో నుండరాదా?" అను నూహచే నాతడు కొంతవరకాశావహుడై "ఉండ వచ్చును" అని నీళ్లునములుచు ప్రత్యుత్తర మొసంగెను. ధర్మపరాయణుడగు రామసింగు "వెదకుడు, దొరకినచో ధనము చెల్లించి నాపత్రమును నేను దీసికొందును" అనియెను. సత్యదేవుడు మెల్లన లేచెను కాని యాతని హృదయము చల్లబడియుండెను. లోనికి బోవనుద్యుక్తుడై యాతడు మెల్లనడుగులు వైచుచు తనలో నిట్లు వితర్కించుకొనసాగెను.

"ఈశ్వరా! పత్రము దొరకునా? పత్రము లేనిచో రామసింగు ధన మేల నిచ్చును? 'ధనమిచ్చి పత్రమును దీసికొందు'నని యాత డనెను కదా! ఆహా! చేతిలోపడుటకు సిద్ధముగనున్న యమృత భాండము పగిలిపోవునేమో!" ఈవిధముగ నాశ యొకవంకను, నిరాశ యింకొకవైపున తన హృదయరంగమున పెనగులాడుచుండ సత్యదేవుడు లోనికింజని మినుకుమినుకులాడుచు తానింతకుముందు గావించిన పైశాచికకృత్యమునకు హాసించుచున్నదో యను దీపపుకాంతిని, కాలగామిగిలిన కాగితముల కుప్పను గాంచెను. ఆపత్రముల నాతడట్టునిటు తిరుగవైచి చూచుచు కొంతసేపటి కాతడొక పెద్ద కేక వైచి, యొకానొకపత్రమును చేతగొని, బిగ్గరగ నవ్వుచు, పిచ్చియెత్తినవానివలె గంతులిడ నారంభించెను. పిమ్మట అదేపనిగ, అతడు తనభార్య పరుండియుండిన మంచము వద్దకు పరుగిడి, యామె మెడచుట్టును తనచేతులు పెనవైచి లేవనెత్తి, కౌగిలించుకొని, ముద్దిడి, "గృహిణీ, పార్వతీ! ఈశ్వరుని కృపయున్నచో నిన్నిప్పటికైనను బ్రతికింపగల సామర్థ్యము నాకు కలదు." అని సంతోషముతో నుప్పొంగుచు ప్రసన్నవదనుడై యాత డీవలకు వచ్చెను. తనప్రాణాధికయగు పార్వతి ఈలోకమును వీడి ఒక యరగంటను బూర్వమే స్వర్గారోహణమొనర్చెనని పాప మాయున్మత్తున కెట్లు తెలియును! ఒక్కక్షణముక్రిందట ప్రేమపూర్వకముగ తాను గాఢాలింగన మొనర్చినది తనపార్వతి కాదనియు, అది ఆమెయొక్క జీవనిర్ముక్తకళేబరమనియు సత్యదేవునకు తెలియనే తెలియదు. పొరలివచ్చుచున్న తన సంతోషతరంగములను బలవంతముగ నాపుకొని చావడిలోని కాతడు సత్వరంబుగ విచ్చేసి, రామసింగు నుద్దేశించి, "అయ్యా! ఇదిగో మీపత్రము చూచుకొనుడు" అని యాకాగితము నాతని హస్తముల నుంచెను.

ఆకస్మికముగ ఫలప్రాప్తిబొందువానికి అనుమానము హెచ్చు. కాగితము చేతిలో పడినతోడనే రామసింగు దానిని ముక్కుముక్కలుగా చింపి మొగమున కొట్టి మోసగించునేమోయని సత్యదేవునిమనమున సంకోచముదయించెను. కాని యట్టి సందియమునకు తావులేదు; ఏలయన రామసింగు ఆకాగితమును దివిటీలదీప్తిని చూచుకొని, తృప్తిజెంది, తనచందుగుపెట్టిలోనుండి ఏబది, వేయిరూపాయలనోట్లను దీసి తివాచిపైనుంచి, "మహాశయా, సత్యదేవా! ఇదిగో మీరూపాయలు. ఇప్పటికి నాపితామహుడు ఋణవిముక్తుడయ్యెను. ఇక నాకు సెలవొసంగుడు" అనుచు నాతడు తివాచిపైనుండి దిగ్గున లేచి, నమస్కరించి, ఆయూర తనబంధువు లెవ్వరో యున్నారనియు, మరునా డచ్చటనే యుండి, మరుసటి రాత్రి స్వగృహమునకు ప్రయాణము గావింతుననియు నుడివి, యచ్చోటినుండి వెడలెను.

* * * *

సత్యదేవునిహృదయము కొట్టుకొనసాగెను. నాడి తీవ్రమయ్యెను. అతడు నాల్గువైపుల తనపికిలిదృష్టుల బరపి చుట్టుప్రక్కల నెవ్వరును లేకుండుటచూచి ఆ నోట్లకట్టను తనకంపితహస్తములనందుకొనెను. తనయున్న ప్రకృతిని వెల్లడించుట కాతడు నోట్లను రామసింగు సముఖమున లెక్కింపనైనను లేదు.

## ౫

అమావాస్యరాత్రి. స్వర్గీయదీపికలను తారలదీప్తి సన్నగిలుచుండెను. సత్యదేవు డింటిలోనికి జనెను. ఆతని హృదయ మానసమయమున నిర్మలౌదార్యప్రకాశముచే నిండియుండెను. ఊరిలోనివారి నందరి నాహ్వానించి, యిష్టదైవ మగు సత్యనారాయణవ్రత మతిశోభతో చేయవలయునని యాత ని మొదటి యాలోచన. వ్రతము నాడు తనభార్య పార్వతి ధరించుట కే చీరకొనవలయునను నా లోచన రెండవది. ఇంతలో గృహాంత ర్భాగమున దేవు

ములచే స్మృతిపథమునకు వచ్చుచుండెను. "ఈశ్వరానుగ్రహమువల మాయిరువురిజీవనమును సుఖముగా గడపుట కీధన చాలును. చాలు నననేల! ఇంతకంటె కావలసినదేమి అని యాతడు ప్రసన్నహృదయుడగుచుండెను. త భార్యరోగమునకు వారి నిరుపేదతనమే కారణమ యూహించిన యాత డీవార్త వినినంతనే పార్వ నీరోగిణియై లేచి కూరుచుండునని యాతనియుద్దేశము.

యాలోచన యాతనిమనస నందు కలిగించిన సంతో మునకు మేరయే లేకుండెను అయ్యో! పాపము! ఇన్ని



"మహాశయా, సత్యదేవా! ఇదిగో మీ రూపాయలు. ఇప్పటికి నాపితామహుడు ఋణవిముక్తు డయ్యెను."

నిల్లు సమీపించి ఆతడు తనయింటిచేల్పులకు మనో వాక్కాయకర్మముల సాష్టాంగప్రణామ మాచరించెను. తరువాత మరల చావడిలోనికివచ్చి, కాలగా మిగిలిన యప్పుపత్రము లన్నింటిని భద్రముగా పూర్వపుముఖ మలుగుడ్డయందుంచి పెట్టెలో దాచెను. దినదినము క్షీణించుచుండిన తనవంశీయులపై నభిమాన మొక్కపరి ద్విగుణ మయ్యెను. ఆత డాసమయమున ధైర్యోత్సాహ

యూహా లోక్కమ్మకి మస్తిష్కమునందు కల్ల మొసర్చుచుండ, ఆతడు పార్వతి పరుండియున్న మ మును సమీపించి, (యాతనియూహాప్రకారము) నిద్ రించుచున్న యామెను మేలుకొలుపు నుద్దేశము నామెపై చేయిపైచి కదల్చి, "పార్వతీ, లెమ్ము కన్నుల తెరువుము. శ్రీ సత్యనారాయణమూర్తి మన ప్రార్థన మంగీకరించినాడు; మనపై తనయద్వితీ

ఉపకారమును కలిగించినాడు......ఇటుచూడు......" పార్వతి లేశమాత్రమైనను కదలకుండుట జూచి, అతడు ఆయమముఖముపైనుండి కప్పియున్న దుప్పటికొన నెత్తి చూచుసరికి—ఏమున్నది? చూచుటయే తడవుగ అతని నోటినుండి కరుణాపూరితమగు "ఆహా!" అను శబ్దము మాత్రము వెడలెను. అతడట్లే మంచముతలపై చతికిలబడి వేడికన్నీరు కార్చసాగెను "అయ్యో! ఈ సంపదకు మూల్యము పార్వతిజీవమా?." అని యాతడు గొంతెత్తి యేడువ నారంభించెను. "తనపవిత్రసభాభవనమునకు పార్వతి మణినిగొని, ఆమెకు మారుగా, దైవము నా నెత్తి నీ పాడుధనమును గొట్టెనా? ఈధనమేల? ధనములలో ధనము, లెక్కింపరాని నాధనము, నాసుగుణరాశి, పార్వతి లేకపోయిన తరువాత ఈపాడురూపాయ లేల?— అయ్యో!అయ్యో!" అని యాతడు పలువిధములవాపోవ దొడగెను.

* * * *

౬

అంధకారమయమగు అమావాస్యరాత్రి, అంధకారమయ పరజీవితముపలెనే సమాప్తమ యయ్యెను. పొలములందు కాపులు సంతోషపూర్వకముగయు చైత్రస్వరముల పాటలు పాడుకొనుచుండిరి. చలిచే వడకుచుండిన బాలురు సూర్యుడెప్పు డుదయించునాయని యాతురపడుచుండిరి. చెరువుగట్టుపై నీళ్లుతెచ్చు నెపమున కూడిన యువతులందరును లోకాభిరామాయణము మా[...]లాడుకొనుచుండిరి. వారిలో నొకతె నీటిలో కడవ ముంచుచు నాబుడబుడశబ్దము తనయత్తగారు నిద్రించునప్పటి గుఱ్ఱును పోలియున్నదని పరియాచకములాడి తక్కిన వారినందరిని నవ్వించుచుండెను. ఇంటికడనున్న వృద్ధాంగనలు ఏడ్చుచున్న పసిపిల్లల నెత్తికొని, "చెరువుకు పోయి నీళ్లుతెచ్చుట కింతయాలస్యమా?" అని కోడండ్రపై తమ కుమారులు వినునట్లుగ విసుగుకొనుచుండిరి. ఆమాటలను వినివిననట్లు నటించుచు పురుషులు వారివారి పనులమీద నుండిరి.

డాక్టరు శంకరశాస్త్రిగారింకను మేలుకొనలేదు. దగ్గుచున్న బాలురతోడను, మూల్గుచున్న ముసలివారితోడను ఆతనియ[...]లయము ప్రక్కయరుగు[...]డే కిటకిటలాడుచుండెను. ఇట్లుండ నొకవ్యక్తి చేరిన



"వైద్యరాజా, ఇవి పదివేల రూపాయలు......మీరు మాయింటికివచ్చి, నాభార్య పార్వతి నొక్కసారి"

కలవెండ్రుకలలో, కెంపురుమాపులతో, ఎఱ్ఱనినయనములతో, భయంకరరూపములో, కాగితముల కట్టనొక దానిని చేతులబట్టుకొని, పరుపరుగున వచ్చి ఆయాపద్ధాలయద్వారము ను సమీపించి, కవాటములను శక్తికొలది [కొ]ట్ట నారంభించెను. ఆవచ్చినవ్యక్తి మనకు పరిచితుడగు సత్యదేవపండితుడే. ఆతనిచేతియం దున్నది ఏబదివేల రూప్యముల నోట్ల కట్టయే! ఏదో యుపద్రవము సంభవించియుండునని భీతుడ్మైన శంకరశాస్త్రిగారు తన భృత్యుని తలుపు తెరువుమని యాజ్ఞాపించెను. భృత్యుడు సత్వరముగ కవాటము తెరచెను. తలవాకిలి తెరువబడుటయే తడవుగ, సత్యదేవుడు లోపల ప్రవేశించి, అప్పుడే మంచముపైనుండి లేచి కూరుచుండుటకు కష్టముపై ప్రయత్నించుచున్న శంకరశాస్త్రిగారిని ఎదుర్కొనెను. పిమ్మట తనహస్తమందున్న యానోట్లకట్టను వైద్యునకు జూపి, "వైద్యరాజా, ఇవి ఏబదివేల రూపాయలు. వీనిని మీకు ఫీజుగా నిత్తును. మీరు మాయింటికి వచ్చి, నాభార్య పార్వతి నొక్కసారి— కేవల మొక్క [సారి] చాలును- కనుల తెరచునట్లు గావింపుడు. నిర్జీవము లగు ఆమె నయనములకు జీవకళల నొసంగుడు. ఆమె ప్రేమపూరిత దృక్కిరణముల నాపై నొక్కసారి బఱపుకొనవలయునను నభీష్టము జనించినది. కేవల మొక్క క్షణము! మానవజీవముకంటెను మీకు రూపాయలు ఘనముకదా! ఇవిగో రూపాయలు— ఈరూప్యముల గ్రహించి, వీనికంటె నెన్నియో రెట్లు విలువగల నా పార్వతి సజీవదృష్టులను గొనితెమ్ము!—నీవేమి తేగలవు? ఆదృష్టులు పోయినవి! మరిరావు! సుశోభితజలరుహ దళములు ముకుళించినవి!—శ్వేతముగ ముకుళించినవి!—పోయినవి! నాయర్ధాంగి, నాసర్వస్వము, నాప్రేమనిధి, నాపార్వతి!......" అని యత్యంతదుఃఖితు డయ్యెను.

శంకరశాస్త్రి తెల్లబోయెను. గతరాత్రి తాను గావించిన యుపేక్షవలన పాప మాసత్యదేవ విప్రుని భార్య పార్వతమ్మ మరణించెనను వాస్తవాంశము నాతడు గ్రహించెను. అతడు నీళ్లు నములుచు, మాటలకు తడవుకొనుచు, "అయ్యా! నాకు చాల విచారముగా నున్నది. నేను మీయెడ నొనర్చిన యపరాధమునకు నన్ను మన్నింపుడు. నాబుద్ధి గడ్డితినినది—ధనమే పరమావధి యని నేనూహించితిని. ఆధనమునుజూపియే నాకు మీ రిప్పుడు తగినశిక్ష నొసంగితిరి. నేను పాపాత్ముడను. నను మన్నింపుడు" అని శంకరశాస్త్రి విహ్వలముగ పశ్చాత్తాపములో, సత్యదేవునిపాదముల బట్టుకొనుటకు ప్రయత్నించుచుండ, సత్యదేవుడు కెవ్వున కేకవైచి, వికృతముగ నవ్వి వీథిలోనికి పరుగెత్తెను.

సత్యదేవు డున్మత్తు డయ్యెను. దారావియోగ దుఃఖ మాతనియెడ యున్మత్తతగా పరిణమించెను. ఆతడు నిద్రాహారముల ద్యజించి, యుపవాసములచే కృశశరీరుడై, "పార్వతీ" నామమును జపించుచు మఱియొక నెలదినములకు తిరిగి అమావాస్యనాటిరాత్రి లోకమును విడిచెను. మఱునాడు జనులందరును లక్ష్మీనగర వీథులందు గుమిగూడి, రేయి ఆతనియింటిలోనుండి, "పార్వతీ! వచ్చుచున్నా"నను వాక్యము వినవచ్చె నని ససంభ్రమముగ బలుక నారంభించిరి.

---

# దారిద్ర్యము

పండితారాధ్యుల నాగభూషణము గారు

౧

చింతలను ముంచు ఘనయశశ్శ్రీని నడంచు
ధైర్యముఁ గలంచుఁ గుజనులదరికిఁ బంచు
స్థైర్య మెడలించు హైన్యంబు సంఘటించు
వలదు పగవానికిని లేమి వలదు వలదు.

౨

మరణ మొకమారె చంపును మానవులను
బ్రతిదినముఁ జంపుచుండును బ్రజల లేమి
లేమికన్నను గష్టంబు లేదు లేదు
మృత్యువె శరణ్య మింక దరిద్రులకును.

౩

స్వస్థలము వీడి యన్యదేశముల కేఁగి
సిగ్గు విడనాడి యొరులకుఁ జేయిఁ జాఁపి
దేహి దేహి యటంచును దేవురించు
జీవి జీవచ్ఛవంబని చెప్పఁదగఁడె.

౪

ఆత్మగౌరవమెల్లను నడఁగిపోవు
ధైర్యమును స్థైర్య మెచటికో తరలిపోవు
కలమనీషాలవంబు గ్రక్కదలిపోవు
ఘోరదారిద్ర్య కలితుఁడౌ పూరుషునకు.

౫

అన్నపానీయములనైన నంటనీదు
కన్నులకు సుంత నిద్దుర కదియనీదు
గ్రంథపఠనంబునకు బుద్ధి కదలనీదు
ఘోరదారిద్ర్యరోగంబు గూరెనేని.

౬

ఆప్తులును బంధులగు వార లట్టులుండ
నగ్నిసాక్షిగఁ బెండిలియాడినట్టి
యింతియే మాటిమాటికి నీసడించి
విసరికొట్టు దరిద్రుఁడౌ విభునిఁ జూచి.

౭

తెమ్ము తెమ్మంచు నిల్లాలు తీవరించు
నిమ్ము సొమ్మంచు సావుకార్ హెచ్చరించు
నేటి కీబ్రతుకని జనం బేవగించుఁ
బుడమిదారిద్ర్యబాధ నెవ్వఁడు సహించు

౮

కుడువఁ గూడుకాని తొడుఁగ బట్టలుగాని
నిలువ నీడగాని కలుగనట్టి
పేదవాని బ్రతుకు పీడాకరముగాక
సుఖమటంచుఁ గలదె సుంతయేని.

౯

ఇంట నున్న మిగుల నిల్లాలు బాధించు
బయటి కేఁగ సెట్టి బాధపెట్టు
నిలిచియుండ నింక నెల వేడ లభియించు
ప్రేతభూమిదక్క పేద కిలను.

౧౦

వృశ్చికశతంబు మేనఁ జరించినట్లు
కాలసర్పంబు లోకవేయి కరచినట్లు
దారుణంబైన దారిద్ర్యభారమునను
జెప్పరానట్టి వేదనల్ చెందు నరుఁడు.

౧౧

హాలహాలమును నంగిట నదుమవచ్చు
నశనిపాతంబు నౌదల నాఁగవచ్చు
నుగ్రరిపుకోటి నాజిలో నోర్వవచ్చు
నుర్వి దారిద్ర్య భారంబు నోపరాదు.

౧౨

సకలజనులకు మోదంబు సంఘటించు
ప్రకృతియు దరిద్రు సంతోషపరుపలేదు
సన్నిపాతజ్వరార్తుఁడై యున్నరోగి
జిహ్వా కిక్షురసంబు రుచింపనట్లు.




పా. వి. రాఘవరావు గారు (సారస్వతమిత్రమండలి)

'ఓరి అయ్యల్లో! అన్నిబియ్యము ముష్టివారి మెదానఁబోసి నాకూటిలో మట్టిఁ గొట్టఁ దలఁచినారఁట రోయి! నాధనము రాళ్ల పాలుచేయ నెంచినారఁట రోయి! నాసంసారము సారహీనహాసహారామెడారి చేయనూహించినారఁట రోయి! ఇదియేమి కర్మము. అత్తయ్యా!నీమొగముమండ! పాలగదిలో పిల్లిలాగున నాయింటి కెల్లు దాపురించినావే! ఓ కన్యకాపరమేశ్వరీ! తల్లీ! ఈ శనిదేవతల నీనోటవేసికొని పోయితివేని నీ కీసంవత్సరము అరణాఅరఁటిపళ్లు, కుంకుమ, అర్పించుకొనియెదను. అమ్మా! రక్షించు! ఈయింటిలోని ముండలందఱు సెనగపప్పువలె నాధనమంతయుఁ దిని వైచుచున్నారు.' అని వెంకటసెట్టి నోటికివచ్చినట్లఱచుచు, పీఁట గుమ్మముపైఁ జదికిలఁబడెను.

వెంకటసెట్టి ఆయూరిలోనున్న వారందఱిలో మిక్కిలి ధనవంతుఁడని పేరుఁ బడసినాఁడు. లక్షలకొలఁదిరూక లాతనికొట్లలోఁబడి మూల్గుచుండెను. అందు దమ్మిడీయైన ఖర్చుచేయఁడు. కర్మముచాలక ఖర్చుచేసెనా తిరిగి ఆదమ్మిడీకొట్టులోఁ బడువైచువఱకు కాతని హృదయమందు సుమంతయేనియు శాంతి యుండదు. కాన ఆయూరివారందఱు ఆతనికి 'దమ్మిడీసెట్టి' యని పేరిడిరి.

ఛీ! ధనము కలవాని కెంతలోభత్వమో! తనధనము వెచ్చపెట్టుదురేమో యను దిగులుచేఁ దనయాప్తుల నెగురవేసికొని పొమ్మని కన్యకాపరమేశ్వరికి మ్రొక్కులిడుచున్నాఁడే. ధనము సంపాదించుటకై తగనిప్రయత్నము లొనర్చుచున్నాఁడే; కాళులఁ బట్టుకొనుచున్నాఁడే; కోర్టులెక్కుచున్నాఁడే; ప్రమాణములఁ జేయుచున్నాఁడే; ప్లీడర్ల కాశఁ బెట్టుచున్నాఁడే; వ్యాజ్యము గెల్చినపిదప వారికి తొంటచేయిఁజూపుచున్నాఁడే; వారియుసురుఁ దినుచున్నాఁడే. సంపాదించినధనము దాఁచునిమిత్తమై తహతహలాడుచున్నాఁడే; నిద్రాహారము లెఱుఁగక భక్తునివలె నినుపపెట్టెకడ భజన లొనర్చుచున్నాఁడే. కాంపౌండువడ్డీల కప్పులిచ్చుచున్నాఁడే. తప్పుపత్రముల సృష్టించుచున్నాఁడే. ఋణముఁ దీసికొనినయాతఁడు 'దివాలా' తీయఁగ 'బారు'మని యెక్కయే డ్పేడ్చుచున్నాఁడే. నలువురచేఁ దిట్లు తినుచున్నాఁడే. తిట్లుదీవన లగుచున్నవి. పాపిచిరాయు వగుచున్నాఁడు.

*     *     *     *

వీథిలోనుండి పరుగెత్తుకొనివచ్చుచు వెంకట సెట్టితో నతని కుమారుఁడు, 'అయ్యా! అయ్యా! బడిలోని మా పంతులే అయ్యా! ఊఁ ఒక్కటోపీ కొనమన్నాఁ డయ్యా! అది తలపై లేనిదే బడిలోనికి రానియ్యఁడఁటఅయ్యా! నా కొకటోపీ కొనవూ' అనెను. అంత సెట్టి, 'ఓరీ! వెఱ్ఱిమొగమా! మనకా కిరస్తాని వేషాలెందుకయ్యా! కోమటికి టోపీయెందుకయ్యా! ఆపంతులు పాపయ్యశాస్త్రియేనా! కానిమ్ము. దొంగముండకొడుకు. రేపు విఘ్నేశ్వరునిచవితికి మీచే పూజచేయించి దక్షిణ అడిగినప్పుడు వానిపని పట్టించెదను. అత్తయ్య పాలకాయలు చేసినది పోయితిను; లేకపోయిన మిగులవు.' అని కొమరుని మెల్లగా లోనికంపెను.

మఱొక నిముసమునకు సెట్టి సేవకుఁడొకఁడు ఒక ఉత్తరముఁ దీసికొనివచ్చి సెట్టి చేత నిడిపోయెను. ఆయుత్తరము సెట్టి ఇట్లు చదువుకొనెను:—

'వెంకటసెట్టిగారికి—
మీ ఇనుపపెట్టె నీరాత్రి దొంగిలింపఁదలఁచుకొంటిని. జాగ్రత్త. పాడుధనము పోయినఁ బోవునుగాని ప్రాణముఁగాచికొనుఁడు.

భవదీయమిత్రుఁడు:
"గజదొం:."

ఇక మనసెట్టిని వర్ణింప నలవి కాదు. సరస్వతీదేవి 'అలవైకుంఠపురంబులో' అను పద్యము వ్రాసి వైకుంఠవర్ణనఁ జేసెనుగాని, మన సెట్టి ప్రస్తుతపుస్థితి వర్ణింపఁ గలదో లేదో చెప్ప లేము. సెట్టి కరగడియవఱకును నోట మాట లేదు. "ఓ ధనదేవతా! ఇంకేమున్నది. నమస్కారము. పోయెదవా? ఎంతకాలమునుండి నిన్నుఁ బూజఁ జేయుచుంటిని. భక్తునిపైఁ గరుణ లేదా? నిన్ను నిత్యము సంస్తుతిఁ జేయుటకై దుర్గయ్యచేతిలోఁ బదివరాలు పోసి, పద్యములను, దండకములను వ్రాయించితినే. దయ లేదా? పోయెదవా? అయ్యో!" అని వెక్కివెక్కి యేడువ మొదలిడెను.

అంత సెట్టితండ్రియగు పద్దయ్య అటకు వచ్చి, 'వెఱ్ఱిమొగమా, వెక్కివెక్కి యేడ్చుచుంటి వేమయ్యా' అనెను. అంత సెట్టి, "అయ్యా! ఊరకే యేడ్చుటకు నేను నాటకములలో వేషములు వేయువాఁడనా? ఈ యూరివారి దృష్టిదోషము నాకు తగిలినది. సెట్టి యింటిలో నిలువెత్తు ఇనుపపెట్టియున్నదని జనులందఱువారిపుట్టిమునిఁగి పోయినట్లేడ్చుచున్నారు.' అనిఅనెను. పద్దయ్య, ఏమిటయ్యా! వెఱ్ఱిచదువు. కారణము లేకుండనట్లు కన్నీరు కార్చుచుంటివేమి? 'అనెను' కారణము కాగితములో నున్నది చూడు'మనిగజదొంగ వ్రాసినయుత్తరము వెంకటసెట్టి పద్దయ్య చేత నిడెను. పద్దయ్య ఉత్తరముఁజదివిచూచుకొని, 'వెఱ్ఱిమొగమా! ఆలస్యము చేయక రఘునాథరావుగారింటికిఁ బొ'మ్మని చెప్పి, తాను లోనికిఁ బోయెను.

సెట్టి పైనుత్తరీయము వైచుకొని రఘునాథరావుగారిఇంటికిఁబరుగెత్తెను. ప్రపంచమున జనులకందఱకును అసామాన్యమగు వస్తువులఁ జూచుటయందుఁ గాని, చేష్టలఁ దిలకించుటయందుఁగాని, సంగతుల వినుటయందుఁ గాని

కుతూహల మెక్కువ. సంతలోనికి నాల్గు చెవులగేదె వచ్చిన దనఁగానె, చేయు పనుల నన్నిటివిడిచి, గడపదాఁటియెఱుఁగని కాంతామణులు సహితము పరుగెత్తెదరు. ఎన్నఁడును ఆంధ్రపత్రికఁ జూచినపాపమునకుఁబోని నిగర్వ చూడామణి నక్కకు కుక్కపిల్లలు పుట్టినవని సంగతి వినఁగానె క్లబ్బునకుఁ బయనమగును. స్థూలకాయులఁ జూచిన నరుల కుత్సాహము మెండు. అతఁడు నడువఁగఁ జూచిన మఱింత యుత్సాహము. అట్టియెడ వర్ణింప నలవికాని వనసెట్టి పరుగెత్తునపుడు జనుల యానందము అపారము; అవర్ణనీయము. ఎందులకో ఆఆనందము వారికే తెలియదు.

* * * *

## ౨

సుప్రసిద్ధాపరాధపరిశోధకు లగు రఘునాధరావుగారు తమ గదిలోఁ గూరుచుండి తమ కెదురుగఁ గూరుచున్న తమశిష్యు లగు జయదేవుగారితో నిట్లు మాటలాడుచుండిరి:

రఘు—జయదేవు! నేను ముసలివాఁడ నైతిని. దేహదార్ఢ్యము తగ్గుచున్నది. ఇఁక నే నీపాట్లు పడఁజాలను. నీ వీకార్యముల నిఁక మీఁద నెఱవేర్చుచుండవలెను.

జయ—ఈ detective పనికి life మీఁది ఆశల వదలిపెట్టవలయును. Life must be left to itself as 'unsavoury snuff'. సంసార మందున్నయాతఁడ ట్లాచరించుట కష్టము. మా బోఁటి bachelors మాత్రమే ఈ పనికిఁ బనికి వచ్చెదరు. మఱియు enterprising spirit లేని వారీపని కక్కరకురారు. Generally enterprisingspirit exists in bachelors. కాన మన మెటు చూచినను bachelors మాత్రమే ఈ యుద్యోగమునకుం బనికివచ్చెదరు. ప్రస్తుతము నేను bachelor నే కదా. ఇఁక వివాహముఁ జేసికొనఁ దలఁచుకొనలేదు. Single blessedness, double wrechedness అని నా అభిప్రాయము. విధివశమునఁ బెండ్లి చేసికొనిన మాత్ర మీమాయతోలుబొమ్మ లెంతకాలము బ్రదుకును. Mors omnibus communis. కాన నేను ముదముతో నాపై నిడినభారము మోయ సంసిద్ధుఁడను.

రఘు—నీన్యాయవాద వృత్తియిందెంత మాత్ర మక్కరకు రాదుసుమా!

జయ— అయ్యా! నే నెఱుఁగనా? Suggestio falsi, Suppressio veri' అనెడు motto ఎప్పు డుపయోగపడును. మఱియు నా intellectual capacity నేను చెప్పుకొనినయెడలఁజాలహేళనముగా నుండును. Exaggeration అని నల్గురు నన్ను దూషింతురు. ఈ కాలపుజనులలోనున్న కర్మమే యిది. They cannot discover a true hero. నిజముగ Arsene Lupin అను నాతఁ డున్నయెడల నిముసములో నాతని చేతి కరదండములఁ దగిల్చి పాదాక్రాంతునిఁగఁ జేయగల్గు మేధావంతుఁడను. తా మెఱుఁగని దేమున్నది?

రఘు—సరియె లెమ్ము నీశక్తిఁ ద్వరలోఁ జూపింతువు గాక!

అంత రోఁజుకొనుచు మన సెట్టి రఘునాథ రావుగారి యింటఁ బ్రవేశించెను.

జయ—A living specimen of Shylock.

రఘు—ఏమోయీ! సెట్టీ! అంతత్వరగా నడుదెంచుటకుఁ గారణమేమి?

సెట్టి—బాబూ! తొందరగా వచ్చినను రెండుఘంటలు తీసికొనినది.

రఘు—జట్కాబండిపై రాలేదా?

సెట్టి—(లోన) ఓరయ్యో జట్కాబండియే. (పైకి) బాబూ! నడచినగాని శరీరము గట్టిపడదని వైద్యుఁ డనుటచే నడచివచ్చితిని.

రఘు—(లోన) అమ్మ దొంగముండ కొడుకా! ఎంతయుక్తిగా మాటలాడితివి. (పైకి) నీవు వచ్చినపని యేమి?

సెట్టి—బాబూ! గొప్పవారిని జూచుటకుఁ బని యేముండును?

రఘు— అటులైనఁ జూచితివి కాన పొమ్ము.

సెట్టి—చిత్తము. బాబూ! చిన్న మనవి కలదు. చిత్తగించవలయును.

రఘు—త్వరగఁ జెమల్చుము.

సెట్టి—బాబూ! ఈకాగితమును చిత్తగించండి. దాని జూచినప్పటినుండియు నాకు తిండి లోనికిఁ బోవుట లేదు.

రఘు—(ఉత్తరముఁ జూచి) జయదేవు! ఈఉత్తరమును జూడుము.

జయ—(చూచి) సెట్టీ! నే నీరాత్రి నీ యింటికి వచ్చెదను. నీకేమియు భయములేదు. ఇనుపపెట్టెగూర్చి విచారింపఁదగదు. పొమ్ము.

సెట్టి (లోన) ఈ దొంగముండకొడు కెవఁడో? (రఘునాథరావుగారివైపుఁ జూచి చేతులు నులిమికొనుచు) చిత్తము. చిత్తము.

రఘు—సెట్టీ! నీకేమియు భయములేదు. నేనైన నేమి, నాకన్ని విధముల మిన్నయగు నా శిష్యుఁడైన నేమి? త్వరగఁ బొమ్ము.

సెట్టి తల వంచుకొని నిష్క్రమించెను. రఘునాథరావుగారు పని యున్నదని లోనికిఁ జనిరి. జయదేవు మాత్ర మాలోచనా నిమగ్నుఁడై కూరుచుండెను. అప్రయత్నముగ, Sherlock holmes అనియు, Maurice Leblanc అనియు, ఏవియో సందర్భశూన్యములగుమాటలాడుచుండెను. ఆఁకలి యెక్కువగుటచే జయదేవు కింక ఆలోచన సాగలేదు. త్వరగక్షుద్బాధా నివారణకై ప్రక్కనున్న అయ్యరు గారి 'ఆంధ్ర హోము'లోనికిఁ బరువెత్తెను. ఆహా! అయ్యరుగారి కాంధ్రులపై నెంతయభిమానము!

### ౩

సాయంకాల మారు గంట లాయెను. సూర్యుఁడు పశ్చిమాంభోనిధిని సమీపించుకొలఁదిని సెట్టిభయ మధికమగుచుండెను. ఆ దినమున సెట్టి చేయుచున్న రామభజనలకంతము లేదు. ఒక్కొక్కమా రినుపపెట్టెనుగౌఁగిలించుకొని బారున నేడ్చుచున్నాఁడు; ఒక్కొక్కపరి సాష్టాంగ నమస్కారము లాచరించుచున్నాఁడు; ప్రదక్షిణములఁ జేయుచున్నాఁడు; పాటలఁ బాడుచున్నాఁడు; ఇంటిలోనివారలఁ దెడఁదిట్టుచున్నాఁడు.

# ప్రాచీనభారతీయులోహపరిశ్రమలు

బొంబాయిరాజధానియందలి రాగి, ఇత్తడి సామానులు.—౧౯ శతాబ్దపు టుత్తరార్థము



౨. గొలుసుల దీపములు



౮. పూనా, కచ్ఛిప్రాంతముల ఇత్తడిపళ్లెములు

ఏడుగంట లగుసరికి సెట్టి వీథితలుపు నెవరో తట్టిరి. సెట్టి పరుగునఁబోయి తలుపుఁ దీసెను. జయదేవుఁ డిరువురు రక్షకభటులతోఁ [గూ]డఁ బ్రవేశించెను. వారిని జూచినతోడనే సెట్టి కన్నులయం దమృతము వర్షించెను. ఇనుపపెట్టెయున్న గదికి సెట్టి జయదేవుని దీసి కొనిపోయెను. రక్షకభటులు వారి ననుస రించిరి. అంత సెట్టి, 'ఈ గ్రహములుకూడ నెం దులకు బాబూ! మీరొక్కరు చాలరా? అల్ల రియేకాని మరేమిగలదు. ఏమో! ఏ గడియ కెవరి కేబుద్ధిపుట్టునో ఇనుపపెట్టెను జూచిన తోడనే, దురూహపొడమి, వారు మిమ్ములఁ జంపి పెట్టెనెత్తుకొనిపోవుదు రేమో జాగ్రత్త!' అనెను. అంత జయదేవుఁడు మందహాసముతో సెట్టీ! [illegible]సిని వెనుక పూర్వసువాసిని ఎంతఅవసర మోడి ఒక్కివృక్షన్నుపెట్టరు వెనుక రక్షకభటు లంతయావశ్యకము తెలిసెనా? వారులేని దేకా ర్యమునెఱవేఱుటెట్లు? ఇంత యనుమానము కల్గినవాఁడవు నన్నేల సందేహింపవు? కావున నేఁ బోయెదను' అనెను. అంత సెట్టి, 'బాబూ! క్షమించండి! రక్షించండి. బుద్ధిగడ్డితినది. డబ్బు మీఁది ప్రేమచే నోరులు తెలియక కారులాడి తిని. రండోయి రక్షకభటులారా!' అనెను.

అంత జయదేవు 'ఏమోయీ! సెట్టీ! భోజనముచేసిరమ్ము. ఈజయదేవుఁ డుండఁగ నీ కేమియు భయము లేదు. పోయి'రమ్మనెను.

రాత్రి యెనిమిదిగంటలాయెను. సెట్టిజయ దేవు లిట్లు మాటలాడుకొనుచుండిరి:

జయ—రాత్రి లోని కెవ్వరిని రానీయ కూడదు సుమా!

సెట్టి—చిత్తము.

జయ—నీ తాళములిటు తెమ్ము.

సెట్టి—(భయముతో) తాళము లెందుకు?

జయ—తాళములునీదగ్గఱనుండతగదు.

సెట్టి—ఎందు చేత?

జయ—ఇచ్చెదవా లేదా? ఈయకున్న యెడల నేఁబోయెదను. నీకర్మము.

సెట్టి—బాబూ! అంతమాటే. కోమటి కుఱ్ఱవానిపై నంతఆగ్రహమే. ఇదిగో బాబూ తాళము చెవులగుత్తి. (ఇచ్చును).

జయ—మంచిది. నీవు పోయి నీగదిలోఁ బరుండుము.

సెట్టి—చిత్తము. బాబూ! ప్రొద్దుట మీకు మీసములు లేవుగదా ఇప్పు డెట్లు వచ్చినవి?

జయ—సెట్టీ! ఎంత తెలివితక్కువవాఁడ వోయి నీవు! నిముసమున కొకవేసముతో నగపడుటయే అపరాధపరిశోధకుల ఘనత. అట్లుకానియెడల నపరాధులఁ బట్టుకొనుట మాతరమగునా?

సెట్టి—చిత్తము. సెలవుతీసికొనెదను. అని తనగదిలోనికిఁ బోయెను.

రాత్రితొమ్మిదిఘంటలకు సెట్టి వీథితలు పు నెవరో తట్టిరి. కాని తలుపుఁదీయునంతటి తెలివితేటలు కలవా రెవ్వరు?

* * * *

తెల్లవారెను. సెట్టి బట్ట సర్దుకొనుచు నినుపపెట్టి యున్న గదిలోనికిఁ బోయెను. ఆఁ. అదియేమి!! సెట్టి నిలువెల్లవడఁకుచున్నాఁడే!!!

వెఱ్ఱిమొగముతోఁ జూచుచున్నాఁడే. ఇనుప పెట్టెతలుపు తీసియున్నది. అందొక్కరూకయైనను లేదు. జయదేవుఁడును రక్షకభటులును గూడ కనఁబడలేదు. అంత సెట్టి, 'ఈడటిక్రొవ్వు ముండకొడుకు నాకొంపఁగూల్చినాఁడు. నన్ను నమ్మించి నాగొంతుకతడిగుడ్డతోఁ గోసినాఁడు. తాళము లెఱుఁగక ఆ దిక్కుమాలినవాని చేతిలోఁ బెట్టితినే. అయ్యల్లో! లోప లేమి చేయుచున్నారురోయి! నాధనము పోయినదిరోయి! కంచెయే చేనుమేసిన దిది యేమికర్మమురోయి! కానిమ్ము. ఈజయదేవు నా కగపడఁడా. అప్పుడు వానిపని పట్టించెదను. మొగముపై నిప్పులు పోసెదను!' అని అఱచుచుండెను. చేత నొకకాగిత మిడికొని త్వరగ, జయదేవుఁడు సెట్టియింటఁ బ్రవేశించెను. ఆతనికొడలుపై తెలియుటలేదు. అతఁడుకన్నుల నగ్నికణములఁ గ్రక్కుచు, 'సెట్టీ! బుద్ధిహీనుఁడా! రాత్రి తొమ్మిదిగంటలకుఁ దలుపులెట్టినఁ దీయక లోపలనేమేడ్చుచుంటివి. తగిన శాస్తియైనది. నీబోంటి తెలివితక్కువ నరుల కట్టులే కావలయును. లేనియెడల నోడల మద మణఁగదు. అనెను. ఆపలుకుల వినుటతోడనే సెట్టికి కోపము హెచ్చెను. ధనముపోయినదనియేడ్చుచుండఁగా తెలివితక్కువవాఁడవనెడు పల్కు చెవులఁబడఁగానే, 'ఆఁ ఏమనుచుంటివి. రాత్రి తొమ్మిదిగంటలకు వచ్చితివా. ఎనిమిది గంటలకు ఇరువుర రక్షకభటులతో రొయ్యబిూనముల వేషముతో సిద్ధపడిన దాసరయ్య యెవఁడు? నిమునమున కొక వేసము వేయుదునని పల్కిన డాబులరాయఁ డెవఁడు? నీవేగా? మర్యాదాహీనుఁడా, మాటలుతిన్నఁగరానిమ్ము; మాఅయ్య మంచివాఁడుకాఁడు'. అని వ్యాజ్యము గెల్చుట కాధారములేక వాగ్ధాటిచే విజయముఁ గాంచఁదలఁచిన న్యాయవాదివలె[illegible]చెను. 'సెట్టీ! శాంతినొందుము. ఈఉత్తరముఁ జూచుకొనుమని జయదేవ ఒకకాగిత మాతని మొగమునఁ బాఱవైచెను. సెట్టి ఆయుత్తరము నీరీతిగాఁ జదువుకొనెను.

అపరాధి పరిశోధకాగ్రగణ్యులగు జయదేవు గారికి—

అయ్యా! నమస్కారములు.

నేను నిన్న సాయంకాలము మీావేషము వేసికొని సెట్టియింటఁ బ్రవేశించి, ఆతఁడు నాకిచ్చిన తాళములతో నాతని ఇనుపపెట్టెలోని వస్తువులన్నియు గ్రహించితిని. సెట్టి [illegible] విచారించుచుండును. ఆతని నేడ్పించుటకిష్టము లేదుకాన తేపురాత్రి మీారుభయులు రాజమహేంద్రవరములో ఇన్నీసుపేటలోని 960 నంబరు గృహమునకు వచ్చిన తిరిగిఇచ్చివేయుదును. మీాప్రాణములకేమియు భయము లేదని నొక్కిచెప్పుచున్నాను.

ఇట్లు,
ఓపు తమరాకకై వేచియుండు
భవదీయమిత్రుఁడు
"గజదొంగ."

'సెట్టీ! లెమ్ము; రాజమహేంద్రవరము పోవుదము.

౪

ఆనాఁటిసాయంకాలము నాల్గుగంటలకు కాకినాడ టౌను ప్లాట్‌ఫారముమీాఁద జయ

దేవుఁడును, వెంకటసెట్టియు కూర్చుండియుండిరి. బండివచ్చువేళ యైనది. జయదేవు వెంకటసెట్టి చేతికిఁ గొంతసొమ్మిచ్చి రెండుటిక్కెట్లు తీసికొనిరమ్మనెను. సెట్టి బుక్కింగుఆఫీసులోనికిఁ బోయి రెండుఇంటరుమీడియేటు టిక్కెట్లు రాజమహేంద్రవరమునకుఁ గొని పైకిఁ బోయెను. ఇంతవఱకు చుట్టగాల్చుకొనుచు కునికిపాట్లుపడుచున్న అసిస్టాంటుస్టేషనుమాస్టరు 'Damn Dirty Devil Probationers!' లోనుండి టిక్కెట్లనీయవలదని మీకెన్నిసారులు చెప్పితిని? చేసెడు పిచ్చిపనులన్నియు మీరు, వచ్చెడు చీవాట్లు మాకు' అనివిసుగుకొనెను.

రైలు ప్లాటుఫారముమీఁదికి వచ్చెను. జయదేవు, సెట్టియు బండినెక్కిరి. 'ఎందులకు వచ్చెనురా భగవంతుఁడా'యని బండి యేడ్చుచు సామర్లకోటఁ జేరెను. మనకథానాయకు లిరువురును బండిదిగి, అచ్చట కప్పుడే వచ్చిన మెయిలుబండినెక్కిరి.

రాత్రి యేడుగంట లగుసరికి రాజమహేంద్రవరముఁ జేరిరి. హోటలులో భోజనముఁ జేసి ఇన్నీసుపేటలో పెద్దయంకెలతో 960 అని యున్నగృహమునఁ బ్రవేశించిరి. ఇరువురు సేవకులు వారి నెదుర్కొని మేడమీఁదికిఁ దీసికొనిపోయిరి. వారిరువురు కుర్చీలపై ఆసీనులైరి. సెట్టి నిల్వుగ్రుడ్లు వైచుకొని ఇటునటు చూచుచుండెను. సేవకులలోనొకఁడు సెట్టిగొంతుక నొక్కెను. 'బో'యని సెట్టి చెవి గోసిన మేఁకవలె నఱచుచు గిలగిలకొట్టుకొనుచుండెను. అంత జయదేవుఁ డిదియే సమయమనుకొని,'మిమ్ములనందఱ నిదే చంపుచుంటి'నని రివాల్వరు కొఱకయి జేబులోఁ జేయి పెట్టెను. వెనుకనున్న రెండవసేవకుఁడు జయదేవుచేయిఁ బట్టుకొని, 'జయదేవ్' అని పిలిచెను.

అంతజయదేవు నిశ్చేష్టుఁడై 'రఘునాథజీ' అని పిలిచెను. అంత రఘునాథరావు, 'జయదేవ్! గజదొంగను నేనేసుమీ'అనెను. 'అటులైన మీ చేతి కరదండములఁ దగిల్చెద'ననెను. 'నాయనా! ఇదిగో నీ చేతి కరదండముల దగుల్చుచుంటి'నని జయదేవుని కరదండములు వైచెను; రఘునాధరావు '961 నెంబరుకల గృహములో నీ వకారణముగ అల్లరి చేయుచుంటివి గాన నీకీశిక్ష విధించితి' ననెను. అంత జయదేవు,'ఆఁ' ఇది 910 వ నంబరుగల యిల్లు కాదా' అనెను. 'కాదు నీ గర్వభంగమునకై ఈయింటిపైనున్న నంబరు తుడిచి వైచి 960 నంబరు వైచితిని, చూడుము. నిజముగ ఇది 961 వ నంబరు గృహమే' అని ఇంటినంబరు చూపెను. 'నీవు చిన్నవాఁడవు. అపరాధపరిశోధనయందు దారితేరని వాఁడవు. అట్టి నీకు తలకు మించిన పలుకులు తగవు' అని రఘునాథరావుగా రనిరి.

'అయ్యా!క్షమింపవలయు'నని జయదేవు రఘునాథుని కాళ్లపైఁ బడెను. 'ఇది నీ ఒకటిన్నర తెలివితక్కువ'యని సెట్టి తన తెలివితక్కువను వడ్డీతో జయదేవుని కప్పఁజెప్పెను.

---




# శ్రావణాశ్రువులు

పెనుమర్తి వేంకటరత్నము గారు [యువకవిమండలి]

౧

మరల వచ్చెను శ్రావణమాసలక్ష్మి
తొలఁకె దిక్తటులందు మాధుర్యవృష్టి
నీలనీరధరాగ్రమందిరములందుఁ
దాండవించెను విద్యుల్లతామతల్లి.

భూమితలగతసౌదామినీమనోజ్ఞ
మధురమూర్తులు శ్రావణమాసవేళ
శాంకరీపదాబ్జాతపూజాప్రసాద
ములు గ్రహించి పుణ్యాంగనల్ వెలిఁగినారు!

దివ్యమాహేశ్వరీ పదాంతికములందు
మోడ్పుఁగనుదోయితోడుత మోఁకరిల్లి
వినతు లొనఁగెడు మాయమ్మ కనఁబడ దట
చర్మచక్షుస్సులత్యవిశ్వమున యందు!

అంతలోన మాతల్లి జన్మాంతవేళ
స్మృతిపథంబునవచ్చి విచ్చెను సహస్ర
కాళరాత్రి విషాదాలకములమ్ముల్లు
కజ్జలఘనాఘనమ్ములఁ గందళించి.

౨

ఆయగమ్యనిశీథరహస్యవీథి
హైమవత కందరాగ్ర గౌరీమతల్లి
పాదములకడ నున్న నీ స్వాదుమూర్తి
కన్నుగవపొంత నాకు సాక్షాత్కరించె.

అకరాళకజ్జలజలదాంతరాత్రి
భయదమైన తమస్సులో నయనయుగ్మ
చంచలమైన నీప్రభాశంప వెలిఁగి
మన్మదశ్రువర్షాంబువుల్ మల్లడించె.

బాహిరమైన యీవిశ్వభాగమందు
మామకీనాంతరాళమ్ము మధ్యమందు
ఏకరీతిగా ప్రావృడుద్రేక మొలసి
తల్లి! నాశరీరోష్ణమ్ము చల్లవడియె!





# లక్ష్మీరామేశ్వరము

నరహరిసెట్టి వెంకటరత్నముగారు

౧

ఆమె "నిజముగా చెప్పండి; మరల పెళ్లి చేసుకోరు కదూ?" అనెను. రామేశ్వరుడు దీనవదనముతో, "లక్ష్మీ! నీమాటలు నేను వినజాలను. ఈరోజున ఏమిటి నీవు నాహృదయమును దహింప జేస్తున్నావు." అనెను.

లక్ష్మి రామేశ్వరుని భార్య. ఇరువురును నూతనయౌవనులు. రామేశ్వరుడు ఇరువదినాలుగువత్సరముల ప్రాయము వాడు; లక్ష్మి పదునెనిమిది వర్షముల యువతీమణి. ఒక దినమున అపరాహ్ణసమయమున ఈసతీపతు లిరువురు చతురంగము ఆడుకొనుచుండిరి. ఆటనడుమ లక్ష్మి సంభాషణమును మార్చి పైవిధమున దీసికొనివచ్చినది. సహజకోమలహృదయుడు—రామేశ్వరుడు ప్రియతమ, మితభాషిణి యగు లక్ష్మి ఇట్లు మాటాడుట గని ఆశ్చర్యపడుటయే కాక అంతరంగమున జాల బాధ ననుభవించుచుండెను.

లక్ష్మి లేనినవ్వు తెచ్చుకొని మిగుల మధురము, మిగుల కఠినము గాని కంఠస్వరమున "మీ మనసుకు బాధ కలిగించవలె నని నామతము కాదు. మీ రేమనుకొనినా సరే, ఈ ఒక్క విషయములో నాకు స్వేచ్ఛ ప్రసాదించి నిక్కముగా జవాబు చెప్పండి. ఇక నేనేమీ మాటాడను." అని పతివైపు పిచ్చిదాని వలె జూచుచుండెను. ఆచూపులో భావమేమియు లేదు. అర్థ మంతకన్న లేదు.

రామేశ్వరునకు నెన్నడు లక్ష్మిపై గోపము రాలేదు. అప్పుడప్పుడు రామేశ్వరుడు భార్యను గోపించుచుండునని లోకు లనుకొనెదరుగాని ఆమాటలో గొంచెమైనను సత్యము లేకపోలేదు. ఇంతవఱకు నాతడు జూపినది కృత్రిమకోపము. వివాహమై ఆరువత్సరములు గడచినవి. లక్ష్మిపై నిజమైనకోప మాతనికి ఈరోజున మాత్రమే వచ్చినది. రామేశ్వరుడు చటాలున దనప్రక్కనున్న తిలకుగారి "కర్మయోగశాస్త్రము" దీసి శిరసున బెట్టుకొని కోపముతో, "లక్ష్మీ! ఇదే నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను. నా లక్ష్మి జీవించియున్నను లేకపోయినను నేను పరస్త్రీ ముఖము తలయెత్తి చూడను. (కొంచెము సేపూరకుండి) ఇకనైనా నన్ను వదలుదువా?" అని చతురంగపుఆట సాగించెను.

పతివ్రతాశిరోమణి యగు లక్ష్మి తల వంచుకొనినది; ఒకటిరెండు అశ్రుబిందువులు కనుకొలంకుల నుండి జారినవి. భర్త ఆవిషయము గాంచలేదని యాముద్దరా లనుకొనెను గాని రామేశ్వరుడు మాత్రము చూడక పోలేదు. అతని నవనీతకోమల హృదయము విదారిత మైపోవుచుండెను. జోస్యము చెప్పగల వారైనను ఆరంగము గాంచి రామేశ్వరు నిది "అసలైనప్రేమ" అని యనకుండ జాలరు.

౨

పదునొకండు మాసములు గడచినవి. లక్ష్మి మార్గశీర్ష బహుళ ఏకాదశినాడు అర్ధరాత్రమున ఆడశిశువును ప్రసవించినది. కాలగర్భాన లీనమగుచున్న వా రండఱు నేల అట్లగుచుండిరో ఎవరు సిద్ధాంతీకరించి చెప్పగలరు? బహుళద్వాదశి—సాయంసమయము. అంధకారము మెలమెల్లన ఆవరించుచున్నది. అనంతనీలాకాశము, పక్షులు, వృక్షములు, మందపవనుడు—సర్వముగూడ దుఃఖించుచున్న భంగి తోచుచున్నవి. లక్ష్మి—ప్రాణవాయువు ఈ పాంచభౌతిక దేహమును విడిచిపెట్టి పోయినది. పూళ్లగ్రామమున—ఆ దుఃఖమయభవనమున ఎల్లరు దుఃఖితహృదయులై యుండిరి. ఒకరిద్దరు మాత్రము బిగ్గరగా నేడ్చుచున్నారు.

ఒకవిరాగి ఆత్రోవను బోవుచు "ఎందుకు దుఃఖపడతారు?" అనుకొనెను.

3

పరమేశ్వరుడు—"లక్ష్మిఅనుఈఆత్మ నరకలోకానికి పోవాలి." లక్ష్మిఆత్మ—"ప్రభూ! నరకలోకానికి పోవడానికి నాకేమీ అభ్యంతరము లేదు. మీ ఆజ్ఞానుసారము అల్లాగె వెళ్తాను. నాభర్త, నేను చాలా అన్యోన్యంగా ఉండేవాళ్లము. నేను మానవశరీరములో ఉన్నప్పుడు ఆయనను విడిచి ఎప్పుడూ ఉండలేదు: ఆయన్ను విడవవలసివస్తుందని పుట్టింటికి కూడా వెళ్లలేదు. ఆయన కూడా నేనంటే అంతప్రేమాతిశయముతో ఉండేవారు. మీ ఆజ్ఞ అయింది; విడవలేక విడవలేక నాప్రాణేశ్వరుని విడిచివచ్చాను. ఏమిచెయ్యను; విడిచి రావలసి వచ్చింది. ఒక్కసారి నే నాయన్ను దర్శించుకు రావడానికి—ఓదార్చడానికి సెలవు దయచేయించండి ప్రభూ! ఆయన నాకోసము ఎంతదుఃఖిస్తూఉంటారో నే నేమిమనవి చేయగలను! ఒక నిముసమైనా విడవకుండా ఉండే నాహృదయేశ్వరుని అపారదుఃఖసముద్రములో—నిబిడాంధకారమున విడిచివచ్చేశాను. నన్ను విడిచి—ప్రియతమనైన ఈదాసిని విడిచి నాప్రియతముడు ఎల్లా ఉంటున్నాడో భావించుటకు కూడా నేను సహించలేకుండా ఉన్నాను. ఆయన్ని నేను పువ్వుల్లో పెట్టి పూజించేదాన్ని. అంత కోమలంగా ఉండే ఆ సుకుమారమూర్తిని "నాకోసము దుఃఖించవద్దు; జరగవలసినట్టు జరుగుతుంది" అని ఓదార్చి కన్నీరు తుడిచి వస్తాను. సర్వము తెలిసిన ప్రభువగు నీకు నేనేమి చెప్పగలను? దేవా, సెలవు దయచేయించండి!" అని వినయవినమితయై చెప్పుకొనెను. పరమేశ్వరుడు—"వెళ్లిరమ్ము".

౪

ఆత్మ పరలోకమును విడిచి భూలోక మును ప్రవేశించెను; భర్తృగృహాో న్ముఖమై వెళ్లుచున్నది. ఇంతలో నౌకరుయా రునందు రామేశ్వరుని కంఠస్వరము వినిపిం చెను. ఆయాత్మ త్వరితముగ నామందిరమును బ్రవేశించి రామేశ్వరుడు నవనవోన్మేషయగు నౌకరమణీమణి చెంత గూరుచుండి ప్రణయ సల్లాపము లాడుచుండుట గాంచినది. "ఏమీ! ఈమెయెవతె—ఔరా, అప్పుడే ద్వితీయ వివాహమా!—మోసము, మోసము, ఇంత కన్న మోసమున్నదా, ఏలోకములో నైనా?

ఇచట కూర్చున్నది నాప్రాణేశ్వరుడేనా! ఇట్లు జరుగుతుందా? ఆప్రేమ, ఆ ఆదరము, ఆ అభిమానము ఎక్కడికి పోయినవి. ఎంతో దుఃఖిస్తూ ఉంటా డనుకొన్న నాభర్త ఆనంద మునవోలలాడుటయా?—నేను నమ్మజాలను.

ఏమీ! ఆనాడు భగవద్గీత నెత్తిపైబెట్టు కొని ప్రమాణము కూడ చేసెనే. ప్రమాణ ముతో లెక్కయేమి? అంతప్రేమతో ఉండే భర్త—ఇంకేలోకములోనూ ఉండడనుకున్న నాభర్తయేనా ఇట్లయిపోవుట. అయ్యోదేవా! నీవెంత విచిత్రవర్తనుడవు! నాభర్త లోప మేమియు లేదు. నీదే బాధ్యత—

అయ్యయ్యో, పరమేశ్వరుని తూలనాడు తున్నానా?'సర్వము నీవే,నీవులేకపోతే ఏమీ లేదు'అనుచుండే నాభర్తననవలెనుకాని.నన్ను శాశ్వత ధర్మపత్నిగా స్వీకరించినట్లు అగ్నిసా క్షిగా ప్రతినకూడా చేసెనే! 'నిజమైనప్రేమ నాభర్తది. ఇతరుల దండిది బూటకపుప్రేమ' అనుకొన్న నేను 'అదిప్రేమకాదు, కామము' అని అనుకొనవలసి వచ్చిందా ప్రభూ! దేహాన్ని మాత్రమే కామించే భర్త నిజమైన భర్త యెట్లగును?—

ఈతడె దైవము; వేరే దైవము లేడను కొనేదాన్ని. ఒకసారి ఒక నెచ్చెలి భర్తను దైవ ములాగు చూడాలి కాని భర్త దైవము కాజా లడు అని చెప్పింది. అప్పట్లో ఆమె మాట లెక్క చెయ్యలేదు. 'ఈతనికంటేప్రేమింప దగి నది ప్రపంచంలో ఇంకేమీలేదు: ఈయనే నేను; నేనే ఈయన' అనుకొని ప్రేమించి నందుకా ఇట్లు మోసగించుట! అయ్యోప్రభూ! నిన్ను గ్రహించుట ఎల్లాగు?

ఇక ఆచంటిపాపగతి ఏమవుతుందో.ఇంత చిత్తచాంచల్యము గల మానవులను నమ్ము టెట్లాగు? 'పురుషులను నమ్మకూడ' దని దేవుడు వ్రాసిపెట్టి ఉంచాడు కాబోలు. ఆసం గతి యింతవరకు తెలిసికోలేకపోయాను.ఇంకా యెందుకిక్కడ? ఇక పోతాను."అనుకొని పర లోకమునకు ప్రయాణమయ్యెను.

౫

లక్ష్మి పరమేశ్వరుని దివ్యసన్నిధికి జని, "దేవా! నన్నిక నరకలోకానికి పంపండి" అనెను.

పరమేశ్వరుడు "నీవిక నరకలోకానికి వెళ్లవలసిన ఆవశ్యకత లేదు. నువ్వు ఇట్టి పతిని దైవముగా భావించావు. దైవ మొకడున్న సంగతే మఱచి ఆతడే దైవ మను కున్నావు.

భర్తను భార్య దైవము లాగున నెంచి గౌరవించవచ్చును, కాని అతడే దైవ మనుకొనుట కూడనిపని. ఇప్పుడు నీవుపడిన పశ్చాత్తాపము వల్లనీదోషము పోయింది.—ఇక నీవు పవిత్రమైన దానవు. స్వర్గానికి వెళ్లి ఆనందమున ఉండు. సత్యమైన ప్రేమామృతము ఇక్కడొక్క చోటనే అనుభవించగలవు కాని ఇంకెక్కడా నీకా ప్రేమామృతము లభింపదు. పోయి శాంతి నిలయము, ఆనందనిలయము, ప్రేమనిలయము అయినస్వర్గధామంలో ఉండు" అని ఆశీర్వదించెను.

లక్ష్మి ఇప్పుడు ప్రశాంతినికేతనమగు ప్రేమానంద నిలయమున సంకల్పరహితయై యున్నది.



# రాగాతిశయము

దుగ్గిరాల పల్లంరాజు, పానుగంటి చిరంజీవిరావుగార్లు

ప్రవిమలంబగు మామకభావవీథి
తెక్కగదలని నిగమాంతరీతు. నీవుఁ
జక్కనైననుఁ బొడువనిఁ చోటువెదకి
కేల నీముద్దు పిల్లనగ్రోలు పట్టి
దర్శనం బిచ్చినావు సంతసమెకాని
పెదవిఁ గదుపవు మొగ్గలు విరియునయ్య!
కళలు పరువొందు నీచిన్నిగళము నెత్తి
యొక్కస్వర మూఁదు, తేనియ లూరఁ గృష్ణ!

చిలుకపలుకు, వసంతకోకిలరవంబు,
నళిరుతము మించి యొయ్యార మతిశయించు
సరససంగీతమాధురీ స్వరయుతమగు
రాగ మేదయ్య! నాదువరాలతండ్రి!
చిన్నవాఁడ వె! యింత యాచింపవలెనె
తలఁపుమున్నెరుఁ బురికొలఁ ద్రాగుదువట
తెలియఁగాలేవె? నావాంఛ తెలిసి యొక్క
రాగమును బాడవేమయ్య, రసికవర్య,
గానలోల! నీ వేనాఁడు వేణువొత్తి
పాడినాఁడవో చల్లని వరుసలెల్ల
వింటినో లేదో నాఁడు నీ వేణురవము
నూఁదు మఱియొక్కమాఱు మహోత్సవముగ
పథముఁ దెలిపెడు నీ కనుపాపఁబట్టి
ఊర్ధ్వనేత్రము సల్ల చేయూఁతఁ బూని
నొక్కునొక్కున నొకమెట్టు నెక్కినీదు
స్వరముతో సందుకొందును స్వర్గతలము
ముద్దుకృష్ణయ్య! చిన్నారి మురళి నెత్తి
యాలసింపవె తొల్లి నీవల్ల గొల్ల
పల్లె నూఁదిన మధురసుస్వరము దివ్య
మోహనంబైన రాగ మారోహణమున.

---




## తిరుక్కోవలూరు మహాస్వామి శ్రీకుమార ఆదివరాహాచార్యులుగారు

మన భరతఖండమునఁ గల మతములు వేదబాహ్యములు, అవైదికములు, వైదికములు అని ముత్తెఱఁగుల నున్నవి. ఇందు వైదికములు ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము అను పేరుల సాంప్రదాయసిద్ధములై బహుముఖముల నీయార్యభూమి నలంకరించియున్నవి.

ఈమతత్రయములో నాయామతముల సాంప్రదాయసిద్ధములగు గురుపరంపరా ధ్యానశ్లోకముల నను [illegible] యీత్రిమతములును శ్రీనారాయణుని చేతనే యుపదేశింపఁబడి యాయామహర్షులచేతఁ బ్రచారమునకుఁ దేఁబడియున్నను, కలియుగమునఁ దటస్థించిన చార్వాకబౌద్ధాదిబాహ్యదుర్మతముల వలని విప్లవమున [illegible], కల్యాది ముప్పదియెనిమిదవశతాబ్దమున శ్రీశంకరభగవత్పాదు లవతరించి యద్వైతమును, కల్యాది నలువదిరెండవశతాబ్దమున శ్రీభగవద్రామానుజు లవతరించి విశిష్టాద్వైతమును, (కల్యాది నలువదినాల్గవశతాబ్దమున శ్రీమధ్వతీర్థు లవతరించి ద్వైతమును బునరుద్ధారపూర్వకముగ సంస్కరించి ప్రతిష్ఠించియున్నారు.) ఆ యద్వైత విశిష్టాద్వైత ద్వైతములకు శంకరమతమనియు, రామానుజమతమనియు, మధ్వమతమనియు నపవాదముగ నా సంస్కర్తల పేరులతోనే యిప్పటికిని వాడఁబడుచున్నవి.

అట్టి యీత్రిమతములవారికిని మతమును, ధర్మమును, ఆచారమును ప్రతిపాదించు శ్రుతిస్మృతులు మున్నను ప్రమాణవ్యవహారమంతయు నేకముగనే యున్నను, ప్రమేయవ్యవహారమునమాత్రము మహావిరోధ మున్నట్లు దేనికది వేఱుపడియుండుటయే కాక యొండొరులకు వ్యతిరేకముగ నుండునట్లు శాస్త్రాధారము లేకున్నను, మతాచార్యు లంగీకరింపకున్నను,* క్రొత్తక్రొత్తయాచారములఁ గల్పించుకొని వానిని సాంప్రదాయసిద్ధములగు సదాచారము లని వాదించుచున్నారు. ఇంతేకాక వాని నవలంబింపకున్నవారిని బలాత్కరించియైన నవలంబింపఁ జేయుచున్నారు.

పైపెచ్చు ఆస్తికసమయముల నొండొరులను దాఁకుటయు, భోజనకాలమున నొండొరులను జూచుటయు నపవిత్రముగ నెంచుచున్నారు.

ఇట్లు తమలోఁ దాము కలహించుకొనుటయేకాక కాలమాహాత్మ్యమునో, మఱియేకారణమునో గాని యీత్రిమతాచార్యులలో నొకమతాచార్యుని దక్కిన రెండుమతములవారు నుగ్రశత్రువుఁగ భావించుచున్నారు. కొందఱు మాటలనేకాక గ్రంథములయందును కఠోరముగ దూషించుచున్నారు.

పురాతనుఁడును, సజాతీయుఁడును నొకమతమును బ్రతిష్ఠించినవాఁడును, బూజ్యపాదుఁడును అగు నొక మతాచార్యునియెడ (ఇప్పటికి) తక్కిన రెండుమతముల వారికి నంతటివైరము కలుగుట కతము విచిత్రతరము.

---

* శ్రుతిస్మృతులు నిషేధించుచున్నను ఒక క్షేత్రమాహాత్మ్యమునందలి మాటను పాటించి (అదియును నంతగ ననుసరింపరు) యద్వైతులు భస్మోద్ధూళనపుండ్రముపై భస్మత్రిపుండ్రమును, దానిపై చందన తిర్యక్పుండ్రమును, తిలకమును ధరించుటయు, శాస్త్రమును, మతాచార్యుల యభిప్రాయమును వీరి విశిష్టాద్వైతులు ఆతిథ్యమహాయజ్ఞమునకు హానికరముగఁ దమలో దాపైనఁ గనియుక తెఱలను [illegible] మొదలైనవి.

కావున నిమ్మతములకు పరస్పరవైర మిప్పుడే కలిగినదిగదా? లేక పూర్వమునుండియు వచ్చుచున్నదియా? అని యాలోచించిన, నీత్రిమతములు నీకలియుగము నందలి యిమ్మతాచార్యులచేతనే క్రొత్తగ స్థాపింపఁ బడినవి కావుకదాయని తేటపడును. సృష్ట్యాదినే వేదముల ప్రచారము ననుసరించి యీమతములును ప్రచారమునకు వచ్చియున్నవి. వీరి గురుపరంపరలును ఇవి యాద్యములనియు, అనాదిసిద్ధములనియు, ప్రతిపాదించుచున్నవి. ఈమత త్రయభాష్యములఁ బరిశీలించినను నీవిషయమె ప్రసరించుచున్నది.

అట్టియెడ నీత్రిమతములు ఋషిపరంపరలయందుఁ జాలకాలము ప్రచారము నొందియుండవచ్చును కదా! కో బ్రహ్మసై ప్రతిమహర్షియుఁ దమమతమువాఁడేయని వాగాడంబరముచేత సాధింపఁ జూచుచున్నను, పూర్వపు మహర్షులలోఁ గొందఱద్వైతులుగను, గొందఱు విశిష్టాద్వైతులుగను, గొందఱు ద్వైతులుగను నుండి తీరవలయును. ఇప్పుడైనను నిష్పాక్షికముగ విమర్శకదృష్టితో శ్రుతిస్మృతీతిహాసపురాణాదులను బరిశీలించినఁ జాలమంది నీఋషి యీమతమువాఁడని వైనము తేలగలదు. ఇఁక గొందఱుమాత్రము గొంతకాల మొక మతమున నుండి తరువాత మఱియొకమతమును స్వీకరించి నట్లును స్పష్టపడఁగలదు.

అట్లు పూర్వయుగములయందుఁ గల మహర్షులలో వైరము నియ్యంటగానితనముఁ, జూడరానితనము కలదనుటకు నవకాశము నొసంగు ప్రమాణము మాత్రము లేదు. కావుననే అమ్మహర్షులు యజ్ఞములయందును, బరిషత్తుల యందును, ఆతిథ్యములయందును ఒండొరులు గలియుచు గౌరవించుకొనుచునే యున్నారు. కాని యీపాపము మాత్రము లేదని స్పష్టముగఁ జెప్పవచ్చును. వలయునేని సోదాహరణముగ నిరూపింపవచ్చును. లేకున్న శాస్త్రములయందలి పూర్వర్షి వచనములలోఁ దమ యాచారమునకుఁ బ్రతికూలించుదమ సమన్వయింప నలవికాని యార్ష వచనములను బ్రక్షిప్తములని త్రోసివేయుచు, మహర్షులందఱు దమ మతమువారేయనియుఁ, దమమతమే యార్ష మతమనియు నిష్పక్షికమగ నిరూపించినవారు చెప్పుకొనువట్లు పూర్వయుగములలో నొక్క మతమే యుండెననియెంచవలసివచ్చును

అట్లనుటకు దక్షునిక్రతువృత్తాంతము, ఋషులసత్రయాగము, జనకునిపరిషత్తు గూర్చిన నాఖ్యాయికలు కల్పనామాత్రములై యసత్యములు కావలసివచ్చును. పైవెచ్చు "అపూర్వయుగములయందలి వైదికమత మేది" యను విమర్శకులోనై దేనికిని నిలుకడ చిక్కక యన్నియు నసత్యములే కావలసివచ్చును.

కావున మహర్షులకాలమునం దీత్రిమతములు ప్రచారములో నున్నను ఈవిపరీతవిరోధములు మాత్రము లేవనుట స్పష్టము.

ఐన నీవైషమ్యము లిమ్మతాచార్యుల [illegible] నుండి కలిగియుండవచ్చు ననుకొన్నను, ఆవైష[illegible] లౌకికసాధారణమా? సిద్ధాంతము ననుసరించినదియా? అన తారములనుండి కలిగినదియా? అని యాలోచింపవలయును. ఇంతకన్న వేఱొకకారణము కనుపడదు.

అందు లౌకికసాధారణ మనుటకు నయ్యాచార్యులు మువ్వురును వేర్వేరుకాలముల నున్నవారు; కావున నది యసంగతము. ఇదికాక వారు రచియించిన ప్రస్థానత్రయమునందును ఉపనిషద్బ్రహ్మసూత్ర గీతాభాష్యములలో వారు విశేషించి బాహ్యదుర్వాదములను ఖండించుటయు, శ్రుతులను సమన్వయించుటయును ప్రయత్నించి యున్నారే కాని యొండొరులను దూషించుకొని కాని, యధిక్షేపించుకొని కాని యుండలేదు. ఎటులైన నొక దూషణ మున్నను అది వాదము నుద్దేశించినదియే కాని వాదిని నుద్దేశించినది కాదు. * అయినను వారివారికి

* శ్రీరామానుజాచార్యుల పరమాచార్యులగు శ్రీ యామునాచార్యులు రచియించిన సిద్ధిత్రయమునందు, "తత్రాప్యాత్మని పరస్మింశ్చ వ్యానేకవిధా విప్రతిపత్తయస్తీర్థకరాణాం" (అందు ఈఆత్మపరమాత్మలవిషయము నందు పూర్వమతాచార్యులకు పలురకముల విప్రతిపత్తులుకలవు) అనియును, "ఆచార్యటంక భర్తృప్రపంచ భర్తృమిత్ర భర్తృహరి బ్రహ్మదత్తశంకర శ్రీవత్సాంక భాస్కరాదివిరచిత" అని స్వపరమతాచార్యులకు "నాచార్య" పదమును చేర్చి సమష్టిగ చెప్పియున్నారు. ఇందు తక్కిన యేడుగురును అద్వైతములోని నానవిశేషముల ననుసరించి భాష్యములను వ్రాసినవారు. శ్రీవత్సాంకాచార్యులు విశిష్టాద్వైతభాష్యము వ్రాసినవారు.

వచ్చియున్న సిద్ధాంతము ననుసరించి బాహ్యకుర్వాదము ఖండించుచు శ్రుతులను సమన్వయించి యున్నారు.

ఇక సిద్ధాంతము ననుసరించి యనుటకు విమర్శదృష్టితో వారి వాఙ్మయమును పరిశీలించిన శంకరాచార్యులు అభేదముక్తిని, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు భేదముక్తిని ప్రతిపాదించియున్నారు. ఐనను రామానుజమధ్వాచార్యులు ప్రతిపాదించిన పరమముక్తిని సగుణముక్తి యను పేర శంకరాచార్యులు తాను సిద్ధాంతీకరించిన నిర్గుణముక్తికన్న నొకించుక క్రిందిమెట్టుగ నంగీకరించియున్నారు. శంకరాచార్యులు ప్రతిపాదించిన నిర్గుణముక్తిని కైవల్యముక్తి యను పేర రామానుజాచార్య మధ్వాచార్యులు తాము సిద్ధాంతీకరించిన భగవదనుభవరూపమగు పరమముక్తికన్న నొకించుక క్రిందిమెట్టుగ నంగీకరించి యున్నారు.

అయినను శంకరమతమున నీ సగుణనిర్గుణముక్తులు రెండును, రామానుజానందతీర్థమతముల నీ కైవల్య భగవదనుభవముక్తులు రెండును అపునరావృత్తికములే, పరమ సుఖకరములే.

మరియు నీ రామానుజ మధ్వతీర్థులు ప్రతిపాదించిన జీవేశ్వరభేదము శంకరమతమునందును అనాదియే. అనాది యగునది సాంతము కానేరదు. పరిణామప్రాయమగు నైక్యము నొందుటయే * తప్ప జీవత్వము నశించుననియు శంకరవాఙ్మయమునందు లేదు. జీవునకు జన్మనాశములు కలవనుటయు శంకరునకు సమ్మతములు కావు. శంకరుడు ప్రతిపాదించిన జీవేశ్వరాద్వైతము రామానుజ మధ్వమతములయందును బరమపురుషుని సార్వాత్మ్యకర్తృ సర్వవ్యాప్తిత్వములు మున్నగు ధర్మములచేత శంకరుని రైక్యభావనకు సమన్వయము నగునే కాని ప్రతికూలింపదు.

శబ్దార్థజ వైచిత్ర్యములచేత స్ఫురించు కొంచెపుదారతమ్యములను బట్టుదలలచేత లాగిలాగి పొగడీసి గోరంతలు కొండంతలు చేయుకోలేదని యిమ్మతములు వేనికదివేర్వేఱుగ నున్నట్లు కన్పట్టుచేకాని, పట్టుదలను, పక్షపాతమును విడిచి, సమరసదృష్టితో నాలోచించిన నియ్యుభయుల మతములు మిథయాసమ్మతములుగనే స్పష్టపడగలవు. ప్రధానమల్లనిబర్హణన్యాయమున నీ రెండువిషయములనుమాత్ర మిక్కడ నుదాహరించినాడను.

ఇక నవతారములనుండి కలిగినది యనుటకు శంకరభగవత్పాదులు శంకరుని యవతారమనియు, భగవద్రామానుజులు శేషుని యవతారమనియు, మధ్వతీర్థులు హనుమంతుని యవతారమనియు ఆ మహామతగ్రంథముల వలనను, వారికథలవలనను స్పష్టపడుచున్నది.

కావున వీరి యవతారములకు కారణమూర్తులగు శివుడు, శేషుడు, హనుమంతుడు నను వీరికి పరస్పరము సంబంధమే కాని, వైషమ్యమే కాని కలదాయని గమనించి చూచిన సమష్టివ్యష్టిగనున అవతారమునందును, అధికారమునందును పరస్పరము కలయికయే కనుపడుచున్నది. అది యైనను పరమేశ్వరుని సార్వాత్మ్యకర్తృత్వము ననుసరించునది కాక వ్యష్టిమూర్తి యగు వ్యూహమూర్తి ననుసరించినదే.

లోకానుగ్రహార్థము తనసంకల్పముచేతఁ బూర్ణషాడ్గుణ్యమగు వాసుదేవస్వరూపమును బరిగ్రహించియున్న పరమపురుషుని దివ్యాంశములు సృష్టిస్థితిసంహారముల కొఱకు ప్రద్యుమ్నానిరుద్ధసంకర్షణులను దివ్యమూర్తులఁ బరిగ్రహించి, రజస్సత్త్వతమోగుణముల నవలంబించి, త్రిమూర్తుల నధిష్ఠించి, జగత్కార్యము నెరవేర్చుచున్నట్లు పాంచరాత్రభాగవతవిష్ణుపురాణాదులయందు స్పష్టపడుచున్నది. శంకరాచార్యులును బ్రహ్మసూత్రభాష్యము అసంభవాధికరణములో స్పష్టముగా దీని నంగీకరించి యున్నారు.

---

* పరిణామప్రాయమగు నైక్యము అనగా సూర్యకాంతిలోఁ గలిసిన నక్షత్రకాంతివలె (ఇక్కడ కాంతియే దృష్టాంతము కాని సూర్యుడు నక్షత్రములు కావు) నణుమాత్ర చిద్రూపుడగు జీవుడు అనంతచిన్మయమగు బ్రహ్మములో గలియుట. ఐనను కొద్దిగొప్ప తారతమ్యములచేతను, సజాతీయత్వముచేతను వేఱువేఱుగ స్ఫురింపకున్నను, కలిసియేయున్నను మహత్తరములో నల్పతర మిమిడియున్నదే కాని అదియే యిది కానేరదు. దేనిపాటి కదియే ప్రకాశించుచుండును.

(శైవగ్రంథములలో వారు దేవునిస్థానమునఁ బరమశివునిఁ జెప్పెదరు (ప్రమాణముల యధిష్ఠానము సమానమే).

కావునఁ దమోగుణవిశిష్టమై సంహారకారణ మగు సంకర్షణమూర్తి యను భగవదంశము—

శ్లో. "రుద్రః కాలోఽన్తకాద్యాశ్చ
సమస్తాశ్చైవ జన్తవః,
చతుర్ధా ప్రళయాయైతా
జనార్దనవిభూతయః."

విష్ణుపురాణము, ప్రథమాంశము-౨౨వ అధ్యాయము.

(ఆ సంకర్షణుని దివ్యాంశములలో నొకభాగము రుద్రుఁడుగను, ఒకభాగము కాలముగను, ఒకభాగము యముఁడు,మృత్యువు,ప్రళయభూతములు మొదలైనవారుగను, ఒకభాగము ఒండొరులఁ జంపుకొను సకలజంతువులుగను- ఇట్లు ప్రళయమునకొఱకు నాలుగువిధములుగ నున్నవి. అన్నట్లు శివుఁడు సంకర్షణుని యవతారమనుట స్పష్టము.

[భాగవతము షష్ఠస్కంధము చిత్రకేతూపాఖ్యానము:]. "జగామ దేవదేవస్య శేషస్య చరణాంతికం" (ఆచిత్రకేతుఁడు దేవదేవుఁ డగు శేషునిపాదసన్నిధికి వచ్చెను)అని శ్రీశుకుఁడు చెప్పుటచేతను,"అహంసమాధాయ మనో యథాహ సంకర్షణస్తచ్చరణారవిందే" (సంకర్షణమూర్తి చెప్పినట్లే నేను ఆతనిపాదములయందు మనస్సును చేర్చి) అని వృత్రాసురుఁ డింద్రునితోఁ జెప్పుటచేతను ఆసంకర్షణుఁడే శేషుఁడనియుఁగనుపడుచున్నది.

అయినను, [విష్ణుపురాణము ప్రథమాంశము ౫వ అధ్యాయము:] "పాతాళానా మధశ్చాస్తే విష్ణోర్యాతామసీ తనుః, శేషాఖ్యా"(విష్ణువుయొక్క తమోగుణస్వరూపుఁడగు శేషుఁడుపాతాళమునకు(క్రిందనుండును)అనియు, "కల్పాంతే యస్యవక్త్రేభ్యో విషానలశిఖోజ్జ్వలః,సంకర్షణాత్మకో రుద్రో నిష్క్రమ్యాత్తి జగత్త్రయం; సబిభ్రచ్ఛేఖరీభూతమశేషం క్షితిమండలం,ఆస్తే పాతాళమూలస్థశ్శేషః" (కల్పాంతమునందు ఏ శేషునిముఖముల నుండి వెలువడినట్టి విషాగ్నిజ్వాలలతోఁ గూడినవాఁడై సంకర్షణాత్మకుఁడగు రుద్రుఁడు బయలువెడలి మూల్లోకములను దహించునో, ఆ శేషుఁడు భూమండలమును ధరించుచుఁ బాతాళమూలమున నుండును). అన్నట్లు ఈశేషుఁడు భగవంతుని తమోగుణవిశిష్టమగు నవతారముగను, లయకర్తగను స్పష్టమగుచున్నాఁడు. ఇట్లు అర్థము చేసిననే సర్వసామరస్యము కలుగును. ఎట్లన—

## సంకర్షణాంశప్రణాళిక



ఆసంకర్షణుని యొక్క యంశము శేషునియం దధిష్ఠించి భూభారమును భరింపఁజేయుచు, మఱియొక యంశము నాలుగు భాగములుగ కాలము, శివుఁడు, యముఁడు మృత్యువు మొదలైనవారు, తమలో తాము చంపుకొను ప్ర[illegible]పులు నను నీనాలుగింటి నధిష్ఠించి నిత్యసంహారమును, ప్రళయము మున్నగు నైమిత్తిక సంహారమును జరిగించుచున్నది. కావున నీ శేషుఁడు, శివుఁడు నను నుభయులును సంకర్షణుని యవతారమూర్తులే కాని భిన్నవ్యక్తులు కానేరరు.

ఇట్లు శేషుఁడు భగవంతుని యవతారము కావుననే, "శ్లో. అనంతః ప్రథమం రూపం త్రేతాయాం లక్ష్మణ స్తథా, ద్వాపరే బలభద్రస్తు కలౌ కశ్చిద్భవిష్యతి" (శేషుఁడు మొదటి రూపము, త్రేతాయుగమున లక్ష్మణుఁడు, ద్వాపరమున బలరాముఁడు, కలియుగమున నొకానొకఁడుగ నవతరించును) అను పురాణోక్తియందును శేషుఁడు మొదటిరూపము, అనగా కృతయుగమునందలి యవతారమనియే స్ఫురించుచున్నది.

మఱియును చిత్రకేతుఁడు పాతాళమునకేఁగి శేషు నాశ్రయించియున్నను, పార్వతి చిత్రకేతుని శపించిన వెనుక శ్రీరుద్రుఁడు పార్వతితో, "ఆత్మత్వా త్సర్వభూతానాం సర్వభూతప్రియో హరిః, తస్యచాయం మహాభాగ శ్చిత్రకేతుః ప్రియానుగః" (భగవంతుఁడగు హరి సర్వభూతములకు నంతరాత్ముఁడు కావున సర్వభూతములకు ప్రియుఁడైనవాఁడు. ఆవిష్ణువునకీ చిత్రకేతుఁడు ప్రియానుచరుఁడు) అని చెప్పినదియు, నీ శేషుని యవతారములగు లక్ష్మణుని, బలరాముని భగవదవతారములని ఇతిహాస పురాణాదులు వచించుటయు నీయంశాంశిత్వరూపమగు నైక్యము ననుసరించియే. ఇట్లుకాకున్న సమన్వయమే కలుగదు.

ఇఁక సృష్టికర్తలగు బ్రహ్మాదులను, రక్షణకర్తలగు యజ్ఞవైకుంఠాదులను, లయకర్తలగు రుద్రయమాదులను భగవంతులనియు, భగవదవతారములనియు స్మృతీతిహాస పురాణాదులు చెప్పుటయు నీయంశాంశిత్వరూపమగు నైక్యము ననుసరించియే.

ఇట్లే కాకున్న నీస్మృతులు మున్నగు నార్షవాఙ్మయమునకు పరస్పరవ్యాఘాత మట్లుండ, స్వవచనవ్యాఘాతము సైతము తటస్థించితీరును. అందుకతన విపరీత లక్షణమగు మూలచ్ఛేదమే పర్యవసానము కాఁగలదు.

ఇదిగాక శ్రీభాగవతము "సిద్ధచారణసేవితః" (సిద్ధులచేతను, చారణులచేతను సేవింపఁబడువాఁడు) అనియు, విష్ణుపురాణము "యోనంతః పఠ్యతే సిద్ధైః" (ఏ శేషుఁడు సిద్ధులచేత పొగడఁబడుచున్నాఁడో) అనియు, నీ శేషుఁడు సిద్ధులు, చారణులు మున్నగు యోగసిద్ధులచేత సేవింపఁబడువాఁడు అని చెప్పియున్నందున శేషునకు విద్యాధీశ్వరత్వము స్పష్టమగుచున్నది. అట్టివాఁడేకదా జ్ఞానప్రదుఁడును! కావుననే "జ్ఞానం మహేశ్వరాదిచ్ఛేత్" (మహేశ్వరునుండి జ్ఞానమును కోరవలయును) అను స్మృతి వచనము సైతము శివునకు విద్యాధీశ్వరత్వమును, జ్ఞానప్రదత్వమును వ్యక్తీకరించుచున్నది.

కావుననే విద్యలకన్నిటికిని బునాదియగు వ్యాకరణశాస్త్రమునకుఁ బ్రాతిపదికములగు "అఇఉణ్" ఇత్యాది సూత్రములు మాహేశ్వరసూత్రములని ప్రసిద్ధినందుటయు, "యేనాక్షర సమామ్నాయ మధిగమ్య మహేశ్వరాత్, కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయే నమః" (ఎవఁడు అక్షరామ్నాయమగు చతుర్దశసూత్రములను మహేశ్వరునుండి పడసి సమగ్రమగు వ్యాకరణమును రచియించెనో ఆపాణినికి నమస్కారము) అన్నట్లు ఆచార్యపాణిని యమ్మహేశ్వరునుండి మహేశ్వరసూత్రములను గ్రహించి వ్యాకరణశాస్త్రమును రచించుటయు, పాణినీయమగు అష్టాధ్యాయికి మహాభాష్యమును, యోగశాస్త్రమును రచించిన యాచార్యపతంజలి శేషుని యవతారమగుటయు నుపపన్నములగుచున్నవి.

కావున ప్రవృత్తికాలమున యమాదులు లయకర్తలైయుండ విద్యాజ్ఞానముల నుపదేశించి ప్రచారమునకుఁ దెచ్చుటయు, ప్రళయకాలమున ప్రపంచమునంతయు సంహరించుటయు నను నీరెండుపనులును శేషునకు, శివునకును సంకర్షణుని దివ్యాంశము ననుసరించి సముపపన్నము లగుచున్నవి.

ఇట్లు విద్యాజ్ఞానముల కధీశ్వరులై యజ్ఞానమును పోఁగొట్టు జగదాచార్యులగు శేషుఁడు, శివుఁడు వేఱువేఱు స్వరూపముల నున్నను తమయవతారముల కాశ్రయమగు

భగవంతుని వ్యష్టివ్యూహాంశము ననుసరించి యేకాంశ వ్యక్తులే కాని భిన్నాంశవ్యక్తులు కారు.

ఇఁక శివునకు నాంజనేయునకుఁగల సంబంధమును గమనించిన * [ఉత్తరరామాయణము, పంచమాశ్వాసము - ౬౩-వ పద్యము]

మ. పదిమోముల్ కల దండిరక్కసుని నిర్
భంజింప నీలాగు నీ
వుదయం బొందిన నీపనుల్ వడంపు ను
ద్యోగించి రుద్రాబ్జగ
ర్భదినేంద్రాబ్జముఖామరుల్ పవనభూ
భల్లూకరాడ్భానుజాం
గదముఖ్యాగచరవ్రముల్ గనిరిగా
కాకుత్స్థవంశాగ్రణీ!

అని చెప్పియున్నందున నాంజనేయుఁడు శివునియవతారమే కావున మూర్తిభేదమే కాని యంశవ్యక్తిభేదము లేదు.

ఇట్లు శేషుఁడు, శివుఁడు, నాంజనేయుఁడు నను నిమ్ముగ్గురు దేశకాలాదిభేదముచేత వేర్వేరుగా నవతరించియున్నను వీరు ముగ్గురును సంకర్షణుని యంశమే కావున నిమ్ముగ్గురకును భేదము లేదు.

కావున విద్యలకు, సిద్ధులకు నధీశ్వరులగు శివుఁడు, శేషుఁడు, నాంజనేయుఁడు తత్త్వబోధము గలిగించి, కర్మజ్ఞానభక్తిశరణాగతులను, మోక్షమార్గములను దేశకాలపాత్రముల ననుసరించి యుపదేశించి, లోకము నుద్ధరించుటకై శ్రీశంకరరామానుజమధ్వాచార్యులను నాచార్య దివ్యస్వరూపముల నిత్యైశ్వర్యభూమి నలంకరించియున్నారు. ఉపాసకులకు ప్రీతిగలిగింప వారివారి మనోగతుల ననుకూలించునట్లు వేదమున కభిమతములగు వేరువేరు ప్రస్థానములను ప్రతిష్ఠించియున్నారు. అయినను ఈముగ్గురు నొకయంశమునుండి కలిగిన యొకవ్యక్తియే

కాని వేఱువేఱంశములనుండి కలిగిన వేర్వేఱు వ్యక్తులు కారు.

ఇందుఁదమోగుణవిశిష్టమై లయకర్తృత్వమునందుఁ బ్రవర్తించిన వ్యష్టిరూప మగు భగవదంశము ననుసరించి చర్చించియున్నాఁడనే కాని నిరంజనమై పరబ్ర[illegible] పరమపురుషతత్త్వము ననుసరించి కాని, సర్వశరీరకమై యెల్లెడల వ్యాపించియున్న యంతర్యామితత్త్వము ననుసరించి కాని చర్చించియుండలేదు. కేవల వ్యష్టితత్త్వమై యాధికారిక మగు సంకర్షణవ్యూహతత్త్వము ననుసరించియే ఇట్లు నిరూపించియున్నాఁడను.

ఇట్లు ఇమ్మతాచార్యులు ఏకాంశమూర్తులు కావున నే వారిలో నొండొరులకు ద్వేషభావములు కాని మాత్సర్యము కాని లేవు.

ఇదికాక నేమతమువారైయున్నను బ్రాహ్మణుఁడు ప్రతివానికిని వాదమునందు గెలిచి కాని, మంచితనమున నుపదేశించి కాని తనమతమును బోధించి మతదీక్ష నొసఁగి, తనమతములోనికిఁ జేర్చుకొని యున్నారే కాని మతాంతరులని బ్రాహ్మణులను సైతము బహిష్కరించి యుండలేదు. ఇందుకు శైవుఁడైయుండి శ్రీశంకరభగవత్పాదాచార్యుల నాశ్రయించి యద్వైతియైన నీలకంఠాచార్యులును, అద్వైతియైయుండి శ్రీ భగవద్రామానుజాచార్యుల నాశ్రయించి విశిష్టాద్వైతియైన యాదవప్రకాశుఁడును, అద్వైతియైయుండి శ్రీ ఆనందతీర్థాచార్యుల నాశ్రయించి ద్వైతియైన త్రివిక్రమాచార్యులు మొదలైన మనపూర్వాచార్యులే దృష్టాంతము. (ఇంకను మండనమిశ్రుఁడు, వేదాంతి, యజ్ఞమూర్తి మున్నగువారు పలువురు కలరు).

అమతత్రయాచార్యులే ఈ మతాంతర బ్రాహ్మణబహిష్కారమును పాటించియున్నచో, జైనబౌద్ధాది విప్లవములలో క్షీణించి యడుఁగంటియున్న మన వైదికమత

* వాల్మీకియరామాయణము సమయమునకు దొరకనందున కంకంటి పాపరాజుగారి యుత్తరరామాయణమునుండి యీపద్యము గ్రహించితిని

♦ రుద్రాబ్జ......గనిరి, రుద్ర=శివుఁడు, అబ్జగర్భ=బ్రహ్మ, దినేంద్ర=సూర్యుఁడు, అబ్జ=చంద్రుఁడు, ముఖ=మొదలైన, అమరుల్ = దేవతలు, పవనభూ = ఆంజనేయుఁడు, భల్లూకరాట్=జాంబవంతుఁడు, భానుజ=సుగ్రీవుఁడు, అంగద=అంగదుఁడు, ముఖ్య=మొదలైన, అగచరవ్రముల్=వానరవ్రజములను, కనిరి=చూచిరి.

ములు నేటికిని వేరు సైతము లేకుండ నంతరింపవలసినవే కాని యింతటి యభివృద్ధి నొందియుండవు.

ఇట్లే త్రిమతముల నుపదేశించినవారును మోక్షప్రదులను ననిరుద్ధులు. ధ్రువధారపూర్వకముగ మన [illegible]భూమియందు సంస్కరించి ప్రతిష్ఠించినవారును జ్ఞానప్రదులను సంకర్షణుండు. కావున నిమ్మూడుమతములను పరస్పరవిరోధము గల్పించుట మహాపాపమగుట స్పష్టము.

కావున నో మతత్రయ పండితాచార్యులారా! ప్రస్తుతకాలవిశేషమును ననుసరించి యొకయింటనే పరస్పరవిరోధములు, ననూయలు, వంచనలు మెండుగుచున్నవి. కావున మనలో మనము దూషించుకొనుచున్నను, భూషించుకొనుచున్నను, మనమన మతాచార్యులగు శ్రీశంకర రామానుజ మధ్వాచార్యులయెడ నిక్కాలమాహాత్మ్యమును దూషణతత్పరుల ప్రయోగింపకుడు. మనలో మనకుగల యంతర్ద్వేషములచేత సాధించు ప్రజ్ఞావాదములచేతను, వ్యర్థకల్పనలచేతను, కుతర్కములచేతను, మొండియుక్తులచేతను వారిమాహాత్మ్యమును క్రిందుమీఁదులఁజేసి వారికి లేనిపోనికీర్తులను దగిలింపకుడు. ఇప్పటి కలిమహిమను నిప్పటివారివలనే పరిణమింప నట్లు కటాక్షింపుఁడు. రెండొకటికేని యిమ్మూఁడు మతములలో నెంటినడంచి యొకటిమాత్రము సుప్రతిష్ఠితము కానేరదు. ఈమూఁడింటి నొకటి యనత్యమైనదని యెడల నైకాత్రయత్వధర్మము చేతఁ జక్కని రెండుమతములు ననత్యములే కావలసివచ్చును! ఈమూఁడింటిని వేఱుసేయుటయును మనకు వశముకాదు. అవియును విడివడనేరవు.

ఇంకను మనము పరివర్తుల జరిగించి పరస్పరము ప్రబోధించుకొని ద్వేషాసూయాది మహాపిశాచముల దఱిమివేసికొని మనలో మనకైకమత్యము గలిగించుకొని మన కులాశ్రమమతాచారాదులను శ్రీ మతాచార్యుల యభిప్రాయముల ననుసరించి సుప్రతిష్ఠితములుగఁ జేసికొనుట కరము శ్రేయోదాయకతరము; భారతాభ్యుదయ పరమసోపానము.

శ్లో. జయతు భగవాన్ వేదాచార్యః
పురాణ పరమ స్స్వరాట్
జయతు జగతాం దివ్యం నేత్రం
త్వదోమఖిలం శ్రుతిః,
జయతు కరుణా సింధు స్సంక
ర్షణః పరమో గురుః
జయతు నితరాం ధర్మాధారా
ధరాఖిల భారతీ.
స్వస్తి శివమ్.

---

# పాంచాలీ మానసంరక్షణము

మోచర్ల రామకృష్ణయ్య గారు, బి. ఏ.

ద్యూతమునఁ దన్నుతొల్తనే యోడిపోయి-యంత నన్నోటు పడియెనో కుంతికొడుకు
మొదట నన్నోడి, యోడెనో పిదప దన్ను-నందియముఁదీర్పుడో సభాస్తారులార!

గీ. ధర్మవేత్తలు, రాజ్యతంత్రజ్ఞవరులు,-మునులు, వృద్ధులు, గురులు,భూభుజులు,బంధులు,
బాలిశులపోల్కి నిట్లు పేరోలగమునఁ-బలుకకున్నార లిదియేమి పాపమయ్య!

గీ. ఏకవస్త్ర—రజస్వల—ఈపడంతి-అంటఁగాఁ గూడ దనినైన నరయ కిటులు
బల్మిమై రచ్చ కీడ్చిన పాపఫలము-కట్టికుడుపక విడుచునే కౌరవులను?

ఉ. అక్కట! రాజసూయసవనావభృథాతిపవిత్ర కేశముల్
ముక్కడి దుస్ససేనుఁ డిటు ముప్పిరిఁజేకొని యీడ్చితెచ్చె న
న్నిక్కడి కిస్సిరో! యుచితమే, యిది క్షత్త్రియ వీరధర్మమే?
యిక్కరణిన్ జగంబున మహీశులొనర్చిరె యెన్నఁడేనియున్.

సీ. కులవృద్ధుఁడై, యుభయులపట్ల సమబుద్ధి వెలయింపఁదగినట్టి భీష్ముఁడైన,
తండ్రియై, బిడ్డలదౌష్ట్యంబు వారించి రక్షింపఁదగు ధృతరాష్ట్రుఁడైన,
ఆచార్యుఁడై, శిష్యులాచరించెడి యొగ్గుఁ దొలఁగింపఁ దగినట్టి ద్రోణుఁడైన,
ఒజ్జయై, తనఛాత్రు లొనరించు నీతప్పు సవరింపఁగల కృపాచార్యుఁడైన,
సకలధర్మరహస్య విశారదుండు-విదురుఁడైనను, మౌనంబు వదలి, ధార్త
రాష్ట్రులకు బుద్ధి సెప్పి, యార్తనగు నన్నుఁ-గావ రారేమి? యెట్టి దుష్కాల మకట!

మ. నను రక్షింపఁగఁ జాలుధీరుఁ డొకఁడైనన్ గానరాఁ డీనభః
వనజాతా! భువి దిక్కు లేనిజనులన్ బాలింపఁగా నేర్తు వీ
వని, యుష్మత్పద పంకజాతయుగమున్ ధ్యానింతు, నన్నీవిప
ద్వనరాశిన్ దరియింపఁ జేయుము, జగద్బంధూ! రమావల్లభా!

మ. నతసంత్రాణపరాయణా! సుజనచింతాధ్వంస! పాపక్రియా
రతులౌ కౌరవముఖ్యు లిత్తఱి మహాక్రౌర్యంబునన్ గర్వదు
ర్మతులై నా కిట మానభంగ మొనరింపన్ జూచుచున్నారు, నా
గతి నీవే! యభయం బొసంగుము రమాకాంతా మనోనాయకా!

ఉ. దీనజనావనుండవు, పతివ్రత నేను, పతుల్ స్వతంత్రతా
హీనులు, శాత్రవుల్ కరము హేయగుణుల్, సమయం బిదయ్యా, నా
మానధనంబు గావ, ననుమానముఁ బూనఁగ పాడియౌనొకో?
మానవతీలలామ లవమానము నోర్తురె మానమనోహరా!

ఉ. పుట్టితి నగ్నికుండమునఁ, బూజితపాండవ పంచకంబుఁ జే
పట్టితి; రాజసూయవిభవంబున దివ్యమహీవితాన సం
ఘట్టితరాట్కిరీట సువికాసితపాదసరోజనైతి, ని
ప్పట్టున నిట్టి ఘోరదురవస్థ ఘటిల్లెను గావు మాధవా!

చ. అనవరతంబు నీచెలియలైన సుభద్రనుబోలెఁ బ్రేముడిన్
ననుఁ గడుగారవించు కరుణామతి వీవు, మదాంధులైన దు
ర్జనములచేతఁ జిక్కితిని రక్షణసేయ కుపేక్షసేయఁగాఁ
జను నొకొ, వాసుదేవ! యనుజాతల కష్టము లన్న లోఁగనే?

మ. అని పాంచాలి ముకుందపాదకమలధ్యానైకవృత్తిన్ మనం
బును లీనం బొనరింప మాధవకృపాపూర్ణప్రభావంబునన్
జనులాశ్చర్య నిమగ్నులై నిలువ, నక్షయ్యాంశుక వ్రాతముల్
గనుపట్టెన్ గురురాట్సుముద్యమము భంగంబొందఁగా నయ్యెడన్.

క. కలదే ముజ్జగములలోఁ-దుల పాతివ్రత్యమునకు; దోషములెల్లన్
దొలఁగవె పతిదేవతలను-దలఁచిన, రవిదీప్తి ప్రేలు తమములభంగిన్.

బొంబాయిరాజధానియందలి రాగి, ఇత్తడి సామానులు—౧౯ శతాబ్దపు టుత్తరార్ధము



౭. బూలేశ్వరమునందలి కాశీ విశ్వేశ్వర దేవాలయద్వారమున గల ఇత్తడిగంటలు



౮. పూనాలో చేసిన ఇత్తడి నగలు

# బుద్ధభగవానుడు - శిష్యమండలి

శరణు రామస్వామిచౌదరి గారు

బుద్ధభగవానుని కాలమున నేటివలె పరిశ్రమ చేత అధర్మములు, అత్యాచారములు ప్రబలి యుండ లేదు. కాని రాజులలో రాజులు తగవులాడు కొని యుద్ధములు చేయుట, యొకరి రాజ్యము మఱి యొకరు లాగుకొనుట జరుగుచుండెను. యాగములయందు పశువుల బలియిచ్చుట ధర్మముగ దలంచుచుండిరి. ఇట్టి యత్రమములు చూచి సహింపలేకయే బుద్ధుడు ధర్మ ప్రచారమునకు గడంగెను.

బుద్ధభగవానుని ధర్మములు కేవలమందు చెప్పు యార్యధర్మములే కాని యన్యములు కావు. మోక్షమునకై ప్రాణము లర్పింపకయే సదాచారముల వలననే మానవుడు దున్నతపదవి పొందునని యామహా త్ముని నమ్మిక. పూర్వాశ్రమమున మిత్రులగు కౌండిన్య భద్రజిత్ బాష్ప మహానామ అశ్వజిత్ యోగీశ్వరుల చెంతకు వారణాసీనగరమునకు బుద్ధుడు వెడలుచుండ, మార్గమధ్యమున నుపాకుడను సన్న్యాసి కనబడి, తమ దేసాంప్రదాయమునకు చెందినవారని ప్రశ్నించెను. అందుకు భగవానుడు చిరునగవుతో, నేసాంప్రదాయ మునకు మానవుడను జాతి మత భేదములు లేక జ్ఞానినై సర్వదుఃఖములనుండి విముక్తుడ నగుటచే నాసాంప్రదా యమే నాది యని ప్రత్యుత్తర మొసంగెను. పైజెప్పిన మిత్రులను వారణాసికి సమీపమున మృగదావకతపోవన మునం గాంచెను. వారతనిని తమతో తపముచేయుచు మానివైచిన సన్న్యాసియని నిర్లక్ష్యముగాం జూచిరి. కాని వారు జాగరూకతతోం బరిశీలించి యామహానీ యుని తేజస్సు చూచి వినమ్రులై ప్రణమిల్లిరి. అప్పు డాయన యీక్రింది యెనిమిదినిబంధనలను జెప్పెను.—

౧. యథార్థజ్ఞానము; ౨. మంచికార్యమునందు దృఢనిశ్చయము; ౩. ఉచితమగు మాటలాడుట; ౪. మంచి పనిచేయుట; ౫. ఉచితసాధనము చేయుట; ౬. ఉచిత పరిశ్రమ; ౭. ఉచితవిషయవిచారము; ౮. చిత్తశాంతి కలిగి యుండవలయును. వీనినే ఆర్యఅష్టాంగికమార్గ మని చెప్పుదురు.

తరువాత బుద్ధభగవానుడు జన్మ జరా వ్యాధి మరణములు, అప్రియసంయోగము, ప్రియవియోగము నను నాలుగు దుఃఖకారణములనియు, నాదుఃఖమునుండి విముక్తిపడయుట కార్యఅష్టాంగిక మార్గావలంబింపవలయు నని యును చెప్పెను.

మఱియు భగవానుడు 'ఆర్యప్రమేయము' లను నీక్రిందివిషయ బోధించెను: ౧. దుఃఖము హేయము; ౨. అజ్ఞానము హేయకారణము; ౩. దుఃఖనిరోధము; ౪. దుఃఖనిరోధకారిణి.

ఈయుపదేశరత్నములు విని సంతుష్టులై పైయైదు గురు సాధువులు భగవానుని శిష్యులైరి. ఈయుపదేశ ములను "ధర్మచక్రవర్తన్" అని యందురు.

భగవానుడు వారణాసినుండి గయకు వెడలి బ్రాహ్మణోత్తములగు నురువేలాకాశ్యప, నదీకాశ్యప, గయాకాశ్యపు లనుమువ్వురికి దీక్ష నొసంగెను. వీరిని దీక్ష నొసంగకుండ చేయవలయు నని బ్రాహ్మణులు యత్నించి, విఫలులైరి. అక్కడనుండి ఆయన గయా శీర్ష పర్వతమునకు జనెను. అక్కడ తపోనిష్ఠాగరిష్ఠు లగు వేయిమందికి ధర్మోపదేశము కావించి, శిష్యమండ లిలోం జేర్చుకొనెను. అక్కడనుండియు త్తరభారతవర్ష మున ప్రఖ్యాతిగాంచిన బింబిసారుని చెంతకు రాజగృహ నగరము వెడలెను. ధర్మోపదేశము గావించెను. బుద్ధ భగవానుడు సర్వత్యాగియై పోవునప్పుడు బింబిసారుడు మరల రాజ్యసుఖములం బడయంజేయుటకై ప్రయత్నిం చి, విఫలుండైనందున తానే భగవానుని భక్తుడాయెను.

రాజగృహనగరసమీపమున సంజయుఁడనుపరివ్రాజకుఁడు గలఁడు. వానికి 250 మంది శిష్యులు గలరు. అందు సారీపుత్ర, మాద్గలాయన్ అను నిద్దఱు బ్రాహ్మణులు గలరు. వీరిద్దరు మోక్షమార్గము మఱం దెవరికిఁ దెలిసినను, రెండవవారికిఁ దెలుపుటకు నిశ్చయించుకొనిరి. భగవానుని శిష్యుఁడు అశ్వజిత్ భిక్షాటనకై రాఁగా, సారీపుత్రుఁ డీక్రిందివిధమునఁ బ్రశ్నించెను:—

సా. పు.—ఆర్యా! తమ దివ్యతేజోవదనముఁ జూచి నా కానందము గల్గుచున్నది. తమగురువు లెవరు? ధర్మము లెట్టివి?

అ.—శాక్యవంశజగౌతమబుద్ధుఁడు మాగురువు. ఆయన ధర్మములే మాధర్మములు.

సా. పు.—తమ ధర్మసిద్ధాంతము లేవి?
అపుడశ్వజి త్తీక్రిందిశ్లోకమును పఠించెను:

"శ్లో. యే ధమ్మా హేతుప్పభవా
హేతుం తేసాం తథాగతో,
తేసాంచ యో నిరోధో ఏవం
వాదీ మహాసమణో."

భావము:—సమస్తవస్తువులు నేకారణముచే నుత్పన్నమైనవో, సకల నేకారణముచే నాశమగుచున్నవో, యాకారణములను భగవానుఁడు మాకుఁ జెప్పెను.

ఈశ్లోకమును వినినతరువాత సారీపుత్రుఁడు తన మిత్రుఁడగు మాద్గలాయనునితోను, మఱికొందఱు మిత్రులతోను గలసి, భగవానుని దర్శనమునకై వెడలి తమ మనోభీష్టమును దెలియఁజేసిరి. భగవానుఁ డీక్రిందిశ్లోకము నుపదేశించి వారిని శిష్యులనుగాఁ జేసికొనెను:

"శ్లో. సర్వపాపస్స అకరణం
కుసలస్స ఉపసంపదా,
సచిత్త పరియోదపనం
ఏతం బుద్ధానసాసనం."

భావము:—చిత్తశుద్ధి కలిగి, యేవిధమైన పాపకార్యములు చేయక, కల్యాణకరమైన కార్యములు చేయుటయే బుద్ధుని ధర్మము.

సారీపుత్రుఁడు, మాద్గలాయన్ బుద్ధుని శిష్యబృందములో ముఖ్యులైరి. భగవానుని శిష్యుఁడగు దేవదత్తుఁడు గురుద్రోహి యాయెను. వీనిని పరిశీలించుటకు పైయిరువురిని భగవానుఁడు నియోగించెను. ఇది తెలిసి దేవదత్తుని మిత్రులు వీరిని చంపుటకు ప్రయత్ని[illegible]చుండఁగను అజాతశత్రుఁడు వారిఁబట్టి ద్రోహులను శిక్షించెను. ఆరాజు వారి వాసమునకు వచ్చి, 'వీరు ప్రతిష్ఠావంతుల రగు యోగులుగదా! ఈహత్య తప్పించుకొనలేరా?' యని ప్రశ్నించెను. దానికి మాద్గలాయన్ 'రాజా! యిది లెక్కగాదు. తప్పించుకొనఁగలను. కాని దానికై శ్రమ తీసికొనఁ దలఁప లేదు. ఎందువల్ల నన, నాపూర్వకర్మానుసారము ఇంకొక వారములోపలలోనే నీదేహమును వదలవలసియున్నది' అనెను. ఆవిధముగనే యతఁడు వారముదినములలో దేహమును బాసెను. సారీపుత్రుఁడు మిత్రుఁడు పోయెనుగదా యని తాను గూడ దేహమును వదలెను. ఇతఁడు నలందయందుండెడివాఁడు. వీరిని భగవానుఁ డగ్రశ్రావకులని పిలుచుచుండెడివాఁడు.

ఒకమారు ధర్మప్రచారము చేయుటకై భగవానుఁడు తన జన్మభూమి యగు కపిలవస్తునగర మరుదెంచెను. పుత్రునకు స్వాగత మొసంగుటకై శుద్ధోదనచక్రవర్తి యుత్సాహవంతుఁడై వెడలెను. భిక్షాపాత్ర గైకొని వచ్చు కుమారునిఁ జూచి లజ్జితుఁడై సక్రోధముగ, "వత్సా! మన రాజకులమునకు కలంకము తెచ్చితివే! నీవు నీశిష్యుల కన్నమిడ లేకయా, భిక్షాపాత్రము గైకొంటివి?" అనెను.

బుద్ధుఁడు, "మహారాజా! మా కులధర్మ మిది" యనెను. ఇది విని రాజు మిక్కిలి విచారపడెను. బుద్ధభగవానుఁ డప్పుడు, తండ్రితో, 'పుత్రులు సంపాదించిన ధనములో విలువగల రత్నములు తండ్రికి సమర్పించుట మర్యాద కావున దయతో నీకెంగు రత్నములు గ్రహింప వేఁడెద' నని యీక్రిందిశ్లోకములను జదివెను:

శ్లో. ఉత్తిష్ఠేన పమజ్జేయ్య
ధమ్మం సుచరితం చరే,

ధమ్మచారీ సుఖం సేతి
అస్మిం లోకే పరంహి చ.

శ్లో. ధమ్మం చరే సుచరితం
న తం దుచ్చరితం చరే,
ధమ్మచారీ సుఖం సేతి
అస్మిం లోకే పరంహి చ.

భావము:—జాగ్రత్తగా నుండుము. సోమరిగా నుండకుము. సద్ధర్మము నాచరింపుము. ధర్మాచరణులు ఇహపరలోకముల సుఖించెదరు.

శుద్ధోదనచక్రవర్తి యీశ్లోకములు విని సంతసించి, పుత్రుని రాజభవనమునకు తీసికొనిపోయెను. భగవానుని దర్శనార్థమై యందఱును వచ్చిరి. కాని తన ప్రియభార్య యగు యశోధరాదేవిమాత్రము రాలేదు. తానే యామెను జూచి నిశ్చయించుకొని, తండ్రియాజ్ఞ గైకొని, తనశయనమందిరమునకుఁ జనెను. ఆదేవి యచ్చట మలినవసనములతో కృశించి పడియుండెను. వియోగము దుస్సహము గదా! బుద్ధుఁ డామెకు ధర్మోపదేశము గావించి, శాంతింపఁజేసి, నగరము వెలుపలకు తనశిష్యబృందముతో వెడలిపోయెను. యశోధరాదేవి తనపుత్రుఁడగు రాహులునిఁ బిలిచి, 'మనపట్టణబహిర్భాగమున నొకసన్న్యాసి గలఁడు. ఆయన నీజనకుఁడు. ఆతనికడకు వెడలి పూర్వోపార్జితధనమునుండి నీవగ భాగమును గైకొమ్ము' మని చెప్పెను. మాతృదేవి యాజ్ఞానువర్తియై యని, రాహులుఁడు జనకుని తనభాగ మడిగెను. బుద్ధభగవానుఁడు తనశిష్యుఁడగు సారీపుత్రునితో 'వీనికి సన్న్యాస మిమ్ము' అని చెప్పెను. ఆతఁడు గురువునాజ్ఞను నెరవేర్చెను. రాహులుఁడుమైలను ప్రసిద్ధిగాంచిన శిష్యులలో నొకఁడాయెను.

ఇదియంతయు తెలిసి శుద్ధోదనుఁడు మిక్కిలి విచారపడి, పుత్రునిచెంత కరిగి, యికముందెన్నఁడు తల్లిదండ్రుల యాజ్ఞలేనిది బాలురకు సన్న్యాస మిప్పింపవని వాగ్దానము తీసికొనెను.

కోసలదేశమునకు రాజును, బింబిసారునకు బావమఱఁదియు నగు ప్రసేనజిత్ తక్షశిలావిశ్వవిద్యాలయమున విద్య నభ్యసించెను. బుద్ధభగవానుని యుపదేశము లతిభక్తిశ్రద్ధలతో నాలకించుచుండెడివాఁడు. మహోపదేశ ఫలితముగ తానును, తనసోదరియు దీక్షను గైకొనిరి. ప్రతిదినము నైదువందల బౌద్ధసన్న్యాసులకు భోజన మిడుచుండెను. కాని వారు సంతృప్తులు గారైరి. ఇది తెలిసికొని యారాజొకనాఁడు, 'ఓసన్న్యాసులారా! దరిద్రు లొసఁగు సామాన్యభోజనమునకే సంతుష్టులగు మీరు నే నొసఁగు విలువగల భోజనమునకు తుష్టులు గారేల?' అని ప్రశ్నింప, వారు, 'అతిభక్తితో నొసంగు భోజనము గాన నతిస్వాదిష్టముగా నుండును.' అని ప్రత్యుత్తర మొసఁగిరి. ప్రసేనజిత్తు నాఁటినుండియు భక్తిశ్రద్ధలతో భోజన మొసఁగుచుండెను. వీనికుటుంబమున జన్మించిన మల్లిక యను సుందరబాలిక నారాజు వివాహమాడెను. ఈమెయు బౌద్ధధర్మముల నతిశ్రద్ధతో పాలించెను. బింబిసారుని బంధువగు జీవకుఁడనురాజు కూడ తక్షశిలావిశ్వవిద్యాలయమున నాత్రేయాచార్యుని దగ్గర ఆయుర్వేదము నభ్యసించెను. విద్యాపరిపూర్తి యైనతరువాత నాత్రేయుఁడు, 'మనవిద్యాలయపరిసరముల పదునారు (౧౬) మైళ్లలో నిరుపయోగమైన మూలిక నొకదానిని తీసికొని రమ్మని శిష్యున కాజ్ఞాపించెను. జీవకుఁడు తిరిగితిరిగి వేసారి యనుపయోగమైన మూలిక దొరకలేదని రిక్తహస్తములతో తిరిగి వచ్చెను. ఇది చూచి గురువు సంతసించి విద్యాపరిపూర్తి యైనదని చెప్పెను. ఆతఁడును బౌద్ధధర్మముల స్వీకరించి ప్రసిద్ధివడసెను. భగవానుఁ డీయనను ప్రేమించుచుండెడివాఁడు. ఈయన వైద్యమున నసాధారణప్రజ్ఞ గాంచెను. ఈతని యనుపమకీర్తి విని బింబిసారుఁడు తన దర్బారునం దితనిని రాజవైద్యునిఁగాఁ జేసికొనెను.

అజాతశత్రుఁ డనురాజు ఒకనాఁడు రాచకార్యముల నిర్వర్తించి, విసివి, సాయంకాలమున విశ్రామమునకై యుద్యానవనమునకు వెళ్లెను. ఇతఁడు వెళ్లిన కతిపయనిమేషములకే భానుఁ డస్తమించెను. నాఁడు పూర్ణిమయగుటఁ రాకానిశాకరుఁ డుదయగిరి నధిరోహించి తన యమృతకిరణముల ప్రకృతి నలంకరింపఁజేయుచుండెను. కుముదములు వికాసభాసురము లయ్యెను. పుష్పపరిమళమును వహించి గంధవహుఁడు మందమందముగ వీచుచు, సుఖస్పర్శనము గావించుచుండెను. కాని దుష్కృత్యములకు రాచకార్యములచే మనము కుందుటచే నజాతశత్రుఁ డానందింప లేకపోయెను. ఆనాఁ

ఉన్నట్లు జీవము నుండుట కటాక్షించెను. అతఁ డాతని బాధ చూచి బుద్ధునిమహిమ వర్ణించి, వెంటనే భగవానుని దర్శనము చేసికొనిన, శాంతి నొందగలవని చెప్పెను. ఆరాజు వెంటనే భగవానుని దర్శించి, కృతార్థుఁడై, యుపదేశవాక్యరత్నముల విని, శిష్యుఁ డాయెను. రాజవైద్యుఁడగు జీవకుఁడు కూడ, కుష్ఠరోగములకు సైతము చికిత్స చేయుచుండెను. ధనవంతులు వైద్యలాభమును పొంది ధన మపారముగ నొసంగుచుండెడివారు. ఆధనమంతయు నాతఁడు బౌద్ధసంఘములకే యొసంగుచుండెను. బౌద్ధసన్న్యాసుల కతిజాగరూకతతో చికిత్స చేయుచుండెడివాఁడు.

బుద్ధభగవానుని యుపదేశముల విని శ్రావస్తీనగరవాసియు, లక్ష్మీపుత్రుఁడును, వైశ్యకులసంజాతుఁడు నగు అనాథపిండకశ్రేష్ఠికూడ శిష్యమండలిలోఁ జేరెను. నగరసమీపమున ౧౮ కోట్లరూప్యముల విలువగల సుందరోద్యానవనమును కొని భగవానుని కొసంగెను. అందు సుందరమగు విహారమును భగవానునికొఱకు నిర్మింపఁజేసెను. సన్న్యాసులకొఱకుకూడ పెక్కు నిర్మింపఁజేసెను. ఇచ్చట భగవానుఁడు పలుమారులు శిష్యుల కుపదేశించెను. అనాథపిండకశ్రేష్ఠి కొమారితలు మహాసుభద్ర, చులసుభద్ర యనువారుకూడ బౌద్ధసన్న్యాసినులై మతప్రచారము గావించిరి.

పూర్ణుఁడను మఱియొక వ్యాపారి సురాపరాంతదేశమునుండి శ్రావస్తీనగరమునకు వ్యాపారమునిమిత్తము వచ్చి, భగవానుని యుపదేశములను విని ధర్మదీక్ష గైకొనెను. కొన్ని దినముల యనంతరము అతఁడు తనదేశమునకు మతప్రచారమునకై వెడల నుత్సహింపఁగా భగవానుఁ డీవిధమున ప్రశ్నించెను:

బు.—వత్సా! నీవు మతప్రచారమునకై వెడలినప్పుడు నీదేశజులు నిన్ను, నీమతమును నిందించి బాధించెదరు. అప్పు డేమి చేయుదువు?

పూర్ణుఁడు—నే నేమియు వారిని నిందింపను.

బు.—నిన్ను వారు వధించుటకు వచ్చిన?

పూర్ణుఁడు—నే నేమియు వారి ననక, యీ ప్రపంచమునఁ గల త్రివిధతాపములనుండి విముక్తిఁ జెందిన దేహము నానందముతో విడిచెదను.

వాని ప్రత్యుత్తరములకు భగవానుఁడు సంతసించి ధర్మమతప్రచారమున కట్టిదృఢసంకల్పులే యర్హులని వాని నాశీర్వదించి ప్రచారమునకై పంపెను.

శాక్యవంశజుఁడగు నానందుఁడుగూడ శిష్యమండలిలోఁ గలఁడు. భగవానుఁ డీతనిని మిక్కిలి ప్రేమించుచుండెడివాఁడు. అతఁ డెల్లప్పుడును భగవానుని చెంతనే యుండెడివాఁడు. భగవానుఁడు, బౌద్ధసంఘవిషయము లెల్ల నీతనితో నాలోచించియే చేయుచుండెడివాఁడు. ఎట్టిరహస్యములైనను నీతనికి తెలియవలసినదే. బుద్ధనిర్వాణానంతరము ఎట్టి కఠినధర్మశాస్త్రప్రశ్నలు వచ్చినను ఈతఁడే సమర్థించుచుండెడివాఁడు.

వీరేకాక యింకను పెక్కురు భగవానుని శిష్యమండలిలో ముఖ్యులు గలరు. శిష్యమండలిలో సకలజాతులవారుఁ గలరు. సారీపుత్ర, మౌద్గలాయన్, కాత్యాయన మొదలుగాఁగల బ్రాహ్మణోత్తములును, [illegible]దుఁడు, రాహులుఁడు, అనిరుద్ధుఁడు మున్నగు క్షత్రియవంశజాతులును, అనాథపిండకశ్రేష్ఠి, పూర్ణుఁడు మున్నగు వైశ్యులును గలరు. వీరుగాక క్రిందిజాతులవారును గలరు, సునీతుఁ డనుమాలవాఁడు, అంగులీమాలుఁ డనునొంగజాతివాఁడు, స్వాతి యను పల్లెవాఁడును, నందుఁడను గొల్లవాఁడును, ఉపాలుఁడను మంగలియు వీరిశిష్యమండలిలోఁ గలరు.

బుద్ధునిశిష్యులలో రెండుతెగలవారు గలరు. అందొకతెగవారు గృహస్థాశ్రమమును వీడి సన్న్యాసులై దేశాటనము గావించి మతప్రచారము గావించువారు. మఱియొకతెగవారు గృహస్థాశ్రమమును వీడక మతధర్మముల పాలించువారు.

సోదరులారా! దీని ననుసరించి బౌద్ధమత మెంత చక్కని నిబంధనలతో వ్యాపించినదియు తెలియుచున్నది. ఇట్లు మంచినిబంధనలతో పలుసంఘములు బయలువెడలి, దేశమున కావశ్యకమగు పెక్కుసమస్యలలో పాల్గొనిన స్వాతంత్ర్యమబ్బుట యెంతయు సులభముగదా!

# బువ్వపెట్టు పుట్టింటిసాధ్వి

విద్వాన్ వారణాశి సూర్యనారాయణశాస్త్రిగారు

ఆవు లింటికి వచ్చెడి నవిగో! చూడు!
బల్లిత్రువ్వాయి తనతల్లి పొదుఁగువంక
నట్టు సాఁచుచున్నది కట్టుకట్టనుండి
బువ్వ తిను! చిట్టితండ్రి! రా! ప్రొద్దుపోయె.

పాలు మీఁగడ వెన్నయుఁ బండు లింక
నన్ని తెచ్చితి నీ వెండిగిన్నెఁ బెట్టి;
వేగఁ దినివెల్లి దోబూచి పెట్టుచుంటి;
నాడుకొనవచ్చుఁ బాపాయితోడఁ బిదప.

నీవు తినుచుండునందాఁక నీకుఁ దోడు
కూరుచుండును మనపాప కూడ లెమ్ము!
తండ్రి! కడుపేడ్చుచున్నది తడయఁబోకు;
పెదవి నడలింపు గోరుండఁ బెట్టుదాన.

"రాను నే నప్పుడే రాను రా"నటంచుఁ
గ్రిందఁబడనమ్మఁ బట్టి యుబ్బించెదేల?
బూచి వచ్చెడివేళ కాఁబోవు నన్న
దేది నీజాగిలము? దానిమీఁదఁ బడుమ-?

అదిగదిగో! చూడు! ఖగపంక్తి యాకసమునఁ
…చుఁ బసిమేఁతముక్కులఁ గఱచిపట్టి;
ఇదిగిదిగో! విను! బిడిపిల్ల లెక్కములను
జెప్పుచున్నారు గొంతులు చించుకొనుచు.

నెమ్మదిగ వచ్చి యదె సందెగుమ్మ మూడ్చి
పాపి వెలిఁగించుచున్నది దీప మపుడె
చేతులారంగ నాతండ్రి! జేజేపెట్టి
పాడుమేది! "దీపంజ్యోతి" వచ్చు?—నీకు.

అగ్నిహోత్రాలకై సోమయాజిగారి
కవ్వ యందిచ్చుచున్న దాజ్యాదికంబు;
సంధ్య వారిచి దేవదర్శనము చేయ
నరుగుచున్నాఁడు, చూడు! విద్యార్థి గుడికి.

అయిన దీకొంచెమే! తిను! మల్లు చూడు!
కోటు తొడిగెను నీతాయికొడుకు; నీవు-
తొడిగికొందువా? పాపాయి నడుగు! దాని
కున్నదా? పాప మెఱవు నీ వొక్కటీవు?—

కోటు టోపియు రంగులగొడుగు నీకుఁ
గావలయునయ్య! తిను మిది క్షణములోన
అన్ని తెత్తురు రేపు సాయంత్రమునకు;
కొన్నవే యున్న వింట మీనాన్నగారు.

* * * *

అప్పు డాసాధ్వి విశదగండాంతరాళ
ఫుల్లపులకాంకురము చల్లనందునుండి (?)
తొంగిచూచి కృతార్థుఁడై తొవలఱేఁడు
నిర్భరానందచంద్రికల్ నెఱపఁదొడఁగె.

# కుశద్వీపము (ఆఫ్రికా)

రాజా వాసిరెడ్డి శ్రీదుర్గా సదాశివేశ్వర ప్రసాద్ బహాదూర్ గారు

శ్రీయుత చౌదరీ ధనరాజసింహా బి. ఏ. గారు మనోరమ యను హిందీమాసపత్రికలో ఈవ్యాసము వ్రాసినారు. భారతీయు లానాడుపార్జించిన భూగోళ చారిత్రిక పరిజ్ఞానముల నిది తెలుపుచున్నది. ఐతే ఆఫ్రికాలో ప్రాచీన భారతీయు లడుగుపెట్టిరా అని సందేహించు వారును గలరు. సందేహ మేలనో తెలియదు. అమెరికా, జావా, బోర్నియో, సుమత్ర, సింహళము మొదలగు దేశములలో యీనడుమ దొరికిన గుళ్లు, గోపురములు, చిత్రములు ప్రాచీన మతసాంప్రదాయములు భారతీయు లాప్రదేశములలో సంచరించి రనుటకు నిదర్శనములుగా నున్నవి. ఆఫ్రికాలోని ఈజిప్టు మనవారికి పరిచితమైనదే అనుట కక్కడ లభించిన బుద్ధవిగ్రహములే నిదర్శనములు. బౌద్ధజాతకకథలలో నదరద్వీపయాత్రా వదానమందు వర్ణింపబడిన "ఎర్రసముద్రము, నల్లసముద్రమును" ఈఆఫ్రికా ఖండమందలివే. వాస్కోడిగామాను భారతీయనావికులు మాల్దీవియా దీవులయొద్ద కలిసికొనినారు. ఆఫ్రికాకు చేరువనున్న యీదీవుల నెరిగిన వారు ఆఫ్రికా నెరుగరనజాలము. ఇంతేకాక ఆఫ్రికాకు మొదట వలసవచ్చినవారు భారతీయులే యనుట సునిశ్చితమైన మాటయేకదా. కాని అంతకుముందు మరికొంతకాలమునుండియు భారతీయుల కది పరిచితమైనదనుటలో విపరీతమేమియు లేదు. ఈ వ్యాసరచయిత చూపించినవేకాక జంబుముకళగునామములు మరికొన్ని భారతీయ సాంప్రదాయములు సూచించునవి ఆఫ్రికాలో నున్నవి.

కుశద్వీపము ఆఫ్రికాయని టాండను గారుతలంచుచున్నారు. ఈ దేశపు ప్రాచీనసభ్యతయందలి భారతీయ సాంప్రదాయములను, పూర్వమీ దేశము[1] నేలిన భారతీయరాజులను ఈతడు చూపినాడు.[2] "యుథియోపియన్సు" (Etheopians) లేక కెప్యోట్సు (Capyots) లోకూడా భారతీయ చిహ్నము లున్నవని తలచుచున్నారు[3]. కపిమహారాజు ప్రఖ్యాత

---

1. కుశద్వీప or Etheopia (Eritrea.) Todd's Rajasthan, 472.

2. ............... assigns the reason of amenophis as the epoch of the colonisation of Ethopia from India. Discoveries, P. 180 and Todd's Rajastan, P. 522.

3. Etheopians were of Indian origin. Todd's Rajastan, 52.

డయిన భారతీయప్రభువు[1]. కపోతుడనుబ్రాహ్మణుడు ఈశనివంశజుడే[2]. ఎరిట్రియా అనునది మిశ్రదేశమం దొక ప్రదేశము. ఎరిట్రియా (Eritrea) అనగా సూర్యుడు. సూర్యునకు ఆదిత్యుడనుపదము ప్రసిద్ధమేకదా; సూర్యుని పేర బరగిన పట్టణమే ఎరిట్రియా అనబడెను. అసురపతియైన ప్రహ్లాదునిపట్టణము పేరుకూడ ఆదిత్యపురమే. కాన ప్రహ్లాదుని పట్టణము ఈఎరిట్రియాయే కావచ్చును[3]. ఎరిట్రియాకు పైన ఖరతూం (అసురుల)స్థానము కలదు[4].

ఎరిట్రియాకు దిగువ అబిసినియా (Abyssinia)అను ప్రదేశము కలదు. Abyssinia అబిసినియా అనగా పాతాళము. టాండ్ నుగారు ఇదియే మైరావణునిలంకయని చెప్పుచున్నారు[5].

అబిసినియాలోనళినీ(Blue Nile)నది యున్నది.

బ్రహ్మరాక్షసుల నివాసస్థానము[6] నళినీనదీతీరమని మత్స్యపురాణములో చెప్పబడియున్నది.

మైరావణుడు బ్రహ్మరాక్షసుడే కదా. కాన యితడు అబిసినియాలోని[7] నళినీనదిప్రాంతముల నున్నవాడనుట పొసగియుండును. అబిసినియా మధ్యప్రదేశమున "తక్" అను దుర్గమొకటి కలదు. దీనిపూర్వతీరమున మూడుదుర్గము లున్నవి. వానిలో నొకదానిపేరు "రాజ్ దశాన్", (Raj Dasan) దశాననము.[8]

ఈ మూడుగిరులు కలసి త్రికూటము లనబడుచున్నవి. అబిసినియా మధ్యప్రదేశమునకు మూడుప్రక్కల నీగిరులును, నాల్గవ వైపున నళినీనదియు వ్యాపించియున్నవి. అబిసీనియాకు తూర్పున సుమాలిల్యాండు (Somaliland) అను ప్రదేశ మున్నది. మైరావణుని పితామహుడైన సుమాలిపేర ఇది వెలసినది. సుమాలిదేశమునకు నెత్తిన బర్బరమను (Barber) వానరుల దేశ మున్నది. [9] ఖరునిసోదరుడైన వానరుడు (బర్బరుడు) దీనికి నేత. బర్బర సమీపమున బాబుల్ మండల మున్నది. లంకకు సమీపమున మైనాక మున్నది. [10]

---

1. పుష్కరుడను లేక త్ర్యంబకుడను అనువాడు మహావీర మహారాజు కుమారుడు.

2. Capyot, కపోత (విష్ణుపురాణములో చంద్రవంశవర్ణన చూడుడు.) శివికి ప్రసక్తించిన కపోతుడు వీరోవి.

3. Erit (ఎరిట్ and Eraj ఎరిజ్ =Sura)Todd'sRajastan.H.P.Vol.I)Erie సూర్యుడు).

4. Cunnigham, Vol. V-see Multana or Adityanagar.

5. జైన ఇతిహాసములలో చెప్పబడిన పాతాళపులంక రామాయణములోని రావణుని లంకకంటె పెద్దదిగా వర్ణింపబడుచున్నది. దీనివలన లంకలు రెండున్నవని తెలియుచున్నది.

6. మత్స్యపురాణము అ. 1 "శ్లో. 20 తతస్తు నళినీచాపి ప్రాచీమేవ దిశాం యయౌ."
తత్రాగస్త్యైకః పరివృతా విస్తద్భి ర్బ్రహ్మరాక్షసైః.

7. Atlas "Bartholomeao", P. 26.

8. జైనఇతిహాసము చూడుడు.

9. ఖరునిసోదరుడు వానరు డనువా డున్నాడనుటకు కాని, వానరుడనగా బర్బరుడనుటకుగాని ఆధారము లేదియో నాకు తెలియకున్నవి.

10. సముద్రవచనము వినిమైనాకము లేచెను.

మైనాకము శాక ద్వీపమునకు సంబంధించిన సగర రాజము. శాకద్వీప (Arabia), కుశ ద్వీప (Africa) ములు [1]బాబల్ ద్వీపము వరకు వ్యాపించి యున్నవి. సుమాలిదేశము (Somaliland) నకు ఆగ్నేయ దిక్కున మాల్డివియా అయి లాండు (Maldavia Ielands), అను మాలద్వీపములు గలవు. మాలి సుమాలి సోదరుడు. ఈమాల ద్వీపమతనిపేర వెలసినది. వీరి సోదరుడు విద్యున్మాలి యింకొక డున్నాడు.[2] వీనిపేర విద్యుత్ అను ప్రదేశ మొకటి వెలసినది.[2] అది యిప్పుడు బదూన్ అని పిలువబడు చున్నది. సుమాలిదేశమున కడుగున మలింద మను ప్రదేశము కలదు. వాస్కోడిగామా (Vascodigama) కు నాలుగుభారతీయనావలు చిక్కినప్రదేశ మిదియే. నావికులలో నొకడు వాస్కోడిగామానుభారతీయవర్షమందలి మల బారుతీరమునకు తీసుకొనివచ్చెను[4]. ఈమలింద మునకు దిగువ మాండేటు అను ప్రదేశములు మూడున్నవి. అవి ఆఫ్రికాలో ఆగ్నేయము నుండి నైరృతిదిశవరకు ఇప్పటికిని వ్యాపించి యున్నవి.

మూడవ మాండేటునకు సమీపములో Ambrez అను ప్రదేశ మున్నది. మాంధాత మహీపాలుడు సప్తద్వీపములను ఏకచ్ఛత్రాధిపత్యముతో పాలించినాడని పురాణములు చెప్పుచున్నవి. బౌద్ధజాతకకథలుకూడ ఇట్లు చెప్పుచున్నవి. ఇట్టి దిగ్విజేతయొక్క రాజ్య[ము] ఈ Mandate వరకు వ్యాపించెననుట యందాశ్చర్య మేమున్నది. ఇతనిపేరనే మాండేటు వెలసియుండును.

ఈమాంధాత కుమారుడైన అంబరీషుని పేరుతో (Ambrez) అంబ్రజ్ అను ప్రదేశము నెలకొలుపబడియుండును. అంబరీషుడు క్షత్రియులలోనుండి బ్రాహ్మణుడుగా మారినాడు.[5] కుశద్వీపములో అంబరీషుని సంతతివారయిన బ్రాహ్మణు లానాడు దర్ములు, ద్రుములు అన బడుచుండిరి.[6]

(Ambrez) అంబ్రజ్ సమీపమున ఇప్పుడు (Dome) డోమ్ అనబడుచున్న ప్రదేశము ఆనాడు ఈ దర్మబ్రాహ్మణుల దేశమై యుండును. శతపథబ్రాహ్మణములో అత్యరాతి చక్రవర్తులలో నొకడుగా చెప్పబడినాడు. ఇంతే కాక యితడు జానంతపతి యని అందే వర్ణింప బడినాడు. జానంతపతి యనగా ప్రజ లెంతవర కుందురో అంతమేరను తనసామ్రాజ్యమును స్థాపించినవా డని అర్థమట. అత్యరాతిసోద

1. మత్స్యపురాణం, 121 అ. 25 శ్లో. "అంబికే యస్య మైనాకం తేనుకం చైవ శత్ స్మృతమ్, తదేవ[illegible] మిత్యుక్తం సర్వం విభ్రాజసంజ్ఞితం."
2 శైవపురాణములలో మాలి, సుమాలి, విద్యున్మాలి-విద్యున్మాల్యవాన్-అని ముగ్గురన్నదమ్ములు చెప్పబడినారు.
3. Bedouins, H. P, Vol. II.
4. Index, High Ways of the World.
5. వాయుపురాణము, రెండవ ఖండము, 20-అ.6.
6. విష్ణుపురాణము, అ. 2. అ. 4.

రుడు ఉరుడు. ఉరునికొడుకు అంగిరస్సు[1]. ఇబ్రహీమును బాబిలోనియాలోనుండి వెడలగొట్టి ఆదేశమును స్వాధీనపరచుకొన్నవాడు (Mr. Enger)[2] ఉరునికొడుకైన అంగిరసుడే. ఆఫ్రికాలోని (Angra Pequenna) అంగ్రా పెక్వెన్నా ప్రదేశమును, ఏంగోలు (Angolu) ప్రదేశమును అంగిరసుని విజయస్మారకచిహ్నములు.

ఆఫ్రికాలోని రివోడివోరో (Reodeoro) లేక (Oren) ఓరన్ అను ప్రదేశము అంగిరసుని తండ్రిఅయిన ఉరునిపేరిటిది.

Ambrez, Mandate ల యొద్ద నున్న గాంబియా, సెనేగల్ నదులయందు గల తాంబకుడం మొదలైన పేర్లుగల స్థలములు భారతీయుల క్షేత్రములపేర్లను తలపునకు తెచ్చుట లేదా?[3]

ఆఫ్రికాలో ఇప్పుడు (Sudan) సూడాన్ అనబడు ప్రదేశము పూర్వము శివదానము అనబడునది. ఇది హిరణ్యాక్షుని పుత్రుడును, ఖరవంశీయుడు నైన శివునిపేరుతో నెలకొన్నది[2].

ఇది ఖరదేశమునకు సమీపమందే యున్నది.

ఈశివదాన దేశముకూడ తొలుత రాక్షసదేశమే. కొంతకాలమున కిది మిశ్రదేశముగా మారినది. దీనికీపేరు మిశ్రబ్రాహ్మణుల వలన వచ్చినది.[5] Capyots, Ethiopians అనువారు మిశ్రబ్రాహ్మణులు[6]. వారలీదేశమున మహీదేవ (Priest Kings) అనగా మతాధికారమును, గవర్నరును బోలిన రాజాధికారమును కలిగియుండిరి. వీరి తరువాత ఈ దేశమునకు జాంటు (Gypsies) లు అనువారివలన ఇజిప్టు (Egypt)అనుపేరు వచ్చెను. ఇరానాలోని జాటా (Jatah) ప్రదేశమువలన వారు జాంటు లనబడిరి[7].

మిశ్రదేశమునకుపైన డమ (Damitter) 'దమిత్ర'="విష్ణు" పుర మున్నది[8]. మిశ్రదేశమునకు పశ్చిమమున ట్రిపోలి దేశముగలదు. ఇదియే పూర్వము త్రిపుర దేశ మనబరగినది. ఇదియేశివుని త్రిపురవిజయమునకు సంబంధించినది.[9] త్రిపురదేశమందలి కొంతభాగము ప్రసిద్ధమయిన సర్టియన్ (Syrtian sea) సముద్ర

1. విష్ణుపురాణములో చాక్షుమన్వంతరము చూడుడు.

2. History of Babylonia.

3. Whence the Hindu Names of towns at the estuaries of the Gonchia and Senagal rivers, the Tambakenda and other Kundas—Todd's Rajastan, P. 521.

4 మత్స్యపురాణము చూడుడు.

5. See Atlas, page 26.

6. Misra under Misraien B. C. 2188—Todd's Rajastan, P.30.

7. Jatah-H. P. Vol. 2nd. Index.

8. Demiter విష్ణువుయొక్క పేరు (Greek Legends).

9. మత్స్యపురాణములో త్రిపురాసుర యుద్ధము చూడుడు.

ములో మునిగియున్నది.[1] త్రిపురములను జలములో శివుడు ముంచినాడని మనపురాణములు చెప్పుచునే యున్నవిగదా.[2] శుక్రనగరము (City of Venus) సరిటియన్ సముద్రములో మునుగుటను గురించి 1925 వ సం. ఏప్రియల్ 20 వ తేదీ ఇంగ్లీషుమెయిల్ పత్రికలో కూడ నొకవ్యాసము ప్రచురింపబడినది.

ఇప్పు డీసముద్రపు టొడ్డున క్వాబెసు (Quabes) అనుప్రదేశ మున్నది. నాడు సముద్రములో మునుగగా శేషించినకావ్యుని (శుక్రుని)స్థలము ఇది కావచ్చును.

క్వాబెసునకు పైన సుసా (Susa) నగరమున్నది. వరుణుని రాజధానియైన సుషా నగరమే యిది.[3] మిశ్రదేశ మధ్యభాగమున సముద్రతీర మున్నది. ఆ సముద్రము పేరు Adriatic Sea, అనగా అద్రిసాగరము. దీనికి దిగువ సోనియన్ సముద్రము (Sonian Sea), యవనసాగరము, అనగా టికాతిక్ సముద్రమున్నది. అద్రుడు అయోధ్యాధిపతి,ఇక్ష్వాకు వంశీకుడు. వీనిపుత్రుడు యావనాశ్వుడు. గ్రీకులుకూడ వీనిని టిటిసు, అనగా సూర్యవంశజుడని చెప్పుచున్నారు. యవన సాగరముచెంత (Aegian Island and Aegia Sea)అనగా అగ్ని ద్వీపము, బడబానలము గలవు. అగ్ని అనువాడొక మహర్షి. మునినది అశాంతి(Reodomuni, Ashanti) అను పేర్లు ఆఫ్రికాలో భారతీయ సాంప్రదాయములను స్ఫురింపచేయవా? వీని నామములిప్పుడు కొంత పరివర్తితము లయి యున్నను విచ్ఛిన్నమైన భారతీయసభ్యత యొక్క శకలము లక్కడ నింకను కనుపడుచునే యున్నవి.

---

# స్వర్భంగము*

మొసలికంటి హనుమంతరావుగారు

[వెనుకటిసంచికి తరువాయి]

ఆనరకగర్భమున ఘో
రానలమునఁ బొటుపడఁగ నంధువునఁ బనుల్
పూనఁగననిలోఁ జిక్కిన
బానిసలము—ఁబలితమైన పరవుడమునకో.

కాదగునిక నతీఁణబ
లాద్యృతిచే, శాశ్వతవ్యథాధీన్యశరీ
రాదినవత్వముచే, మఱి
లేదు ప్రయోజనము వేఱు లేశంబయినన్.

అనుటయుఁ బూర్వసుపర్వా!
యనిపిలుచుచు వాని మిగుల నాత్రములో ని
ట్లనునుపుగ భాషించెను ద్రిభు
వనకంటక దుశ్చరిత్రవర్యుం డంతన్.

ఆపదలం బనులను ని
ల్పోపమి దురవస్థ గూర్చు నొగి నిటు వినుమీ
తేపకు నరి క్రియమగు
పాపమె వేడ్క_గుత, సుకృతి పాయుత మనలన్.

---

1. Map of Mediterranean Sea.
2. మత్స్యపురాణములో త్రిపురాసురవధ యుపాఖ్యానము చూడుడు.
3. మత్స్యపురాణము—'సుషానామ పురీ రమ్యా వరుణాస్యాపి ధీమతః.'
* ఇది ఆంగ్లకవి 'మిల్టను' రచియించిన 'పేరడైజులాస్టు' (Faradise Last) అను పద్యగ్రంథ ప్రథమ [భాగమున కనువాదము.

మనదుండగములు మేలగు
నను పెంచిన విఫలముగను నడ్డుచు, మేలౌ
పను లతఁడు చేయఁ గీడగు
నను పెంచుటె మనదు ధర్మమై యొప్పవలెన్.

మనధర్మము ఫలవంతము
గను సాగినకొలఁదిఁ దనదు కడుగూఢాలో
చనములు లక్ష్యవిశుద్ధినిఁ
గననేరవు దాన నతఁడు గాసిలు మిగులన్.

చూడుమ! యిదె మగిడించెను
వేడివిజయి వాడిభటుల వెన్దవ్వులు నెడన్
పోడిమిచెడె గాంధకవ
ర్షాడంబర మగుఁ బ్రశాంత మనలజలధియున్.

రుధిరారుణశంపా దు
ర్మథనాగ్రహా పటీయుగ్మ మహిత స్తనితం
బధికార్భటి సేయుదు నిర
వధికాంధువు నందు పశనివారశ్లథయా.

కావున నిదె తరుణమురిపుఁ
డేవిధిఁ దృష్టాగ్రహాగ్ని నేనియు నిస్సా
రావిష్కృతి నేనియు మది
భావించిన, మించఁబెట్టవల దించుకయున్.

అటుగనుమ, బహిష్కృతమై,
కటువై, దుస్సహమునైన కటకము దోఁచున్
పటుశూన్యత, భ్రష్టాంశుత
(?)ద్యుటిభయదైతత్ప్రికాశమే దిక్కగుచున్.

అయ్యోదకు నడువుఁడీ సెగ
యుమ్మెలలకుఁ దన్వు గాఁగ నూఱట లభ్యం
బయ్యెడుదో నట విరతిం
దియ్యముగాఁ గాంతు మూర్తి దీరఁగ నంతన్.

విఱిగినబలములు గూరిచి
తఱుగులఁ దీర్చుట,విరోధిఁ దాఁకుట, సిలుగుం
బఱచుట, నాశ నిరాశను
దఱిగొనుటో, సెంపు గనుటొ తలపోయవలెన్.

అని బోరగిలఁగ నర్ణవ
మున బంధురదీర్ఘకాయమును జాఁపి కనుల్
గణగణమండఁగ నలపైఁ
జొనిపి తలన్ నఖునిఁ బలుకుచో నిల్లొప్పెన్.

జవు గవిసిన యవనీతను
భవు లగు శైటనుల లోనివాఁడో టరసునక
వివరములోఁ దవిలిన బ్రియ
రివసుండో శైతనుఁడో మఱియు నూహింపన్.

ఉత్తరజలనిధి నిశఁబడి
తత్తరమున రేపుదాఁక దలఁదాఁచుకొనక
ఎత్తోయచరము నిద్దుర
మత్తునఁ దేలంగ ద్వీపమతిమూఁపుపయిన్.

నావికుఁ డరిత్ర మేయునో
యావారి చరమ్ము నాఁగ నాయామముగా
నావహ్నినరసి పై దు
ర్భావుఁడు సైతానుదోఁచె బహు నిగళితుఁడై.

దైవేచ్ఛ గాకయుండిన
నావంతయు లేవఁగలఁడె, యానన మెత్తం
జేవ దలిర్చునె, బంధితుఁ
డై నహ్నిన యట్టులుండ కశ్రాంతముగన్.

స్వైరిత పొనఁగుట దుర్వ్యా
పార పరత్వంబుఁ బూని పరుల నిరతముం
గారించుచు నిజదుష్కృతి
వారావృత్తముల దండ్యవరుఁడై కినుకన్.

తనకార్పణ్యము తాఁ గలఁ
చినమనుజు దయాసమగ్ర చిరసౌఖ్యములం
బెనచి, తన కతులహృద్వే
దనమును,బగ,గలఁతఁ బెనుపఁ దగ నీక్షించున్.

అట్టి దురాత్ముఁడు కొలఁకున
నిట్టనిలువుగాఁగఁ దనువు నిగిడిచి లేచెన్
జెట్టలమంటలు శూలము
లట్టుల దిగు వాఁకెఁదెరల యందము చిందన్.



# మనోనాశనము

భాగవతుల దక్షిణామూర్తి శాస్త్రి గారు

దుర్లభో మానుషో దేహః బ్రాహ్మో దేహ స్సుదుర్లభః,
బ్రాహ్మం దేహం సమాసాద్య యేన ముక్త్యై న యత్నతే.
స మేరో రగ్ర మాసాద్య స్వదేహం పాతయ త్యధః,
తమేవ పతితం విదు ర్జాతిభ్రష్టం మహర్షయః.

'సర్వసంకల్పక్షయో మోక్షః' యనునట్లు సంకల్పములే సంసారవృక్షమునకు తల్లివేరు. అట్టిసంకల్పము లెంతదనుక నశింపవో యంతపర్యంతము జీవుఁడవిద్యావశమున సంసారసాగరము నీఁదలేఁడు. సకలవాసనాక్షయము కాఁగనే మనస్సు నశించును జనకుఁడిట్లు చెప్పుచున్నాఁడు:

'ప్రబుద్ధోఽస్మి ప్రబుద్ధోఽస్మి
దుష్ట శ్చోరో మయాత్మనః,
మనో నామ నిహన్మ్యేనం
మనసాఽస్మి చిరంహృతః.'

అనఁగా 'మేల్కొంటిని మేల్కొంటిని. ఆత్మచోరుఁడు వ్యక్త మాయెను. అట్టిచోరుఁడు మనస్సు. పెద్దకాలము మనస్సుచే నిడుములం గుడిచితి' నని.

వసిష్ఠభగవానుఁ డిట్లు చెప్పియున్నాఁడు:

'అస్య సంసారవృక్షస్య
సర్వోపద్రవదాయినః,
ఉపాయ ఏక ఏవాస్తి
మనస స్తస్య నిగ్రహః' అని.

శ్రీగౌడపాదాచార్యులవారును:

'మనోనిగ్రహాయత్తమభయం సర్వయోగినా'

మని సెలవిచ్చిరి. ఇట్లు సర్వయోగులు నభయరూపమగు ముక్తి మనోనాశనమువలనఁ గల్గునని చెప్పిరి. కావున మనోనిగ్రహ మావశ్యకము.

'హఠనిగ్రహ' మనియు, 'క్రమనిగ్రహ' మనియు నిగ్రహము ద్విధా వర్తించును. చక్షుశ్శ్రోత్రాదిజ్ఞానేంద్రియములను, వాక్పాణిపాదాదికర్మేంద్రియములను వానివాని గోళములను మూసినమాత్రమున హఠాత్తుగా నొకానొకప్పుడు నిగ్రహింపఁబడును. అటులనే మనస్సును గూడ నిగ్రహింపఁ గలనను భ్రాంతి మూఢునకుఁ గల్గును. కాని హృదయకమలము మూయరాని దగుటం జేసి యట్టి హఠనిగ్రహము శక్యముగాదు. కావునఁ గ్రమనిగ్రహమే యస్మదాదులకు స్వీకారయోగ్యము. అందుల కుపాయములు: ౧. అధ్యాత్మవిద్యాప్రాప్తి, ౨. సాధుసాంగత్యము, ౩. వాసనాపరిత్యాగము, ౪. ప్రాణస్పందనిరోధము. ఈసాధనముల ననుకూలముగా బలపఱచుకొనినపక్షమునఁ జిత్తజయము సుకరము. వీనిని మాని హఠనిగ్రహముచే మనోనిగ్రహముఁ జేయువాఁడు బిసతంతువుచే మదపుటేనుఁగు బన్ధముఁ జేయఁ నిశ్చయించిన మూఢుఁడే యగు. అధ్యాత్మవిద్య దృశ్యము లన్నియు మిథ్య లనియు, దృగ్వస్తువు స్వతఃప్రకాశ మనియు బోధించును.

౧. అంత ననిత్యమగు దృశ్యమునం దపేక్ష లేని కారణమున దృగ్వస్తువు తనకు గోచరింపమిచే మనోవృత్తులు క్రమముగా క్షయమునొంది యింధనములు లేని యగ్నివలె తమంతఁ దా ముపశమించును. ఈయర్థమును

"యథా నిరింధనో వహ్ని స్స్వయోనా వుపశామ్యతి,
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనా వుపశామ్యతి"

యను శ్రుతి తెలుపుచున్నది. ఈమనోనిగ్రహోపాయ మధికారేతరాప్రాప్య మైనది.

౨. బోధింపఁబడిన తత్త్వమును జక్కఁగఁ దెలియనేరని వానికిని, తెలిసి విస్మరించినవానికిని సాధుసంగమ మత్యంతశ్రేయోవిధానము. సజ్జనులు వేమాఱు జ్ఞానమును స్మృతికి వచ్చునట్లనుగ్రహింతురు. ఇది మధ్యమాధికారికిం దగినది.

3. దర్పము మొదలగు దుర్వాసనలచే సాధువుల సేవింప నిచ్చలేని మందాధికారులు పై నుదాహరింపఁబడిన వాసనాపరిత్యాగోపాయమును స్వీకరించు టుచితము.

౪. వాసనాప్రాబల్యముచే మనోవినాశము వదిపోఁదని యవసరమున ప్రాకృతాధికారులు ప్రాణస్పందనిరోధనమె యవలంబింపవలెను. ప్రాణస్పందములు, వాసనలు చిత్తప్రేరకములు గావున వాని నిరోధమునఁ జిత్తశాంతి సంఘటిల్లును.

"ద్వేబీజే చిత్తవృక్షస్య వృత్తిప్రతతిధారిణః,
ఏకం ప్రాణపరిస్పందో ద్వితీయం దృఢవాసనా"

యని వసిష్ఠభగవానుఁ డీయర్థమునే నుడివెను: ప్రాణస్పందములు, వాసనలును చిత్తప్రేరకము లగుట గాక పరస్పరప్రేరకము లగునని తెలియునది.

"వాసనావశతః ప్రాణస్పంద స్తేన చ వాసనా,
క్రియతే చిత్తబీజస్య తేనబీజాంకురక్రమః'

అని వసిష్ఠవచనము.

అద్వైతమునం దేకనాశన మన్యనాశనహేతు వగును.

'ఏకస్మింశ్చ తయోః క్షీణే క్షిప్రం ద్వే అపి నశ్యతః'

అను వాక్య మీయెడ స్మరించు టుచితము. వాసనా సంపరిత్యాగమువలన చిత్త మచిత్తత్వమునుఁ జెందును.

"ప్రాణాయామదృఢాభ్యాసై ర్యుక్త్యా చ గురుదత్తయా,
ఆసనాశనయోగేన ప్రాణస్పంది నిరుధ్యతే."

అని ప్రాణస్పందనియమోపాయములు—

౧. ఆసననియమము, 2. ఆహారనియమము, 3. ప్రాణాయామదృఢాభ్యాసము, 4. గురుదత్తయుక్తి.

౧. ఆసనము:—ఎట్లు దేహ ముండుటచే నవయవవ్యథ కలుగక, దేహము చలింపక స్థిరముగ నుండునో యది యాసనము. 'స్థిరసుఖమాసన'మను పాతంజల యోగసూత్ర మీయర్థమునే వ్యక్తీకరించుచున్నది.

క్షుత్తృష్ణాదులు బాధముగ నున్నయెడ సాధనము నాయాససాధ్యము గాదు. ప్రాణులు రేచించువాయువు విషమిశ్రితమైనది. ఆ విషమునే యాధునికులు 'బొగ్గుపులు'సని వ్యవహరింతురు (carbonic acid). ఆవిష మెంతయెక్కుడుగ రేచింపఁబడిన నంత క్షుత్తృష్ణలు, దాహతాపములు, బలహీనత యతిశయించును. కావున యోగయుక్తు విషము తక్కువగాఁగల వాయువులఁ బీల్చుచుండవలయును. ఉష్ణమండలమున నుండువారికంటె శీతమండలమున నుండువా రెక్కువవిషమును రేచించెదరు. కావుననే యుష్ణమండలవాసులకంటె వారికి క్షుత్తృష్ణాదు లధికములై తీవ్రముగ నుండును. తన మేనికాఁకకుం దుల్యమగు కాఁకగల తావులయం దట్టి విషము మిక్కిలి తక్కువగ రేచింపఁబడును. భూమధ్యరేఖకు సమీపమునమన్న తామ్రపర్ణి కావేరీనదీప్రముఖంబు లగు తీరములు యోగయుక్తున కనుకూలంబులై యుండును. ప్రాచీనులు ప్రాయికముగా నట్టిస్థలము లయందే యోగపరిశ్రమము చేసి యారితేఱినపిమ్మటనే హిమాలయాశ్రమముల కేఁగినట్లు కన్పట్టుచున్నది. పర్వతాద్యున్నతప్రదేశములం దున్న వ్యక్తికంటె సముద్రముతోఁ దుల్యమగు నెత్తుగల తావులను, నంతకంటెం బల్లంబులగు తావులను నున్నపుడు విష మెక్కువ రేచింపఁబడును. కావునఁ గొండలు, గోపురములు మొదలగు సత్తైనప్రదేశములు స్వీకారయోగ్యములు. విషరేచన మారుబైట బహుళంబగు. వాయుసంచారము బాగుగ నున్న ప్రదేశములందుఁ గలుగునంత విషరేచనము గాలి నిలువయుండు పట్టణములం దుండదు. కావున యోగయుక్తునకు గుహలు మొదలగు నిర్జనప్రదేశము లనుకూలములై యుండవు. మఱియు, మేఘాగ్నివాహు లగు (conductors of electricity) పదార్థముల సంపర్కమున్నపు డెక్కుడు విషము రేచింపఁబడును. శీతల వాయుసంచారదేశములం దది యధికముగ నుండును.

కావున లోహములు, బొగ్గులు, పులుపుగల క్షారములు, లోహకిట్టములు (metallic ores), జంతువుల జలమయము లగు ధాతువులు, తేమగల వస్తువులు, మంచు, ప్రాణివర్గము, శాకపదార్థములు, చూర్ణమైన గాజు, గంధకపు పొడ మొదలగువాని సంపర్కము తీవ్రమైనంత నిరాకరించిన క్షేమము. తచ్ఛక్తివాహులుకాని (non-conductors) పట్టు, రోమములు, వజ్రములు, ప్రతిఫలనము గల రత్నములు, తడిలేని కాగితములు, ఆసనములు, హారతికర్పూరము, భస్మము, సున్నము, ఫాస్ఫరము (phosphorus), మంచుగడ్డ, స్ఫటికములు, తైలములు మొదలైనవాని సంపర్కమున విషరేచన మంత యుండదు. ఇవియు మిక్కిలి లాభకరములు. వ్యాయామాదులచే విషరేచన మెక్కువగును. ఈ పైవిషయముల విమర్శించి విషరేచనావిముఖులై యాసనమును యోగులు సాధింతురు. మఱియు గమన, గృహకృత్య, తీర్థయాత్రా, స్నాన, హోమాది విషయమగు మానసోత్సాహమును సైతము మానవలెను. అట్టి యుత్సాహము దేహమును బలాత్కారముగ లేవఁదీసి యెచ్చటికేని ప్రేరేపించును. దానిచే వ్యాయామాదులు సంభవించుటయు, విషరేచన మెక్కువగుటయు వాసనభంగము మొదలగు ననర్థంబులు వాటిల్లును. అట్టి మానసోత్సాహమును మానుటకై ప్రణవము మొదలగు బీజాక్షరముల జపమాచరింపఁదగు. ఆబీజాక్షరములనే యాశ్రమవాసులు వారికిఁ దగిన వానిని సద్గురువువలనఁ దెలియవలెను. అట్టి జపముచే విషరేచన మీడదు. అట్లే చిత్తము ధ్యానమగ్నంబై యుండెనేని వ్యాపారవిహీనతచే విషరేచనము యెక్కసాం గడఁగును. నాసాగ్రమున భ్రూమధ్యమున నుండు దృష్టిని స్థిరీకృతముఁ గావించినయెడ స్వవ్యాపారములను మనస్సు దూరమగును. వాగ్వ్యాపార మున్నపుడు సైతము విషరేచన మెక్కువయగు. వాగ్వ్యాపారము రెండువిధములు: ౧. లౌకికము, ౨. వైదికము. సంభాషణాదిరూపమైనది ప్రథమము; జపాదిరూపకము ద్వితీయము. అనేకవిక్షేపములకుఁ గారణమగుటఁజేసి ప్రథమవ్యాపారము పరిత్యజింపఁదగినది. జపాదికము నిరోధసమాధియందు మాత్రము విడువవలయును. కావున మౌనము సైతము ముఖ్యమని తేలుచున్నది. ఇట్టివెల్ల వాసనాక్షయమున కనువగు సహాయములు. ఇందుఁ గొన్ని లౌకికములు. అలౌకికోపాయములను పెద్దలు కొందఱు చెప్పుచున్నారు. ఫణసహస్రముచే భూమిని ధరించి స్థిరముగ నుండు నాదిశేషుని ధ్యానించిన వాసనము స్థిరముగనుండును. ఈయుపాయము కాక యమనియమాదులుగూడ వాసనస్థైర్యదాయకములు. జగమంతయుఁ జిత్తవికారము. చిత్తవాసనలచే జగద్వ్యాపారము సంభవించుచున్నది.

'స్వచిత్తమేవ కలతి తయోస్తాదృఙ్మోహనం,
వాసనామాత్రసోల్లేఖం క్వ బ్రహ్మాండం క్వ సంసృతిః.'

యని లీలోపాఖ్యానమున వసిష్ఠభగవానుఁడు చెప్పియున్నాఁడు. కావునఁ జిత్తము క్రోధావేశాన్యమైనవాఁడు లోకంబంతయుఁ గ్రోధవర్జితమై కన్పట్టును. దర్పణమున ముఖవికారము లన్నియుఁ గన్పట్టునట్లనే మనక్రోధాదులన్నియు లోకమునఁ గన్పట్టును. హింసారతిగల పూరుషునకు విశ్వమంతయు హింసారతిగల్గినట్లు తోఁచును. "తత్సన్నిధౌ వైరత్యాగః" యను పాతంజలయోగసూత్ర మహింస సుప్రతిష్ఠితమైనవాని సమీపమున హింసారతములైన భూతములు హింసత్వమును మానియుండునని చెప్పుచున్నది. భూతములు తన్ను హింసించునను వెఱపుగలవానికి వాసనస్థైర్యము కుదురనేరదు. కావున నహింస దృఢముగ నభ్యసించువాఁడు నిర్భయముగ నుండును. అహింస యనఁగా మనోవాక్కాయకర్మములందు భూతములకుఁ గ్లేశముఁ గావింపకుండుట. "అక్షయ్యం హవై చాతుర్మాస్యయాజిన స్సుకృతం భవతి" యనఁగాఁ జాతుర్మాస్యయాగముఁ జేయువానిపుణ్య మనంతమై యుండునని. కాని 'హిరణ్యదా అమృతత్వం భజన్తే' యనఁగా హిరణ్యదానముఁ జేయువా రమృతత్వముఁ బొందుదురు. ఇట్టి శ్రుతులవలన నాముష్మికఫలాసక్తుఁడైనవానికి యాగాదులఁ జేయ నుత్సాహ ముద్భవించును. దానిచేతఁ దదాచరణమునకై యత్నించునుగావున వాసనస్థైర్యము సంభవింపదు. అట్టి సకల సత్కర్మఫలము నొసంగఁజాలు మేటిధర్మమును వదలపఱచుకొనునెడ నట్టి యుత్సాహముగాని, యత్నముగాని సంభవింపవు. అట్టి మేటిధర్మము సత్యము. "సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వ" మను పాతంజలసూత్రము సత్యత్వమునఁ బ్రతిష్ఠితుఁడైనవాఁడు యాగాదిసత్కర్మలను జేయలేకపోయి

నను తత్ఫలభాక్కగుచున్నాఁడని చెప్పుచున్నది. ఇఁక రెండవది 'యస్తేయము.' 'అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థాన'మ్మను యోగసూత్ర మస్తేయస్య మెంత యుత్కృష్ట మైనదియో చెప్పుచున్నది.

అహింసాదికర్మము లెంత బలవంతము లైనను స్త్రీపిశాచము సోఁకినంతమాత్రమున సర్వానర్థప్రాప్తి కావున వాసనము భంగము నొందునని చెప్పుట చోద్యము కానేరదు. సర్వజ్ఞుండగు పరమేశ్వరుఁడు కామిని సోఁకిన మాత్రమున సగమైపోయెనుగదా! పెద్దకాలం బెంతేని కష్టముల కోర్చి సుజనశ్లాఘాస్పదంబగు తపంబు చేసి పెంపెక్కిన విశ్వామిత్రాదిఋషులు పూర్వకృతతపంబులు నీరైపోవ కామినీకృతనికారంబుల పాలై చెడిరి. సర్వానర్థమూలంబగు కామినులం జేరినవానికి నాయుస్తేజోద్యుతిబలంబులు క్షీణించును. మతిని హరించి మత్తుచేయునది మద్యముగదా! అది గౌడి, మాధ్వి, పైష్టి యని ముత్తెఱఁగు. స్త్రీని నాల్గవతీరుదానినిగ నెంచవలయును. అది సర్వహానికరము. అట్టియెడ నెట్టికార్యమునందు బుద్ధి చొరనేరదు. ఆసనస్థైర్యము మాట చెప్పనేల? విమర్శనం బత్యధికం బగును. నితంబిని నిప్పులకుండము. పురుషుండు ఘృతకుంభమువంటివాఁడు. దాని చెంతఁ బోయినయెడఁ గ్రాఁగి క్రాఁగి రూపు మాపుకొనును.

"స్మరణం కీర్తనం కేళిః వీక్షణం గుహ్యభాషణమ్,
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృతిరేవచ;
ఏతన్మైథున మష్టాంగం ప్రవదన్తి మనీషిణః,
విపరీతం బ్రహ్మచర్యం ఏత దేవాష్టలక్షణం"

అను స్మృతివచనము వలన, ౧. సుందరులను స్మరించుట, ౨. వనితల రూపలావణ్యాదుల కీర్తించుట, ౩. బోఁటులతోడి యాటపాటలు, ౪. సీమంతినులను గన్నారఁ జూచుట, ౫. నారీమణులతో రతిసల్ప సంకల్పించుట, ౬. మహిళలను రమింప నిశ్చయించుట, ౭. వామలోచనలతో రహస్యసంభాషణము, ౮. ఇందీవరాక్షులఁ గూడుట—ఈయెనిమిది మైథునరూపములు; వీనికి విపరీతమైనది బ్రహ్మచర్యమని తెలియునది. శరీర మతినింద్యము. అట్టి నారీశరీరమునకు దాసుఁడై యా నర్మకుండమ్మున బలాయురారోగ్యసంపదల నేల్చుట యెంత దురవస్థయో యూహింపఁదగినది. ఇట్టి వివేకమునే స్త్రీలును పురుషులయెడ పూనందగు. కావున యోగయుక్కు సర్వదినముల బ్రహ్మచర్యమును బూనవలయును. యోగయుక్కు ప్రారబ్ధబలంబున గృహస్థుండగుట సంభవించెనేని ఋతుకాలములందు ౫, ౬, ౭, ౮, ౯, ౧౦, ౧౨, ౧౪, ౧౫, ౧౬ రాత్రులయందు, వ్రతాది దినములు కానియెడల, దంపతుల కనుకూలారోగ్యమున్నచో, స్వభార్యతో రమించుటవలన బ్రహ్మచర్యహాని లేదు. "బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః" అను పాతంజలయోగసూత్రము బ్రహ్మచర్యము సుప్రతిష్ఠితమైనవానికి వీర్యలాభమని చెప్పుచున్నది. బ్రహ్మచర్య మనఁగా వీర్యనిరోధముగదా! దాని యతిశయముచే శరీరేంద్రియమనంబుల వీర్యాతిశయ ముప్పతిల్లును. దాన వాసనస్థైర్యము సిద్ధించును. మఱియు భోగము లుపస్థితము లైనను యోగయుక్కు వాని నపేక్షింపఁగూడదు. ఇట్టిదానికే 'యపరిగ్రహ' మని పేరు.

పరిగ్రహము కలవాఁడు రాగానుబంధము బలియక మానదు. దానివలనఁ బ్రవృత్తి బహిర్ముఖమై యుండును. బహిర్ముఖప్రవృత్తివలన ఆధ్యాత్మికజ్ఞానము నశించును; మోక్షము గలుగదు. కావున భోగసాధనములగు శరీరాదుల యెడ నిరపేక్షుండై యుండెనేని మాధ్యస్థ్యము సంభవించును. మధ్యస్థునకు రాగాదిపరిత్యాగము సంఘటిల్లును. దానంజేసి జ్ఞానకారణము పొడముచును. దానంజేసి యపరిగ్రహము దృఢప్రతిష్ఠితమైనవానికిం బూర్వాపరజన్మజ్ఞాన ముప్పతిల్లును. "అపరిగ్రహస్థైర్యే జన్మకథన సంబోధః" అను పాతంజలయోగసూత్ర మీయెడ స్మరణీయము. పూర్వాపరజన్మజ్ఞానమువలన జన్మాంతరీయమైన యనర్థావహములగు కర్మలపరిపాకము కరతలామలకమువలెఁ గనుఁగొనుటంజేసి యట్టికర్మలచెంతం బోక యుండును గావున వాసనస్థైర్యము సిద్ధించును. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము, వీనికి యమములని నామధేయము. హింసాదులగు నిషిద్ధధర్మములవలన యోగులను యమించునవి గావున యమములనంబడును. కావున హింసాదులు (యమనిరోధులు) యోగవిఘ్నకరములు. హింసాదులు (౧) కృతములు, (౨) కారితములు, (౩) అనుమోదితములు అని ముత్తెఱఁగు.

(౧) తానే చేయునవి 'కృతములు', (౨) 'చేయుము, చేయుము' అని పరులచేతఁ జేయించునవి 'కారితములు', (౩) పరులు చేయఁగా 'మేలు మేలు' అని యంగీకరింపఁబడునవి 'యనుమోదితములు.'

కావున హింసాదులను దాను చేయకున్నను బరులచేఁ జేయించుట, చేయ ననుమోదించుట యమములకు భంజకములే యగు. హింసకుఁ గ్రోధమే కారణము. అస్తేయమునకు, నపరిగ్రహమునకు లోభమును, మోహమును దూరము చేయవలయు. ఉపస్థావ్యాపారమునకుఁ గామము, మోహము కారణములు. కారణనిర్మూలనంబునఁ గాని కార్యము తుదముట్టఁ దొలఁగదు. అం దనాత్మయం దాత్మాభిమానము మోహము. అదియే సర్వానర్థమూలం బగును. మఱియు హింసాదులు కారణభేదముచే మృదువులనియు, మధ్యములనియుఁ, దీవ్రములనియు ముత్తీరు. దీనిఫల మనంత దుఃఖకరమును; అనంతమగు నజ్ఞానకారణము. యమములను సకలజాతులయెడ, సకలకాలములందును, సకలదేశములందును నడుపవలయును. కావున 'బ్రాహ్మణులనే హింసింపఁగూడదు. మనుష్యులనే చంపరా' దనుమాట వలదు: సకలభూతములను హింసింపరాదు. 'ఏకాదశినాఁడే బ్రహ్మచర్యమును బూనవలె' ననుమాట కాదు: సర్వదా పూనఁజనును. 'కాశీక్షేత్రమునందే స్తేయము చేయఁగూడ' దనికాదు: సర్వప్రదేశములందును నిగ్రహింపవలయును. 'బ్రాహ్మణప్రయోజనాదిసమయములందు సత్యము నడుపవలయు'నని కాదు: అఖిలసమయముల జరుపవలయు. మఱియు సకలయోగభూమికలందును, జ్ఞానభూమికలందును యమములు నిలుపవలెను.

ఇంక నియమములు:

సంసారహేతువులగు కామ్యకర్మలవలనఁ దొలంగించి మోక్షహేతువులగు నిష్కామకర్మల యాచరణమునందు నియమించునవి గనుక 'నియమములు': (౧) శౌచము, (౨) సంతోషము, (౩) తపస్సు, (౪) స్వాధ్యాయము, (౫) ఈశ్వరప్రణిధానము.

(౧) శౌచము: అనఁగా మలప్రక్షాళనము. అది బాహ్యమనియు, నాభ్యంతరమనియు రెండుతెఱంగులు. మృత్తు, జలము మొదలగువానిచే దేహక్షాళనము చేసికొనుట బాహ్యము. మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష మొదలగువానిచేతఁ జిత్తమలినమును బోఁగొట్టుకొనుట యాభ్యంతరము. శౌచము దృఢముగ నభ్యసించువానికిఁ దనదేహావయవాదులందు సైతము వానిస్వరూపముఁ జక్కఁగ నాలోచన సేయుటచే జుగుప్స గల్గును. 'ఈదేహ మశుచి యైనది. దీనియందు నభిమానముఁ జేయరా' దనుటఁ బట్టియే శరీరధారులగు నితరులతో సైతము సంసర్గము పోవును. దానం జేసి శుద్ధసత్త్వజ్యోతి వృద్ధినొంది రజస్తమస్సుల నాశన మొనర్చును. సత్త్వశుద్ధిచే ఖేదములేని మనశ్శుద్ధి కల్గును. ఆ సౌమనస్యముచే నియతమగు చిత్తంబు స్థైర్యముఁ బొందును. శౌచాభ్యాసబలమువలన నిట్టిలాభములు సంపన్నంబగుఁ గావున యమములు సురక్షితములగును.

(౨) సంతోషము: అనఁగా సంతుష్టి:

'సంతోషైశ్వర్యసుఖినాం చిరవిశ్రాంతచేతసాం,
సామ్రాజ్యమపి శాంతానాం జరత్తృణలవాయతే.'

యని వసిష్ఠులవారు సంతోషైశ్వర్యములు గలవానికి సామ్రాజ్యమైనను దృణప్రాయముగఁ దోఁచునని సెలవిచ్చిరి. నిత్యసంతోషి యగువాఁడు దారిద్ర్యవియోగాదివిషమసంసారస్థితులయందు సైతము సుఖమున విడువఁడు.

"అప్రాప్తవాంఛా ముత్సృజ్య సంప్రాప్తే సమతాంగతః,
అదృష్టఖేదాఽఖేదో యః స సంతుష్ట ఇహోచ్యతే."

యని నిత్యసంతోషిలక్షణమును పెద్దలు చెప్పుచున్నారు. సంతోషసిద్ధికి నాశావిసర్జనము ముఖ్యము. ఇదికూడ సాధనసిద్ధి కత్యంతోపయుక్తము.

(౩) తపస్సు: అనఁగా శాస్త్రాంతరమున నుపదేశింపఁబడిన కృచ్ఛ్రచాంద్రాయణాదులు. వానిచేఁ జిత్తముయొక్క క్లేశాదిరూపమగు నశుచిత్వము పాయును. అందుచే నింద్రియములు ఉత్కృష్టతఁ జెందును. సూక్ష్మమగునట్టియు, దేశకాలములచే దవ్వగునట్టియు వానిని గనఁజాలును. దీనివలన బ్రహ్మచర్యాదులు స్థిరపడుటకు సందియము లేదు.

(౪) స్వాధ్యాయము: అనఁగా ప్రణవాదిమంత్రజపము. ఆమంత్రములను యోగ్యతానుసారముగ సద్గు

రూపదేశమునఁ బొందవలయు. శిష్యుండు గురువును, గురువు శిష్యునిని బరీక్షింపక మంత్రోపదేశముఁ గొనుటయుఁ, జేయుటయు ననర్థావహములు.

"గురుశిష్యావుభౌ మోహాదపరీక్ష్య పరస్పరం,[తాం."
ఉపదేశం దదద్గృహ్ణన్ ప్రాప్నుయాతాం పిశాచ

అనువచన మీయర్థమునే చెప్పుచున్నది. పుస్తకములలో వ్రాసిన మంత్రానుష్ఠానమును జేయరాదు. సద్గురువువలనే తెలియవగును.

"ఆచార్యాదనభిప్రాప్త మంత్రశ్చాదత్తదక్షిణః,
అభ్యస్తోఽపి సదా మంత్రః శ్రేయసే నావకల్పతే."

యని నారదీయము.

"పుస్తకే లిఖితాన్మంత్రా నాలోక్య ప్రజపంతి యే,
బ్రహ్మహత్యాసమం తేషాం పాతకం పరికీర్తితమ్."

అని పురశ్చరణదీపిక ఘోషించుచున్నది.

"యదృచ్ఛయా శ్రుతం మంత్రం ఛద్మనాఽపి బలేన వా,
ప్రేతితం వాథగాథాదౌ యజ్జపేత్తదనర్థకృత్."

యని మూలార్ణవవచనము.

అట్టి మంత్రానుష్ఠానమువలన నిష్టదేవతా సాక్షాత్కారము గల్గును. మంత్రానుష్ఠానవర్తనమున యమాదులు గుప్తంబులు కాకమానవు. వేదపురాణేతిహాసధర్మశాస్త్రకల్పసూత్రముల పారాయణములును జపమే యనఁదగు.

(౫) ఈశ్వరప్రణిధానము : అనఁగా లౌకిక వైదికరూపమగు సర్వకర్మను ఫలాభిసంధి లేకుండ నిరహంకారముగ నీశ్వరార్పణఁ జేసి తజ్జన్యసుఖదుఃఖముల హర్షోద్వేగమున నొందకుండుట. ఈశ్వరప్రణిధానమువలన యోగయుక్తుఁ పరమేశ్వరకృపకుఁ బాత్రుఁడై సత్యకామ సత్యసంకల్పాదిగుణసహితుండగును. నియమానుష్ఠానమునకు నియమానుష్ఠానమునకు విలక్షణత్వము గలదు.

"యమాన్ సేవేత సతతం న నిత్యం నియమాన్బుధః,
యమాన్పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్."

అను స్మృతి సైతము సర్వదా యమములను సేవింపవలయునుగాని నియమములను సర్వదా యాచరింపఁ బనిలేదని చెప్పుచున్నది. [సశేషము]

---

# చంద్రుఁడు

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

అల్లమిన్నేటి తీరంబునందుఁ జెలువు
గులుకుమొగిలుగొండల నున్న కోనలోనఁ
బొలుచుచున్నది యొక్క తపోవనంబు
చెలఁగుఁజందురుఁడను ఋషిశ్రేష్ఠుఁ డందు.

క. పరిశుద్ధుఁడు సర్వకళా
పరిపూర్ణుఁడు పూతవృత్తి పరిభోగ్య వయ
స్స్ఫురితుండు ప్రపంచతమో
హరణసమర్థుండు వెలుఁగునతఁడున్నతుఁడై.

గీ. కనులఁ గప్పంగ నిండుజవ్వనపుఁ బొగరు
పైపడఁగఁ బాలు రోహిణీపంకజాస్యఁ
గరములం ద్రోయుచాలకుఁ గాని యాతఁ
డెట్టి ధృతిమంతుఁడో! కౌఁగిలింపఁబోఁడు.

గీ. అలరుసాయాహ్నములయందునాశ్రమంబు
నారుబయలునఁగూర్చుండి యద్భుతముగఁ
దారకాశిష్యులకు నాత్మ దర్శనములఁ
బండువెన్నెలపేర నుపన్యసించు.

గీ. ఆయుపన్యాసమందలి యంశములకు
సంశయములెల్లఁ దీఱఁగా సంతసించి
నిర్మలతుషారమిషమున నింగినుండి
బాష్పములురాల్చుచుందురు వారు గనుల.



# దేవేంద్రవర్మ కంబకాయశాసనము

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

కొంతకాలము క్రితము 'మూడవ వజ్రహస్తుని చిక్కాలవలస శాసన'మను పేరుతో భారతిలో ప్రకటింపబడ్డ శాసనముతోపాటే ఈతామ్రశాసనమును కంబకాయ ప్రాంతమున ఒకరైతు తన చేను దున్నుకొనుచుండగా బడినది. ఈవిషయము తెలిసిన పిదప ఆంధ్రదేశ చరిత్రాభిమానులును, పరిశోధనాభిలాషులును, కంబకాయ గ్రామోద్యోగస్థులును అగు శ్రీ ఖైరి అప్పలస్వామినాయుడు గారు ఆరైతునొద్దకువెళ్లి అతనితో 'పరిశోధన చేసినపిదప ఈశాసనము తిరిగి నీకిచ్చివేసెద'నని తెలిపి దాని నతనినుండి తీసికొని పరిశోధనార్థము దయతో నాకు బంపిరి. దీనిని నేనింతకుపూర్వము చాలకాలముక్రితమే ప్రకటించియుండవలసినది కాని కారణాంతరముల చేతనైన కాలవిలంబనమునకు చాల విచారించుచున్నాను.

ఆకారాదికములు

ఈ శాసనమున మూడు రాగిరేకులు కలవు. మొదటిరేకు మొదటిప్రక్కను, మూడవరేకు రెండవప్రక్కను వ్రాతయేదియు లేక ఈ రెండుప్రక్కలును శాసనమునకు రెండు అట్టలవలెనుండి దానిని సంరక్షించుచున్నవి. ఒక్కొక్కరాగిరేకుయొక్క పొడవు ౮ అంగుళములు; వెడల్పు 3. 3 అంగుళములు. రేకులుపైభాగమునను దిగువభాగమునను కొనల దగ్గర వెడల్పుగను నడుమ సన్నముగను, కుడియెడమప్రక్కల కొనల దగ్గరకంటె నడుమ రవంత ఉబ్బెత్తుగ విలువంపుగను ఉన్నవి. ఒక్కొక్క రేకునకు అంచునుండి .౫ అంగుళముదూరమున రంధ్రము కలదు. ఈరంధ్రముగుండ పోనిచ్చిన యొక కడియము మూలమున ఈ రేకులు బంధింపబడియున్నవి. కడియముయొక్క వ్యాసము ౧. ౫ అంగుళములు. ఈకడియ మొక రాజముద్రికలో నతికింపబడి యున్నది. ముద్రికమీద స్ఫుటముగ ఎగువభాగమున చంద్రుడును, దిగువభాగమున అంకుశమును, ఈ రెంటికినడుమ అడ్డముగ మత్స్యమును చెక్కబడియున్నవి. దీనిననుసరించి ఈశాసనమునందు చెప్పబడ్డ దాతవంశమువారిది మత్స్యలాంఛనమని తెలియనగును. ముద్రికలో కడియము నతికినభాగమున ముద్రికకిరుప్రక్కల చెక్కడపుపనికలదు కాని యది చాల కాలపు దగుటచేత త్రుప్పుపట్టి దాని యంద

చందములు వివరముగ దెలియవచ్చుట లేదు. నాదగ్గర కీశాసనము వచ్చునప్పటికి కడియము నెవ్వరును గోసియుండ లేదు. రేకులను విడ దీసి చదువునిమిత్తము నేనే దానిని కోయించి తిని.

లిపి: భాష

ఈ శాసనమునందలి లిపి నాగరి; కాని యిది 'మూడవ వజ్రహస్తుని చిక్కాలవలస', 'బూడ్డపాడు, అనంతవర్మ చోడగంగ దేవుని కొర్ని శాసనములలోని లిపివలె తీర్చి దిద్ది వ్రాసినది కాదు. ఇది మూడవ వజ్రహస్తుని నడగాం[1], నరసీపట్నం[2], 'మెడ్రాస్ మ్యూజి యమ్[3] తామ్రశాసనములందలి లిపివంటిది: విచిత్రమైనది: విలక్షణమైనది. అక్షరములు పొంకముగ నుండక కొంకిరిగీతలవలె నుండును.

ఈ శాసనములో అచ్చులలో ఋ, ౠ, ఏ, ఐ, ఓ, ఔలును, హల్లులలో ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ఫ, బ, శ లును రాలేదు.

అచ్చులలో అ, ఆ, ఇ, ఈ, ఉ లు గను నింపడగినవి. 'అ' వర్ణమును ౧, ౨౨, ౨౮, ౨౯ పంక్తులలోను, 'ఆ' వర్ణమును ౨౧-వ పంక్తిలోను, 'ఇ' వర్ణమును ౨౬, ౨౯ పంక్తుల లోను, 'ఈ' వర్ణమును ౨౨, ౨3 పంక్తుల లోను, 'ఉ' వర్ణమును ౮, ౧౮, ౧౯, ౨౮ పంక్తులలోను గాంచనగును. 'ఉ' వర్ణము తక్క మిగిలిన అ, ఆ, ఇ, ఈ లు నేటి నాగరి వర్ణములకు భిన్నముగా నున్నవి.

క, జ, డ, ద, మ, య, వ లు నేటి నా గరివర్ణములకు — స్వల్పభేదమున్నను — చాల చేరికగా నున్నవి.

ఖ, గ, శ, క్ష వర్ణములు భిన్నరూపము లతో కాన్పించుచున్నను వీటికి ప్రాతిపదిక మాత్రము ఒక్కటిగనే కన్పట్టును.

చ, ట, ణ, త, ద, న, ప, భ, ర, ల, ష, స, హ లు నేటి నాగరివర్ణములకు భిన్న ముగా నున్నవి. 'ట' వర్ణము తలకట్టు లేని నేటి నాగరి 'ట్ట' వర్ణమును బోలియున్నది. 'చ', 'ధ' లు రెండును ఆకృతిలో కొంచె మించుమించు సమానముగనే కన్పట్టును. భేదమేమన 'ధ' వర్ణమునకు తలకట్టు లేదు; 'చ' వర్ణమునకు ఉన్నది. 'ణ', 'ల' లు రెం డును ఆకృతిలో ఒకటే కాని 'ల' వర్ణమునకు తలకట్టు కలదు; 'ణ' వర్ణమునకు లేదు. 'ణు', 'ణ్ణ' లకు భేదము కనబడదు. ఇట్లే 'తు,' 'త్త' లకును భేదము కాన్పింపదు. 'ప', 'ష' లు నేటి నాగరివర్ణముల కించుకభేదముగ నున్నవి. శాసనములోని వర్ణములు ప్రక్కకు తిరిగియున్నవి. నేటివి దిగువకు తిరిగియున్నవి. 'భ', 'స' లకు ప్రాతిపదిక యొక్కటిగ కన బడును. 'ఛ', 'థ' లు శాసనమున విడిగా రాలేదు కాని సంయుక్త వర్ణములలో దిగు వను వచ్చినవి.

శాసనమున చాలచోట్ల 'శ' వర్ణమునకు 'స' వర్ణమును, అన్నిచోట్లను 'బ' వర్ణము నకు 'వ' వర్ణమును వ్రాయబడినది.

1. Ep. Ind. Vol IV. p 183.
2. Ibid Vol XI. p 147.
3. Ibid Vol IX. p 94.

వెలుపలి గిలకతో ఉన్న హల్వర్ణములకు ఇందు ఒకటి రెండుచోట్ల తక్క ఎచ్చటను ద్విత్వము రాలేదు. వెలుపలగిలకతో ఉన్న [illegible]' వర్ణమునకు మాత్రము ద్విత్వము వచ్చినది. ఇదికూడ ఒకచోట జారిపోయినది (పం. ౧౭).

సంయుక్త వర్ణములలో ప్రాచీన వర్ణక్రమము ప్రకారము వర్గానునాసికములతో కలిసి ఉండవలసిన వర్గాక్షరములు శాసనమునందు దాదాపుగ అంతటను అనుస్వారముతోనే కలిసియున్నవి. 'ఙ', 'ఞ' వర్ణములు మాత్రమే ఇందులకు భిన్నములు. (చూడుడు: ఙ్గ—పం. 3, ౧౭, ౧౯ లు; ఞ్చ—పం. ౧౫, ౧౬ లు: ఇందు 'ఞ్చ' అను వర్ణము రెండుచోట్ల రెండురీతుల—ఒకమారు అనునాసికము పిదప 'చ' వర్ణము చేర్చియు, మరియొకమారు 'చ' వర్ణము పిదప అనునాసికమును చేర్చియు—వ్రాయబడి యున్నది)

గుణింతములలో ఆ, ఈ లకు ఈషద్భేదము కలదు. తరచు ఈకారమునకు ఆకారమే వ్రాయబడినది. ఇట్లే ఉ, ఊలకుగల భేదమును స్వల్పమే; కాని శాసనమున తరచు ఊకారమునకు ఉకారమే వ్రాయబడినది; ఇ, ఏ ల విషయమున మూడవ వజ్రహస్తుని చిక్కాలవలస శాసనమున నెట్లో ఇందును అట్లే. ఋకారము నేటి నాగరిగుణింతమున నెట్లున్నదో అట్లే యున్నది.

శాసనమున చాలచోట్ల అనుస్వారములు విడిచి పెట్టబడినవి: కొన్నిచోట్ల—రేకులు పాడగుటచే—అవి ఉన్నవో లేదో తెలియవచ్చుట లేదు.

భాష సంస్కృతము. భాషయు, వ్రాతయు కూడ చాల పాడుగా నున్నది. లేఖకుడు అధీతుడు కాని కారణముననో, లేక వ్రాత బాగుగ వ్రాయనేర్చినవాడు కాని హేతువుచేతనో భాషలోను, వ్రాతలోను గూడ చాల తప్పులు కలవు. లేఖక లక్షణమిది:

సర్వదేశ లిపిజ్ఞాతా,
  లేఖనే కుశలః పటుః
అధీతో వాచకో ధీమాన్
  యోజ్యో రాజ్ఞా స లేఖకః.

ఈశాసన లేఖకుడు పైని చెప్పినయట్టివాడుగా కనబడడు. ఏలయన: వ్రాతయు, భాషయుగూడ చాల తప్పులతడికగ నున్నది.

శాసనభాషలో ప్రాకృతఛాయ మెండు. దీసిననుసరించి ప్రాయికముగ లేఖకుడు ఉత్కలదేశనివాసుడై యుండునని యూహింపదగును. శాసనమున ఉత్కీర్ణకుని పేరుకాని, లేఖకుని పేరు కాని తెలుపబడియుండ లేదు.

శాసన విషయము

శాసనభాషయు వ్రాతయు తప్పుల తడికగ నుండుటచేత శాసనమునందు చెప్పబడ్డ విషయములకు అన్వయక్రమము కొన్నికొన్ని సందర్భముల గనబడుట లేదు. అయినను నే నర్థముచేసికొన్న ప్రకారము శాసన విషయమిది:

కళింగనగరము రాజధానిగా పరిపాలించుచుండిన గంగామలకులతిలకు డగు శ్రీ

దేవేంద్రవర్మ 'దంతిపురము'న నుండగా ఆ రాజుయొక్క విజయరాజ్యము 'సకాబ్ద సహస్ర మేకసతత్రయాధిక'మని చెప్పబడ్డకాలమున ఆ రాజుయొక్క మహామండలికుడును, కదంబ కులతిలకుడును అగు శ్రీధర్మఖేడి పుత్రుడు మహామండలికుడైన ఉదయాదిత్యుడు 'శేవనిజి' గ్రామమును 'అచాటభట' ప్రవేశ్యముగను, 'ఆచంద్రార్కస్థాయిగాను ఉదక పూర్వకముగ దానముచేసి అందొకభాగమును వృద్ధపుత్రుడైన శేవననాయకుని కుమారుడు నారాయణ నాయకునికిని, ఇంకొక భాగమును 'అయితయ సోమయాదు(?)" ఈజణ'కునికి నొసంగెను. ఇదియే శాసనభాషనుబట్టి నేనర్థము చేసికో గలిగినవిషయము.

దానమును గురించి చెప్పబడిన పిదప దానమొసంగిన గ్రామమునకు సరిహద్దులు చెప్పబడెను. ఈ సరిహద్దులలో అన్నియు రాళ్లు రప్పలునేగాని ఒక్కటియు ఊరిపేరు కనబడదు.

సరిహద్దులనుగురించి తెలిపినపిదప శాసనమున ఈ క్రిందిపంక్తులు కలవు.

> 'శేష గ్రామస్య, దాత్త మాడ దుక్ష
> అపర దోలీ "వడమేటు" వడత్తర
> ప్రదతోస్మి.'

విషయవిమర్శనము

రాజు:

ఈశాసనము పుట్టునాటికి కళింగనగరము రాజధానిగ దేవేంద్రవర్మ పరిపాలించుచుండెను. ఇతడు 'గంగామల కులతిలకు' డని మాత్రము చెప్పబడినది. ఇతని తండ్రిపేరు గాని, తాతపేరు కాని శాసనమున చెప్పబడలేదు. అయితే గంగవంశజులలో ఈరాజు ఎవ్వడు?

గంగవంశజుల శాసనములు అనేకములు దొరకినవి. వాటిలో శిలాశాసనములును, తామ్రశాసనములునుగూడ గలవు. శ్రీకూర్మము, ముఖలింగము మొదలగు పుణ్యక్షేత్రములలో వీరి శిలాశాసనములు అపరిమితముగ నున్నవి. ఈగంగవంశములోనివారే యగు వజ్రహస్తదేవునియొక్కయు, అతనిమనుమడును రాజరాజదేవుని కుమారుడు నగు అనంతవర్మ చోడగంగదేవునియొక్కయు తామ్రశాసనములు కొన్ని ఈపత్రికలోనే ప్రకటింపబడినవి. వాటినిబట్టియు, ఇంక నితరశాసనములను బట్టియు

(౧) వజ్రహస్తదేవుడు శక వర్షములు ౯౬౦ వ సంవత్సరమున సూర్యుడు వృషభలగ్నమునను, (చంద్రుడు) రోహిణిలోను ఉండగా శుక్లపక్ష తృతీయా ఆదివారము ధనుర్లగ్నమునను

(౨) వజ్రహస్తదేవునికుమారుడగు రాజరాజదేవుడు ౯౯౨ వ శకవర్షమున జ్యేష్ఠ శుద్ధ అష్టమీసింహలగ్నమున ఉత్తరఫల్గునీ నక్షత్రమున గురువారమునాడును

(3) రాజరాజదేవుని కుమారుడైన అనంతవర్మచోడ గంగదేవుడు ౯౯౯ వ శకవర్షమున సూర్యుడు కుంభలగ్నమున నుండగా శుక్లపక్షతృతీయా శనివారము రేవతీ నక్షత్రము మిథునలగ్నమునను

పట్టాభిషిక్తు లైనట్లు తెలియవచ్చుచున్నది. అందువలన శాసనములందు శకవర్షపరిగణనము నొసంగిన గంగవంశజులలో మొదటి రాజగు వజ్రహస్తుడు శకవర్షములు ౯౬౦ మొదలు ౯౯౨ వరకును, అతనికొడుకు రాజరాజదేవుడు శకవర్షములు ౯౯౨ మొదలు ౯౯౯ వరకును, అతనికొడుకగు అనంతవర్మ చోడగంగదేవుడు ౯౯౯ నుండియు పరిపాలించినట్లు మనకు శాసనముల మూలమున విస్పష్టమగుచున్నది. ఈపై నుడివిన మూవురు రాజులలో వజ్రహస్తదేవునికి అనంతవర్మయనియు, అతనికొడుకు రాజరాజదేవునికి దేవేంద్రవర్మయనియు, అతనికొడుకు చోడగంగదేవునికి అనంతవర్మయనియు నామాంతరము లున్నట్లు శాసనములవల్లనే తెలియుచున్నది. అనంతవర్మచోడగంగదేవుని పిదప రాజ్యమేలిన గంగవంశపురాజుల శిలాశాసనము లనేకములు కాన్పించుచున్నను వాటిని బట్టి వారికి నామాంతరము లున్నవో లేవో తెలిసికొనుటకుకష్టమగుచున్నది: ఏలయన, శకవర్షము ౯౯౯ మొదలు శకవర్షములు౧౨౩౦ వరకు అనగా రమారమి రెండువందల నలభై సంవత్సరముల కాలమున కనిపించు గంగవంశ శాసనములన్నిటిలో రాజుపేరు సాధారణముగ అనంతవర్మయనియే కలదు: శకవర్షములు ౯౯౯ మొదలు శకవర్షము ౧౦౪౦ వరకు గల శాసనములలో రాజుపేరు అనంతవర్మదేవర అనియు, గంగేశ్వరదేవర అనియు, చోడగంగదేవర అనియు కలదు. అటుపిదప

| | వి. రా. (విజయరాజ్యసంవత్సరములు) | |
|---|---|---|
| శ. ౧౦౬౧ | ౮ | అనంతవర్మ మధుకామార్ణవదేవ |
| ౧౦౪౧ | | అనియంకభీమ రాహుతదేవర |
| ౧౦౯౧ | ౧౪ | అనంతవర్మ దేవిదాస రణరంగ రాఘవ చక్రవర్తి |
| ౧౧౨౯ | ౨౮ | వీరనరనారసింహదేవ |
| ౧౧౩౮ | ౧౪ | వీరనరనారసింహదేవ |
| ౧౧౭౨ | | అనియంకభీమదేవర |
| ౧౧౫౫ | | అనింకభీమ రాహుతాఖ్య |
| ౧౧౬౩ | ౮ | అనంతవర్మ వీరనరనారసింహదేవర |
| ౧౧౬౪ | ౧౦ | వీరనరసింహ రాహుతదేవ |
| ౧౧౬౪ | ౧౦ | అనంతవర్మ వీరనరసింహదేవర |
| ౧౧౬౭ | ౧౧ | అనంతవర్మ వీరనరసింహరాహుతదేవర |
| ౧౧౬౭ | | వీరశ్రీమన్నృసింహదేవర |
| ౧౧౪౨ | | ప్రతాప వీరనరసింహదేవర |
| ౧౧౪౨ | ౧౫ | వీరనరసింగదేవర |
| ౧౧౪౭ | ౨౩ | వీరనరసింహరాహుతదేవ |
| ౧౧౪[౯] | ౧౯ | వీరనరసింహదేవర |
| ౧౧౭౮ | ౩[౧] | వీరనరసింహరాహుతదేవ |
| ౧౧౭౮ | | నరసింహదేవర |
| ౧౧౯౦ | | నరసింహదేవర |
| ౧౧౯౩ | | భానుదేవ |
| ౧౧౯౩ | | భానుదేవ |
| ౧౧౯౩ | | భానుదేవ |
| ౧౧౯౪ | | వీరభానుదేవ |
| ౧౨౦౦ | ౧౭ | అనంతవర్మ ప్రతాపవీర శ్రీ భానుదేవ |
| ౧౨౦౧ | ౩ | ప్రతాప వీరనరసింహదేవ |
| ౧౨౦౩ | ౩ | అనంతవర్మ నరనారసింహరాహుతదేవ |
| ౧౨౦౮ | ౪ | వీరనరసింహదేవ |
| ౧౨౦౫ | ౪ | అనంతవర్మ శ్రీ వీరనారసింహ రాహుతదేవర |
| ౧౨౧౧ | ౧౮ | వీరనరసింహదేవ |
| ౧౨౧౨ | ౧౮ | వీరనరసింహదేవ |

| | | |
|---|---|---|
| ౧౨౧౨ | ౧౫ | వీరనరసింహదేవ |
| ౧౨౧౨ | | నరహరనృపతి |
| ౧౨౧౩ | ౧౫ | అనంతవర్మప్రతాపవీర నరసింహదేవ |
| ౧౨౧౩ | ౧౫ | అనంతవర్మప్రతాపవీర నరసింహదేవ |
| ౧౨౧౪ | ౧౮ | అనంతవర్మప్రతాపవీర నరసింహదేవ |
| ౧౨౧౫ | ౧౭ | వీరనర నారసింహదేవ |
| ౧౨౧౫ | ౧౭ | వీరనారసింహ రావుతు దేవ |
| ౧౨౧౭ | ౨౨ | అనంతవర్మప్రతాపవీరనరసింహదేవ |
| ౧౨౧౯ | ౨౩ | ” ” |
| ౧౨౧౯ | ౨౩ | ” ” |
| ౧౨౧౯ | ౨౩ | ” ” |
| ౧౨౨౧ | ౨౫ | ” ” |
| ౧౨౨౮ | ౩౩ | ” ” |
| ౧౨౨౯ | ౩ | అనంతవర్మప్రతాప వీరబాణుదేవ |
| ౧౨౨౯ | ౩ | ” ” |

ఈ పైశాసనములలో అనంతవర్మ అను గంగవంశబిరుదము మాత్రమే కాక గంగవంశ భూపతి పేరుకూడ కలదు. కేవలము అనంత వర్మ బిరుదముతో నున్న గాంగవంశజులశాస నములు ఈ క్రింద పొందుపరుపబడినవి.

| | | | |
|---|---|---|---|
| శ. ౧౦౮౧ | వి. రా. | | వి. రా. |
| ౧౦౮౩ | ౫ | శ. ౧౦౭౨ | ౫ |
| ౧౦౮౪ | ౮ | ౧౦౭౪ | ౭ |
| ౧౦౮౪ | ౮ | ౧౦౭౪ | ౯ |
| ౧౦౮౪ | ౮ | ౧౦౭౬. | ౧౦ |
| ౧౦౮౫ | ౭ | ౧౦౯౩ | ౩ |
| ౧౦౮౫ | ౭ | ౧౦౯౬ | ౪ |
| ౧౦౮౬ | ౬౨ | ౧౦౯౮ | ౪౭ |
| ౧౦౮౮ | ౧౦ | ౧౧౦౦ | ౧౧ |
| ౧౦౮౭ | ౯ | ౧౧౦౪ | ౧౪ |
| ౧౦౮౯ | ౧౯ | ౧౧౦౯ | ౨౨ |
| ౧౧౧౪ | ౨౮ | ౧౧౨౭ | ౧౧ |
| ౧౧౨౮ | ౧౦ | ౧౧౩౭ | ౮ |

శ. ౧౨౨౯-వ శకవర్షము పిదప గాంగ వంశపు రాజుల శాసనములలో నేను చూచి నంతవరకు అనంతవర్మ నామము కనబడ లేదు. వజ్రహస్త, రాజరాజదేవ, చోడగంగ దేవులకు గల నామాంతరముల ననుసరించి అనంతవర్మ, దేవేంద్రవర్మనామములు ఈగంగ వంశపురాజులకు వంశక్రమమున ఒకరితరువాత నొకరికి వచ్చుచుండెనని యనుటకు ఈ పైవిష యముల ననుసరించి వీలు లేదు. శకవర్షము ౧౨౨౯ తరువాత ఈ క్రింది గాంగవంశ భూపతుల శాసనములు కాన్పించును:

(౧) భానుదేవ
(౨) వీరనరసింహదేవ
(౩) వీరభానుదేవ
(౪) వీరనరసింహదేవ
(౫) ప్రతాపవీరనిశ్శంక భానుదేవ.

శకవర్షము ౧౧౦౦ ల ప్రాంతమున గాంగవంశపు రాజు లందరు అనంతవర్మ నామాంచితులే కాని వారిలో నొక్కరును దేవేంద్రవర్మాభిధానులు గనబడరు. అందు వలన కాలమొక్కటియేయైనను అనంతవర్మ దేవేంద్రవర్మ నామాంకితు లగు నీ రాజులు ఒక్కరుకారనియు, ప్రాయికముగ వీ రిరువురు వేర్వేరురాజులై యుందురనియు అనుమానిం చుట కవకాశమున్నది. ఇట్టి యనుమానము నకు మరికొన్ని వ్యత్యస్తవిషయములు బలము నొసంగుచున్నవి. ఎట్లన గంగవంశజుల తామ్ర శాసనముల వలన దెలియవచ్చు సంపూర్ణ

గంగవంశానుక్రమణిక (చూ: పుట ౧౨౫.) ప్రకారము అనంతవర్మ చోడగంగదేవుని కుమారుడైన మధుకామార్ణవునిపిదప అతని సోదరుడైన రాఘవభూపతి రాజ్యమునకు రావలసియుండెను; పైనిచ్చిన శాసనములపట్టికలో గానవచ్చు 'అనంతవర్మదేవిదాస రణరంగరాఘవచక్రవర్తి'యే యీరాఘవభూపతి యని నేను తలంతును. పైనుదివిన యీశాసనముల పట్టికను జూచినచో మధుకామార్ణవునికిని రాఘవనామాంతరముగల 'అనంతవర్మదేవిదాస రణరంగరాఘవచక్రవర్తి'కి నడుమ 'అనియంక భీమ రావుతుదేవర' అనుపేరుగల మరియొకరాజు కనబడును. వంశానుక్రమణిక ననుసరించి అనియంకభీముడు రాఘవభూపతికి సోదరుడైన రాజరాజునకు పరముననేకాని పూర్వము పరిపాలించినట్లు కనబడదు. కాని యీ రాజును పేర్కొనుశాసనము చాలవరకుశిథిలమైయుండుటచేత దీని నాధారముచేసికొని ఏ విషయము తేల్చుటయు యుక్తముకాకపోయినను ౧౦౭౧వశకవర్షపుశాసనమున అనియంకభీమనామముకాన్పించుట జేసి దీనినిగూర్చి యింత చెప్పవలసివచ్చినది. అదియునుగాక దాక్షారామశాసనములలో నొకటియైన రాజకేసరి వర్మ త్రిభువనచక్రవర్తి బిరుదాంచితుడగు శ్రీ కులోత్తుంగచోడదేవుని ముప్పదిమూడవ(33) సంవత్సరపు శాసనమున, అతని సామంతుడగు నొక పల్లవరాజిట్లు కీర్తింపఁబడి యున్నాడు.

భస్మీకృత్య కలింగదేశ మఖిలం
నిర్జిత్య గంగంరణే
భజ్త్వా కోశలఖండపాల నివహాః
దేవేంద్ర వర్మాదికాః
వీరః పల్లవరాజ ఇత్యభిహితో
రాజేంద్ర చోడప్రభోః
కీర్త్యుత్తంభమి వోగ్ర సంధిషు జయ
స్తంభం శుభం న్యక్షిపత్.

ఈ కులోత్తుంగచోడుడు మొదటివాడే అయియుండవలెను. రెండవ కులోత్తుంగుడు 33 సంవత్సరములు రాజ్యము చేయలేదు గనుకను, మూడవ కులోత్తుంగచోడుని నాటికి వేంగిమండలమున రాజాధిరాజదేవర వర్షమే వాడుకలో నుండినందునను పైన పేర్కొనబడిన కులోత్తుంగచోడుడు తప్పక మొదటి వాడే యనుటకు సందేహము లేదు. అందు వలన నాశాసనము క్రీ. శ. ౧౧౦3 నాటిది (శ. ౧౦౨౫) కావలెను. అప్పటికి అనంతవర్మ నామమును ధరించిన రాజరాజ తనయుడగు చోడగంగదేవుడు పరిపాలించుచుండెనే కాని దేవేంద్రవర్మ నామాంచితుడగు రాజెవ్వడును పాలించుచుండినట్లు కానరాదు. "నిర్జిత్యగంగం" అను పైశ్లోకములోని మాటవలన చోడగంగదేవుడు పేర్కొనబడెననుట స్పష్టము. "దేంద్రవర్మాదికాన్" అనికూడ నాశ్లోకము నందే యుండుటవలన దేవేంద్రవర్మ నామాంచితులైన మరికొందరు రాజులుకూడ అప్పటికి కళింగమును పాలించుచుండిరని యూహించుట కవకాశము కలదు. ఈ పైకారణములనుబట్టియే ఏకకాలమున కళింగమునందలి వేరువేరుభాగములను గంగవంశమునకు సంబంధించినవే రెండు వేరువేరుకోవలు పరిపాలించుచుండెనని శంకింపవలసి వచ్చుచున్నది. ఇటువంటి శంకలకు తావిచ్చు మరికొన్ని విషయములు

కూడ కనబడును. నాటినన్నిటిని ఇచ్చట పేర్కొనుట అనవసరము.

ఇట్లు అనంతవర్మ దేవేంద్రవర్మాదులు వేరువేరుకోవలకు సంబంధించినవారు కానిచో దేవేంద్రవర్మయనునది అనంతవర్మనామాంచితునికి నామాంతరమైన కావలసివచ్చును. వజ్రహస్తతనయుడగు మొదటి రాజరాజదేవునకు దేవేంద్రవర్మ నామమున్నట్లే, అనంతవర్మ చోడగంగదేవుని తనూజుడైన రెండవ రాజరాజదేవునకును దేవేంద్రవర్మ నామము కలదేమో! ఎట్లయినను ఒకేరాజునకు అనంతవర్మ, దేవేంద్రవర్మనామములు రెండునుండెననుట అంతసమంచితముగ కన్పట్టదు. దీనంజేసి మనశాసనమునందలి శకవర్షసంఖ్య సరియైనదేయని నమ్మినచో దేవేంద్రవర్మ అనంతవర్మ చోడగంగదేవుని కోవలోనివాడు కాడేమోయని సంశయము పొడముచున్నది.

దాత:—

మనశాసనమునందలి దాత మహామండలికుడును, కదంబకులతిలకుడును అయిన శ్రీ ధర్మఖేడియొక్క పుత్రుడగు ఉదయాదిత్యుడు. గంగవంశపురాజుల కాలమున కదంబవంశజు లనేకులు గ్రామాధిపతులుగను, మండలికులుగను ఉండి ప్రముఖులైనట్లు గంగవంశజుల శాసనముల ననుసరించి తెలియవచ్చుచున్నది. మొదటి రాజరాజ దేవుని తండ్రి యగు అయిదవవజ్రహస్తుని (ఇతడు చిక్కాలవలసశాసనమున మూడవవజ్రహస్తుడుగ పేర్కొనబడియున్నాడు) ౧౫-వ విజయ రాజ్యసంవత్సరమగు ౯౭౬-వ శకవర్షమున కదంబకులతిలకుడును, పరమమాహేశ్వర పంచవిషయాధిపతియు నైన మహామండలేశ్వర రాణక శ్రీభామఖేడి కుమారుడైన రాణక శ్రీధర్మఖేడి 'ఉజణకునికి' (?) మహేంద్రభోగములోని మధిపథరఖండగ్రామమును దానముచేసిన శ్లోకశాసనము కలదు. ఈ తామ్రశాసనపు రాజముద్రికమీద గూడ గాంగవంశజ తామ్రశాసనరాజముద్రికాలాంఛనమగు నందిగాక మనశాసనముద్రికమీద వలెనే మధ్య అడ్డముగ మత్స్యమును, దాని దిగువ నంకుశమును గలవు. మరియొక వజ్రహస్తుని— (ఈ వజ్రహస్తుడు గాంగవంశజులలో ఎన్నవవాడో, వీనికిని గాంగవంశమునకు నెట్టిసంబంధము కలదో నిర్ణయించుట కింతవరకు ఏయాధారములును గానరావు)-పర్లాకిమిడి తామ్రశాసనమున మరియొక కదంబవంశజుడు కన్పట్టుచున్నాడు. అం దాతడు కదంబామలకులతిలకు డనియు, 'నిడుసంతి' వంశములోని వాడనియు జెప్పబడినది. అతని పేరు శ్రీ ఉగ్రఖేదిరాజు - హొన్సండిగ్రామపాలకుడు. మహారాజ శ్రీమదనంతవర్మ కుమారుడగు శ్రీదేవేంద్రవర్మయొక్క విశాఖపట్టణ తామ్రశాసనమున ఆరాజు తనమేనమామ యగు ధర్మఖేదిచే నుపదిష్టుడై యొక గ్రామమును దానము చేసినట్లు చెప్పబడియున్నది. అది గాంగశకము ౨౫౪ వ సంవత్సరమునాటిది. ధర్మఖేది కదంబ వంశజుడని యీ శాసనమున ప్రత్యేకము ఎచ్చటను దెలుపబడియుండలేదు. గాంగవంశజుల శాసనములలో పేర్కొనంబడుచుండు

కదంబవంశజుల నామములకు సూచకముగ నున్న ఖేడి, ఖేది పదము నామాంతమున నుండుటచేత ఈధర్మఖేదియు కదంబవంశజుడై యుండునని యూహించు చున్నాను. ఇంద్రవర్మయొక్క విషమగిరి తామ్రశాసనమున దూతకుడుగ నాగఖేడి యనునతడు ఇంకొకడు తెలియవచ్చుచున్నాడు. ఖేడి పదము నామాంతమున నుండుటచేత ఇతడుకూడ కదంబవంశజు డగునని తలంచెదను. ఈ విధమున 'ఖేడి' పదాంచితులైన కదంబవంశజులు గంగవంశపురాజుల కాలమున ప్రముఖులై ప్రసిద్ధులుగనుండినట్లును,ఉభయులకునుసంబంధబాంధవ్యము లుండినట్లును తెలియనగును.

రాణక శ్రీధర్మఖేడి పంచ విషయాధిపతి యగు రాణక శ్రీభామఖేడి కుమారు డని అనంతవర్మ బిరుదాంచితు డగు వజ్రహస్తదేవునిశాసనమువలన దెలియుచుండుటచేతను, గాంగశకము ౩౦౮నాటి అనంతవర్మ కుమారుడైన దేవేంద్రవర్మ శాసనమున అతనికి మాతులుడగు ధర్మఖేడియొకడు కన్పట్టుచుండుటచేతను,మనశాసనమునందలి దాత మహామండలికుడైన ధర్మఖేడియొక్క కుమారుడు ఉదయాదిత్యు డగుటచేతను వీరికి ఈక్రింది రీతిని బంధుత్వము కూర్ప బుద్ధిపుట్టును.

పంచవిషయాధిపతి
రాణక శ్రీ భామఖేడి
|
రాణక శ్రీ ధర్మఖేడి
|
మహామండలిక ఉదయాదిత్యుడు

కాని యిది సాధ్యమగునట్లు కనబడదు. అనంతవర్మ నామాంకితుడైన వజ్రహస్తుని శాసనము వలన దెలియవచ్చు రాణక శ్రీ భామఖేడి కొడుకైన రాణక శ్రీ ధర్మఖేడియు, అనంతవర్మ కుమారుడైన దేవేంద్రవర్మ శాసనమున అతనికి మాతులుడుగ జెప్పబడిన ధర్మఖేడియుగూడ నొక్క రనుటకు సాహసింపజాలను. ఏలయన మాతులు డని చెప్పబడిన ధర్మఖేడి గంగశకము ౩౦౮ నాటివాడు. ఈ శకము ౩౦౮ నాటిశాసనమునందలి అనంతవర్మ కుమారుడైన దేవేంద్రవర్మ అనంతవర్మ నామాంతరముగల వజ్రహస్తుని కుమారుడగు దేవేంద్రవర్మయను రాజరాజే అగుననుటకు కొంత ప్రతిబంధకము కలదు. ఇంతవరకు మనకు దెలియవచ్చిన కట్టకడపటి గాంగశక సంవత్సరము ౫౨౬. ఇది అనంతవర్మ కుమారుడైన మధుకామార్ణవ దేవుని శాసనమున నొసంగబడినది. గాంగశకము ౩౦౮ నాటి దేవేంద్రవర్మ వజ్రహస్తతనూజుడైన మొదటి రాజరాజే అయినయెడల మరి ౨౧౮ సంవత్సరములకు గాంగవంశపు రాజులలో మధుకామార్ణవ నామముగల రాజు ఉండవలెను. కాని గాంగవంశానుక్రమణికను జూచినయెడల మొదటి రాజరాజు పిదప ౨౧౮ సంవత్సరములకు నరసింహదేవ, భానుదేవాదులు పాలించుచుండినట్లు తెలియును గాని మధుకామార్ణవ నామధేయు డుండినట్లు తెలియరాదు. కావున గాంగశకము ౩౦౮ నాటి దేవేంద్రవర్మ మొదటి రాజరాజు కానేరడనుటకు ఇదియొక కారణము. ఒకవేళ ఈ దేవేం

ద్రవర్మ మొదటి రాజరాజే అని సంశయించి నప్పటికి మన శాసనమున ఉదయాదిత్యుని తండ్రిగ చెప్పబడిన ధర్మఖేడియు వజ్రహస్త, దేవేంద్రవర్మల శాసనములందు వచ్చు ధర్మఖేడియు నొక్కరు కానేరరు; ఏలయన వజ్రహస్తుడు శ. ౯౪౦-౯౯౨ నాటివాడు: ఆతని కొడుకు దేవేంద్రవర్మ నామాంతరముగల రాజరాజు శ. ౯౯౨-౧౦౦౦ ప్రాంతములవాడు. మన శాసనమునందలి దేవేంద్రవర్మ-మన శాసనమునందలి శకవర్ష సంఖ్యనే నమ్మినచో-మొదటి రాజరాజునకు నూరుసంవత్సరములు తరువాతివాడు. అట్లయినచో నూరుసంవత్సరములు వెనుకనున్న ధర్మఖేడి నూరుసంవత్సరములు తరువాతనున్న ఉదయాదిత్యునికి తండ్రియెట్లగును? ఇది యసాధ్యము. శాసనమునందలిశకవర్ష సంఖ్య తప్పైనను గావలెను లేదా ఉదయాదిత్యజనకుడగు ధర్మఖేడియు వజ్రహస్త దేవేంద్రవర్మల శాసనములందువచ్చు ధర్మఖేడియు వేఱువేఱు ప్రభువులైనను గావలెను.

స్థలవిషయము:—

రాజునుగూర్చియు, దాతనుగూర్చియు మనకింతవర కెంత తెలిసినదో స్థలవిషయమునను అంతే తెలియుచున్నది. 'పంచపాత్ర వీథీతమస్తు భవతా పఞ్చవీథరే వెనిజిగ్రామ'అనునది 'పంచపాత్రవిషయ నివాసినః సర్వాన్ జనపదా న్సమాహూయేత్థ మాజ్ఞాపయతి విదితమస్తుభవతాం పంచవిషయే రేవెనిజిగ్రామ' మని యుండవలెనేమో. ఇచ్చినది వెనిజిగ్రామమో రేవెనిజిగ్రామమో. విషయే అనుటకు విస(ష)రే అని పడినదన్న అది వెనిజిగ్రామమే కాదగును. కాని శాసనాంత్యభాగమున 'రేభిగ్రామస్య దాత్త మాడ దుఇ' అని యుండుటచేత రేభిగ్రామమే రేవెనిజి యేమో యని అది రేవెనిజియే కావచ్చునని సంశయించుచున్నాను. ఈగ్రామమునకు సరిహద్దులన్నియు రాళ్లలోను, రప్పలలోను చెప్పుటవలన గ్రామ మెచ్చటిదైనదియు చెప్పలేము. ప్రతి గ్రామమునకు ధాన్యాదాయమును, నిష్కాదాయమునుకూడ నుండును. 'రేభిగ్రామస్య దాత్త మాడ దుఇ'అను దానికి 'రేభిగ్రామమునకు వచ్చు నిష్కాదాయము రెండుమాడలు (మాడ దుఇ-ద్వయి)ను గూడ ఇయ్యబడిన' వనియర్థమని నే నూహించుచున్నాను. 'అపరదోలీ' "వడవేట" 'వడత్తర ప్రదత్తోస్మి' వీటికి అర్థమేమో నాకు తెలియరాలేదు. 'ఇచ్చుచున్నాను' అని యర్థమగుచున్నది కాని ఏమిటి ఇచ్చుట? అపరదోలి-వడవేట-వడత్తర-అనగా నేమో!

ప్రతిగ్రహీతలు:—

వృద్ధపుత్రుడు రేవననాయకుని కొడుకు నారాయణనాయకు డొకడు: 'ఆయితేయాసోమయాదు (?) ఈజణకు' డొకడు!

కాలము:

శాసనకాలము 'విజయరాజ్యస్యసకాబ్ద సహస్రమేక సతత్రయాధిక'మని శాసనమున తెలుపబడినది. దీని కర్థము పదకొండువందల మూడా లేక పదమూడువందలా యని శంక కలుగుచున్నది. గంగవంశపు శాసనములు పరిశీలించిన పదమూడువందలనాటికి నాలుగవ నరసింహదేవుడు రాజ్యముచేయు చుండినట్లు

తెలియవగును. ఇతనికి దేవేంద్రవర్మ యను నామాంతర మున్నట్లు తెలియరాదు. అది యునుగాక లిపి అంతటి అర్వాచీనమైనదిగ కనబడదు. అంతటి అర్వాచీనశాసనములలో దేనిలోను గూడ గంగవంశానుక్రమణిక యియ్యనట్టిది కాని, ఆవిధమైన గంగవంశ ప్రశస్తి యిచ్చినట్టిది కాని కానరాదు. అందువలన అది 'విజయరాజ్యస్య శకాబ్దసహస్రే ఏకశతత్ర్యధికే' అని యుండదగునని నాయూహ. అట్లయినచో ఈ శాసనము ౧౧౦౩-వ శక వర్షమునాటిది అనగా క్రీ. శ. ౧౧౮౧ నాటి దగును. ఇంతకన్న శాసనకాలమును గురించి ఎక్కువ నిర్ణయింపలేము. శాసనము ౧౧౦౩ నాటి దగునను భావముతోనే పై చర్చ అంతయు జరుపబడినది.

కళింగగంగ వంశానుక్రమణిక



(౧౨౫ పేజీ తరువాయి)

(నాల్గవ) వజ్రహస్తుడు (౩౫ సం.లు)

(ఐదవ) కామార్ణవుడు (౬ నెలలు)

(రెండవ) గుండమ (౩. సం.లు)

(ఆరవ) మధుకామార్ణవుడు=వినయమహాదేవి (౧౯ సం.లు)

* 1. (ఐదవ) వజ్రహస్తుడు=వంగమ(?) (౩౩ సం.లు)

2. (మొదటి) రాజరాజు=రాజసుందరి (౮ సం.లు)

3. అనంతవర్మ అను చోడగంగదేవుడు (౭౦ సం.లు)

కస్తూరికామోదినివలన
4. (ఏడవ) కామార్ణవుడు (౧౦ సం.లు)

ఇందిరవలన
5. రాఘవుడు (౧౫ సం.లు)

చంద్రలేఖవలన

6. (రెండవ) రాజరాజు (౨౫ సం.లు)

7. అనియంకభీముడు=బొఘల్లదేవి (౧౦ సం.లు)

8. (మూడవ) రాజరాజు=మంకుణదేవి (౧౭ సం.లు)

9. (రెండవ) అనంగభీముడు=కస్తూరాదేవి (౩౪ సం.లు)

10. (మొదటి) నరసింహదేవుడు=సీతాదేవి (౩౩ సం.లు)

11. (మొదటి) భానుదేవుడు=జాకల్లదేవి (౧౨ సం.లు)

12. (రెండవ) నరసింహదేవుడు=చోడదేవి (౩౪ సం.లు)

13. (రెండవ) వీరభానుదేవుడు=లక్ష్మీదేవి (౨౪ సం.లు)

14. (మూడవ) నరసింహదేవుడు=కామలదేవి (౨౪ సం.లు)

15. (మూడవ) భానుదేవుడు=హీరాదేవి (౨౬ సం.లు)

16. (నాలుగవ) నరసింహదేవుడు

17. (నాలుగవ) భానుదేవుడు

---

* ఈ సంఖ్యలు పరిపాలక క్రమమును దెలుపును.

# మూ ల ము *

## మొదటిరేకు : రెండవపెడ



౧. స్వస్తీ అమరపురానుకారీణ సర్వఋభ్యసీఖరమణీయు॰

౨. త సుధాధవల ప్రాసాదమాలా వీరతల్లలీతల్లాస్యా [త]

౩. దోర్దణ్డఖణ్డితసకలాల[ం*]క్రీత శ్రీకలా [ం*] గనగరా

౪. ధివాసకా మహే[ం*]ద్రా చలామలకనకసిఖర ప్ర[తి]ష్ట

౫. తస్య సచరాచరగురో సకలభువన సీమ్మాౣౖ

౬. కసూత్రధార  ససా[ం*]కచుడామణే భఋగవతో గోకర్ణస్వా

౭. మిన  చరణకమలజుగలప్రణామోదిగత కలీరలంకో నే

౮. కాహాయన[ం*]త్కోభ (॥) జనాతజయసవదప్రతాపావనాతస

---

* నాదగ్గరనున్న రేకుల ననుసరించి.

సవరించినచో మూల మిట్లుండదగునేమో:

౧. స్వస్తి. అమరపురానుకారిణః సర్వర్తుసుఖ రమణీయా

౨. త్ సుధాధవలప్రాసాద మాలావిరతిలాలితలోకాత్

౩. దోర్దణ్డ ఖణ్డిత సుబలాలంకృత శ్రీకళింగనగరా

౪. ధివాసకాత్. మహేంద్రాచలామల కనకశిఖర ప్రతిష్ఠి

౫. తస్య సచరాచరగురోః సకలభువన నిర్మ్మాణై

౬. క సూత్రధారస్య శశాంకచూడామణే భగవతో గోకర్ణస్వా

౭. మిన శ్చరణ కమలయుగళ ప్రణామా ద్విగతకలికలంకో ఒనే

౮. కాహవ సంక్షోభ జనిత జయశబ్దః ప్రతాపావనత స

రెండవ రేకు : మొదటిపెడ



౯. మస్త సామ[ం*]తచక్రచూడామణీప్రభవ మ[ం*]జరీపు[ం*]జర [ం*]

౧౧. జీతనీజనీత్ర[ం*]సధారో పకలీ[ం*]గాధిరాజ దుర్వార వైరీవా

౧౧. రణకు[ం*]భస్థలదలదలీతము క్తికాప్రకరధ్వస్తారాతీకు

౧౨. లాచలో నయవీనయ దయాదానదాఖిన్యసఉయో ధాయర్

౧౩. సత్యత్యాగిప్రకరగుణస[ం*]పదాధారభుతో పరమమా

౧౪. హేస్వర పరమభటారక గ[ం*]గామ[ల]కులతీలక శ్రీదే

౧౫. వే[ం*]ద్రవమ్మస్య వీజయరాజ్యన కాద్దస[హ]స్ర మేకసత్త్ర యా

౧౬. ధీక ద[ం*]తిపురే స్థితో । తస్య మాణ్డలీకకద[ం*]వకులతీ

---

౯. మస్త సామంతచక్ర చూడామణి ప్రభా మంజరీ పుంజ రం

౧౦. జిత నిజ నిస్త్రింశ ధారోపార్జిత సకల కలింగాధిరాజ్యః దుర్వార వైరివా

౧౧. రణ కుంభిస్థల దలనళిత మాక్తిక ప్రకరః ధ్వస్తారాతిప

౧౨. లావలో నయ వినయ దయా దాన దాక్షిణ్య శౌ యౌదార్య

౧౩. సత్య త్యాగ ప్రకర గుణ సంపదాధారభూతః పరమ మా

౧౪. హేశ్వరః పరమ భట్టారకః గంగామలకులతిలకః శ్రీదే

౧౫. వేంద్రవర్మా. విజయరాజ్యస్య శకాబ్ద సహస్రే ఏకశతత్ర్య

౧౬. ధికే దంతిపురే స్థితః తస్య మణ్డలికః కదంబకులతి

౧౯౩౭-వ సంవత్సరమున పాశ్చాత్యస్త్రీలు సిగరెట్టు త్రాగునపుడు ఇట్టి యుడుపులను ధరింతురట



'పవ్‌లావా' అను నర్తకి
హంసనర్తనము చేయుచున్నది.
ప్రపంచములో నుత్తమనర్తకి యని యీమె పేరుగాంచినది

౧౯౭౮-వ సంవత్సరపు పాశ్చాత్య కన్య
భవిష్యన్నాగరకత

410

రెండవ రేకు : రెండవ పెడ



౧౭. లకమాహామాణ్డలీక శ్రీధమః ఖేడీ॥తస్యపుత్రో మహా
౧౮. మాణ్డలీక శ్రీఉదయాదిత కుసలీ సవక్ష్చపాత్ర వీదీ
౧౯. తమస్తు భవతా పఙ్చవీస రేవెనిజగ్రామ ఉదకపుర్వః కి
౨౦. తా వ్రసీసనీకృత్య ప్రధ్ధపుత్ర రేవన నాయకస్య పుత్ర
౨౧. నారాయణనాయకస్యమేకభాగ ఆఇతయా(?) సోమయాదు
౨౨. ఈజణకమేకభాగకృతప్రదత్తో రస్మాభీ అచటభట
౨౩. చద్రార్కవచ రే॥సీమాలి [ం*]గాని లిఖ్య[ం*]తే॥ ఈసానే త్రికుట
౨౪. రోపితే సీలా॥పుర్వేణ రోపితసీలా॥ అగ్నేయా

---

౧౭. లకః మహామణ్డలికః శ్రీధమః ఖేడీ. తస్య పుత్రః మహా
౧౮. మణ్డలికః శ్రీఉదయాదిత్యః కుశలీ. పంచపాత్రవిషయ నివాసినో జనపదా న్సమాహూయ ఇత్థ మాజ్ఞాపయతి. విది
౧౯. తమస్తు భవతాం. పంచవిషయే రేవెనిజి గ్రామ ఉదకపూర్వకం కృ
౨౦. త్వా తామ్రశాసనీకృత్య వృద్ధపుత్ర రేవనాయకస్య పుత్రాయ
౨౧. నారాయణా యైకభాగమ్ ఆయితయా సోమయాదు (?)
౨౨. ఈజణ కా యైక భాగం కృత్వా ప్రదత్తో స్మాభి రచాట భట ప్రవేశ్య మా
౨౩. చంద్రార్కక్షితిసమకాలమ్. అస్యగ్రామస్య సీమాలింగాని లిఖ్యంతే. ఈశాన్యతః త్రికూటే
౨౪. రోపిత శిలా. పూర్వతః రోపిత శిలా. ఆగ్నేయతః

మూడవ రేకు: మొదటి పెడ



౨౫. చ తుకుటరోపితసీలా॥మధుపవృఖతలే రోపితసీ
౨౬. లా దఖణే భుమి పర్వతితలే రోపి[తసీలా]॥నఇ
౨౭. ఋతే లేవురు ప్రిఖతలే రోపితసీలా [॥*][పచ్ఛి(?)]మే జయతి
౨౮. గదా॥వాయవే రోపితసీలా॥ఉతరో రాపిత
౨౯. సిల॥ శేఖిగ్రామస్య దాత్త మాడ దుఇ ౨ అపర
౩౦. దోలీ వడవేట వడత్తర ప్రదత్తోస్మి[॥*]



రాజముద్రిక

౨౫. చ త్రికూటే రోపిత శిలా॥ మధువృక్షతలే రోపిత శి
౨౬. లా॥ దక్షిణతః పర్వతభూమితలే రోపిత శిలా॥ నై
౨౭. ఋత్యతః లేవుర (?) వృక్షతలే రోపిత శిలా॥ పశ్చిమతః 'జయతీ'
౨౮. గర్తః॥ వాయవ్యతః రోపితశిలా॥ఉత్తరతః రోపిత
౨౯. శిలా॥ శేఖి (?) గ్రామస్య మాడ ద్వయీ ౨ దత్తా॥ అపరే
౩౦. దోలీ॥ వడవేట॥ వడత్తర ప్రదత్తోస్మి 1॥

1. (దిగువగీటుగీసిన భాగమునకు అర్థము తెలియ వచ్చుటలేదు.)

# శ్రీ దేవీ అన్నపూర్ణాస్మృతి

శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ గారు

"అన్నపూర్ణాస్మృతి" యటంచు నకట! హృద్వి-దారకంబగు నీ పెనుఘోరవార్త
పాడుచేతులతోడ నీనాఁడె వ్రాయ-వలసివచ్చుటఁ దెలియ స్వప్నమున నైన.

ఉ. హా! విదుషీమణీ! ప్రముఖి! హా! సుగుణాశ్రయ! హా శుభాంగి! హా!
పావని! లోకయాత్ర గడుపందగు మేల్విధి నీ స్వజాతికిన్
గైవసమిచ్చి నీకు ధరఁ గల్గిన కార్యముఁ దీర్చి మా కిటన్
నీవిమలాత్మజీవితము నేర్చి మనుండని చెప్పిపోయితే!

ఉ. హా! నవపద్మకోరకమ! హా! మణిహారమ! హా! సతీమణీ!
హా! నవనీతపేశలమ! హా! వినయాన్విత! భారతాంగనా
నూన మహానిధానమ! వినూత్న కళాకలితా! దయానిధీ!
హా! ననుఁ బాసి పోవఁదగునా! సఖి! పెన్వగ ముంచి నేఁడిటన్.

చ. చదివితి పెక్కు గ్రంథములు సాధ్వి తెలుంగిడియంచు నట్టి నీ
చదివిన గ్రంథసారముఁ బ్రశస్తి నొనర్చితివమ్మ, నీకు నీ
సదమలబుద్ధివైభవము చక్కఁగ నెక్కుడఁదక్క! భారతీ
సదనము వన్నెకెక్కునని చాలగ నమ్మితిమమ్మ! సోదరీ!

గీ. "దేశమునకె పుట్టి దేశమ్మునకె నిల్చి దేశమునకె చచ్చితీరవలయు"
నను మదగ్రజునుడిఁ గని చాలఁ బతియించి - నావు సార్థకం బొనర్చినావు.

చ. వరగుణయుక్తవైన నినువంటి సతీమణి మాకు దుర్దశా
పరులకుఁ దక్కునే? కులము వన్నియ కెక్కఁగఁ బుట్టినింటికిన్
బరువముఁ జొచ్చునింటికి నవారితకీర్తియుఁ దెచ్చునట్టి న
చ్చరితమునన్ మెలంగవె? నిజంబుగ నేమన నేర్తు సోదరీ!

సీ. ప్రథితమా కలగరాన్వయసుధావారాశి - గణనీయ కౌస్తుభమణిగఁ బుట్టి
ప్రఖ్యాత మాగంటివంశపయోధిఁ బూ - తమ్మొనరింపఁ బాదమ్ము పెట్టి

విమల గుణాకరు విజ్ఞాననిలయుని - శ్రీబాపినీడ్వీధుఁ జెట్టవట్టె
లలితకావ్య కళావిలాస పాండిత్య ధీ - విభవ చాతురి వినువీథి మెట్టె
మహిత గుణముల నెల్లరి మనసుఁ బట్టె - అతుల నిస్స్వార్థపరత మహాత్ముఁ దట్టె
తలఁపులో నెల్లవారి కుత్తలము సుట్టె - అట్టె! మటుమాయమైతె దవాగ్ని నెట్టె?

సీ. పెన్నిధివని నమ్మి ప్రేమఁ బెంచిన తల్లిఁ - దండ్రుల కేమని తరలితమ్మ!
పంచప్రాణములఁ బ్రేమించి యుప్పొంగు నా - త్మేశున కేమని యేఁగితమ్మ!
పాలుపీడని ముక్కుపచ్చలారని ముద్దు - బిడ్డ కేమని చెప్పి వెడలితమ్మ!
నిను నమ్మి నీవె దిక్కనియున్న బీదసా - దల కేమిగతిచెప్పి తొలఁగితమ్మ!
దేశభక్తుల కేమని తెల్పితమ్మ! - సంఘసంస్కర్తలకు నే మొసంగితమ్మ!
అస్మదాదుల కేమని యంటివమ్మ! అన్నపూర్ణమ్మ! మాయమ్మ!! యరిగితమ్మ!!!

మ. కలుపుంగోలుతనంబు సౌమ్యతయు నిష్కాపట్యమున్ తాల్మి ని
మ్మలవైదుష్యవివేచనాపటిమ సంపూర్ణంబుగా నీవి; వ
త్సలతాత్వంబు నితాంత ప్రేమమును సౌజన్యంబు కారుణ్యమున్
చెలియా! నిక్కము నీదుసొమ్ములుగదే! చింతింప నిం కేటికిన్?

గీ. మఱతుమన్న నీరూపంబు మఱపురాదు - మఱతుమన్న నీగుణములు మఱపురావు
మఱతుమన్న వైదుష్యంబు మఱపురాదు-మఱవఁగల దేది యింక? నో మాన్యచరిత!

గీ. ప్రాజ్ఞ వగు నీవె మున్ను ముప్పదిదినముల - నీసుతునికిఁ గన్నీరు మున్నీరుగాఁగ
నేడ్చి తిపు డెట్లు పితరు లీ క్రూరమైన - గర్భశోకాగ్నిఁ దరియింపఁగలరు తల్లి!!

చ. నినుఁ గన నెన్నఁడేనియును నేఁ జనుదేరఁగ "నేదియేది నూ
తనముగ నేమి వ్రాసితివి? దాఁచితె? చూపక" యంచుఁ డీయుచున్
ఘనమగు ప్రేమ నిండుకొనఁగాఁ గొని చూచి పఠించి యెంతయో
మనమున సంతసించెదవు మన్ననఁ జేసెడువార లేరిఁకన్.

సీ. నవ్యరీతి ద్విజేంద్రు నాటకంబులఁ దెల్గు - నొనరింతునంటి వెం దునిచితమ్మ!
విజ్ఞానధారల వెదఁజల్లు రామకృష్ణు - నిబోధ కెటు దారిఁ జూపితమ్మ!
ఘనమైన గీర్వాణ గ్రంథరత్నముల భా - షాంతరీకృత మెట కనిపితమ్మ!
అనుపమరీతి నాంధ్రాంగన నలరింతు - నని పల్కితివి యెందుఁ జొనిపితమ్మ!
అకట! ఇరువదియైదేండ్లైన రాక - మున్నె భవదాఖ్యను సువర్ణములను బూర్వ
పుణ్యవతుల నామావళిఁ బొందుపఱిచి - చదువుకొనుఁడని వైకుంఠపదవిఁ గంటె.

ఉ. భావము లుద్భవిల్లను బ్రవాహముగా లిఖియింప శక్తి నీ
డావిధి వంగభాషఁ గలయట్టి యమూల్యపు గ్రంథరాజముల్
నే వచియించెదర్ జదివి నీవు లిఖింపఁగదమ్మ! యంటి వో
దేవి! నిరాశఁ జేసి యది దివ్యపథంబును జూరఁగొంటివే.

ఉ. ఎన్నఁడొ నీవు నేనుఁ బ్రకృతేచ్ఛల వీడి మహాత్ముచెంత నా
త్మోన్నతి నంద నే గుడ మింతోధికసౌఖ్యము లేదు; వలయు
న్నన్నిదినాలు బంధములె? యంటివి తద్విధి మిథ్యఁ జేసి హా!
క్రన్నన స్వర్గధామమును గాంచితె? నన్విడనాడి పోయితే?

ఉ. గారవ మొప్ప నాసుతునిఁ గన్గొని లాలనఁ జేసి ప్రేమ నిం
డారఁగ నెత్తి ముద్దులిడి యక్కునఁ జేర్చి ముదాప్తి మా జబిలాం
దారని పల్కుచుందువుగదా! సతతం బమృతోపమానమౌ
కూరిమి మీరు నీదు పలుకుల్ మఱువన్ వశమే సహోదరీ!

చ. కనుఁగొన దేశసేవకయి గాంధిమహాత్ముఁడు ఖాదిదీక్షఁ గై
కొని వడిఁ గార్యరంగమున కుర్కి దిగ నెన్నఁడొ, నాఁడె భర్తతో
డ నమెరికాకుఁ బోవుట చటాలున మాని మహాత్మునాజ్ఞఁ గై
కొని దిగి కార్యభూమికి సకుంఠిత సేవ యొనర్చి మించితౌ.

మ. మనమం దద్భుతమంద నెల్లరును సన్మాన్యంబుగా దేశసే
వనుగావింపుచు నొక్కవర్షమున నే బ్రహ్మాండమైనట్టి "మో
హనదాస్ ఖాదిపరిశ్రమాలయము" నాహా! స్థాపనన్ జేసి తా
పసి నీకే తగు సాధ్య మేరి కిఁక నంబా! యన్నపూర్ణాసతీ!!

సీ. ద్విజ ద్విజేతరుల వర్ధిలు నతిబాల్య వి-వాహంబులకు నెంత వగచితమ్మ!
అనదల శరణాలయస్థాపన మొనర్పఁ-గొనకొని యెంతగాఁ గుందితమ్మ!
స్త్రీవిద్య, శిశువిద్యఁ బృథుగతి బునరుద్ధ-రింపఁగా నెంత చింతించితమ్మ!
అస్పృశ్యదోషంబు హరియింప నిమ్నజా-తులఁ బ్రోవఁగా నెంత దలఁకితమ్మ!
ఖద్దరు మహోద్యమమున కేగతిని స్వీయ-రక్తపుం బొట్లు ధర సదా రాల్చితమ్మ!
అన్నిటిఁ దలంచుకొనుచు జన్మాంతమును వి-చారపడుఁడని స్వర్గంబుఁ జేరితమ్మ

సీ. స్త్రీలకు విశ్వవిద్యాలయం బత్యంత-మావశ్యకంబని యనయ మందు
ఆరోగ్య మొక్కింత యనుకూలమైన సం-స్థాపింప మది సదా తలఁచుచుందు

కలరు ఉన్నతవిద్యఁ గాంచిన సతులువా-రలె యొజ్జలుగఁ జేరవలయు నందు
మనమెల్ల నిర్మలాత్మల ఘనకృషి చేయ-కున్న ప్రయోజనం బుండ దందు
ఎపుడొ శుభదినములు సమీపించు టంచు-దీర్ఘనిశ్శ్వాస మొక్కటి దీయుచుందు
కటకటా! విస్మరింపుచుఁ గలఁతపడక-ధైర్యము వహించి చరియింపఁ దరమె తల్లి!

గీ. హృదయశోకంబు నిలఁ బ్రవహింపఁజేసి-యాత్మభారంబు వీడుట యంతె కాని
కనులు వోవంగఁ గాయలు కాయునట్టు-లెంత యేడ్చిన లాభ మింతేనిఁ గలదె?

చ. వరచిరవాంఛితంబులు నవశ్యకృతంబులునై వెలార్చు నీ
గురుతర కార్యసంతతులకున్ ననుఁబోఁటులు చాల రైన శ్రీ
హరికృప యున్న సర్వము జయప్రదమౌ నటులౌట నాపరా
త్పరుని మదిం దలంచుచు నితాంతకృషిం బొనరింతు సోదరీ!

ఉ. పరమ పతివ్రతామణివి పావనమూర్తివి నిష్కళంకస
చ్చరితవు శారదాకృతివి సాధ్విని సర్వసమానవృత్తి యశో
భరితవు సత్యశీలవు నపారకృపాబ్ధివి ప్రేమమూర్తి నీ
శ్వరగుణపానమత్తవు ధ్రువంబుగ నీ కెన వేరు నెచ్చెలీ!

సీ. పెద్దలకడఁ జేర్మిఁ బితరులయెడఁ గూర్మి-గన నీకు నీవె నిక్కముగ సాటి
పతియందు భక్తి సంతతిఁ గడు ననురక్తి - తలపోయ నీవె సత్యముగ సాటి
చెలులందుఁ బ్రేమ బీదలయందు దాక్షిణ్య - భావంబునకు నిజ మీవె సాటి
దేశీయులం బ్రీతి దివిరి యాత్మీయుల - యెడ సానుభూతికి నీవె సాటి
అస్మదాదులమౌ భవదాత్మబంధు - జనులఁ బ్రేమానురాగవాత్సల్యగరిమఁ
గన నినువినాగ వేరు నెందునను లేరు - నీకు నీవొక్కతెవె సాటి నిశ్చయముగ.

గీ. భారతీయుల దౌర్భాగ్యవశమువలన - వ్యాధి హెచ్చి యారోగ్య మత్యంతక్షీణ
గతిఁ గనిన పెద్దలెల్లరు నతిగఁ బట్టు - పట్టిన మహాత్మునంతటివాఁడుగూడ
వ్రాసినను ధృతి సెడి యాత్మవ్రతము విడిచి - సత్యపథమును విడి యహింసావ్రతంబు
దూల్చి ధర్మముతప్పి ఈతుచ్ఛమైన - యసువులకుఁ బ్రతిజ్ఞాభంగ మగుట నొల్ల
ఈశ్వరుఁడుగాని ద్రుంప రక్షింప కర్త - మనమనుట వెఱ్ఱి ఈమాత్ర మునకు మనుట
కల్లయని కోడిగ్రుడ్లను నొల్లనట్టి - నీప్రతిజ్ఞ మిక్కిలి వర్ణనీయముగద!

సీ. నీమీఁద నిజమైనప్రేమ యుండిన నీ మ - హాశయంబులఁ దీర్చ నమలబుద్ధి
ఆమరణాంతంబు స్వార్థంబుఁ ద్యజియించి - పలుకష్టనిష్ఠురములకు నోర్చి

రక్తమాంసములు ధరాతలంబున నోడ్చి - చిరకృషిచేసి సంసిద్ధి నొంది
భవదాత్మ సంతృప్తిపఱచి మాతృ-ణంబు - దీర్చి నీదరిఁ జేరవలయు
నంతియేకాని భ్రమకులోనై నిరంత-రంబు దుఃఖింప నేమిలాభంబు వెఱ్ఱి
గాక శాశ్వత మెవరు లోకంబునందు? - శాశ్వతము శుభాశుభ కర్మచయము గాక.

చ. చింతిల నేటికమ్మ మృతిచెందె రటంచు వివే కమేది య
శ్రాంతము నిత్య మెయ్యది? ధరాస్థలి విభ్రమమొందె కాక నీ
మంతులు ఆత్మసత్యమని పల్కు-దు రింక శరీరమందుమా
భ్రాంతి, విసర్జనీయమగు వస్త్రముకైవడి సోదరీమణీ!

గీ. సాధ్వి, నీ కాత్మశాంతి, హృచ్ఛాంతి మాకుఁ - గలుగ హరి వేఁడి పద్యసూత్రమాలఁ
జేసితిని ఇంకఁ ద్వదభీష్టసిద్ధికొఱకుఁ - జీవితాంతంబునుం గృషి సేయుదాన.

---

# మంగళమ్

విద్వాన్ కవితిలక కంచనపల్లి కనకమ్మ గారు

కేదారగౌళ రాగము-ఆదితాళము

మంగళం రామాయ-మానల్లభాయ
సంగీతలోలాయ-శంకరాప్తాయ.

౧. ఆనందరూపాయ-హంసవేద్యాయ
జ్ఞానాధికరణాయ-కైవల్యదాయ. మం.

౨. దశరథతనయాయ-ధర్మరూపాయ
కుశలవజనకాయ-కోమలాంగాయ. మం.

3. కర్తృకర్మక్రియా-కలితరూపాయ
భర్తృభార్యాకేళి-పరవంచనాయ. మం.

౪. కోదండరామాయ-గూఢచర్యాయ
కోదండభంగాయ-కువలయేశాయ. మం.

౫. యమునాశుభాంగాయ-యాదవేంద్రాయ
కమనీయరూపాయ-కామితార్థాయ. మం.

౬. ప్రహ్లాదవరదాయ-పరమహంసాయ
ప్రహ్లాదవరదాయ-పరమేశ్వరాయ. మం.

౭. భూరికల్యాణాయ-బుధసేవితాయ
సారసనేత్రాయ-సద్భూషణాయ. మం.

౮. శ్రీగిరినిలయాయ-శ్రీనివాసాయ
భోగీంద్రతల్పాయ-పురుషోత్తమాయ. మం.

[వ. రా.—దీనిని ద్విపదగాగూడ చదువవచ్చును.]

---




# పంచరత్నములు

కావ్యకంఠ గ్రంథి సూర్యనారాయణశాస్త్రి గారు

అర్పయే ఽంజలి మహం కుసుమానాం పాణిపంకజయుగే భవదీయే;
మంత్రివర్య! కరుణా మసృణై ర్మాం పాల యాశ్రిత మనూనకటాక్షైః.

శ్లో. అద్యాసీనే భవతి సుదినే మంత్రిపీఠే మ్మహార్హే
సర్వే పౌరా శ్శిథిలితమనోవ్యాధయ స్సాధువాదాః;
శిష్టా స్తుష్టా అపిచ సుధియ శ్శీర్ణదారిద్ర్యఖేదా
వేదోక్తాశీర్వచననిచయం చక్రు రానందమగ్నాః.

శ్లో. విద్వన్! భూసురవర్య! సంతి బహవః పృథ్వీతలే మంత్రిణః
కింతు త్వత్సదృశా న సంతి కవితా సారస్య సంవేదినః;
తద్వ త్సంతి బుధా న సంతి కవయో నిర్దుష్టవాగ్వైభవా
నానాగ్రంథవిచారచారుమతయః కాలే కలౌ మాదృశాః.

శ్లో. యత్పాణిస్థితలేఖనీ ఋజుపథే సంచారిణీ సాత్త్వికీ;
సంఖ్యావర్ధితకారిణీ నిజముఖోద్గీర్ణై స్సువర్ణై శ్శుభైః,
సోఽయం వేంకటరంగయేతి విదితః ప్రస్ఫీతకీర్త్యుజ్జ్వలః
స్థేయా న్మంత్రిపదే మహీయసి దయాశాలీ సుశీలీ చిరమ్.

శ్లో. ఇతోఽప్యధికసంపత్తి, మితోఽప్యధికవైభవమ్;
ఇతోఽప్యధికమేధాం చ, దద్యా త్తే పరమేశ్వరీ.

---



మిస్. స్లేడుకన్య
అడ్మిరల్ స్లేడుగారికుమార్తె ఈమె మహాత్మా
గాంధికి శుశ్రూష చేయుచు వారి ఆశ్రమమునను౦డును.



శ్రీయుత లక్ష్మీసుందరరామ్‌గారు
**M. A., F. R. Econ. S. (Lond.)**



మిస్ కేథరైన్ మేయో
శ్రీవనిరసనమునకు గుఱియైన ' భారతమాత ' యను
గ్రంథమును రచియించిన అమెరికాదేశపు స్త్రీ.
ఈమె అమెరికాలోనున్న పుడు తీసిన ఛాయాచిత్రమిది.



శ్రీ రోబిన్ చటర్జీగారు
వీరి నివాసస్థానము అలహాబాదు. వీరు బొంబాయివద్ద
సముద్రములో ముప్పదిమైళ్ళ మేర $12\frac{1}{2}$ ఘంటలకాలమున
ఈదగలిగిరి. భారతీయు లెవ్వరు నిదివఱ కిట్టి యద్భుత
సామర్థ్యమును జూపరైరి.

# గురుదక్షిణ*

వెమురుగూడ్ వెంకటకృష్ణారావు గారు

శ్రీరమణీశోభితశ్యాం
గారహృదయ సంజనిత జగల్లీలావ్యా
పారి, యనంతుఁ డనంత
శ్రీరాజితుఁ జేసి నిన్ను క్షితినిమనుచుతన్!

గీ. సర్వదోషాపహారక శక్తి యగుచు,
తాఁకుమన్న తీర్థంబుగాఁ దనరఁ జేయు
విమలగంగాప్రవాహమై వెలయుఁగాదె
నీయకలుషితజీవిత మోహనతీంద్ర!

గీ. ప్రాణతేజ మిచ్చి పాలించు లోకంబు
లోకబాంధవుండు; శ్రీకరముగు
జ్ఞానతేజ మిచ్చి మానవాత్మలఁ బ్రోచు
దీనబంధు వీవు, జ్ఞానయోగి!

గీ. నీదుధర్మపరత, నీయేకపత్నీత్వ,
మింటిపేరు నరసి, యెంచుచుందు
రాఘవుండ వనుచు, రఘుపతి వేంకట
రత్నగురువరేణ్య! రాజమాన్య!

గీ. తొలుత నే నెంతపుణ్యంబు సలిపినానొ
నీపద సరోరుహముల సన్నిధిని మెలఁగ!
తృణసమానుఁడ, దయయుంచుమనఘచరిత!
అదియె చాలు హేమాద్రినై యలరుటకును!

---

## శ్రీయుత లక్ష్మీసుందరరామ్‌గారు M. A. F. R. Econ. S. (Lond.)

ఈయన ఆంధ్రవైదికయువకుడు. ఇరువది రెండు వత్సరముల ప్రాయము. మచిలీపట్టణము జన్మస్థానము. బందరునోబులు కళాశాలయందు పట్టపరీక్షలో రెండవ తరగతియందు ఉత్తీర్ణుడై, మద్రాసు విశ్వవిద్యాలయమున యం. ఏ యందు కృతార్థుడై, లండను "రాయల్ యికనామిక్ సొసైటీ" యందు సభ్యత్వమును సంపాదించి, చిరకాలప్రాయముననే కీర్తిగాంచినాడు. ఈవత్సరము, కాకినాడవారి "సత్యలింగం ధర్మనిధి" సహాయమును బొంది ఇంగ్లాండునందు మాంచెస్టరునందు, 'యికనామిక్స్' నందు డాక్టరేటును, ఐ. సి. యస్ డిగ్రీయును పొందుటకు, అక్టోబరు ఎనిమిదవతారీఖున పయనమై పోయినారు.

ఈతడు తనకును, తనదేశమునకుగూడ కీర్తిదెచ్చు నను టను సందియము లేదు. ఆదేశమం దున్నత పరీక్షల నిచ్చి, సంపూర్ణప్రజ్ఞావంతుడై, శాస్త్రీయతత్త్వసంపన్నత నార్జించి, విజ్ఞానవాటికలందు స్వైరవిహారణచేసి, సాహితీ సింహాసనమునుండి నిజ్ఞానోత్తేజిత రత్నదీపికలను దెచ్చునో వేచి చూచెదము; మాది సంతసించెదము. ఈశ్వరు డితనికి పరిపూర్ణాయురారోగ్యములను ప్రసాదించుగాక!

[వెం. నా.]

---

* నాగురువర్యులగు శ్రీ దివాన్‌బహద్దూర్ సర్ రఘుపతి వేంకటరత్నంనాయుడుగారి యఱువదియైదవ జన్మదినమహోత్సవసందర్భమున వందనపూర్వకముగా సమర్పించిన పంచరత్నములు. [వెం. కృ.]

# *భరతుఁడు - ఆత్మోపదేశము

భాగవతుల నృసింహ శర్మగారు

మునులున్ దేవతలున్ మహర్షివరులున్ మోక్షంబుఁ గాంక్షించి, యె
వ్వనిపాదాబ్జమరందపాననిరతిన్ వ్యామోహముం జంపి, పా
వననామంబు జపించుచుండు రతనిన్ వర్జించి భోగింతువే?
మనసా! దేహము శాశ్వతంబె? వినుమా, మా రాము సేవింపుమా.

మ. "జననాథుల్ భువి లేరొ? భోగపరులై శాసింపరో రాజ్యమున్
మునులున్ మేలని సన్నుతింపఁగఁ దుదిన్ మోక్షంబుఁ గాంక్షింపరో"
యని వాదించెదవేమొ, జ్యేష్ఠునకు నర్హం బెందు సామ్రాజ్య మో
మనసా! రాజ్యముఁ గోరరాదు వినుమా, మా రాము సేవింపుమా.

మ. జనకున్ మాటల మోసపుచ్చి, వసుధన్ శాసింప నాసించి, యా
తనిజీవంబు హరించి, జ్యేష్ఠసుతుఁ గాంతారంబునం బెట్ట నా
జననిన్ దేవతఁగా భ్రమించెదవె? సంసారంబు నిస్సార మో
మనసా! యాశకు లొంగరాదు వినుమా, మా రాము సేవింపుమా.

మ. తనయుం డంచును తల్లిదండ్రులు, జనుల్ ధాత్రీశ్వరుం డంచుఁ, బా
వనుఁ డంచున్ ఘనుఁ డంచు బ్రాహ్మణులు, సద్భక్తుల్ శివుం డంచు, నె
వ్వనినామంబు స్మరించుచుండు రతనిన్ భావింపుమా నిత్యమున్
మనసా! మాయకుఁ జిక్కరాదు వినుమా మా రాము సేవింపుమా.

మ. దనుజుల్ కొందఱధర్మకర్మపరులై ధాత్రిన్ విజృంభింప, యా
తన సైరింపఁగలేక లోక మకలన్ ధర్మావనార్థంబు, భూ
జనులన్ గారణజన్ముఁడై వెలసె సాక్షాద్విష్ణు శ్రీరాముఁడై;
మనసా! ధర్మపథంబుఁ బట్టి చనుమా; మా రాము సేవింపుమా.

మ. జననాథుల్ బలవంతులై స్థిరము లైశ్వర్యంబులన్ భావనన్
కవకాంగీ కనకంబులన్ మరగి కొక్కుండైనఁ గొంపోయెనే
తనతో రాజ్యము, లేక కాలయమునిన్ దండించి జీవించెనే?
మనసా, శాశ్వత మింకనైన మనసా! మా రాము సేవింపుమా.

---

* శ్రీ తులసీరామాయణము, అయోధ్యాకాండమున ద్వితీయభాగమునుండి.

మ. జనుఁ డెవ్వండు దరిద్రుఁ డెవ్వఁడు మహాసంపన్నుఁ, డేవేళ కేన్
దిని జీవింపనివాఁ డెవండు? మఱిఁ దృప్తిన్ బొందువాఁడే క్షితిన్
ధనికుండంచు నెఱుంగుమా! సిరికి సంతాపించుటే సౌఖ్యమా?
మనమా! భోగవిలాసముల్ విడువుమా! మా రాము సేవింపుమా.

ఉ. ఎట్టులొ రాజ్య మబ్బెను, గ్రహింపవు మూఢుఁడ వంచుఁ బల్కెదేన్
బుట్టుకతోడ భాగ్యముల భోగములన్ గొనివచ్చితే? సిరిన్
గిట్టినవేళఁ జేకొని సుఖింతువె స్వర్గపురంబునందు? నీ
కట్టి విచార మేల? మనమా! రఘురాముని నాశ్రయింపుమా.

మ. అని యిట్లా భరతుండు ధర్మనిరతుం డాత్మోపదేశంబునన్
దన దీక్షన్ బ్రకటింప రాజసభలోఁ దద్ధర్మవాక్యంబులన్
విని శిష్టుండు వసిష్ఠుఁ డాత్మ నలరెన్ పృథ్వీసురుల్ మెచ్చి హె
చ్చిన భక్తిన్ గడు నుత్సహించి రడవిన్ శ్రీరాము దర్శింపఁగన్.

---

# ఏమొ!

"కలిసి మెలఁగినపొలుపు కలఁగన్న యులుకేమొ!"

* యమ *

(హారితకృతము)

౧

పొలయల్క మఱుఁగునన్ - మొలకనవ్వుల మెఱుపు
గులికించి నావలపుఁ-గొల్లలాడిన చిన్ని—
పొలకువే కఱవయ్యెనే-గుండెలో-
కలఁత యే బరువయ్యెనే!

౨

అలరుసెజ్జల మ్రొగ్గి-యలికిడికిఁ జెవి యొగ్గి
.........ముచ్చట్ల-కతల వేగించునా—
—పొలకువే.

౩

నిలువుటద్దము చెంత-నిలిచి మురిసిన వింత
చెలిమి చీటీమీఁదఁ-జల్లుపెట్టిన దేమొ!
—పొలకువే.

౪

తలఁపు మేడలలోన-వలపు వెన్నెలసోనఁ
గలిసిమెలఁగినపొలుపు-కలఁగన్నయులుకేమొ!
—పొలకువే.

---

*లయానుగుణముగ సురట ముఖారి, కేదార, హిందూస్థాని తోడి రాగములలో దేననైనపాడుకొనవచ్చును.—హారిత.



## అమెరికనులు నేరస్థులను పెట్టు చిత్రహింస

'న్యూరిపబ్లిక్' పత్రికవలన నిట్లు తెలియవచ్చుచున్నది.

"కొలదికాలము క్రిందట - ఇద్దఱు ముదుసళ్లను, సంపెనను నేరముపై 'లక్స్టరు లీ' అను నాతనిని, న్యూయార్కు-పట్టణమున ఖైదుచేసిరి. తనచే తప్పిదము నొప్పింప జేయుటకై పోలీసువారు వివిధ్రవిధానముల తనపై ప్రయోగించిరనియు తత్ఫలితముగ తన రెండుప్రక్కల ఎముకలు విరిగి యొడలంతయు గాయములతో నిండెననియు, తనతలవెంట్రుకల నూడబెరికిరనియు, విపరీతముగు బాధ కలుగునట్లు తనకాలుసేతులను మెలిపెట్టిరనియు, చాల అహోరాత్రములు కంటిపై రెప్పవాల్చనీయక నేరము నొప్పుకొనుటకై నిరంతరము అనవసరముగ ప్రశ్నవర్షము కురిపించుచుండిరనియు నాతడు చెప్పెను. అతని న్యాయవాది విపరీతములగు నీ హింసాకృత్యములను నమ్మజాలక, రుజువయినచో అక్టోబరుమాసమున జరుగనున్న విచారణయందు ఖైదీకిది ముఖ్యాధారము కాగలదని యాతనిని ఖైదునందే డాక్టరులచే పరీక్షింపించుటకును, గాయములకు ఫొటోలను దీయుటకును కోరిరట. పోలీసువారందుల కంగీకరింపకైరి. న్యాయవాది పోలీసువారిచర్యను ఖండించుచు వారి ఉత్తరవును రద్దుచేయించుటకై మూడు న్యాయస్థానముల కెక్కెను కాని లాభము లేకపోయెను.

'లీ' నార్వేదేశమున జన్మించినవాడగుటచే నార్వేదేశపు రాయబారి యీ సంగతి స్టేటుడిపార్టుమెంటువారికి అప్పీలు చేసికొనిరట. అందుపై గవర్నరుస్మిత్తుగారిని యీవిషయము విచారించుటకు నియోగించిరి. పోలీసువారి చిత్రవధ్యలయందలి సత్యాసత్యములు వెల్లడియగుదనుక స్మిత్తుగారు విచారణ నాపబోరని నమ్ముచున్నాము.

'లీ'ని ఖైదుచేయుటకు పూర్వ మొకన్యాయవాది ఖైదీలు నేరముల నొప్పుకొనుటకై న్యూయార్కు-పోలీసువారు వారిని చిత్రహింస కావించుచుందురని యొక్క న్యాయస్థానమున చాటిచెప్పినారు. ఇట్టివిధి ప్రవర్తనము సహించు నాగరికదేశ మీప్రపంచమున నింకొకటి కానరాదు. అక్కడనే యిట్టిప్రవర్తనమున్నచో నిది యెన్నడో రూపుమాసియుండవలసినది."

ప్రపంచమున నాగరికతకు మిగులవాసిగాంచిన అమెరికాదేశమునందలి పోలీసువారు క్షమానిగంపని చర్యలచే తమదేశమునకు కళంకమును దెచ్చిపెట్టుకొనుట తగదు. [మాడరన్ రివ్యూ]

---

## ఇందిరా మహారాణిగారి ఆట-పాట-వేట

అక్టోబరు మాడరన్ రివ్యూ పత్రిక యిట్లు వ్రాయుచున్నది:

బహుసంతానవతియగు కూచిబీహారు మహారాణి-ఇందిరాదేవి-యింగ్లాండులో భారతీయవిరంతువుల కనువిత్తైన ఆటపాటలతోను, వేటతోను కాలమును బుచ్చుచున్నదను పత్రికాప్రకటనములకు మేమెంతయు విచారమును, సిగ్గును జెందుచున్నాము. ఇదివఱకు భారతీయ మహారాజులు మాత్రమే అనాథలగు తమప్రజలనుండి సంగ్రహించిన ధనమును విదేశములయందు విరజల్లుచుండుటకు లోనగుచుండిరి. ఇందిరామహారాణి త్రొక్కిన యీ యనుచితమైన త్రోవను యితరమహారాణులు త్రొక్కుట సంభవించునేని యీనాడు భారతదేశమునకు దుర్దినమగును. ఒక యాంగ్ల పత్రికయందలి యీ క్రింది ప్రకటనను నాగ్రహోద్దిష్టుడగు నొకానొక భారతీయ వార్తావిలేఖకుడు మాకు పంపినాడు:—

"నర్తకియగు మహారాణి"—ప్రస్తుతము లండను నగరమునందున్న సునిపుణమగు నర్తకీబృందమున కూచ్ బీహారు యువరాజ్ఞి యొకర్తు. ఈమె చాల అందకత్తె. ఆధునిక నాగరకత ననుసరించి యీమె తనశిరోజములను కత్తిరించుకొనుచున్నది. మేలిముసుగును మానివైచినది. కాని చీరనుమాత్రము సింగారించుకొనుచునే యున్నది. ఈవారమున నీమె 'వికిల్ విక్టరు'భవనమున నాట్యము సల్పినది. 'లిస్లీహచిన్సను' గానముచేసిన వివిధవిధగానములయందలి సంగతుల నీమె గుర్తించి చాల మెచ్చుకొనగలిగినది. ఈమెకుగల 'ఆంగ్లభాషాపరిజ్ఞానమున కిది నిదర్శనము. ఈమె తండ్రి బరోడాగైక్వారును ఈమె భర్త, సోదరులు ఈటనులో విద్యనభ్యసించినవారును నగుటచే నిదియొక వింతకాదు.'

రాజ్యపరిపాలనమును వహించిన యువరాజ్ఞులు-అందును-విశేషించి వితంతువులు- పరమపవిత్రయగు ఇండూరు మహారాణి అహల్యాబాయియొక్క యుత్తమమార్గము ననుగమింపవలెను."

యువతిజనసామాన్యమునకు మార్గదర్శకులుగ వెలయవలసిన భారతీయ మహారాణుల ఇట్టి ప్రవర్తనము భారతదేశమున కంతకు వంతను గలిగింపక మానదు.

---

## భారతశాసన నిర్మాణసభయందు రాష్ట్రములకుగల ప్రాతినిధ్యబలము

అక్టోబరు 'మాడర్న్ రివ్యూ' పత్రికయందు రామానందచటర్జీగారు భారతశాసననిర్మాణసభయందు పాశ్చాత్య దేశములయందువలె రాష్ట్రములసంఖ్య ననుసరించికాని, వానివిస్తీర్ణము, ఆదాయము ననుసరించికాని, జనసంఖ్య ననుసరించికాని ఆయారాష్ట్రముల ప్రతినిధులసంఖ్య సరిగా లేదనియు, ఎక్కువ విస్తీర్ణము, జనసంఖ్య గల రాష్ట్రములకు తక్కువ ప్రాతినిధ్యము, తక్కువ జనసంఖ్య, విస్తీర్ణము గల రాష్ట్రములకు ఎక్కువ ప్రాతినిధ్యమును గలదనియు, ఇందువలన రాష్ట్రములన్నియు సమానముగ అనగా వాని వాని విస్తీర్ణమునకు, జనసంఖ్యకు దగినట్లు వలసిన సౌకర్యములను సమకూర్చుకొనుటకు గాని, భారత దేశ సేవ చేయుటకుగాని, రాజకీయార్థిక సమస్యలయందు సముచితానుభవమును గడించుకొనుటకుగాని తగిన యవకాశములు లభింపవనియు, ఇట్లు కొన్ని రాష్ట్రములు ఎక్కువ అవకాశమును, కొన్ని తక్కువ అవకాశమును కలిగియుండుటకు దగినకారణములు కాన్పింపవనియు వ్రాయుచు నిట్లు వివరించినారు.

"అమెరికా సంయుక్తరాష్ట్రములు, ఆస్ట్రేలియా, కానడా మొదలయిన దేశములయందు ప్రజాప్రాతినిధ్య రాజ్యాంగవిధానముల ననుసరించిన రాష్ట్రీయ సభలయందు ఎల్లరాష్ట్రములకును సమానసంఖ్యగల ప్రతినిధులుగలరు. శాసననిర్మాణసభయం దాయారాష్ట్రముల జనసంఖ్యనుబట్టి ఎన్నుకొనబడిన ప్రతినిధులు గలరు. భారతశాసన నిర్మాణసభ నైవిధానములనుగాని, మరియేయితర న్యాయ్య విధానములనుగాని అనుసరించి యేర్పడినది కాదు.

భారతశాసన నిర్మాణసభయందు ఆయారాష్ట్రముల ప్రతినిధులను, వారల నెన్నుకొనిన జనసంఖ్యయును నీక్రింద తీరునగలదు.

| రాష్ట్రము. | జనసంఖ్య | ఎన్నుకొనబడిన భారతీయ ప్రతినిధులసంఖ్య |
|---|---|---|
| మదరాసు | ౪౨౩౧౮౯౮౫ | ౧౫ |
| బొంబాయి | ౧౯౩౪౮౨౧౯ | ౧౫ |
| బెంగాలు | ౪౬౬౯౫౫౩౬ | ౧౪ |
| సంయుక్త పరగణాలు | ౪౫౩౭౫౭౮౭ | ౧౫ |
| పంజాబు | ౨౦౬౮౫౦౨౪ | ౧౨ |
| బీహారు-ఒరిస్సా | ౩౪౦౦౨౧౮౯ | ౧౨ |
| మధ్యపరగణాలు | ౧౩౯౧౨౭౬౦ | ౬ |
| ఆసాము | ౭౬౦౬౨౩౦ | ౩ |
| ఢిల్లి | ౪౮౮౧౮౮ | ౧ |
| బర్మా | ౧౩౨౧౨౧౯౨ | ౩ |
| అజ్మీరు-మేర్వారా | ౪౯౫౨౭౧ | ౧ |

దీనివలన నాయా రాష్ట్రముల జనసంఖ్యనుబట్టి ప్రతినిధులసంఖ్య నిర్ణయముకాలేదని తెల్లమగుచున్నది. సంఖ్య నిర్ణయముకాలేదని తెల్లమగుచున్నది. సంస్కరణవిధానములయందు రాష్ట్రములకు ప్రాప్తించిన యీయసమాన స్థితినిగూర్చి జనుక వ్రాయుచు నీపద్ధతి రాష్ట్రములయందలి విద్యావంతులసంఖ్యను (దేశభాషలయందుఁగాని ఆంగ్లమునందుఁగాని)బట్టిగాని, రాష్ట్రములయాదాయమునుబట్టిగాని యనుసరించినదికాదని వ్రాసినారు.

భారత దేశము మొత్తమున తక్కువజనసంఖ్యగల రాష్ట్రములకును, కొన్ని ప్రత్యేక రాష్ట్రములకును ప్రాధాన్యముగలుగుట అసంగతమును, అన్యాయ్యమునునగు నీవిధానముయొక్క ఫలితమగుచున్నది.

బ్రిటీషు భారత దేశ జనసంఖ్యయం దీ క్రింది రాష్ట్రముల జనసంఖ్య యధికముగానున్నది.

| రాష్ట్రము | జనసంఖ్య | ఎన్నికొనబడిన భారతీయ ప్రతినిధులు |
|---|---|---|
| మదరాసు | ౪౨౩౧౮౯౮౫ | ౧౫ |
| బెంగాలు | ౪౬౬౯౫౫౩౬ | ౧౪ |
| సంయుక్తపరగణాలు | ౪౫౩౭౫౭౮౭ | ౧౫ |
| | ౧౩౪,౩౯౦,౩౦౮ | ౪౪ |

క్రిందజూపిన ప్రత్యేక రాష్ట్రములజనసంఖ్య బ్రిటిషు ఇండియా జనసంఖ్యయందు తక్కువభాగముగనున్నది.

| రాష్ట్రము | జనసంఖ్య | ఎన్నికొనబడిన భారతీయ ప్రతినిధులు |
|---|---|---|
| బొంబాయి | ౧౯౩౪౮౨౧౯ | ౧౪ |
| పంజాబు | ౨౦౬౮౫౦౨౪ | ౧౨ |
| బీహారుఓరిస్సా | ౩౪౦౦౨౧౮౯ | ౧౨ |
| మధ్యపరగణాలు | ౧౩౯౧౨౭౬౦ | ౬ |
| అస్సాము | ౭౬౦౬౨౩౦ | ౩ |
| ఢిల్లీ | ౪౮౮౧౮౮ | ౧ |
| బర్మా | ౧౩౨౧౨౧౯౨ | ౩ |
| అజ్మీరుబర్మా | ౪౯౫౨౭౧ | ౧ |
| | ౧౦౯౭౫౦౦౭౩ | ౫౨ |

పైరెండు పట్టికలవలన బ్రిటిషు భారత దేశమున నధిక భాగము జనసంఖ్యకు, తక్కువభాగమునకంటె ఎన్నికొనబడిన ప్రతినిధులు ఎనమండుగురు తక్కువగా నున్నారని స్పష్టమగుచున్నది."

మఱియు ఘటర్జీగారు రాష్ట్రములగొన్నిటిని ప్రత్యేకముగ గైకొని వాని ప్రాతినిధ్యమునందలి తారతమ్యమును వివరించిచూపి,తుదకీ విపరీత విధాన మన్యాయమని చెప్పుచు, దీనిని క్రమపద్ధతికి దెచ్చుటకు దగిన ప్రయత్నములు చేయుటకయి నేషనల్ కాంగ్రెసు, ఇండియన్ నేషనల్ ఫిడరేషన్, మజ్లిములీగు, నాన్ బ్రాహ్మిన్ ఫిడరేషను మొదలగు ప్రజాసంస్థలదృష్టి నీవిషయమువంకకు మరల్చుచున్నానని.

---

## భారతీయుల ప్రాణము, ఐరోపీయుల మానము

'నెటాలు'లోని 'ఇండియన్ ఒపీనియను పత్రిక' చెప్పినట్లుగా 'విదేశములందలి భారతీయులు' అను శీర్షిక క్రింద నవంబరు మాడర్న్ రివ్యూ యిట్లు వ్రాయుచున్నది.

మాపత్రికయొక్క కడచినవారపు సంచికయందు ప్రకటించినట్లు అజాగ్రతతో మోటారుబండిని నడపి యొక భారతీయ శిశువుయొక్క ప్రాణములను దీసినందుకై ఒక యూరోపు దేశ స్త్రీకి ఇరువది పౌనులు జరీమానా విధింపబడెను. ఇపుడొక భారతీయుడొక ఐరోపీయ స్త్రీతో తిరస్కారపూర్వకముగా మాటలాడినందుకై న్యాయమూర్తి మాత్యూగారు ఐరోపీయ స్త్రీల పట్ల చూపిన యీప్రవర్తనమింకను తీవ్రదృష్టితో బరికింపవలసినదని చెప్పుచు వానికి ఆరుసంవత్సరముల కఠిన దాస్యమును, ఎనిమిది దెబ్బలును శిక్షగా విధించిరి. ఈదేశపు న్యాయస్థానముల దృష్టియందు భారతీయుని ప్రాణముకంటె శ్వేతజాతి స్త్రీయొక్క మానము (పరువు) గొప్పదిగ నున్నది.

విదేశములందు భారతదేశవాణిజ్యము:—

పై 'విదేశములందలి భారతీయులు' అను శీర్షిక క్రిందనే 'మాడర్న్ రివ్యూ' పత్రిక యిట్లు వ్రాయుచున్నది:

"భారతదేశవ్యాపారస్థుల భావ్యభివృద్ధి ప్రస్తుతము ఆఫ్రికాదేశములో శ్వేతజాతికిని భారతీయులకును జరుగుచున్న పోరాటముపై నాధారపడియున్నదని భారతీయుల కెల్లరకును విశదమైయున్నది. ఈరెండుజాతులకును నడుమ పెరుగుచున్న అసూయకు అచ్చటి వ్యాపారపరిస్థితులును ముఖ్యమైయున్నవి. ఆఫ్రికాదేశపు పత్రికయందు బ్రకటితమైన ఈక్రిందివిషయములవలన నది తెలుసుకొనవచ్చును.

"ఐరోపా మహాసంగ్రామమునకుముందు టాంగనీకా రాజ్యములో ప్రధానమైన నార(సీసల్)పరిశ్రమ శ్వేతజాతులహస్తగతమైయుండెను. యుద్ధానంతరము కొన్ని భారతీయవాణిజ్యసంస్థలు ఈనారపరిశ్రమలను స్థాపించి వ్యాపారముచేయగడంగుటను చూచి శ్వేతజాతివారు భారతీయులు ఈవ్యాపారములో నెగ్గలేరని తలంచుటయే కాక దృఢనిశ్చయులునై కూడ నుండిరి.

ఈపరిశ్రమ భారతీయులకు క్రొత్తదైనను దానిని నిర్వహించుటకు బూనుకొనిన భారతీయవాణిజ్యసంస్థలు విశేషముగా పరిశ్రమచేసినవనుటకు నైరోబీ ప్రదర్శనమునందు వారు పడసిన విజయమే ప్రబలనిదర్శనము.

నైరోబీప్రదర్శనమును చూడవచ్చినజనులందరును ప్రదర్శింపబడిన యీనారపరిశ్రమయందు తమసంతృప్తినిజూపిరి. ప్రదర్శింపబడిన పలుతెగలైన కెన్యా, టాంగనీకా దేశముల నారపరిశ్రమలో ఏరెండుమూడో తప్ప భారతీయులు ప్రదర్శించినవానితో సరిపోవునవి లేకుండెను. ఈపరిశ్రమయందారితేరిన కర్నల్ ఆర్. బి. టర్నర్ గారు ఆప్రదర్శనమునకు మధ్యవర్తిగానుండిరి.

మాన్యాసీలోని గొంబా భారతీయపరిశ్రమాధికారు ఈనారప్రదర్శనమునందు ప్రథమబహుమతిని బడసినందులకై కెన్యాటాంగనీకాదేశములలోని భారతీయులు మిక్కిలి గర్వపడవలసియున్నది. ఈనారపరిశ్రమసంస్థ కరింజీ జీవాన్జీ కంపెనివారికి చెందియున్నది! దానిని అబ్దుల్లా యం. ఎ. కరీమ్జీగారు మిక్కిలి నిపుణతతోను, తెలివితేటలతోను నిర్వహించుచున్నారు!

పైప్రదర్శనమునకు మధ్యవర్తియైన కర్నల్ ఆర్. బి. టర్నర్ గారు ప్రథమబహుమతిని పొందిన యీకంపెనీవారకు 100 కి 94 మార్కులను ఇచ్చుటయే కాక అదిసర్వవిధముల శ్రేష్ఠముగ నున్నదని చెప్పిరి. అవకాశము లభించినపుడెల్లను భారతీయులు ఏపనినైనను కడుసమర్థతతో చేయగలరని తెలుపుటకు పైయుదాహరణమే సాక్ష్యము."

---

## పూలతొట్లలో మహావృక్షములు

౧౯౨౮ సం. అక్టోబరు నెల ఎనిమిదవ తేదీ 'టిట్ బిట్సు' అను పత్రికయం దిట్లు కలదు.

మూఁడుసంవత్సరములవయసును మించిన దేవదారు వృక్షము లనేకములు రెండడుగులుమాత్రమే పొడవు గలవి జపానులో గలవు. అవికొంచెము పెద్దవగుపూలతొట్లలో పెరుగుచున్నవి. అడవులలోనున్న దేవదారువృక్షములకును వీనికిని బరిమాణమునమాత్రమే భేదము గలదు. బుద్ధిపూర్వకముగనే వీని నిట్లు పెరుగకుండ అచ్చటివారు చేయుచున్నారు. అందుచేత వారు నల్పసారముగు విత్తనములనే విత్తెదరు. వేళ్లను కత్తిరించెదరు. చురుకుగ పెరుగుచుండు రెమ్మలను ఎడతెగక త్రుంచివేయుచుండురు. కేవలము గిడసబారిన కొమ్మలనుమాత్రమే పెరుగనిచ్చెదరు. ఇట్లు మూడునాల్గేండ్లు చేసినచో నాచెట్లు పరిపక్వముస్థితికి వచ్చును. అవి ఒకటి లేక రెండు అడుగులకు మించని పొడవునే యుండును. ఈపొట్టిచెట్లొకప్పుడు రెండువందలయేండ్లు పెరిగి మనును.

హాలండులో చాలచోట్ల నిట్లు పెంచబడిన నాగజెముడుచెట్లు చిన్నపూలతొట్లలో గలవు. వానిలో కొన్ని నీటితేమయే లేక పట్టుపనివాని వ్రేలితొడుగుకన్న కొంచెము పెద్దవిగ నుండును.

ఎవరయిన నిట్టిపొట్టిచెట్లను పెంచవచ్చును. ఆవిధానమిది: పలచనిచర్మముగల నారింజపండును చెరుసగముగ కోసి, ఒకసగములోని గుజ్జునుతీసివైచి దానిపైభాగమున

లక్కపూసి లోపల సారవంతమగు మంటిని నింపి అందు రెండు దేవదారుని త్వక్కులను చిత్తినలెను. అంత దానిని ఒక గదియందు సూర్యరశ్మి విస్తారముగ సోకుట కనువైన-చోట వ్రేలగట్టియుంచి దాని కప్పుడప్పుడు నీరుపోయుచుండవలెను. ఆగదిలో వేడి యధికముగాకుండ జాగ్రత్తపడవలెను.

డిప్పకుండా వేళ్లు దిగబారినప్పుడు వానిని డిప్పనంటునట్లు లక్కపూత చెడకుండ కత్తిరించవలెను. చెట్టు కొంచెము పెరిగినతర్వాత పెద్దతొట్టిలోనికి మార్చవచ్చును. కొనవేళ్లనుకత్తిరించుటచే నాచెట్టు పెరుగక ఎల్లప్పుడును పొట్టిగనేయుండును.

---

## రోడ్లపై మేకులులేకుండ చేయుపద్ధతి

రోడ్లపైన మేకులులేకుండ జేయుటకై కనుగొనిన యొకక్రొత్తసాధనమును గూర్చి 'ది అమెరికనుసిటి' అను న్యూయార్కుపత్రిక యిట్లు వ్రాయుచున్నది:

ఇరువదిరెండు అంగుళములపొడవుగల కెంకుమూడంటు రాళ్లు అయిదుటన్నులబరువుగలబండికి ముందు, వెనుకనున్న చక్రములనడుమ రోడ్డుకు అయిదంగుళముల యెత్తున నుండునట్లు వ్రేలుచుండును. అయస్కాంతురాళ్లకు విద్యుచ్ఛక్తినిప్రయోగింపవవి రోడ్లపైనున్న యినుపమేకులనన్నిటి నాకర్షించితీసికొనును. విద్యుచ్ఛక్తిని ప్రయోగించుటకు వలసినపరికరము లన్నియు నాబండియందే కలవు. తొలుదొల్త నిచికాగోరోడ్డుపై నీవిధానమును ప్రయోగించిరి. ఒకమారు చుట్టివచ్చినపూరు మైళ్లమేరయందు 1870 పౌనులబరువుగల ఇనుపమేకులు, ముక్కలు మొదలయినవి ఉండినవట. ఒకమైలు మేరకు సరాసరి ౧౫౫ విడి ముక్కలు - మోటారుబండ్లచక్రములరబ్బరుకట్లను పాడుచేయజాలినవి-ఉన్నట్లు తేలినది. ఈపద్ధతినిలాభకరమని తెలిసికొని 'కార్సను' నగరమువారు నెలకొల్పిరి. రెండురోజులకే ౪౭౫౦ పౌనుల ఇనుపమేకులు మొదలయినవి దొరకినవట. [ది రివ్యూ ఆఫ్ రివ్యూస్—అక్టోబర్. 1927.]

---

## ముగ్గురుబిడ్డల ముద్దరాలు



శ్రీ. పి. మిస్త్రీ అనునామె యీముగ్గురు పిల్లలను ఒక్కసారే కన్నది. ఈముగ్గురిలోను పెద్దబిడ్డ ౨౭ పౌనులబరువున్నందుకు, బొంబాయియందొకానొక ప్రదర్శనమున నుత్తమబహుమానమును బడసెను. 'ఇన్కమ్ డిమాంటి' అను నొకదొరసాని ముగ్గురుబిడ్డలకును మూడు ప్రత్యేకబహుమానముల నొసగెనట.

[ఇండియన్ డెయిలీ మెయిలుపత్రికనుండి]

---

## ఫిలిప్పైనుదీవులలో కార్యరూపమైన విద్యాభ్యాసము

డి. స్పెన్సర్ హాచ్‌గారు 'భారతయువజనులు' (Young Men of India) అనేపత్రికలో ఫిలిప్పైనుదీవులలోని విద్యాభ్యాసమునుగురించి వ్రాసినారు. ఆదీవులలోనిప్రజలు తమ భావినాగరికులను గొప్పదక్షతయు, ఆలోచనలును, అనుభవమును కలవారినిగాను, దీవులకు తప్పకుండా అభ్యుదయమూ, ఔన్నత్యమూ చేకూర్చువారినిగాను తయారుచేస్తూఉన్న విధమును వారు చక్కగా తెలియజేసినారు. వారు కీలాగున చెప్పినారు;

“ఫిలిప్పైనుదీవులలోని వ్యవసాయ వ్యాపార విద్యాశిక్షణమును గురించిన్నీ, జనులలోని తోటపనినిగురించిన్నీ తెలియినమట్టుకు తెలుసుకొనే సందర్భమున ఒక స్కూలునిఆశయము అక్కడ సిద్ధమైన ఆవరణలో ఉండుట చూడగా చాలాసంతోషము కలిగినది. ఆ ఆశయము పట్ల భారతదేశములో ఇప్పుడిప్పుడే తాత్పర్యమూ, ఆసక్తియూ ప్రబలుతూ ఉన్నవి.

కార్యరూపమైన విద్యాభ్యాసము

వివిధస్థలములలోనూ, వివిధపద్ధతులవిూదనూ ఈ ఆశయము పనిచేస్తూ ఉన్నదనేటందుకు ముఖ్యముగా 'మ్యానిలా' లోని 'సెంట్రల్ ల్యూజన్ అగ్రికల్చరల్ స్కూలు'ను గురించి చెప్పితే మంచినిదర్శనము చూపించినట్టే. 'మున్రోప్రత్యేకమిషను' దీనిని ఈదీవులలో ఉన్న పదిహేను వ్యావసాయికవిద్యాసంస్థలలోనూ ఉత్తమమైన వాటిలో ఒకటిగా పరిగణించినది.

విద్యార్థులు పాఠశాలకు వచ్చి తాము గైకొనవలసిన పనినిగురించి విద్యాలయాధికారులతో ఆలోచించి, తమతమ కార్యములు నిర్ణయించుకొంటారు. ప్రతివిద్యార్థియూ ఒకభాగస్వామిని ఎన్నుకొంటాడు. ఈ ఇద్దరు భాగస్వాములకూ ఒకకొంత భూభాగము ఇస్తారు. అందులోనే వారి నివాసమూ, పనియూను. అది కౌలుకు పుచ్చుకొన్నట్టే పుచ్చుకొంటారు. అక్కడ ఒకయిల్లు కట్టుకొంటారు. విత్తులూ, చేతిపనిముట్లూ, ఇతరసాధనములున్నూ, ఎద్దుగాని దున్నపోతుగాని ఒకటిన్నీ, వారిపనికి అవసరమైతే కోడిపిల్లలులూ, పాడిఆవులూ, పందులున్నూ పాఠశాల ఎరువిస్తుంది వారికి. కౌలుదారులవలెనే విద్యార్థులు ఇవన్నియూ సంతకముచేసి పుచ్చుకొంటారు. కోత లయినతర్వాత నిర్ణయము జరుగుతుంది. ఈలాగు జంటలుగా ఉండి పనిచేయడము అవసరము ఏమంటే: ఒకడు జాగ్రత్తగాపొలము పని చూస్తూఉండగా ఒకడు పాఠములకు వెళ్లవలెను. కొందరువిద్యార్థులు పనిమాత్రమే చూస్తూఉంటారు; వారికి ప్రతివారమూ క్రొత్తపనులు తగులుతూఉంటవి.

ఈపాఠశాల ఒకవిద్యార్థులపట్టణమువలె ఉంటుంది. విద్యార్థులు తమ భావిజీవితమున సంఘములో వలెనే తమవ్యవహారముల పరిపాలనకోసము ఒకఅధ్యక్షునీ, పాలకసభనూ ఎన్నుకొంటారు. విద్యార్థిపోలీసులు అరెస్టులుచేస్తూ సంఘములో నెమ్మది కాపాడుతారు; ఒకవిద్యార్థి న్యాయాధిపతి అభియోగములన్నియూ తన న్యాయస్థానములో విచారిస్తాడు. ఎన్నుకోబడిన ఆరోగ్యశాఖాధికారి పట్టణములో ఆరోగ్యమునూ, పరిశుభ్రతను చూచుకొంటాడు. ఒక పట్టభద్రుడైన రోగరక్షకుడు కొందరువిద్యార్థుల ఆరోగ్యశాఖాదళములయొక్క సహాయముతో గాయములకూ, రోగములకూ చికిత్స చేస్తూఉంటాడు.

అధ్యక్షుని అధికారము ఒక నటన కాదు. అతడు విద్యార్థిపాలకసభకు ఆధిపత్యము వహించి విద్యార్థులకు పనులు ఒప్పగిస్తూ, మెలకువతో సంఘక్షేమమునుగమనిస్తూ, యథార్థమైన కార్యనిర్వహణము చేస్తూఉంటాడు.

దీవులలో గుట్టలకూ, అడవులకూ సంబంధించిన వేర్వేరుప్రాంతములనుండి వచ్చినవిద్యార్థులలో చాలావిభేదము ఉండడమువల్ల పరిపాలన మరింత క్లిష్టమవుతూ ఉంటుంది. వేర్వేరురాష్ట్రములవారికి వేర్వేరుపడకటిళ్లు ఉంటవి. ఆయారాష్ట్రముల సాంఘికవ్యవహారములను ఆయారాష్ట్రముల ప్రతినిధులైన విద్యార్థులు చూస్తూఉంటారు. విద్యాలయాధ్యక్షునికి నిషేధాధికారము (అంటే ఒకరినిర్ణయమును తుడిచిపెట్టే అధికారము) ఉన్నది: కాని అది అతను ప్రయోగించడము చాలా అరుదు: చిత్రమౌతుంది.

ఈపాఠశాలయూ, దీనివల్ల ఏర్పడ్డ సంఘమున్నూ ఒక చురుకైన సంస్థ. సంవత్సరముపొడుగునా చాలా వ్యాపారము నడపవలసి ఉంటుంది. విద్యార్థులు తమసరుకులు అమ్మడమునకున్నూ, కావలసినవి కొనడమునకున్నూ ఒకసంతచావడి ఉంటుంది. మంచిస్థితిలో ఉన్న విద్యార్థులందరికీ ఇక్కడ అరువు ఉంటుంది. విద్యార్థుల కోశము (బ్యాంకు) వారిజమాఖర్చులు చూస్తూ వారిసంపాదనయూ, ఉన్నడబ్బుదస్కమునూ నిలువచేసిపెట్టుతుంది. వారమువారమూ వారివాడకము పోను మిగతఉన్నదానికి లెక్కలు ఏర్పడుతవి.

ఆదివారము విడిచి తక్కినరోజులలో రోజుకు నాలుగుగంటలవంతున పడినపాటు వారిభోజనమునకు చాలును. స్వయముగా విద్యార్థులే తమభోజనశాలలో రసాయనశాస్త్రానుసారము భోజనము తయారుచేస్తారు.

విద్యార్థులు నడిపే వ్యాపారములు ఒక పట్టణములో వలెనే పలువిధములుగా ఉంటవి. కిరాణాదుకాణము, రంపపుయంత్రము, సినిమెటోగ్రాఫు, ముద్రణాలయము కోశము, అన్నియూ వారుసొంతముగా పెట్టినడుపుతారు. తమబియ్యపుమిల్లులో తమ చేలలో పండిన బియ్యమున్నూ, చుట్టుప్రక్కల ఉన్న రయితులబియ్యమున్నూ విసురుతారు. తమపడకటిల్లూ, వాసగృహములూ, తక్కినకట్టడములున్నూ స్వయముగానే నిర్మిస్తారు. తామే వంటకొని నడిపించుకొంటారు. పీఠులూ, వంటసలూ వగైరాలు నిర్మిస్తారు. ఇతరు లెవరు చెయ్యగలిగిన పనిఅయినాసరే వారు వెనుదీయకుండా చేసివేస్తారు. ఈవిషయమై వారికెంతో గర్వము. ఆగర్వము ఎంత ధార్మికము! ఎంత ప్రశస్తము!!

తక్కువరకమువస్తువులు తయారుచేయుటమునకు వారు ఒల్లరు. ఒకపనిలో ప్రశస్తమైన వస్తువులు తయారుచెయ్యడమునకు వారికి అనుభవము చాలకపోయినట్లయితే ఆరితేరిన పనివానిని ఒకనిని పెట్టుకొని తమలో కొందరు తయారవుతారు. ఉదాహరణము చూడండి: ఈమధ్య వారిముద్రణాలయము సర్వాంగశోభనముతో సిద్ధముకాగా వారు ఉత్తమపద్ధతిని పనిసాగించే నిమిత్తమున్నూ, ముఖ్యముగా తమలో కొందరు ఆరితేరి పెద్దపనివారు అయ్యేనిమిత్తమున్నూ 'మనిలా' నుంచి ఒక చెయితిరిగిన పనివానిని జీతమిచ్చి పెట్టుకొన్నారు.

కృషికవిద్యార్థులందరూ ఒకవాదము పెట్టుకొని స్వయంకృషివల్ల ఎవరు ఎక్కువప్రతిఫలము తీస్తూఉన్నారో నిర్ణయించుకొంటారు. అన్నిసరుకులూ వినిమయము ద్వారా అమ్ముడుపోతవి. వార్షికోత్సవపువారములో బహుమతులున్నూ, గుణములు తెలిపే యోగ్యతాపత్రములున్నూ యథాయోగ్యముగా పంచిపెట్టబడుతవి.

[మాడరన్ రివ్యూనుంచి.]

---

## వింతవృక్షములు

'పాప్యులరు పిక్టోరియలు' అను పత్రికయందు ఇవీరోజర్సు అను నాతడు వృక్షజాతిలో కొన్ని వింతవిషయముల నిట్లువ్రాయుచున్నాడు:

### ఈలవేయుచెట్టు

దీనినే 'విస్లింగు ట్రీ' అనెదరు. ఇటీవలనే దీనిని ఫ్రాంసుదేశములో పెంచుటకు ప్రారంభించిరి. ఈచెట్టు ఆకులకు కన్నములుండును. దానిగుండా గాలినిరంతరము దూరి అపూర్వమగు గానము బయలుదేరును. మొదటిపర్యాయము విన్నపుడు భయంకరముగ నుండును. ఈకన్నములను పురుగులు సదా చేయుచుండునట. అరబ్బులీచెట్టును 'సోఫార్' అని పిలిచెదరట. సోఫారుఅనగా పిల్లనగ్రోవియని వారియర్థము. ఆశబ్దము విన్న ఒడలు కంపించును. బర్బాదాస్, సుడానుదేశములందు 'అకేషియా' చెట్టుగా దీనిని వాడుచున్నారు. యూరపియనులు దీనికి 'విస్లింగు ట్రీ' అను పేరిడిరి. మనలో సంగీతపుచెట్లు అని ఉన్నవికాని ఆకు లుండవు. రంధ్రము లుండవు. వాటినే మనము సరుగుడుచెట్లు అనెదము.

### "అక్లైడెంటు ట్రీ"

ఇది ఇంకను అద్భుతమగుచెట్టు. క్యాలిఫోర్నియా నెవేదా ఆరిజోనా దేశములందు దీనిని 'యాంగ్రీట్రీ' అనెదరు. ఇది ౧౦ నుంచి ౨౦ అడుగులు పొడుగుండును. గాలివచ్చి కదిపిన తను అసహ్యతను అనిష్టతను జూపుటకు కంపించును. ఆకులన్నియు జలజలకదలి ఒకవిధమగుశబ్దము నలుదిక్కుల వ్యాపించును. వాయువంతయు భరింపరాని దుర్గంధముతో నిండిపోవును. తనను ముట్టుకొన్న కోపమువచ్చుచెట్టు అని చెప్పవచ్చును. మనలోగూడ అత్తిపత్తిచెట్టు ఒకటిగలదు. దానినిముట్టుకొన్న ఆకులన్నియు ముడుచుకుపోవును. దీనినిగూడ కోపముగను, 'అయిష్టము'గను అర్థముచేయవచ్చునని తలంచెదను.

### అగ్నిపర్వతపుచెట్టు

ఇది జపానులో నుండును. సూర్యుడస్తమించు సమయమున చిట్టచివరనున్న కొమ్మలనుండి తెల్లనిపొగ కాన్పించును. పొగలుక్రమ్మును. కారణము తెలియదుగాని చూచుటకు అద్భుతముగనుండును. బాగా పెరిగినచెట్టు ౬౦ అడుగులఎత్తు ఉండును. సూర్యాస్తమయమునకు ముందు ఏకొమ్మయందుగూడ ఇట్టిపొగ కాన్పించదు.

### "బర్నింగుట్రీ"

అనగా అగ్నివృక్షము. ఆకులు మ్రాను ముట్టుకొన్న గుచ్చుకొనుముళ్లుండును. కోమలమును బోలి

యుండును. ఎఱ్ఱగా గాలిన సూదులవలె ముట్టుకున్న చుఱుక కాలును. ఆమంట శరీరమంతయు ప్రాకి గంటలకొలది బాధపెట్టును. మనలో వెదురుపొదలు కొంతవరకీ పోలికనుండవచ్చును. అవిగూడ గ్రుచ్చుకొనునుగాని కాలినసూదిని ముట్టుకొన్నపుడు గలుగు బాధయుండదు. గాలికి రాచుకొని అంటుకొనుస్వభావము గలదు. అంతవరకే పోల్చి చెప్పవగు.

### సూది దారము నిచ్చు చెట్టు

మెక్సికోలో సూది దారము నిచ్చుచెట్టున్నది. ఏ అత్యవసరమైన పనికైనను బాటసారికి సూది దారము సప్లయిచేయును.

దీనినే 'మ్యాగ్ని ట్రీ' అనెదరు. నలుపుతో గూడిన ఆకుపచ్చని ఆకులుండును. ప్రతియాకుశిఖరమున ముల్లు వంటిసూది లోపలనుండును. పొరలో నుండునన్నమాట. దీని పొరలనుండి తీయగానే చాలనిడుపైన దారము వంటినార ననుపుగా బయలుదేరును.

### సిరా చెట్టు

దీనినే 'ఇంక్ ట్రీ' అనెదరు. ఇది కొలంబియాలో నున్నది. దీనినుండి ఎఱ్ఱనిరసము ద్రవించుచుండును. చక్కటి ఎఱ్ఱ సిరాక్రింద దీనిని ఉపయోగించవచ్చును. దీనితో వ్రాసినచో పాళీగాని కలముగాని తుప్పుపట్టదు. అలుకుకు పోదు. నీళ్లలో నానబెట్టిన తుప్పుపట్టదు.

కొన్నిగంటలయినపిదప కాగితముమీద వ్రాసిన అక్షరములన్నియు క్రమముగా నల్లగామారును.

### "కాంపస్ ట్రీ"

దీనినే దారిచెప్పినత్రోవను జూపుచెట్టు అనెదరు. ఇది దూరపాశ్చాత్య ప్రదేశములో నుండును. దారితప్పిప్రాణమువిసికిన బాటసారికి మహోపకారి. పచ్చనిపూవులుండును. ౪ నుండి ౬ అడుగులు ఎత్తుండును. ఆకులు తమచిగుళ్లను ఉత్తరముగను, దక్షిణముగను జూపును. అర్థరాత్రియందు పెనుచీకటిలో గూడ దారితప్పిన పాంథుడు తనత్రోవను కనుగొనగలడట.

### "ట్రావెలర్సు ట్రీ"

ఇది మడగాస్కరులో నుండును. ప్రతిఆకుఅడుగున నీరుయుండును నిర్మలోదకము. తియ్యగా చల్లగా నుండును. ఒక్కొక్క ఆకుఅడుగున గ్యాలనులో ¼ వంతు నీరుండును. ప్రతిచెట్టులో అగ్రమున నాలుగుఆకులుండును. మండుకుపోవు ఆప్రదేశములో ఇది మనోహరముగ రమణీయముగనుండును. అచట ఉండు దేశీయులుతమకు నీరుగావలసినపుడు ఒక శూలములో ఆకును పొడుతురు. ఆకు తమతలమీదుగానే యుండుటచే ఒకచెంబును ఆకు క్రిందుగా బట్టుదురు. నీరుకారుచున్నపుడు అది ఆచెంబులోపడును.

### పరిహాసముచేయు చెట్టు

దీనినే క్యారికేచరుప్లాంటు అనెదరు. నలుపుతో గూడిన ఆకుపచ్చని ఆకులమీద వింతయగు పచ్చని గుర్తులుండును. వాటినిజూచువారిని వెక్కిరించుచున్నవా యన్నట్లుండు ముఖచిత్రములు ఆకులమీద కన్పించును.

మొదటి మూడురకముచెట్లకు మనకున్న చెట్లను సమన్వయించితినిగాని ఇతరజాతులకు ఏమియుదొరకలేదు. వృక్షశాస్త్రవిజ్ఞాన నిపుణులు ఈవిషయము నాలోచించి తెలుపగోరెదను. [జ. పా.]

---

### ఈగలు

ఆష్ట్రేలియాలో సిడ్నినగరమున క్రిమిశాస్త్రజ్ఞులు ౩౦౦౦౦౦౦ ఈగలను లెక్కపెట్టిరి. రెండుసంవత్సరములలో రకమువారిగా ఈ ఈగలను ఏర్పాటుచేసిరి. గొఱ్ఱెలను బాధించుచుండ దానిని నివారణచేయుటకు ఇట్లు పూనుకొనిరి. ప్రతిసంవత్సరము వేలకొలది ఈజంతువులు చనిపోవుచున్నవని దానిని ఆపుటకు ఉపాయము కనుగొనుటకు ఈఎత్తుఎత్తిరట. ఏసంవత్సరములో ఏమాస్తరు ఈగలు అభివృద్ధియగునో తెలిసికొనుమార్గమును తెలుపుచున్నారు. అయిదురకముల ఈగలను ఇంతవరకు ప్రత్యేకించిరి. వీటినిగుర్తించువారు రోజు ౧-కి ౧౦౦౦౦ ఈగలను రకమువారీగా ఏర్పాటుచేయగలరట. ఈ అయిదింటిలో రెండు గోధుమరంగుగాను మూడు ఆకుపచ్చరంగుగానుండును. గోధుమరంగుఈగకు రోమములతో గూడుకొన్న పొత్తికడుపుండును. ఇదియే ఆకుపచ్చవాటికి లేదు. మూడు ఆకుపచ్చని ఈగలలో ఒకటిచాలాచిన్నది. తెల్లనిముఖముండును. ఆష్ట్రేలియా కామన్వెల్తు

అంతటను ఈపరిశోధన శాస్త్రి ఈగలను ధ్వంసముచేసినచో గోశాలలమందలవారికి ప్రతిసంవత్సరము వేలకొలది పౌనులు మిగులును.

## స్త్రీలకు ఇంటియందే విద్యను నేర్పుట

రజస్వలలయిన పెద్దపిల్లలకును, వితంతువులకును, సంసారముచేయు స్త్రీలకు నింటివద్దనే వ్రాయను, చదువను నేర్పుటకు పంజాబులో క్రొత్తగ నొకయుద్యమమును ఏర్పరిచిరని ఫార్వర్డుపత్రిక పంజాబు స్వకీయవిలేఖకుడు వ్రాయుచున్నాడు. ౬౦ మంచి నీతిదాయకములగు పుస్తకములను చదువుకున్న స్త్రీకిచ్చి ప్రతిఇంటికి బంపి కావలసినవారికి ఇచ్చెదరట. ఆమె ఉచితముగ ఈపుస్తకములను ఇంటింటికి గొంపోవునట. డబ్బు ఇవ్వనక్కరలేకయే స్త్రీలు ఈసంఘములో సభ్యత్వమును బొంది సంతకముచేసి తమకు కావలసిన పుస్తకములను తీసికొని చదువుకొనవచ్చును. ప్రతికోటున ఈపుస్తకములను కొంతకాల మగుసరికి మార్చి క్రొత్తపుస్తకములను సప్లయిచేసెదరు. లాహోరులో ఇట్లు ౧౬ సంచారకగ్రంథాలయములు ఏర్పడినవి. పంజాబురాష్ట్రమంతట నీయుద్యమమును వ్యాపింపచేయుటకు ప్రయత్నించుచున్నారు. స్త్రీలకు ప్రత్యేకముగ నుపయోగించుపత్రికలు, పంచికలు అందరికిని పంచి పెట్టెదరు. ఇట్లు ఒక్కొక్క గ్రంథాలయమునకు ఆదిలో ౧౦౦ రూపాయలు మాత్రమగును.

పట్టణములో ప్రతివీథియందును పాఠములను చెప్పుటకు తరగతుల నేర్పరచెదరు. రజస్వలలై పాఠశాలకు పోవుటకు శంకించువారు, గృహిణులు, వితంతువులు ఎక్కువను పోకుండగనే నిత్యము ఇంటిలో కావలసిన చేతిపనులను, ఇతరకళలను తమకు తీరికయున్నప్పుడు నేర్చుకొనవచ్చును. ఇంటిలోపని అయిన పిదప నేర్చుకొనవచ్చును. ఇట్టి తరగతులను జయప్రదముగ సాగించితిమేని స్త్రీలను తమ ధర్మములను గ్రహించి, దేశసేవకు తోడ్పడునట్లు చేయగలము. దేశసేవకేకాక శిశుపోషణయందును, గృహకార్యభారనిర్వహణమందును నిపుణులగుదురు. నిత్యజీవితమున జరుగుసంగతులనే నేర్పెదరు కావున నేర్చుకొనుట నుత్సాహముగ నుండును. కార్యక్రమము క్రియారూపమును దాల్చును. అందరిని ఆకర్షించును. పెక్కుమంది విద్యార్థినులగు స్త్రీలు ఉచితముగ విద్యను గఱపుటకు ముందంజ వేయుచున్నారు. రోజు ౧-కి రెండుగంటలు నేర్పెదరు.

నేర్పువిషయములు

కుట్టుపని, గుడ్డలను కత్తిరించుతీరు, గుడ్డలమీద పువ్వులను తీగెలను అల్లుట, ఆటవస్తువులను చేయుట, జరీ చేయుట, నేతపని, ఇండ్లయందు ఆరోగ్యముగ నుండుటకు ఆరోగ్యశాస్త్రము, గృహచికిత్స, చదువు, వ్రాత, లెక్కలు, ముఖ్యముగ ధర్మములు; పరిపాలనవిధానమును మున్నగునవి నేర్పబడును. లాహోరులోనున్న సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసయిటీవారీపనికి పూనుకొని పంజాబులోనున్న సంఘసంస్కరణ సంఘమునకు తోడ్పడుచున్నారు.

ఈయుద్యమము ఎంతయు శ్లాఘ్యము. శిశుమరణములు తగ్గును. స్త్రీలలో దుర్బలలు తగ్గుదురు జీవనోపాధికి ఒరులమీద ఆధారపడ నవసరముండదు. సంఘము నీతిబాహ్యతనుండి నిలువబడును. దేశారాధనకు సోదరీమణులెందరో తోడ్పడగలరు. ఈయుద్యమము నెరవేర్చు... ప్రతీ ఇల్లును భూలోకస్వర్గముగ ఏర్పడును.

ఇట్టి సంఘమును చెన్నరాజధానియందు గూడ నేర్పరచుటకు విద్యాధికులగు డాక్టరు ముద్దులక్ష్మమ్మగారు మున్నగువారు పూనుకొన్న ఎంతయు బాగుండును. ఒక్కవిద్యాధికురాండ్రే కాక మద్రాసురాజధానియందున్న సంఘసంస్కరణసంస్థలు, కాంగ్రెసు సంస్థలు, సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసయిటీవారును పూనుకొన్నచో దేశమున భాగ్యోదయమగును. స్త్రీలయందు విశాలభావము లుదయించును. రజస్వలానంతరవివాహము, బాలవితంతు సమస్యలు మున్నగునవి దులకనగ పరిష్కారము గాగలవు. వరదక్షిణల పిశాచము గూడ వదలును. కాంగ్రెసుసంస్థలు ఈయుద్యమమునకు తోడ్పడిన ఖద్దరు స్త్రీలలో తప్పక ప్రచారము గాంచును. స్త్రీలు అందరును ఖద్దరువహత్తును గ్రహించినపుడే సత్వరస్వరాజ్యప్రాప్తి గల్గును. ఇట్టి యుద్యమమును మన రాజధానియందుగూడ నెలకొల్పుటకు వెంటనే ప్రముఖులందరును పూనుకొనవలయును. పిఠాపురము మహారాజాగారు, డాక్టరు బెసంటుగారు మున్నగువారు మార్గదర్శకులగుదురు గాక!

[జ. సా.]

## అజంతా చిత్రములు



౧. విజయసింహుని సింహళప్రవేశము—క్రీ. పూ. ౫౪౪

అజంతాచిత్రములు



3. విజయుని పట్టాభిషేకము




ఆముక్తమాల్యద
సంజీవనీవ్యాఖ్యానసహితము

వ్యాఖ్యాత:—మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ బిరుదాంచితులగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులుగారు.

రాయలు ౮ పేజీల సైజున ౮౦౦ పేజీలు గల సంపుటము; క్యాలికో బైండు. వెల రు. ౮-౦-౦

విలాసము: గ్రంథకర్త పేర; నెం. ౮ మల్లికేశ్వర వీధి, ముత్యాలపేట, జార్జిటవును, మదరాసు.

కవిపండితపోషకుండును, బహుగ్రంథకర్తయు, భర్తయు నయి యాంధ్రభోజుండనం బ్రసిద్ధిగాంచిన విద్యానగర చక్రవర్తియగు శ్రీకృష్ణదేవరాయలకాలమున వెలసిన రసోత్తర ప్రబంధములలో నెల్ల ప్రౌఢమయిన యీ యాముక్తమాల్యదకు నిరుపమానసంస్కృతాంధ్రాంగ్లపాండితీమండితులును, సంస్కృతాంధ్ర వాఙ్మయ ప్రపంచమున నేబదిసంవత్సరములనుండి స్వతంత్రానువాద వ్యాఖ్యానరూపక గ్రంథములను లెక్కకుమిక్కిలి వెలయించిన ప్రతిభాశాలురును నగు శ్రీ వేంకటరాయశాస్త్రులుగారియొక్క సిద్ధహస్తమునుండి బయలువెడలిన యీ సంజీవనీవ్యాఖ్యాన మాంధ్రవాణి చిరకాలమునుండి యాకాంక్షించుచుండిన యొకయుత్కృష్టాలంకారము. కడు వృద్ధులయ్యు, మందదృష్టులయ్యు, శ్రీ శాస్త్రులుగారు దీక్షతో నీవ్యాఖ్యానమును రచియించి ప్రకటింపఁగల్గు టాంధ్రవాఙ్మయతత్త్వజిజ్ఞాసువుల భాగ్యఫలమనుట యతిశయోక్తి గాఁజాలదు. ఈయుత్తమగ్రంథమునకునుపూర్వ గతమున చెప్పఁజాలిన రసగ్రహణపారీణమగు నాంధ్రలోకమునకే గలదు.

ఉత్కృష్టకావ్యలక్షణసమంచితమును, నతిప్రౌఢమునునగు నీయాముక్తమాల్యదయొక్క పూర్వపరిష్కారముల యందలి వ్యాఖ్యానములు బహుముఖముల నిండారియున్న కావ్యరస స్వరూపమును విస్తరించి సుగ్రహముగ వివరింపఁజాలనివిగను, అసంబద్ధములుగను, సమగ్రసంస్కరణాపేక్షితములుగను నుండుటచేత "నీ సమగ్ర సంస్కరణ–సాధుపాఠ నిర్ధారణ – దుర్వ్యాఖ్యా విమర్శన – సమంజసార్థావిష్కరణ – పూర్వక విపులవ్యాఖ్యానమును" వీరు రచియించినారు.

శాస్త్రులుగారి వ్యాఖ్యారచనావిధానమును వీరిరచనకు రచియించి ప్రకటించి యాంధ్రలోకమునకుం బ్రసాదించిన శృంగారనైషధ వ్యాఖ్యానము చాటుచున్నది. ఆవ్యాఖ్యానము చూచియుద్బుదున్న తత్కాలవ్యాఖ్యాకారసమును పరసాంధ్రలోకము నవిచారించియేయున్నది. ఆముక్తమాల్యదావ్యాఖ్యానమును నైతము అట్టి సమీచీనవిధానము ననుసరించియే శాస్త్రులుగారు రచించినారు. సంస్కృతాంధ్రవాఙ్మయముల యందలి ప్రామాణ్యగ్రంథములను లెక్కకుమిక్కిలి యోర్పుమెయిఁ బరిశీలించి వానినుండి గైకొనిన బహుళప్రయోగములను బురస్కరించుకొని వీరిందు సాధ్వసాధుపాఠనిర్ణయమును, అర్థావిష్కరణమును గావించియున్నారు.

గ్రంథప్రాశస్త్యమును వెల్లడించుచు, పూర్వముద్రిత గ్రంథములసంస్కర్తలీగ్రంథముపై నారోపించిన దోషముల నుద్ఘాటించుచు సవిమర్శమును, సవిస్తరమును (౧౭౦ పుటలు) నగు పీఠికను వ్రాసి దీనితోఁ జేర్చినారు.

పూర్వముద్రిత గ్రంథముయొక్క "ఉపోద్ఘాతములో ఆముక్తమాల్యదను కృష్ణరాయప్రణీతత్వమును స్థాపించుటకై, అందులోనివి కన్నిసరు, హిండితశబ్దములు కన్నడపదములని వ్రాయఁబడియున్నవి......" అని వ్రాసి అవి కన్నడపదములు కావని సిద్ధాంతీకరించుచు 'హిండిత' శబ్దవిషయమై శాస్త్రిలుగారొసఁగిన యీక్రింది ప్రయోగబాహుళ్యమువలన వీరు గావించిన సంస్కృతాంధ్రవాఙ్మయపరిశీలనక్రమము గోచరము కాఁగలదు.

"హింశితము.—ఇది పిండిత మనుటకు కన్నడమా? చూ.

'ఖండితపుగీనాగర
ఖండంబులు ఘనశశాంక ఖండంబులచే
హిండితములు గావించి యు
ఖండస్థిర భక్తి నొసఁగి కదలి చెలులతోన్.'

ఈ పద్యములో ఆరొసఁగిన వస్తు వేదో లేదు. వ్రాఁతలలో మాఱిపోయినది గావలయు. 'హింశిత వగుతాంబూల మఖండ' అని పఠించినయెడల తాంబూలము దొరకును.—[టీక. హిండితములు గావించి = కలియఁగూర్చి.] ఇందే 'పరిహిండితంబును' 'హిండన'యుం 'గండ పెండెరంబునం జొడము నఖండ ప్రభామండలంబునం బరిహిండితంబులై మత్తిపండుల వసువు గల మడమల చెసంగుపడి భావి నిజ కవతారావతార సూచకంబులంబోలెఁ గొదమ తాఁబేళ్ల పేళ్లనగు మీఁగాళ్లతో'—౬ (౯౨). [టీక.—చుండలంబుగన్ = సమూహముచేత-పరిహిండితంబులై.]

'కొండయుఁబోలె భక్తి వలగొంచునె వాఁడు నిజద్రుమభ్రమీ, హిండన వ్రాలఁపాకలపు చేమఁగుపోలె నొసలువంఘులఁ,దుండ రొవ లన్మహాగిరులు పోరవఁ బస్తుతివ్రాలి'—౬ (౮౩.)

[టీక.—భ్రమీ=మట్టు తిరుగుటయొక్క - హిండనన్=వ్యాప్తిచేత.]

మను. ౮(౬౦) లో 'వెండికొండలఁ జండకరకరహిండనంబునం బాంసుప్రభలు నిండ.' [కర=కిరణముల యొక్క - హిండనంబునన్=వ్యాపనచేత.]

శ్రీకాళహస్తిమాహాత్మ్యములో [దాసిని రాజులల గోరిగింపఁగా దానిశిరమునం దద్భక్తిపలుఁడు పరమశివుఁడు హస్తమును ఉంపఁగా] ౧(౫౫, ౫౩)

ఉ. 'ఎత్తిన నింద్రజాలకరుఁ డెత్తినబర్హ మనంగ, మన్మథుం - డెత్తిన పువ్వుబంటిమద మెత్తినకమ్మెద పింఛునారి నాఁ, జిత్తజరాజ్యలక్ష్మి కభిషేకము సేయ శివుండు కాంతకై, యెత్తిన నీలకుంభరుచి హిండనమో యన నద్భుతంబుగాన్'

క. 'నెఱి మిగులఁ గలిగి నలుపై
తఱచై మదనప్రతాప దావాగ్నిశిఖన్
మెఱయు నవధూమ మనఁగాఁ
దెఱవుఁ గచభరము వన్నె దేవునికరుణన్.'

మఱియు దశావతారచరిత్ర-నృసింహావతార కథలో—

'చండవాతోత్థ ధూరజో హిండనమునఁ
గొండమెండునఁ గదలక యుండుదైత్య
మండలేంద్రుని జేహ ముద్దండముగను
గండకండూతి నొరయుచేపండగాను.' పు. ౭౯.

పారిజాతాపహరణచంపువు (౩ పు.)-౧ (౧౩-౧౪) లకు నడిమిగద్యలో—'ప్రచణ్డ భుజదణ్డ చణ్డ మాకర్ణకుణ్డలిత కోదణ్డ హిణ్డమాన కాణ్డప్రకాణ్డ తాణ్డవాడమ్బరోద్దణ్డ ఖణ్డితారిముణ్డ పుణ్డరీక ఖ(మ?)ణ్డ మణ్డితాఖణ్డ భూమణ్డలః'—

'పక్షిణ ఆహిణ్డన్తి' స్వప్నవాసవదత్త; 'ఇతస్తతో ప్యాహిణ్డన్తే' మృచ్ఛకటీ.

'అత్యాశ్చర్యంత కఠోరమూర్తులు మహీహాలాహలజ్వాలధూమ్రమశ్మశ్రుల్ భుజదండ హిండితకుఠారప్రాసఖడ్గాగ్రల్, రక్తప్రాతముతోడ వెల్వడిరి రుద్రక్రూరగాత్రంబునన్, గూశ్మాండాగ్నిపతనీ (?) పిశాచగణరక్షోభూతభేతాళముల్.' వరాహ. ౫ (౧౦౬)

'మండువా లెడండకోట మాహురాది మేదినీమండలేశ్వరస్తుతాస మానమానుషోదయా
భండనాజితప్రచండ పటహ (వాద్య?) నిస్వనార్భటీహిండితాష్టదిక్కుడుంగ యీశ్వరాత్మసంభవా'—
,,—౧(౧౫౮)

'సంధ్యాతాండవ చండఖండపరశు ప్రాయజ్జటా మండలీ, సంధ్యాహిండితగాంగభంగజమిథః స్సంఘర్ష పుండీకృతా, సంధ్యారావ ఘుమంఘుమోన్మిలితసన్మ గ్యాచాలపుణ్యాకృతీ, వింధ్యక్ష్మాధరకూటకోటివివర ద్విద్వేషిమోషి త్తతీ.' కువలయాశ్వ. ౪(౭౧౬)

'తాండవఖేలనోద్దండ ఖండపరశు జటామండ లాగ్ర హిండమాన పుండరీక' ౧ (౧౬)

'హిండనము. సం. వి. అ. న ౧. వ్యాప్తి, ౨. భ్రమణము; 3. సురకము,' శ. ర.

'హిండితము. సం. విణ. (అ. ఆ. అ.) వ్యాపించినది.' శ. ర.

"హిండనము N. S. spread, extension. wandering; వ్యాప్తి, ప్రసరించడము, తిరగడము, (హిండనము, రతే, లేఖనే, † Sc) Swa. ౪(౬౦) 'జండితాండ' [ఇత్యాది పూర్వోదాహృతము.] Calahasti mahatyam ౧(౬౦) 'నీలరుచి హిండనమో యన.' A. ౬(౫౭) 'నిజద్రుమభ్రమిహిండన వ్రాలు పాకలపుకేనుగుకోలె"–చాణ్యము.

'హిండితము–వ్యాపించే, తిరిగే,[ఇట్లర్థము వ్రాసి శ్రీనుదోరగారు అందులకు తారాశశాంకవిజయము ౧ (౬౫), వసుచరిత్ర ౬(౬౦),అను సంఖ్యలతో 'హిండిత కీర్తియుక్తి', 'మదాకరవంశ హిండితంబు' అను ప్రయోగములను, ఆముక్తమాల్యదలోని 'ఖండిత పూగీనాగ' ఇత్యాదిపద్యమును–ఉదాహరించినారు.] [హిండితములు గావించి=సమ్మేళనముచేసి అని వారిటీక.]

ఆతారాశశాంక పద్యము:—

'పండిత మండలీహృదయ పంకజభానుఁడు బుద్ధి
కృష్ణయార్యుఁడు సుసీనమార మణియుక్ దొలి నో
మిన నోముపంటగా – హిండితకీర్తియుక్తి జనియిం
చెను వేంకటరాఘవాన్వయిం – ద్రుండు విభాసమాన
గుణ రుంద్రుఁడు వంగలవంశ చంద్రుఁడై.'

ఆ వసుచరిత్ర ప్రయోగపాదము:—

'మాణిక్యసారంబు లాణిముత్తెములు సు
మ్మివి మదాకరవంశ హిండితములు' ౬(౩౬)

[దీనిటీక.—'ఇవి–మదాకర=నాకు ఆకరమైన–వంశ=కులమందు–హిండితములు వర్ధమానము=ప్రసుమ్మ లైనవి సుమాయని యర్థము. మత్=నాసంబంధమయిన–ఆకర=గనులయందును–వంశ=వెదుళ్లయందును–ప్రవర్ధమానములైనవి–అని యర్థాంతరము.']

'మన్మథః—సఖే సాంఖ్యాయన, విప్రలబ్ధోఽపి పూర్వేద్యు ర్గ్రగ్రభోజనసముత్సాహేన యన్నదృష్టం దర్శనీయం త్వయా.

'విదూషకః—వయస్య, త్వయా తావత్ అను ధ్యాహ్నం వృక్షంవృక్షం ప్రతి హిణ్డమానేన బుభుక్షా పరిశుష్కముఖేన సమాసాదితం సాహిత్యమ్' రతిమన్మథ.

'నారదః – దమ్పత్యో ర్వనర క్తయోరపి మిషాత్ సంపాదితం వాకలిం, ప్రకాన్తం సహసా నియుద్ధ మథవా శిష్యైత్సుకై ర్బాలకైః, ఉత్థో వాథ నతు మృగేఽభిపతితో యోద్ధుం విషాణోద్ధురాన్, పశ్య న్నిర్వృత మానసోఽ సవరతం హిణ్డే మహీమణ్డలే'

—౹౹—భా.

'విదూషకః వనరాజి ష్వాహిణ్డిత్వా అటవీతోట వీమ్,' కౌముదీల.

'విదూషకః – భా. త్వం తావత్ అటవీతః అటవీ మాహిణ్డమానః నర వాసికామివ లోలుపస్య కస్యచి జ్జీర్ణరక్షస్య ముఖే నిపతిష్యసి'—

'అవికుణ్ఠవేగ హయమణ్డలికా, ఖురమణ్డ తాణ్డవిత మణ్డితమ్, భుజదణ్డ కుణ్డలిత చణ్డధను, శ్ఛ్యుతికాణ్డ హిణ్డిత వికుణ్ఠగజమ్.' అచ్యుతరాయ 4 (17).

[టీక.–కాణ్డైర్బాణై శ్హిణ్డితాః దూరతో నిరస్తాః వితుణ్డా శ్ఛిన్నకరాః గజాః యస్మిం స్తత్.] 'త్వం తావ న్మత్తోఽ త్రాహిణ్డసే.' ప్రతిజ్ఞాయౌగన్ధరాయణ.

హాలాయుధుని కవిరహస్యమునందు—

'హిణ్డన్తే యే మృషా రాత్రౌ పరస్త్రీషుహిండ న్తియే,
హేడతే నీతిసంపన్నో బాన్ధవా నపి తా నసౌ.'
'అయి కురఙ్గి, కిమకాణ్డ మిత స్తతో హిణ్డసే.' సుక్తిలక. 2 (౩౬౦ పు)

ఈప్రమాణములవల 'హిండితములు' అనుపదము నకు 'వ్యాప్తములు' అని యర్థమనియు, 'శశాంక ఖండంబులచే హిండితములు గావించి' అనఁగా 'కర్పూరపుఁ దునియలతో మిశ్రము చేసి' అని భావమనియు, స్పష్ట

ము. 'ఖండంబులచే' అను పదమందలి 'చేత' ప్రత్యయము కర్తను తెలుపుచున్నది. 'హిండితము' లో కర్మార్థమందు క్తప్రత్యయము. 'హిండితము' నకు అవ్యుత్పన్న కర్ణాటకపదముగా 'పొర్చుట' యర్థమేని, 'ఖండంబుల ఘనశశాంకఖండంబులను' అని ద్వితీయయేని, 'ఘనశశాంక ఖండంబులతో' అని తృతీయయేని, ప్రయుక్తమై యుండును. మఱియు, అవ్యయమునకు 'పరి' యని యుపసర్గపయితెము వచ్చునా? 'పరిహిండితంబులు,' 'జటామండలీ సంధ్యాహిండిత గాంగభంగ' అను స్థలములందు సంస్కృతసమాసములో ఇది యెట్లు చేరును. ఆకర్ణాటకకవిసాధారణంబును అగు నీపదముచే కర్ణాటక కవిని సాధించుట శక్యము గాదు."

దీనినిఁగాంచిన 'పండితమానులకండె నీలు'గాదా!

ఇట్లే కొన్ని పదములను ఏఱి, యనుచిత దనుకొను ప్రయోగముల నుదహరించి చూపియున్నారు.

ఈక్రింది సుస్థలోచితమైన వ్యాఖ్యానభాగమును బరికించిన యెడల శాస్త్రిులుగారి సర్వతోముఖపాండిత్యము, అద్భుతమేధాశక్తియు వెల్లడికాఁగలవు.

ఉ. కర్కశుఁ డంట కోర్వ, కుదకంబులు వాఃపతి కూర్చి
నట్లు సూర్యుఁడుఁ దానుఁ గూర్చి, మఱి యా సలి
లాధిపచిహ్న వాహతం, బేర్కలగంగ నాతఁ డెలమి
న్మకరస్థితిఁ గన్న నీర్ష్యఁ దాఁ, గర్కటకస్థుఁ డయ్యె
ననఁ గర్కటకస్థితిఁ గాంచె నత్తఱిన్.

అత్తఱిన్=గ్రీష్మసమయానంతరంబున, అర్కుఁడు = సూర్యుఁడు, కర్కశుఁడు అంటకున్ = తాను (సూర్యుఁడు) తీక్ష్ణుఁడు అని లోకులు పలుకుటను, ఓర్వక=సహింపక, వాఃపతి=వరుణుఁడు, ఉదకంబులు=జలములను, కూర్చినట్లు=కూడఁబెట్టినరీతిగా, తానున్=సూర్యుఁడును, కూర్చి=ఆవిరిరూపమున సేకరించుకొని, మఱి=ఇంక, ఆతఁడు=ఆవరుణుఁడు, ఆ-స...తన్-సలిలాధిప = వరుణునియొక్క - చిహ్న=గుర్తయిన మొసలి-వాహతన్=తనకు వాహనము గాఁగలది, అని, పేరు=నామము, కల గంగన్=వహించినదైన (ప్రసిద్ధమైన) గంగానదియందు, ఎలమిన్=ప్రీతితో, మకరస్థితిన్=మొసలియందు ఉనికిని, కన్నన్=పొందఁగా, ఈర్ష్యన్=వరుణునిమీఁద నీసు వహించి, తాన్=సూర్యుఁడు, కర్కటకస్థుఁడు=ఎండ్రియందు ఉన్నవాఁడు, అయ్యెన్, అనన్=అనునట్లుగా, ఎలమిన్=ప్రీతితో, కర్కటకస్థితిన్=కర్కటకరాశియందు ఉండుటను, కాంచెన్=పొందెను.

ఆ బెట్టిదపు టెండల తర్వాత సూర్యుఁడు కర్కటకరాశికి వచ్చుట యెట్లుండె ననఁ-సూర్యునికి ఆగ్రీష్మకాలమందు క్రూరుఁ డనునింద రాఁగా, అతఁడు దానికి కంటగించి, వరుణునికి వచ్చిన చల్లనికోర యను పేరు తానును తెచ్చుకొనఁ గోరినవాఁడై, ఆవరుణుఁ డెట్లుగా, 'నదీనాం సాగరో గతిః' అన్నప్రకారము నదులన్నియు సముద్రమునఁ బడుటం జేసి, సముద్రరూపమున జలములను కూడఁబెట్టుకొనెనో, అట్లే తానును పుడమిలోని నదులు, చెఱువులు లోనగు జలాశయముల జలమెల్ల ఆవిరిరూపమున మింటం గూడఁ బెట్టుకొన్నవాఁడై, అంతటితో తనియక ఆవరుణునితో ఇంకను పోటికై ఆవరుణుఁడు గంగలో గంగకు వాహనమైన మకరము తనకును వాహనమగుటచేత గంగయందు సుఖముగా నుండఁగా, (సూర్యుఁడు) తానును గంగచెంత మొసలివలెనే జలజంతువైన కర్కటకమందుఁ బ్రవేశించి సుఖముగా నున్నాఁడో యనునట్లుండెను. వర్షర్తువు వచ్చె నని భావము. ఉత్ప్రేక్షాలంకారము.

'కర్కశుఁడు'-'కర్కశో నిర్దయః క్రూరః ఖరః స్పర్శశ్చ సాహసీ' నానా. 'వాఃపతి'-'సలిలాధిప'-సముద్రవరుణ పర్యాయములలో 'ప్రచేతా వరుణః పాశీ యాదసాంపతి రప్పతిః' అని అమ. 'అర్కుఁడు'-'అర్కో మఘోని స్ఫటికే జ్యేష్ఠభ్రాతరి భాస్కరే' నానా.-'సలిలాధిపచిహ్న'-వరుణునికిని సముద్రునికిని మకరము చిహ్నము, అయినను ఇట వరుణచిహ్నార్థమే ఉచితతరముగాఁ గనఁబడుచున్నది.

'సంప్రాప్తం మకరధ్వజేన మథనం త్వత్తో మదర్థే
పురా, తద్యుక్తం బహుమార్గగాం మమ పురో నిర్లజ్జ
వోఢుం స్త్రియమ్, తాం మే వామనయస్వ భావకుటిలాం,
హే కృష్ణకణ్ఠ గ్రహం, ముఞ్చేత్యాహ రుషా య
మద్రితనయా లక్ష్మీశ్చ పాయాత్స వః.' రత్నావళి.

వేల్పులకు ప్రాయికముగా వాహనమే ధ్వజము-

ఉ. గరుడధ్వజుఁడు, వృషధ్వజుఁడు. వరుణునికి మొసలి వాహనంబును, సితమును.

మ. మరుదీశద్విపదానశోభ, శిఖిధూమ్యారోచిఁ, గీనాశకా - సరదేహప్రభ, రాక్షసాశితిలకాంచద్ధితిన్, వారిధీ - శ్వరకేతుద్యుతి, మాతరిశ్వ హరిణచ్ఛాయన్, ధనాధ్యక్షునీ - లరుచిన్, ధూర్జటికంఠకాంతిఁ దమముల్ వ్యాపించె దిక్ప్రాంతులన్. పారి. 4(46).

'చిహ్న'-'కళఙ్కాఙ్కౌ లాఞ్ఛనం చ చిహ్నం లక్ష్మ చ లక్షణమ్' అమ. 'చిహ్నం లక్ష్మ పతాకయోః' మేదిని. 'వాజి వాహార్వ గన్ధర్వ హయ సైన్ధవ సప్తయః' అమ. 'అసలిలాధిపచిహ్నవాహితం పేర్కొల గంగన్'-ఈసమాసమున ఆశబ్దము గంగకు విశేషణము. నడుమ వ్యస్తపదంబుల కలిమికి; ప్రౌఢవ్యా. సమాస. ౧౨ వ సూ. ను జూచునది. అందు 'ఈ కన్నులు తెలివని శిశువు' భోజ. ౬ ఆ. అని, త్రికమునకును, 'గగనమునరుద్రధూమి సేకతము తిరుగ నడరులుమిసెడు క్రొంజిదయ్యంబు పీఁడె' అని నైష. ౨. ఆ., 'బలిమి నదే దునిన్ గెలిచి బాగుగఁ గొన్న రవిప్రకాశమై యలరుచు నున్న ప్రమ్మ్యకమునందు రమింపుడు కోర్కెలారఁగన్.' రామా. ఆర. ౭ ఆ.. అని ధాతుజవిశేషణములకును, ప్రయోగములం జూపినారు. మకరము గంగకు వాహన మనుటకు- 'మకరేశ్వర పృష్ఠాధిశయితే చరణాకిసలయే' అని గంగాస్తుతిలో, క. క. ల.

'ఆలిఖ్య సఖ్యాః కుచపత్త్రభఙ్గీ
మధ్యే సుమధ్యా మకరం కరేణ,
యత్రాలపత్తామిమ మాళి యానం
మన్యేత్వదేకావళి నాకనద్యాః.' నైష. 6 (69)

అందు టీకలలో మల్లినాథనారాయణులు 'గఙ్గా మకరవాహినీ ఇతి ప్రసిద్ధిః' అని వర్ణించినారు. వరుణునికి మకరము వాహనము-'వరుణాయ జలాధిపతయే మకరవాహనాయ పాశహస్తాయ' అని వరుణప్రార్థన గలదు.

'నవోద్య దమ్భోధర ఘోరదర్శనే
యుద్ధాయ రూఢో మకరే మహత్తరే,
దుర్వారపాశో వరుణోరణోల్బణ
స్తమన్వియాయ త్రిపురాన్తకాత్మజమ్.'కుమార.4(9)

గంగయందు తద్వాహనము మకర మున్నది గాన మకర వాహనుఁడు వరుణుఁడు నున్నాఁడనుట. అట్లు గంగయందు సూర్యుఁడు లేఁడే యన్న? 'గంగన్' అనఁగా ఈపక్షమందు 'గంగాయాం ఘోషః'అనువాక్యమందుం బోలె 'గంగకడ' అని సామీప్యార్థమును చెప్పవలయును. మఱియు నిట నదిలోనికర్కటకమునకును కర్కటకరాశికిని అభేదోపచారము. నాలుగు వ్రాఁతప్రతుల యందు ఇతరత్ర భేదములు మెండుగానేయున్నను, ఇచట మాత్రము పాఠము 'పేర్కొల గంగ' అనియే యున్నది.

'సితమకరనిషణ్ణాం శుక్లవర్ణాం త్రినేత్రాం
కరధృతకమలోద్యత్సూత్పలాభీష్టముద్రామ్,
విధిహరిహరరూపాం సేన్దుకోటీరచూడామ్
కలితసితదుకూలాం జాహ్నవీం త్వాం నమామి.'
గంగాధ్యానము."

ఆముక్తమాల్యదకర్తృవిషయమై శాస్త్రులుగారిందు ముక్తకంఠముగ నెట్టిసిద్ధాంతమును గావింపక "సర్వజ్ఞులైన పెద్దలు ఈవిషయమును పరమసిద్ధాంతమును నెలకొల్పుదురు గాక" యనిరి. కాని, వీరు పీఠిక యొక్క ఉపసంహారమునఁ గృష్ణదేవరాయకర్తృత్వవాదమును బూర్వపక్షముచేయుటకై కావించిన విఫలచర్చ, 'తారుణ్యాతిగ' (ఆ. ౨-౬౭) అనుపద్యమందలి 'మాత్స్యశ్యైనపాక' విషయికమయిన చర్చ, ఈగ్రంథమునుండియే యేర్చిచూపిన 'సాజముగ కృష్ణదేవరాయని కలవడని వర్ణనలు', కృష్ణదేవరాయకృతములుగ 'సకల [illegible]' అనుపద్యమునఁ జేర్కొనఁబడిన 'సత్యావధూపరిణయ', 'రసమంజరీ'కావ్యములు అల్లసాని పెద్దనార్యకృతములుగఁ జెప్పిన 'ప్రపంచదర్పణ'మను సంస్కృతగ్రంథవృత్తాంతము, ఆంధ్రపత్రికయందు వెనుక బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు ప్రకటించిన వ్యాసప్రస్తావన మొదలయినవి "ఆముక్తము పెద్దనప్రణీతమను నాభాణకమునకే కైదండ యొసంగుచున్నవి."

పూర్వవ్యాఖ్యానము లేవియును నంతగాఁ దడవని యేతత్కావ్యోత్పత్తిమూలాధారమగు విశిష్టాద్వైతతత్త్వమును శాస్త్రులుగారు వైదికపౌరాణికప్రమాణపూర్వకముగ మహోపన్యాసమునందలి విష్ణుచిత్తవాద, అన్యమతఖండన, ఖాండిక్యకేశిధ్వజసంవాదముల వ్యాఖ్యానమున లెస్సవివరించియున్నారు.

'ఈవ్యాఖ్యానముఁ బూర్తిజెంది యిప్పటి కయిదారేండ్లయ్యె వీనాఁడు ప్రకటితమగుటయు, శాస్త్రిగారే తాము 'ఇన్నికడగండ్ల పాలయితి' నని చెప్పుటయు, నాంధ్రలోకమునకుఁ గలవాఙ్మయాభిమానమును జాటుచున్నది. ఐననేమి? గ్రంథపారమ్యమును గుర్తించి యిప్పటికయినను బ్రకటితమగుటకు యథాశక్తిని దోడ్పడిన వదాన్యులగు పలువురు రసికులకు ధన్యవాదముల నర్పించుట సముచితము. సాహితీసంపన్నులతోపాటు సంపత్సంపన్నులును నడుముకట్టి కట్టిప్రయత్నములను గావించిననే కాని సర్వతోముఖసాహిత్యాభివృద్ధి కాఁజాలదు?

'అలఁతిసేవకె తనివోఁడీ యన్నలార' యని శాస్త్రులుగారు నుడివిరి. కాని, యట్లు తలఁప నెవ్వరు సాహసింతురు? ఇది యత్యధికమగు సేవ గాక 'అలఁతి సేవ' యెట్లగును? శాస్త్రులుగారి యిట్టి యుత్కృష్టసేవను బడసి యాంధ్రభారతీదేవి ధన్యురాలయినది. ఇంకను జిరకాల మాతల్లి శాస్త్రులుగారివలన నితోధికసేవను బడయుచుండ 'మాల్యము దాల్చి పతికిడుమాతను' మెచ్చిన శ్రీరంగనాథస్వామి వారి కాయురారోగ్యములను బ్రసాదించి యనుగ్రహించుఁ గాక!

* * * *

## బసవపురాణము (ద్విపద)

[ఆంధ్రగ్రంథమాలయందు ద్వితీయకుసుమము.]

కర్త:—ప్రాచీనాంధ్రకవి పండిత లోకమునఁ బేరుగన్న పాల్కురికి సోమనాథుఁడు.

పరిష్కర్త:—అర్వాచీనాంధ్రకవి పండిత లోకమునఁ బేరుగన్న బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు.

రాయలుసైజున ౪౩౦ పేజీలు గలవు. వెల రు. [illegible] మాత్రము.

విలాసము:—ఆంధ్ర గ్రంథమాల, నెం. 7, తంబుచెట్టివీథి, మద్రాసు.

శివపారమ్యమును బ్రతిపాదించు నాంధ్రగ్రంథములలో నుత్తమమనఁదగు నీబసవపురాణము నందీశ్వరుని యవతారమని వీరశైవులు విశ్వసించిన బసవేశ్వరుని యొక్క చరిత్రము ప్రధానేతివృత్తముగాఁ గలది. అనుప్రసక్తములుగ నాంధ్రద్రావిడ కర్ణాటమహారాష్ట్రదేశములకుఁ జెందినవారును, బసవేశ్వరునకుఁ బూర్వులును, సమకాలికులును నగు శివభక్తులయొక్క చరిత్రములును నుపకథలుగ నిందువర్ణితములైనవి. క్రీ. శ. ౧౧౫౬ మొదలు ౧౧౬౭ వఱకుఁ గల్యాణకటకము రాజధానిగఁ బశ్చిమ చాళుక్యరాజ్యమును బరిపాలించిన 'కలచుర్య' రాజగు బిజ్జలునియొద్ద బసవేశ్వరుని మేనమామయగు బలదేవమంత్రి దండనాయకుఁడుగా నుండి మృతుఁడు కాఁగా బిజ్జలుఁడు బసవేశ్వరుని రప్పించి యాదండనాయకపదమున నియమించెను. కర్ణాటదేశమున వేరువాటుకొనియున్న జైనశైవమతములకు ద్వేషము ప్రబలి పరస్పరము రూపుమాపుకొనఁజూచుచున్న యాకాలమున బసవేశ్వరుఁడు జైనమతము నడఁగార్చి, వీరశైవమతమును బెంపొందించి, స్థిరముగ నెలకొల్పినాఁడు. కాన నీబసవపురాణమును శైవులు గొప్పమతగ్రంథముగఁ బరిగణించి యారాధించువారు. ఈగ్రంథ మాంధ్రభాషయందు వెలసినను శైవమతప్రతిష్ఠాపకగ్రంథ మగుటచే నాంధ్రదేశమునకంటె వీరశైవము మిక్కిలిగా వ్యాపించియున్న కర్ణాటదేశమున మిగులఁ బ్రచారమును గాంచినది.

తొలుకొత్త బసవేశ్వరునిచరిత్రము నిట్లు 'బసవపురాణ' మను పేరఁ దెలుఁగున రచియించిన యాతఁడీ సోమనాథకవియే. ఈతఁడు క్రీ.శ. పండ్రెండవశతాబ్దాంతమున (క్రీ. ౧౧౯౦ ప్రాంతముల) నుండినవాఁడు. శైవేతరుల మొగము సైనఁ జూడ నిచ్చగింపని వీరశైవుఁడీతఁడు; సంస్కృతాంధ్రకర్ణాటభాషాకోవిదుఁడు; వీరశైవమతప్రవర్తకులలో నొకఁడుగఁ బేరుగన్నవాఁడు; బహుగ్రంథకర్త.

"శ్రీ బసవపురాణంబు, పండితారాధ్యుల
చరితంబు, ననుభవసారమును, జ
తుర్వేదసార సూక్తులు, సోమనాథభా
ష్యమ్ము, శ్రీరుద్రభాష్యమ్ము బసవ
రగడ, గంగోత్పత్తిరగడ, శ్రీబసవాఢ్య
రగడయును, సద్గురురగడ, చెన్న
మల్లు సీసములు, నమస్కారగద్య, వృ
షాధిపశతకంబు, నక్షరాంక

"గద్యపద్యముల్, పంచప్రకారగద్య,
యష్టకము, పంచకము, నుదాహరణయుగము
నాదియగుకృతు"

లీతఁడు రచించినవి. వానిలోఁ గొన్ని తెలుఁగుకృతులు; కొన్ని సంస్కృతకృతులు; తక్కినవి కర్ణాటకృతులు. ఇన్నియు శివపారమ్యమును, శైవమతాధిక్యమును బ్రతిపాదించునవి. ఈతని తెలుఁగుకృతులలో ద్విపదకృతి యగు పండితారాధ్యచరిత్రము గొప్పది. తరువాతి యెన్నఁ దగినది యీ బసవపురాణమే. సోమనాథుని పేరనుగూడఁ గొన్నికృతులు గలవు. తొలుతఁ దెలుఁగున వెలసిన యీ బసవపురాణమునకుఁ గ్రమముగ సంస్కృతద్రావిడకర్ణాటాదిభాషలయందుఁ బెక్కనువాదములు బయలువెడలినవి. మఱియు నిందలి భక్తుల యుపాఖ్యానము లెన్నియో వన్నెలుగ ద్విపదపద్యప్రబంధములరూపమును దాల్చినవి. దీనిని సోమనాథునకుఁ దరువాతివారగు పెక్కురాంధ్రకవులు ద్విపదపద్యకృతులుగను, యక్షగానములుగను రచియించినారు. వీరశైవమతమువారికీ బసవపురాణము పారాయణగ్రంథము కావున పరస్సహస్రములుగఁబుట్టిన వ్రాతగ్రంథప్రతికలు క్రమముగ నవ్యక్తమైన లేఖకప్రమాదజనితదోషదూషితములుగాఁ దోఁచినవి. ముద్రణాదిసౌకర్యములు లభించినతరువాత నిటీవల నొండురెండుమారులు భిన్నభిన్నకాలముల ముద్రితమయిన గ్రంథము సైతముఁ దద్దోషములకు దూరము గాకుండినది. ఆంధ్రవాఙ్మయమునకు మూలాధారమగు ప్రాచీనగ్రంథమయినను దోషభూయిష్ఠమగు స్థితికి వచ్చుటచే నర్వాచీనులీగ్రంథప్రాశస్త్యమును, ప్రామాణ్యమును నంతగా గుర్తింపఁజాలకపోవుట వింతగాదు.

ఇపు డీగ్రంథమును బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు భిన్నభిన్నప్రాంతముల నుపలబ్ధములయిన బహుతాళపత్రమాతృకలను బరిశీలించి సముచితరీతిని బరిష్కరించియు, సర్వతోముఖగ్రంథవిమర్శనమును, విపులమును (౧౫౯ - పేజీలు), అమూల్యమును నగు పీఠికను రచియించి యిందుఁ జేర్చియు నిట్లు క్రొత్త వెలయించి యాంధ్రవాఙ్మయమునకు మహోపకారమును గావించినారు. పరిష్కరణావసరలబ్ధములు, పఠనాంతరగ్రాహ్యములు నగు పాఠాంతరములను మూలముతోఁ జేర్చినారు.

పీఠికయందు శ్రీశాస్త్రిగారు కవికాలకులగోత్రములు, గ్రంథరచనాకాలము, బసవేశ్వరచరిత్రము, కాలము, బిజ్జలునిచరిత్రము, కాలము, బసవేశ్వరునిసమకాలము వారలచరిత్రము, శైవమతస్వరూపము, తద్వ్యాప్తి, వీరశైవమతప్రారంభకాలము బసవపురాణమునవర్ణింపఁబడిన ప్రాచీనభక్తులయొక్క ఆధారాంతరోపలబ్ధచరిత్రములు మొదలగు విషయములను శాసనాదులను, సంస్కృతాంధ్రద్రావిడకర్ణాటాదివాఙ్మయములను బరిశోధించి వానివలన లభించిన యాధారములను బ్రమాణముగాఁ గొని సయుక్తికముగను, సమంజసముగను జర్చించి సిద్ధాంతీకరించినారు. గ్రంథమును విమర్శించుచు, కవియొక్కఛందస్స్వాతంత్ర్యము, గ్రంథమునందలియతిప్రాసవిశేషములు, అపూర్వప్రయోగములు, శబ్దవిశేషములు, ప్రాంతపలుకుబడులు మొదలయిన విషయములను జక్కఁగాఁ జర్చించి తమపాండిత్యప్రకర్షను జాటినారు. ఇదివఱకసాధువులని యవిచారితముగ కొందఱుప్రాచీనులు, నర్వాచీనులు నెట్టిచెనఛందోవ్యాకరణాది విశేషములు, శబ్దస్వరూపములు, పలుకుఁబళ్లు సాధువులేయని యమూల్యమగు నీబసవపురాణపరిశీలనమువలనఁ దేలుచున్నది. ఈసిద్ధాంతము లనావశ్యకములగు పెక్కునిర్బంధములచేఁ గట్టువడియున్న తెలుఁగుభాషయొక్క వికాసమున కెంతయు నుపకరించునవి. ఈయుపకారము శాస్త్రిగారి సద్వైదుష్యమూలక మగుట సునిశ్చయము.

శ్రీ శాస్త్రిగారు పీఠికయందుఁ గావించిన సారస్వతవిషయిక విమర్శావిధానమునకు రెండుదాహరణములు:

౧. గ్రంథమునందలి యసాధారణప్రయోగశబ్దములను జర్చించుచు 'తొంగిళ్లు' అను శబ్దమునుగూర్చి యిట్లు వ్రాసిరి:—"తొంగిళ్లు శ.ర.లో నీపదమునకు నీటిబొట్లు, నూనెబొట్లు అని యర్థము కలదు. భల్లాణచరిత్రలో నివిగా బసవపురాణములోని యీ ద్విపదలే యుపపాఠములతో సందర్భశూన్యము లయ్యెను. (శబ్దరత్నాకరమునఁ బెక్కుపట్టుల బసవపురాణ పండితారాధ్య చరిత్రములలోని ద్విపదలే భల్లాణచరిత్ర ద్విపదభాగవత పతివ్రతాచరిత్రములలో నివిగా నుదహరింపఁబడినవి. అట్టి ద్విపద లాయా గ్రంథములందు నాకుఁ గానరాలేదు. శ. ర. లో గ్రంథసంకేతవివరణపట్టికలో భల్లాణచరిత్రము వాలేశ్వరుని

దిగాఁ జెప్పఁబడినది. వాలేశ్వరునిది పద్యకృతి.) ఇక్కడ ముద్రితమయిన పాఠమును శే. ర. పాఠమును జూచినఁ దెలియఁగలదు. తలంటునప్పుడు పసిబిడ్డలఁ బండుకొనఁబెట్టుటకయి చాఁచిన యూరుద్వయమునకుఁ దొంగిళ్లని పేరు. 'తొంగిళ్లపైనిడి లింగమూర్తికిని|నంగన గావించు నభ్యంజనంబు' అనుద్విపదను గన్నడకృతిలో భీమకవి యిట్లు పరివర్తించినాఁడు: 'ఎరడుతొడ గళమేలె పర మన | నిరిసిసలె యభ్యంగనవనా| చరిసు'. మఱియు అంగిటి మల్లొత్తునందంద్రవేలఁ - దొంగిళ్లఁగార్నీరు దోసె త్తిమిడుచు' అనుదానికి 'అంగళియమళ్లం సునతికెం జంగళివి నొత్తువరు తుంగో | త్సంగదిం సురిదిఱబునని తంసెత్తి యొళెరెవరు."

౨. "షష్ఠీసమాసమున 'పుం, ప్ర', లు:—పు. ౩ ఆ- 'ధీరంబుకట్ట,' 'గంభీరంబు తిట్ట.' ఇత్యాదులు. ప్రాచీన కృతులలో షష్ఠీసమాసమున ముకారమునకు 'పు', 'ంపు'లు గానరా వని కొందఱందురు గాని యది సరికాదు. బసవపురాణపు ప్రాఁతప్రతులలో రెండురూపములును గానవచ్చుచున్నవి 'ధీరంపుఁగట్ట గంభీరంపుఁదిట్ట.' ఇత్యాదిగాఁగూడఁ గలవు. తిక్కనాదులు మఱచుగా నిట్టు ప్రయోగించిరి. ప్రాఁతవ్రాఁతప్రతులు చూఁడవలెను. ప్రాసస్థలములలోని ప్రయోగము లనివార్యములు, వానిఁ జూపుచున్నాఁడను 'వ. తపమున—గల్గుక్రీడి క, య్యావు వెర వెక్కుడై గెలుచువట్లుగ'—కర్ణ. ౩ ఆశ్వా. 'లావు చేవక| య్యావువెర వేపుదాల్మి'—శల్యపర్వము. 'కృపఁ దిలకింపఁ దెంపఁ బరికింపఁ గలాఁ డుదయించు నంము వే, దపుగని వేల్పు సెప్పి:'—సోమనహరివంశము, ౨ ఆశ్వా. 'కపటమువన్ని జానకి నకల్మషఁదెచ్చినయట్టి పాపకర్మపుఁబోఁడువక.'—భాస్కర రామాయణము, యుద్ధకాండము. ఇత్యాదులు కవిలోకచింతామణిలో నెల్లంకి తాతంభట్టుగూడ షష్ఠీసమాసమున నీయాదేశము గలదని వచించెను."

దేశీయపద్ధతిని జానుఁదెనుఁగున వెలసినయీగ్రంథముయొక్క రచనాసౌందర్యమునుగూర్చి శాస్త్రిగారీక్రిందితీరునఁ జెప్పిరి:

"మన సోమనాథుని రచన మసాధారణ సౌందర్యము గల్గియున్నదనుట యతిశయోక్తిగాదు. ఛందస్సు, భాష, విషయము మూఁడును దేశీయములే యగుటయు, కవి శివతత్త్వానుభవమున నోలలాడుచుఁ దన్మయుఁడై కవితావేశము నొందియుండుటయు నట్టి యసాధారణసౌందర్యమునకుఁ గారణములు.

వడిఁ బాఱు జలమున కోడలెల్లఁ గాళ్లు
వడిఁ గాలు చిమ్మున కోడలెల్ల నోళ్లు
వడి పీఁచు గాడ్పున కోడలెల్లఁ దలలు
వడిఁ జేయు బసవన కోడలెల్ల భక్తి.

అని బసవనిఁగూర్చి సోమనాథుఁడు భావప్లుతములుగాఁ బలికిన పలుకులు స్వవిషయమునఁగూడ సమన్వితము లయ్యెను. ప్రతిపదమునను శివభక్తిపరవశుఁడైయుండి సోమనాథుఁడీ గ్రంథముల రచియించెను. ముగ్ధభక్తుల కథలు మొదలగువానిలోఁ గొన్నిపట్టులు చదువునప్పుడు మనసు ద్రవించితీఱును. బిజ్జమహాదేవి కథయు, గొడగూచికథయుఁ, గన్నప్పనికథయు జదువునప్పుడు నేను వెక్కిరిడవలు కరఁగితిని. మాయమర్మములు లేని విశుద్ధము గ్ధభక్తిని బ్రకటించుటలో సోమనాథుఁ డక్కడక్కడ మధురమధురములయిన జానుఁదెనుఁగుఁ బలుకుల జాలు వార్చి ముద్దులు గరిపించెను. శబ్దాలంకారములకయి, యర్థాలంకారములకయి, సోమనాథుఁ డెక్కడను బాధపడలేదు. తనకుఁ దెలియక యప్రయత్నముగాఁ బొందుపడినవే కాని యాలంకారికులు పేర్కొన్న కావ్యగుణముల ననుధ్యానించి పనిపూని చొప్పించినట్టు కన్పట్టు పట్టు లీగ్రంథమున నెక్కడను గానరావు. సులువుగా రచింపఁదగిన ద్విపద మగుటచే సోమనాథుని చూపు కథాకల్పనమందును, విషయవిన్యాసమందును, భావప్రపంచనమందును బరుగులువాఱినదే కాని యతిప్రాసచ్ఛందోభాషా బంధములందుఁ జిక్కుకొని యెక్కడను ద్రొక్కటపడలేదు. అట్లు పరుగువాఱుటలో చిక్కుపట్టులం దీతఁడు పాఠకుఁడు సరిగాఁ దన్నువెన్నాడఁ గలఁడా యనికూడఁ జూడఁబోఁ డయ్యెను."

ఇఁక నావిషయమునుగూర్చి యిటుఁ జర్విత చర్వణముగఁ జేమియుఁ జెప్ప బనిలేదు. కాని యీక్రింది యుదాహరణమును గొంపఁదగును:

'రుద్రపశుపతి' యను నొకముగ్ధభక్తుఁ డాదిపురాణమునందలి సముద్రమథనకథ నెవరో చదువుచుండ నం

దు శివుఁడు హాలహాలమును మ్రింగెననుటను వినెనట. దాన శివున కేమిచేటు వాటిల్లునోయని యాతఁ డిట్లు పరితాపమును జెందుచున్నాఁడు :

"ఆరుద్రపశుపతి యాలించి భర్గుఁ
డారగింపుట నిక్కమా విషం? బనుచు
'ననుమానమా! మ్రింగె హరుఁడు విషంబు
బనుగొన నటమీఁదిపను లెఱుంగమన
విని యుల్కిపడి పేఁపువిఱిగి "హా! చెడితి"
నని సోలఁబడి పొర్లి యక్కటా' నిన్ను
వెఱ్ఱిఁ జేసిరిగాక! విశ్వేశ! యెట్టి
వెఱ్ఱివా వైనను విషముఁ ద్రావుదురె?
బ్రదుకుదురె విషమ్ముపాలైన వార?
లిది యెట్లు వినవచ్చు; నేమి సేయుదును?
నిక్క మెవ్విధమున నిన్నె కాచె (కే!)లుఁగ
ముక్కంటి! నా కింక దిక్కెవ్వరయ్య?
నాకొఱకైనఁ బినాకి! యివ్విషము
చేకొన కుమియవే నీకు మ్రొక్కెదను
కటకటా! మేన సగంబున నుండి
యెట వోయితివె! నీ వెఱుఁగవే గౌరి!
ప్రమథగణములార! పరమాప్తులార!
పనుపిన వెండి మీశక్యమే కాద?
శతరుద్రులార! యసంఖ్యాతులార!
క్షితిధరకన్యకాపతిఁ గావరయ్య!
వీరభద్రయ్యరో! విషముఁ బ్రాణేశుఁ
డారగించె నిఁ కెట్టు లవునోకదయ్య!
ఓపురాతనులార! యొషయుండు బ్రదుక
నోపునో! విషం బోగి నారగించెఁ
జావుఁ దప్పింపరే సద్గురునాథు
జీవన లీయరే కావరే శివునిఁ
దల్లిలేని ప్రజలఁ దలఁతురే యొరులు
తల్లి యున్న విషముఁ ద్రావనేలిచ్చు!
పరమేశుఁ డీబారి బ్రదికె నేనియును
మరణంబు లేదునో మఱి యెన్నఁటికిని!
నని ప్రలాపింపుచుఁ బనవుచు నొండు
వినఁజాలఁ బ్రాణముల్ విడుతు నేననుచుఁ
దడయక ఘనజలాంతరమున మునుఁగఁ
బనకుండ నారుద్రపశుపతిఁ బట్టి
పార్వతీసహితుఁడై ప్రమథరుద్రాది
సర్వసురాసురసంఘంబుఁ గొలువ
హరుఁడు ప్రత్యక్షమై"

తాను విషమును కుత్తుకను దాఁటనీయకుండునని యాభక్తునికి వరమిచ్చెనట. ఈపరితాపవర్ణన మెం...హృదయద్రావకముగ నున్నది. ఇట్టులే భావోద్రేకమును గలిగించి పాఠకులఁదన్మయులఁ జేయు పట్టు లీపుస్తకమున లెక్కకుమిక్కిలిగఁ గలవు.

దేశోద్ధారకులు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు (గ్రంథమాలాసంపాదకులు) శైవ వీరశైవ మతములయొక్క ఉత్పత్తి, వ్యాప్తి, స్వరూపతత్త్వములను వివరించుచు రచియించిన విలువగల ప్రస్తావన (౩౨ పేజీలు) గ్రంథాదిని వెలసియున్నది.

కృతికర్త కవివతంసము; పరిష్కర్త పండితవతంసము. ఇఁకఁ జెప్పవలసినదేమి? బంగారమునకుఁ బరిమళమబ్బినది. తత్సౌందర్యసౌరభ్యములను గ్రహించి యానందింపఁదగిన నేర్పు ఆంధ్రలోకమునకుఁ గలదని విశ్వసించుట పొరపాటు కానేరదు.

జానుఁదెనుఁగు నుడికారములు, జాతీయములు, నామట్లనను వెలలేని మానికముల కీగ్రంథము గని. గ్రంథరచనాభిలాషు లగు రసికాంధ్రసహృదయులెల్లరు నిందలి రత్నములను సంగ్రహించి తమరచనముల నలంకరించుకొనఁదగుదురు. ఈగ్రంథముయొక్క ప్రాచీనతను, ప్రాశస్త్యమును గుర్తించి విద్యాశాఖాధికారులు ఉన్నతపాఠశాలలయందును, కళాశాలలయందును దీని నావశ్యకపాఠ్యగ్రంథముగ నిర్ణయించి ఆంధ్రవిద్యార్థుల మాతృభాషాభివృద్ధికిఁ దోడ్పడుట పరమావశ్యకము.

* * * *

## త్యాగరాజస్వామిచరిత్రము (పద్యకావ్యము)
## [ఆంధ్రగ్రంథమాలయందలి సప్తమకుసుమము]

గ్రంథకర్త: శ్రీయుత పసుమర్తి కృష్ణమూర్తి శాస్త్రిగారు, బరంపురము, గంజాముమండలము.

క్రౌను ౧౬ పేజీలసైజున రెండువందలపుటలు గల గ్రంథము. వెల రు. ౦-౧౦-౦

విలాసము:—ఆంధ్రగ్రంథమాల, 7 తంబుశెట్టివీధి, మదరాసు.

ఆంధ్రదేశమున త్యాగరాజు రచించిన కృతులను ఎఱుగని రసజ్ఞు లుండరు. ఒక్క ఆంధ్రదేశమునందే కాక ఆంధ్రేతరప్రాంతములను సైతము మురిపించు నతిశయోక్తి గాదు. త్యాగరాజు చోళమండలముననున్న పంచనదక్షేత్రమున నివసించుచుండిన యొక యాంధ్రకుటుంబమునందు కాకర్ల నగరాజ బ్రహ్మమను నాయనకు ద్వితీయపుత్రుడుగ జన్మించినవాడు; సంగీతసాహిత్యములయందసమానపాండిత్యము గడించి, పుట్టువు మొదలు శ్రీరామచంద్రుని పరదైవముగా నమ్మి తత్సేవాపరాయణుడై ప్రాపంచికవ్యామోహములం దగుల్కొనక జీవితమును పవిత్రముగ గడపిన మహానుభావుడు. అట్టి రామభక్తాగ్రేసరుడు ఉత్తమసంగీతలక్షణసమంచితములుగను, లలితలలితములుగను, సరసభావసంపన్నములుగను రచియించిన గేయములు భక్తిరసమును జాలువార్చుచు కర్ణరసాయనములై రసికశ్రోతృబృందమును మైమఱపించుచుండుట అనుభవసిద్ధము.

శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారు గాయకబ్రహ్మయగు నామహనీయుని చరిత్రమునే యిట్లు రసవత్ప్రబంధకావ్యముగా రచియించినారు. ఇందలి రచనము ధారాశుద్ధి గలిగి, లోకోక్తులతో నొప్పి యెంతయు హృదయంగమముగ నున్నది.

త్యాగరాజు జీవితచారిత్రమునందలి వివిధసందర్భములకు దగినట్లుగా రుద్రచితకృతులయం దేవి దగినవి యటి చేర్చి యిందు యథాపట్టుల జేర్చినారు. ఈ సాంఘిక గ్రంథమునకు మఱింత వన్నె దెచ్చి పాఠకులను భక్తిపరవశులను గావింపజాలియున్నది.

ఈ గ్రంథము నిఖిలాంధ్రజనసమాదరణ పాత్రమగుట నిస్సంశయము.

మచ్చునకు :

ఉ. చూడక యుండలేను భవ,
　　శోషణ నీ నగుమోము చందురుం
　బాడక యుండలేను మృదు,
　　భాషణ నీ విలసద్గుణంబులం
　గూడక యుండలేను రఘు,
　　కుంజర నీపదపద్మభక్తులకా
　దేడెన రమ్మ కంటబడి
　　వేడుకనొందెదు నన్నుఁ బ్రోవుమా.

ఉ. రామనృపాల, నే జనక
　　రాజు నై సీతాకకన్ని విచ్చి నీ
　ప్రేమకుడీ జారకొంటనకు?
　　సభిష్టుత మై యలరారుచున్న నీ
　నామము రేయి యుం బవలు
　　నాక జపించుచు నున్న పేద న
　న్నేమిటి కన్నియుం దెలిసి
　　యిట్టుల నట్టెల నెట్టుచుంటివో.

*　　　*　　　*　　　*

## సైడీలేడీ-అపవాదము

శ్రీ నాళము కృష్ణారావుగారు రచించినది. క్రౌను ౩౨ సైజున ౨౦ పుటలున్నవి. వెల ౧-౪-౦.

రెండుకావ్యములందును కేవలము సంభాషణములును, ఆత్మభాషణములును దక్క కవి స్వయముగ జెప్పునదేమియు లేదు. కథాభాగములు పరిచితములే కాని యీ నవీనకావ్యరచనయందు దవిరక్తినే కూర్చుచున్నవి.

ఇందు 'సైడీలేడి' యను కావ్యము—

'అదిగో! సౌమిత్రి! వింటివే యార్తరవము'

అను సీతవాక్యముతో నారంభమై,

'దురితమారుని లక్ష్మణు దూఱియుంటి,
గట్టికుడు పకయున్న యాకర్మఫలము?'

అను సీతవాక్యములతో ముగియుచున్నది. ఆ 'ఆర్తరవము'న నంకురించిన కావ్యవస్తువు ఆ ఆర్తరవమున నుద్విగ్నయై లక్ష్మణుని నిందించి పుచ్చినసీత యొక్క పశ్చాత్తాపమున పరిణతమై, ఆమె యవిమృష్టకార్యము వలన బ్రాప్తింపనున్న దుష్ఫలమును సూచించుచు శోభావహము గనున్నది.

'అపవాదము' అను కావ్యము లక్ష్మణుడు సీతనడవియందు విడువగా నామె,

'ఏమి లక్ష్మణా! నేడు నీమోముఁ జూడ
విన్నవైయున్న దేటికి చెన్నదోరఁగి?'

అని యాశంకించుటతో మొదలగును. అతనివలన నామె నిజావస్థ నెఱిగి, వందులై, తుదకు—

'నగవుచే నిట్లు నోరికి వచ్చినట్లు
పలికితిని గాక, లోకాపవాదమునకు
పతిని గురిసేయ నేనెట్లు పాలుపడుదు!
విభునియానతి పడియుండు విపినమందు.'

అని తన శీలప్రాశస్త్యమున తనవ్యగపు నాహుతిచేసి,

'ప్రజల బిడ్డలంబోలెఁ గాపాడు మనుచు
తలఁప నాకేమిగడ చెప్పు తానె యనుచు
భావ మెప్పుడు తనమూర్తిఁ బాయదనుచు
నెమ్మి యొకయింత నామీఁద నిలుపుమనుచు.'

అని తన పతిహిత పరాయణత్వమును, నైరాశ్యాంధకారమున మునిగిపోవుచున్న తన ఉజ్జ్వలప్రేమజీవనమును దండడించిన తుదిసందేశము వెలిబుచ్చును. కావ్య మిట్లు ముగియుట బాగున్నది.

నిర్వహణ నైపుణికతోడు శైలీసారళ్యమును, రసస్ఫురణమును నీ కావ్యములకు వన్నెపెట్టుచున్నవి.

ఈ చిన్నిసంపుటము చాలముద్దుగ నున్నది. వెల యింకను తక్కువ అయిన బాగుండెడిది.

ముద్రాపకులు: మల్లయ్యా ఆర్టుప్రింటింగ్ వర్క్సు, రాజమండ్రి.

---

శ్రీ మహాభక్తవిజయము-ప్రథమ సంపుటము:—గ్రంథకర్త: కీర్తిశేషులైన శ్రీమాన్ పరవస్తుజియ్యరు సూరిగారు. క్రౌను సైజు ౩౩౬ పుటలు. క్యాలికో బైండు. వెల రు. ౨-౮-౦.

'దేవా, అవధరింపుము' వంటివను గ్రంథ శీర్షిక మన కావ్యపురాణాదిసంప్రదాయము ననుసరించి పద్యగద్యాత్మకమైయున్నది. గ్రంథముమాత్రము గద్యాత్మకము. శైలి ప్రౌఢస్నిగ్ధమై యొప్పుచున్నది.

'వలయువారు—1. బెంగళూరుసిటి, నగర్తపేట, పావుగడ వెంకటరమణప్ప శ్రేణియందుండు రామానుజాచార్య అండ్ కంపెని వారిపేరఁగాని'—

'2. బెంగుళూరు సివిల్ అండ్ మిలిటరిస్టేషన్ సెప్పింగ్స్ రోడ్డునందలి గాయక గ్రామణీవిద్యాసంఘ కార్యదర్శిగారగు ఆర్. యతిరాజులపేరఁ గాని—సొమ్ము పంపి తెప్పించుకో వచ్చును.'

సీత (పురాణకథ):—శ్రీ. వెలికాని సూర్యారావుగారు రచించినది. క్రౌను సైజు ౧౩౦ పుటలు. (వెల తెలియదు.) శ్రీరామముద్రాక్షరశాల, చిత్రాడ. పిఠాపురము.

ఇది సులభశైలితో నొప్పుచు జనసామాన్యమునకు సుబోధముగ నున్నది. నడుమనడుమ పద్యములు గలవు. "ఇట్టి గ్రంథములు పాఠశాలలయందలి బాలికాబాలకులకు నిర్మలచరిత్రబోధకంబులును, నీతిమార్గసాధకంబులును, ధర్మోపదేశకంబులును, సత్త్వప్రకాశకంబులునై మహోపయోగకరంబులుగా నుండఁగలవు." అని శ్రీవేంకటపార్వతీశ్వరకవులు దీని యుపోద్ఘాతమున నుడివియున్నారు.

సూక్తిసుధార్ణవము (గద్యకావ్యము):—గ్రంథకర్త: శ్రీ. తూనా విశ్వనాథశాస్త్రిగారు, పచ్చయప్పపాఠశాలాంధ్ర పండితులు, చెన్నపురి. క్రౌను సైజు. వెల ౮ అ.

ఇందు ధర్మవ్యాధోపాఖ్యానము; ౩౭ పుటలు; సావిత్ర్యుపాఖ్యానము; ౩౫ పుటలు.

పాండిత్యప్రకర్షను ప్రకటింపగోరుచున్నది శైలి. విద్యార్థులకు పదజాల మెక్కువ నేర్చుకొనుట కిదితోడ్పడును. ఇది నీతిదాయకముగను నున్నది.

శ్రీరామచరిత్రము (సటీకము):—ఇది పోతనామాత్య భాగవతాంతర్గతము. క్రౌను సైజు ౯౮ పుటలు. వెల ౮ అ. ఏడవకూర్పు.

శ్రీ. గా. వారిసర్వోత్తమరావు, యం.ఏ. గారు తమ టీకను చేర్చి దీనిని ప్రకటించినారు. "చదువరులెల్లరు శ్రీమద్రామాయణకథనే ఎక్కువగా ఎఱింగియుండువారు గాన ఆకథకును, భాగవతకథకును గల తారతమ్యముల వ్యాఖ్యానమందుఁ గొంచెము విపులముగఁ గనఁబఱచినాఁడ" అని టీకాకారులు పీఠికలో నుడివిరి. అర్థతాత్పర్యములే కాక విశేషాంశముల వివరముకూడ నిందున్నది. తగినతావుల విశేషములను వ్యాకరణవిషయములుగూడ నున్నవి.

ఈపుస్తకములు వలయువారు టీకాకారుల పేర వందావ్యలకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

కేదారేశ్వరవ్రతకల్పము:—విద్వాన్ శ్రీ. ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారిచే నిది పరిష్కృతము. క్రౌనుసైజు ౪౦ పుటలు. వెల ౪ అణాలు. శైవప్రచారిణీగ్రంథమాల, వరంగల్, దక్కను.

లలితాంధ్రకథావళి:—గ్రంథకర్త: శ్రీ వెంకటసుబ్బయ్యశాస్త్రిగారు. డెమ్మీసైజు ౨౬ పుటలు. చివరగల 'ఉపదేశరత్నములు' ౧౪ పుటలు. వెల ౪ అణాలు.

లలితాశ్రమగ్రంథావళీ, నెం. 6–9, పోలయప్ప మొదలివీథి, మైలాపూర్, మద్రాసు.

సురభి:—గ్రంథకర్త: బుక్కపట్టణము తిరుమలనరసింహాచార్యులుగారు. క్రౌనుసైజు ౭౮ పుటలు. వెల ౬ అణాలు.

ఇది యొకఖండకావ్యముల సంపుటము. ఇందు ప్రేమప్రధానములగు ఖండకావ్యములు చాలగ నున్నవి. ఆశానైరాశ్యములు మెండుకొన్న కవిహృదయమందలి వ్యగ్రత యిందు బాగుగ గోచరించుచున్నది. చివర 'వడిసెల' యనుకథ యున్నది. ఇందు కవికిగల ప్రకృతిప్రేమయు, విస్నజీవనము నెడ సానుభూతియు ప్రకటితములగుచున్నవి. కథనశైలి సరళముగ నున్నది. అటనట భాషాదోషములు, ఛందోదోషములును గలవు.

ఫెదరువైటు కాగితముపై చక్కని ముద్రణముతోడను, మంచిబైండుతోడను సంపుటము ముచ్చటగా నున్నది.

వలయువారు 'ఆంధ్రాబుక్‌డిపో, 45, బందరువీథి, మద్రాసు' అని వ్రాయవలెను.

హరిశ్చంద్రమహారాజు:—గ్రంథకర్త: శ్రీ చెలికాని వేంకటనరసింహారావుగారు. డెమ్మీసైజు ౬౦ పుటలు. వెల ౬ అణాలు.

శైలి మృదుమధురమై యొప్పుచున్నది. కథనము ప్రవాహమువలె నున్నది. శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు గ్రంథాదిని, 'ఇట్టి వచనప్రబంధములు స్కూలువిద్యార్థుల కత్యంతోపకారకములుకావున విద్యాశాఖవారు పరిశీలించి పఠనీయగ్రంథముగా నియమించి గ్రంథకర్తకు ప్రోత్సాహము లొసఁగుదురని నమ్ముచున్నాను' అని నుడివినది యుక్తము.

వలయువారు 'సెక్రెటరీ, యస్. ఆర్. లైబ్రరీ, లక్ష్మీనరసాపురము, పిఠాపురముపోస్టు, తూర్పుగోదావరిజిల్లా' అని వ్రాయవలెను.

నీతిముక్తావళి:—గ్రంథకర్త: శ్రీ. నూతులపాటి నరసింహశతశిల్పిగారు. క్రౌనుసైజు ౨౪ పుటలు. వెల ౪ అణాలు. చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

'అన్నమాటను తప్పకుము,' 'ఆడవారి నొంటరిగ నాటకములకు పంపకుము,' 'నీపుస్తకములను శుభ్రముగ నుంచుకొనుము'—ఇట్టినీతివాక్యములు నిండినపుస్తకమిది.

రామదాసునాటకము:—గ్రంథకర్త: రావుసాహేబు డి. వేంకటరమణయ్య, బి. ఏ. గారు. డెమ్మీసైజు ౯౦ పుటలు. వెల ౧ రు. రెండవకూర్పు.

తొలికూర్పులోని కొన్ని పాటలకు మారుగా నిందు కొన్నిపద్యములు రచింపబడినవి. పాటలన్నియు గ్రంథముచివర అనుబంధముగా చేర్పబడినవి 'ఈ రెండవకూర్పులో గ్రంథము నింకను రంగానుకూలముగా నొనరించినాను' అని గ్రంథకర్తగారు ఉపోద్ఘాతమున వ్రాసుకొన్నారు.

ఈ పుస్తకము దొరకుచోటు:—

వావిళ్ల రామస్వామిశాస్త్రి అండ్‌సన్స్, 292, ఎస్‌ప్లనేడ్, చెన్నపురి. హిగిన్ బాతమ్ కంపెనీ రైల్వే పుస్తకశాలలలో కూడ దొరకును.

శ్రీమన్నారాయణకవచము:— బమ్మెరపోతనామాత్యకృతము. శ్రీ. అయ్యగారి వీరభద్రరావుగారిచే టీక వ్రాయబడినది. వెల ౪ అణాలు.

శేషచల్ బుక్ డిపో, రాజమండ్రి.

శ్రీసూర్యపురాణము:—గ్రంథకర్త: శ్రీ వేమూరి జగన్నాథశర్మగారు. శ్రీ గిడుగు వేంకట సీతాపతిగారిచే సంశోధితము డెమ్మీసైజు ౧౩౪ పుటలు.

శ్రీగిడుగు వేంకట రామమూర్తిపంతులు గారు దీనిపై నొసగిన యభిప్రాయము తిలకింపదగినది. అందు వారు-'అష్టాదశపురాణసారము తెలుగున వచనముగా రచించిన శ్రీవేమూరి జగన్నాథశర్మగారు ఓఢ్రభాషలో నున్న సూర్యపురాణము తెలుగుచేసి తెలుగువారికి వందనీయులైనారు...రచన సాఫుగానే ఉన్నది ...ఇదివరకు మేము కనివిని ఎరుగని ముచ్చట్లు ఎన్నో ఈపురాణమందున్నవి. ఇతరపురాణములు ఏఉద్దేశముతో తెలుగువారు చదువుతున్నారో ఆఉద్దేశముతోనే ఈసూర్యపురాణము కూడా చదివితే వారికోరిక తప్పకుండా నెరవేరుతుంది.' అని వ్రాసినారు.

వలయువారు గ్రంథకర్తగారి పేర 'సహోపాధ్యాయులు, ఆస్కా-హైస్కూలు, ఛత్రపురం, గంజాం జిల్లా' అని వ్రాయవలెను.

దీనబంధు కబీరు:—గ్రంథకర్త: శ్రీతారానాథ్ గారు. ప్రకాశకులు: అమెచ్యూర్ డ్రమేటిక్ అసోసియేషన్, బెంగుళూరుసిటీ. క్రౌనుసైజు ౬౮ పుటలు. (వెల తెలియదు.)

ఇది యొక హిందీనాటకము. దీనికి గాంధిమహాత్ముడు వ్రాసిన భూమికయనువాదము ఈదిగువ గలదు:

'నాకునాటకజ్ఞాన మేమియు లేదు. నేనీప్రయత్నము ననుమోదించుచున్నాను. దీనివలన రాష్ట్రభాషాప్రేమ యీప్రదేశమున వృద్ధిపొందు ననుఆశతో అట్లు చేయుచున్నాను.'

ఇది స్వల్పకాలములో ప్రదర్శించుట కనువుగ వ్రాయబడినది.

భద్రాద్రిరాముడు:—కర్త: శ్రీ. అల్లమరాజు నారాయణరావుగారు. క్రౌనుసైజు ౯౯ పుటలు. వెల ౦-౨-౦. లలితా అండ్ కో., గవర్నరుపేట, బెజవాడ, కృష్ణాజిల్లా.

చపల:—అనువాదకర్త: శ్రీ పండిత ఆదిభట్ల లక్ష్మీనయ్యసిద్ధాంతిగారు. డెమ్మీసైజు ౨౩౪ పుటలు. వెల రు. ౧-౦-౦.

ఇదియొక [illegible]. ఇది శ్రీ. క్షేత్రమోహనఘోషుగారి వంగమూలమున కనువాదము. కథ రక్తి గూర్చుచున్నది. శైలియు సరళముగనే యున్నది.

వలయువారు [illegible] గ్రంథమాలాధికారులకు, 'పూడిపెద్దివారి వీథి, బరంపురం (గంజాం)' అని వ్రాయవలెను.

వెన్నెలకుప్పలు:—సంపాదకులు: శ్రీకోటకూరు సత్యనారాయణరావుగారు. క్రౌనుసైజు ౫౬ పుటలు. వెల సారస్వతచంద్రికామండలి చందాదారులకు రు. ౧, ఇతరులకు రు. ౧-౮-౦.

సారస్వతచంద్రికామండలి, అన్నపాడు, గంపలగూడెంపోస్టు (కృష్ణాజిల్లా.)

ఇది కొన్ని ఆధునిక ఖండకావ్యముల సంపుటము.

## శ్రీనందిరాజ లక్ష్మీనారాయణ దీక్షితచరిత్రము

అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజి విరచితము

పద్యకావ్యము ౫ ఆశ్వాసములు. డబుల్ క్రౌను సైజులో ౩౮౦ పేజీలుగల గ్రంథము. ఆంధ్రదేశమునందు సుమారు ౧౦౦ సం. క్రిందట జన్మించి నియోగి బ్రాహ్మణులయందు వేదవిద్యను వ్యాపింపజేసిన నందిరాజ లక్ష్మీనారాయణదీక్షితులవారి జీవితచరిత్ర మిందు వివరముగ వర్ణింపబడియున్నది. పాఠకులకు సులభముగ తెలియుటకై పీఠికయందు దీక్షితులవారిచరిత్రము సంగ్రహముగ వచనమున వ్రాయబడియున్నది. వెల రు. ౧.

విలాసము: అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజిగారు. హైస్కూలు తెలుగుపండితులు, పెరవలి-చావలిపోస్టు, గుంటూరుజిల్లా.

ధమ్మపదము:—[ఆంధ్రగ్రంథమాలయందలి ఎనిమిదవకుసుమము] ఇది శ్రీ కిడాంబి రంగాచార్యులుగారు అనువదించినది. క్రౌనుసైజు ౧౧౨ పుటలు. వెల ౧౨ అణాలు.

ఆంధ్రగ్రంథమాల, ౭, తంబుచెట్టివీధి, మదరాసు.

ఇది 'పాళీభాషయందు వ్రాయబడిన బౌద్ధవైదిక గ్రంథములలో' నొక్కటి. క్లిష్టపదములున్నను అనువాదము సుబోధముగనే యున్నది.

ఇందు 'బుద్ధునిధర్మోపదేశములు,' 'బౌద్ధమతసిద్ధాంతములు' అను రెండనుబంధములు చేరియున్నవి. తుట్టతుదను కొన్ని పారిభాషికపదములకు పట్టికనిటిప్పణ మున్నది. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు దీనికి ప్రశస్తమైన ప్రస్తావన వ్రాసియున్నారు.

ఇది ఆంధ్రభాషలోని బౌద్ధమతవిషయికవాఙ్మయమున నొక విలువగలగ్రంథము.

# పత్రికలు

## సుభాషి. సంపుటం ౧. సంచిక ౧.

౧౯౪౮ సం. అక్టోబరునెలలో క్రొత్తగాపుట్టింది యీపత్రిక. సంపాదకులు శ్రీయుత పందిరి మల్లికార్జునరావుగారు. రాజమండ్రి.

| | | |
|---|---|---|
| చందా సంవత్సరానికి | రు. | ౩-౦-౦ |
| ,, ఆరునెల్లకు | రు. | ౨-౦-౦ |

దేశంలో విజ్ఞానంపరుగులు బారాలంటే మంచిపత్రికలు కావాలె. కాని మనదేశంలో ఉండేవెన్ని? ఎవరైనా ఉత్సాహంకొద్దీ డబ్బుపెట్టి పత్రికలుప్రకటిద్దామంటే వాళ్లకు మంచివ్యాసాలు వ్రాసేవాళ్లూ,సదివేవాళ్లూ దొరకడం కష్టంగా ఉంటుంది. అసలు మనదేశంలో చదువుకొన్నవాళ్లు తక్కువ. ఆకొందరిలోనైన పత్రికలు చదవడానికి, వ్యాసాలువ్రాయడానికి ఆశ, ఉత్సాహం ఉండేవాళ్లు చాలాకొంచెమంది. ఇట్లాంటప్పుడుపత్రికలను ఎట్లానెగ్గించడంకీ కాని ధైర్యంచేసి ఒకొక్కరు ప్రారంభిస్తూనే ఉంటారు. శ్రీమల్లికార్జునరావుగా రట్లాంటివాళ్లలో ఒక్కరు.ఉపక్రమణికలో వారుచెప్పారు :

"ఆంధ్రులభాషాసేవాభిలాషతో డగిన మొగ్గలలో ఇదికొత్తది. క్రొత్తభావాలతో రేకెత్తింది." అనీ,

సారస్వత, మత, సాంఘిక, రాజకీయ ఆర్థికరంగాల్లో ప్రబలిన వాదప్రతివాదాలనుగూర్చి ఉపక్రమణికలో ముచ్చటగా చర్చిస్తూ వాటి "సంరంభంలో-ఈనవయుగములలో సారస్వతము, కళ, చరిత్ర, ఈమూటిరూపంగా తెలుగు హృదయాన్ని వ్యక్తీకరించడమే మాఆశయము" అనీ,

"ఈ పైసంకల్పాలు నిండుమనస్సులో తొణుకులాడిన ఫలితమే యీపత్రిక" అనీ.

ఇట్లాంటి తనఉద్దేశాలను నెరవేర్చుకోడానికి ఈపత్రిక బాగాపనిచేస్తూ చిరంజీవిగా మనవాలె.

ఈసంచికకు తెలుగుదేశంలో సారస్వతప్రపంచాన పేరువచ్చిన పెద్దలే వ్యాసాలు వ్రాశారు.

శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారువ్రాసిన 'అన్నయదేవుడు—వింతచరిత్రాంశములు'అనేవ్యాసం 'అకాలమున వనులోమువివాహములు బాహాటముగా రాజకుటుంబములలో జరుగుచున్నట్లు స్పష్టముగా' తెలియజేస్తూంది. శ్రీయుతులు-శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, విశ్వనాథసత్యనారాయణగారు వ్రాసినపద్యవ్యాసాలు భాగవర్ధితాలు, రసోత్తరాలు. శ్రీ. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసినకథ మంచియెత్తుమీదనెగ్గి వ్యావహారిక భాషాసారస్యాన్ని చమత్కారంగా చూపిస్తూంది. ఇంకా రెండుమూడు గద్యపద్యవ్యాసాలూ కలవు.





# సాభిప్రాయ విశేషములు

శ్లో. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయో ఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవసః.

మానవులు సంకల్పసిద్ధిని బడయుటకు భక్తిశ్రద్ధలు మూలసాధనములుగ నున్నవి. భక్తిశ్రద్ధలులేని పనులు వ్యర్థములైన మనోరథములవలెను పుట్టిగిట్టుచుండును. భక్తిశ్రద్ధలు గలుగకను తామసించి పనులను జేయుట తగదని వేమనయోగి చేసిన హితోపదేశమును వర్తమానకాలమునందు ప్రపంచ మంతయును మననము చేయదగి యున్నది. వేగిరపడుటవలనను విషమస్థితి గలుగుచున్నది. వాయువిమానములు, వాయువార్తలుపరిపాటియైన యుగమునందైనను వేగిరపడుట ప్రయోజనకరము గాదు. వ్యక్తులు, కులములు, సంఘములు, జాతులు ఒక్కసారి స్వర్గారోహణము చేయుదలపడుచున్నవి. ఎవరికిని సాధ్యాసాధ్యములతో నిమిత్తము గనుపడకున్నది. ఈవేగావేశమునందు చెప్పుటకును వినుటకును సావకాశము గలుగకున్నది. సత్త్వశుద్ధిలేకను కార్యసిద్ధి దుర్లభమగుచున్నది. సత్త్వశుద్ధిలేకను ప్రపంచ మంతయును సంక్షోభమును బొందుచున్నది.

శాంతినిప్రతిష్ఠించుట కేర్పడిన నానాజాతి సమితి శాంతిస్థాపనమునకు నిరర్థకమైనది; ప్రబలములైన పాశ్చాత్యరాజ్యముల స్వప్రయోజనములకు వినియోగపడుచున్నది. బ్రిటీషు మంత్రివర్గ మాయుధధారణానియమమున కభ్యంతరములను గల్పించుచున్నది. ఇటలీదండయాత్ర నభినయించుచున్నది. ఫ్రాన్సుసంగ్రామభయమున నటించుచున్నది. రుష్యా సోవిటు ప్రాజాపత్యమును విశ్వమునం దంతటను స్థాపింప గోరుచున్నది. యూరపురాజ్యములన్నియును యుద్ధజ్వరదాహమును గోరుచున్నవి. మాటలందు జనీవా సమావేశము, శాంతిస్థాపనము, ఆయుధనియమనము, మానవస్వాతంత్ర్యము- చేతలందు సంగ్రామము, మానవ దాస్యము, పరపీడనము ప్రత్యక్షమగుచున్నవి. యూరపు సంగ్రామఫలము శ్మశానవైరాగ్యము, ప్రసూతి వైరాగ్యము చందమైనది.

యుద్ధము ముగిసి పదేండ్లు గాకపోయినను యుద్ధజ్వరము యూరపురాజ్యముల నావహించినది. యూరపు రాజ్యముల విజయములకును, ప్రపంచపీడనమునకును గారణంబైన ఆయుధసంచయము యూరపురాజ్యములవినాశనమునకు గారణంబగుట ప్రకృతి

ధర్మము. సుందోపసుందోపాఖ్యానమునందు మొదటి యధ్యాయములు యూరపుమహాసంగ్రామముతో ముగిసినవి. కడపటి యధ్యాయములు యూరపునందును, ఆసియాయందును నారంభమగుచున్నవి. భవిష్యాధ్యాయముల ఫలము మహాదారుణముగ నుండగలవిధమును యూరపుపరిస్థితులు, చీనాపరిస్థితులు విశదము చేయుచున్నవి. రుష్యాయందు మహాపరివర్తన మేర్పడినది. ఇంగ్లాండునందు సంపన్న కార్మిక సంరంభము వృద్ధియగుచున్నది. చీనాయందు మహాసంక్షోభము చెలరేగుచున్నది. ఆసియాయందలిచిత్రకథ భావికాలమునం దాఫ్రికాకు వ్యాపించ గలదు. లియోనార్డు వుల్ఫుగారు మొదలగువారు చేసెడి హితోపదేశములు సామ్రాజ్యలోభోపహతులకు సంతృప్తినిగలుగ జేయజాలవు.

యూరపు విజయములు పశుబల విజయములు; స్వప్రయోజన విజయములు; పరపీడన విజయములు. యూరపు విజయములాసియాహృదయమును నిర్వీర్యము చేసినవి. యూరపు రాజ్యముల యంతఃకలహములు ఆసియాప్రజల నిశ్చేష్టతను తొలగించినవి. ఆసియాప్రజల కాత్మవిశ్వాసము గలిగినది. పాశ్చాత్యపాశబద్ధులైన ప్రజల కాత్మవిశ్వాసము గలిగినను పాశబంధములను తొలగించెడి మార్గము సాధ్యము గాకున్నది. పాశ్చాత్య పాశబంధములు భిన్న దేశములందు భిన్నరూపముల నున్నవి. తురుష్క పారసీకరాజ్యముల నార్థికపాశములు బంధించుచున్నవి. చీనాను ఆర్థికవాణిజ్య పాశబంధములు బంధించుచున్నవి. భరతవర్షమును ఆర్థికవాణిజ్య రాజకీయవైజ్ఞానికాది నానావిధ పాశములును బంధించుచున్నవి. పాశబద్ధములైన దేశములందు భరతవర్షస్థితి బహుదైన్యముగ, నున్నవిధము ప్రపంచవిఖ్యాతముగ నున్నది.

విజ్ఞానపరాక్రమ సంపన్నులైన ముప్పది కోట్లప్రజలుకొఱగాములగుచు మహాకష్టముల ననుభవించుచున్నారు. ప్రజలదుస్సహమైనస్థితి కోపావేశమును గలుగజేయుచున్నను సంఘనాయకుల స్వప్రయోజన పరాయణత్వము పాశబంధములను బిగదీయుటకు వినియోగపడుచున్నదిగాని సడలించుటకు వినియోగపడుటలేదు. జపాను తుర్కీ దేశములు పరదేశ పాశబంధములను విడిపించుకొనగల సాధనమును ప్రాచ్యులకు విశదము చేసినవి; ఇపుడు ఈజిప్టు పరిషియా చీనారాజ్యములు విశదము చేయుచున్నవి. భారతీయులకును అంతఃకలహములుపోయి సంయోగము గలుగనంతవరకును పాశబంధములనుతొలగించుటకు ప్రజలకు శక్తి చాలదు. మొదటి పాఠపుస్తకమునందు గల కట్టెలమోపు కథనే భారతీయుల యంతర్విభేదములు సంస్మరింపజేయుచున్నవి. కట్టెలను ప్రత్యేకించి విరుచుట సులభము. మోపుగ నేకమై యున్నపుడు భేదించుట దుర్లభము. ఈరహస్యము బ్రిటీషుప్రభుత్వబలమును, భారతీయుల దుర్బలమును విశదముచేయుచున్నవి. అంతర్విభేదములకును, పరాధీనత్వమునకును చిరకాలాభ్యస్తమైన భరత ఖండమునందు సంయోగము దుస్తరముగ నున్నది. సంయో

గావసరమును భారతీయులు గ్రహించుచున్న విధమును కలకత్తాయందు గూడిన సంయోగ సమావేశము, ఢిల్లీయందు గూడిన రాజప్రతినిధి సమావేశము విశదము చేయుచున్నవి.

*     *     *     *

సంయోగసమావేశము

శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు వారి శక్తిసామర్థ్యములు వినియోగించి సంయోగ సమావేశమును సఫలముచేసి భారతీయుల కృతజ్ఞతకు బాత్రు లగుచున్నారు. హిందూ మహమ్మదీయసమస్య, హిందువులును మహమ్మదీయులును నున్నంతవరకును నిలిచియే యుండును. ఆసమస్య తీవ్రరూపమును దాల్చినపుడే శాంతిసహానము లవసరములు. శ్రద్ధానందస్వాములు మొదలగు వారి హత్యలు హిందూ మహమ్మదీయ సమస్యను భయప్రదము చేసినవి. శుద్ధి తాంజీను ఉద్యమములు, మేళతాళములు, గోబలులు హిందూ మహమ్మదీయ సమస్యకు పరోక్షకారణంబులైనను ప్రత్యక్షకారణంబులు గాజాలవు. ఈ సమస్యలు చిరకాలము నుండియును వచ్చుచున్నవి; చిరకాలముండగలవు. కాని ప్రస్తుతసమయమునందు భయంకరాకారమును దాల్చుటకు గారణము రాజకీయముగాని మతసంబంధము గాదు. పరాధీనస్థితియందున్న దేశమునందు రాజకీయసంరంభము సహజముగను గలుగుచుండును. పట్టుదల లేర్పడినపు డన్నివిషయము లందును పట్టుదలలు ప్రబలుచుండును. హిందూ మహమ్మదీయులు పట్టుదలలను విడిచినపుడు దేశముమీదను ప్రజలకు భక్తిశ్రద్ధలు వర్ధిలుట కవకాశములు విస్తరింపగలవు.

కొందరు చెప్పినటులు గోబలులు లేనిచోట్లను గోబలులు హెచ్చుటయును, అ వాటు లేనిచోటను మేళతాళముల నాపుటయును సంప్రాప్తము గాజాలదు. సంప్రాప్తమైనను హిందూమహమ్మదీయులు ప్రత్యేకమైన హక్కులను రక్షించుకొనుటకు పట్టుపట్టినంతవరకును సమావేశములు నిరర్థకములు. సమరసభావముతో నీవిషయమును నిర్ణయించవలయును. ఈవిషయవిచారణ చిరకాలము నుండియును జరుగుచున్నది. కాలయాపనము విభేదములను పెంచుచున్నది గాని సంయోగమునకు వినియోగపడుటలేదు. ఇట్టి విషమపరిస్థితులందు కలకత్తాయందు సంయోగ సమావేశము చేసిన తీర్మానములు ప్రశంసార్హములుగాని నిందార్హములు గావు. సంధిషరతులకు సమగ్రత్వ మసంభవము. ఈషరతులమీదను సంయోగసౌధమునుగట్టుట కవకాశములు గలవు. ప్రజానాయకుల యందు భేదాభిప్రాయము లీవిషయమై పెరుగుట యనవసరము. సంయోగ సమావేశ మామోదించినయొడంబడికలు సమగ్రములుగాని, శాశ్వతములుగాని కాజాలవు. క్రొత్తపరిస్థితులు క్రొత్తరాయబారములు నిరంతరము సంప్రాప్తమగుచుండును.

ప్రస్తుతము నిర్ణయించిన యొడంబడికలు మహమ్మదీయుల కనుకూలములైనను భరతఖండమున శాంతిస్థాపనమునకు ప్రయో

జనకరములై సంయోగమున కవసరంబులుగ నున్నవి. హిందూమహమ్మదీయుల కన్యోన్య విశ్వాసము, మిత్రత్వము గలుగుట కుభయ పక్షములును మహాత్యాగము చేసినను నష్టము గలుగదు. మహమ్మదీయులు బాహ్యదృష్టిని వదలి మాతృదేశమునందు వారిదృష్టిని లగ్నము చేయుటకు హిందువులబలము, త్యాగము సాధనములుగ నున్నవి. హిందువులందన్నికులముల వారును వర్ణాశ్రమ ధర్మములందలి నామరూపములను విసర్జించి భావము నారాధించుట ప్రయోజనకరము. శుద్ధిసంఘటనోద్యమములను దేశమంతయును నవలంబించునపుడు హిందూసంఘమున కపూర్వమైనబలము గలుగగలదు. మహమ్మదీయసంఘమునందు ప్రబోధము వ్యాప్త మగునపుడు గోవధరూపమైన జీవహింస సహజముగను నంతరింపగలదు. మాంసాశనమును మహర్షులును, మునులును, భక్తులును నిరసించిన విధమునను ప్రపంచ మంతయును నిరసించునపుడు మహమ్మదీయులును గోవధను, గోమాంసభక్షణమును నిరసింపగలరు.

హిందువులు హిందూధర్మోద్ధరణమును జేయుటయె భారతాభ్యుదయమునకును, ప్రపంచకల్యాణమునకును సాధనముగ నున్నది. అహింసాధర్మమును, మాంసాశననిరసనమును ప్రపంచమునకు ప్రసాదించిన భారతభూమియందు మాంసాశనులు, బలులు, జాతరలు ప్రబలుట భారత ధర్మవైకల్యమును విశదము చేయుచున్నది. భారతధర్మోద్ధరణమునకు భారతసత్త్వోద్ధరణము సాధనముగ నున్నది. ప్రజానాయకులు భక్తిశ్రద్ధలు గలిగి అంతర్విభేదములను విసర్జించి ప్రజాసత్త్వాభ్యుదయమునకై పాటుపడి మాతృదేశ పాశబంధములను ధర్మమార్గమునను విచ్ఛేదము చేయుదురు గాత! బ్రిటీషు రాజ్యాధికారులు వారిపాశబంధములను దృఢతరము చేయుటకు చేయుచున్న ప్రయత్నములు బ్రిటీషుసామ్రాజ్యమునం దంతటను ప్రత్యక్ష మగుచు భారతీయులకు ప్రతిబంధకముగ నున్నవి. మహోపద్రవావస్థయందైనను భారతీయు లంతర్విభేదములను విసర్జించి సంయోగబలమును విశదము చేసి కృతార్థులగుట వివేకము, ధర్మము.

* * * *

బ్రిటీషుసామ్రాజ్యము–భారతీయులు

బ్రిటీషుసామ్రాజ్యము శ్వేతసామ్రాజ్యము గాని మానవధర్మసామ్రాజ్యము గాదని సకలదేశవ్యవహారములు విశదము చేయుచున్నవి. సామ్రాజ్యాంతర్భాగములందును, స్వదేశమునందును, విదేశములందును భారతీయులు దాసులుగ నుండుట కవకాశములు గలవు గాని సమానులుగ నుండుట కవకాశములు లేవు. ఫ్రాన్సురణరంగమునందు బ్రిటీషు సామ్రాజ్యమునకును, మానవస్వాతంత్ర్యమునకును ఆత్మార్పణము చేసిన భారతీయయోధులకు సమాధులను నిర్మించుటయును, వారిగుణములను సంకీర్తనము చేయుటయును సుకరము. బర్కెనుహెడ్డు ప్రభువు, రీడింగు ప్రభువు, ఫాకు సేనాధ్యక్షుడు భారతయోధుల త్యాగమును, శౌర్యప్రతాపములను కొనియాడుట

సూకరము. క్రియ వచ్చినపుడు మాత్రము బర్కెను హెడ్డుప్రభువునకును, శ్వేతముఖులకును చేతులు వెనుకబడుచున్నవి.

భారతీయులు సైన్యమునందును, పరిశ్రమలందును, రాజ్యాంగములందును దాసులుగను బనిజేయునంతవరకును, వారు వీరులు, విశ్వసనీయులు, ప్రభుభక్తిపరాయణులును నగుచున్నారు. స్వతంత్రమును వ్యక్తము చేసిన వెంటనే పిరికిపందలును, కుత్సితులును, రాజద్రోహులును నగుచున్నారు. ఈ విపరీతభావములకు స్వప్రయోజనపరాయణత్వము, శ్వేతజాత్యభిమానము, సంభావనాభావము గారణములుగ నున్నవి. భారతీయుల సాహచర్య మంతరించిన వెంటనే బ్రిటీషుసామ్రాజ్యప్రతిభకు దౌర్బల్యము గలుగుట సహజము. బ్రిటీషుగయానా యందును, కెనియాయందును, తూర్పుదక్షిణాఫ్రికాలందును, మలయాసింహళములందును భాంతీయుల సహాయము తెల్లదొరల లాభములకు సాధనంబుగ నున్నది. భారతీయుల సహాయము లేనపు డిపుడు వారు తలచునటులు దేశము నంతను ననుభవించి జీర్ణముచేసికొనజాలరు.

కన్సర్వేటివుప్రభుత్వము భారతీయుల హక్కులను నిర్మూలము చేయుటకు సామ్రాజ్యమునం దంతటను చేయుచున్న దుష్ప్రయత్నములకును, బర్కెను హెడు ప్రభువున్యాపాపెలునందు జెప్పిన తియ్యని మాటలకును సంబంధ మెచ్చటను గనుపడదు. బ్రిటీషు ప్రభుత్వాధికారులు రానున్న యుపద్రవమునుండి తప్పించుకొనుట కవలంబించుచున్న మార్గము మాత్రము నిరర్థకముగ నున్నది. నిర్బంధములు భక్తి విశ్వాసములను గలుగ జేయజాలవు. శ్వేతప్రజలపట్లను జూపుచున్న భక్తివిశ్వాసములను శ్వేతేతర ప్రజలకు వారి స్వగృహము లందు జూపకుండుట శ్రేయఃప్రాప్తికి సాధనము గాదు. తుపాకులు ప్రాణహింసను జేయుటకు వినియోగపడును గాని ప్రాణసంవర్ధనమును జేయుటకు సాధనంబులు గావు. గయానా, కెనియా, ఆఫ్రికా మొదలగు దేశములందు భారతీయుల సాహచర్యము తెల్లవారు బాగుపడుటకును, బ్రిటీషు సామ్రాజ్యము వికసించుటకును నవకాశములను గలుగజేసినది. సమానుల సాహచర్యము వలెను బానిసల సాహచర్యము కార్యసిద్ధికి ప్రయోజనకరము గాదు. ప్రపంచానుభవ మీధర్మమును సహస్రముఖములను బోధించుచున్నను సంకుచితహృదయము ప్రతిబంధకముగ నున్నది. బ్రిటీషుప్రభుత్వమును, భారతప్రభుత్వమును దలపెట్టిన స్టాట్యూటరి కమిషను బ్రిటీషుప్రభుత్వముయొక్క సహజమైన సంకుచితహృదయమును విశదము చేయుచున్నది.

* * * *

### స్టాట్యూటరి కమిషను - భారతీయులు

కమిషను నిర్ధారణను భారత బ్రిటీషు ప్రభుత్వములు ఆగస్టుమాసమునందు జేసినవి: పార్లమెంటరికమిషను నిర్ణయించినది. కమిషనునందు భారతీయప్రాతినిధ్యము లేకపోయినను కార్యనిర్వాహకసభ యామోదించినది. సర్ హబీబుల్లా సాహెబుగారు మాత్రము ప్రతికూలాభిప్రాయమును దెలిపిరట! ఇపు[illegible] సుగుణసంపన్నులైన ఇర్విను ప్రభువుగారు ప్రదర్శించుచున్న ప్రదర్శనమునకు మాత్రమర్థము గనుపడకున్నది. స్థిరపడిన విషయమునుగురించి నాయకులతో సంప్రతించుటకు రాజప్రతినిధి ఏల పూనుకొనెనో తెలియ

కున్నది. గాంధిమహాత్ముడు, శ్రీనివాసయ్యం
గారు, అన్సారి, జిన్నా, పటేలుగారులు మొద
...వారితో ఇర్విను ప్రభువు సానుభూతిని
గలిగి మాటలాడినను ఫలము మాత్రము
సమానముగ నున్నది. రాజప్రతినిధి యవ
లంబించిన చతురోపాయమె బ్రిటీషు భారత
ప్రభుత్వము లవలంబించిన యనుచిత విధాన
మునకు వ్యాఖ్యానముగ నున్నది. భారత
రాజ్యాంగమునకు సంబంధించిన కమీషను
నందు భారత ప్రతినిధులు లేకుండుట నాయ
కుడు లేని నాటకమువలె నున్నది. అస్సెంబ్లీ సరు
లను, సహకారసభ్యులను నియమించుట నిర
ర్థకము. బ్రిటీషు ప్రభుత్వము పార్లమెంటు
...్యులను నియమించునటులు భారత ప్రభు
...ము సామ్రాజ్య శాసనసభ్యులను నియమిం
చుట సమంజసముగ నుండును. న్యాయదృష్టి
గల ఇర్విను ప్రభువునకు నాయకులతో జేసిన
సంప్రతింపులు కర్తవ్యమును వ్యక్తముచేసి
యుండును. పార్లమెంటు పక్షములనుండి వలె
సామ్రాజ్య సభాసభ్యులపక్షములనుండి సమాన
సంఖ్యగల సభ్యులను నియమించి ఇర్విను
ప్రభువు స్వధర్మనిర్వహణమును జేయునని
నమ్ముచున్నాము. కేవలము పార్లమెంటరి
కమిషనును భారతీయులు బహిష్కరించుట
సహజమని బ్రిటీషుప్రభుత్వము గ్రహించి
వారి నిర్ణయములను మార్చుకొనియెద రని
నమ్ముచున్నాము. వర్తమానమహోపద్రవ
సమయమునం దైనను భారతీయు లంతర్విభేద
ములను విడిచి సంయోగబలమును వ్యక్తము
చేసి భారతసత్త్వమును బ్రిటీషుప్రభుత్వము
నకు విశదము చేయుదురు గాత! గాంధిమహా
త్ముడు ప్రతిపాదించిన సాత్త్వికనిరోధమును
జూపుటకు వర్తమానసమయమును భార
తీయులు వినియోగించి కృతకృత్యు లగుదు
గాత!

* * * *

సాత్త్వికనిరోధము

రాజ్యాంగవ్యవహారముం...
గల విఠలభాయి పటేలుగారు భా...
పాశబంధవిమోచనమునకు సాత్త్వి...
శరణ్యమని పునహాయం దిటీవల...
యుండిరి. యూరపుసంచారానంతర...
గా రీభావమును ప్రకటించుట వారి...
ప్రభుత్వముపట్లను గల విశ్వాసాభా...
నిదర్శనముగ నున్నది. కన్సర్వేటి...
ము శ్వేతపాశబంధములను సర్వ...
చున్న విధమును భారతవర్ష వ్యవహా...
వలన రాజ్య వ్యవహారములును వి...
చున్నవి. సంకల్పసిద్ధికి సాత్త్విక...
మన సాధనములు ఉత్తమ మధ్య...
సాధనములుగ నున్నవి. పశుబలము
సిద్ధి కధమసాధనముగ నున్నది. య...
రాజ్యముల విజయముల కవలంబనముగ ...
ఆయుధధారణము ప్రపంచనాశనమునకు ...
యోగపడుచున్నది. ఆయుధభారము ప్ర...
సత్త్వమును నాశనము చేయుచున్నది. దేశ...
దాయ మంతయును ఆయుధధారణ వ్యయమ...
నకు వినియోగపడుచున్నది. ప్రజాసత్త్వము
నిర్వీర్యమై రాజనతానుసరూపములను దాల్చు...
చున్నది. ఆయుధనియమము కుదిరినను యూ...
రపు రాజ్యముల ప్రయోజనముల కేర్పడ...
చున్నది గాని తదితరుల కుపయోగపడజాల...
దు. పరాధీన దేశములం దాయుధధారణము
స్వదేశస్థులయందును రాజద్రోహముగ నున్న
ది. పిస్తోళ్లకును రాజద్రోహములకును సంబం
ధము భారతకోశమునందు బాగుగ జీర్ణించి...

నది. ప్రస్తుతము దేశమునం దంతటను పిస్తో ళ్లను బట్టుకొనుటకు జరుగుచున్న సోదాలు పోలీసు పరిపాలనమునకు నిదర్శనముగ ను ... తామస సాధనములు స్వరాజ్య ...ందు గలుగ జేయగలసంక్షోభము ...ంభముమహోదృశ్యముగనున్నది. ...యుధులైన చీనాప్రజ లనుభ ... దుఃఖవేదన నిరాయుధులైన ...లనుభవింపగల విధమునకు నిదర్శ ...న్నది. జలియనువాలాబాగుహత్య ... నిరాధారస్థితిని భయంకరముగను ...చేయు చున్నవి. ఈ బీభత్సనాటక ...ంచుటకు భారతీయులకు దగిన ...ములు లేవు శక్తిసామర్థ్యములు ...ందు గలిగినను రాజస తామస ... పరమార్థములకును సాధన ...విధమును యూరపు రాజ్యముల ...ము విశదము చేయుచున్నది. యూర ...ముల చరిత్రము చరమాధ్యాయము ప్రదర్శింపబడనున్నది.

ఇపుడు నానాజాతిసమితి నిర్ణయింప దలచిన ధర్మ సందేశమును అశోకచక్రవర్తి 2300 ఏండ్ల క్రితము ప్రపంచమున కుపదేశించిన విధమునకు వారి శిలాశాసనములు నేటి ... సాక్షీభూతములుగ నున్నవి. ప్రపంచ ...మునందు ధర్మ విజయము వలెను ఆయుధ విజయములు ధర్మసిద్ధికి సాధనములు గావు. భారతీయులుప్రాచీనకాలమునందు ప్రదర్శించిన సాత్త్వికవిజయమె వర్తమాన కాలమునందును ప్రపంచశాంతికి సాధనంబుగ నున్నది. భారతీయులుసాత్త్వికనిరోధమునభ్యసించుటకు భార...య సంస్కారము అనుకూలముగ నున్నది.

బుద్ధభగవానుని ధర్మసందేశము ప్రపంచము నంతయును జయించినది. భారత విజయములు ధర్మవిజయములుగాని తామ... విజయములు గావు. భారతీయ విజయముల ప్రతిభను నేటికిని జావా, బలి, సయాము ప్రాంతములందు ప్రత్యక్షముగ నున్నది. రవీంద్రనాథ ఠాకూరు గారు జావా సయాము యాత్రానంతరము చాటిన సందేశము భారతీయవిజ్ఞానవిజయములను వ్యక్తము చేయుచున్నది పరదేశాక్రమణము, పరధనాపేక్ష, పరదాస్యము రాజస తామసపరమైన పాశ్చాత్యవిజయములకు ఫలము. ఆ విజయముల దుష్ఫలము ననుభవించుచున్న ప్రపంచమంతయును పాశ్చాత్యాయుధ విధానమున... ప్రతిఘటనమును జూపుచున్నది. ఆ ప్రతిఘటనమునందు నాయకత్వమును వహించుటకు భారత సంస్కారము సకల విధములను తగియున్నది. భారతీయసాత్త్వికవిజయము విజ్ఞానవిజయము, త్యాగవిజయము, ధర్మవిజయము, ప్రేమవిజయము. వర్తమానకాలమునందు ప్రపంచము రాజసవిజయములను నిరసించి సాత్త్వికవిజయములను బడయుటకు పరితపించుచున్న విధము మహానుభావుల యుపదేశములు విశదము చేయుచున్నవి. భారతహృదయమునందు ప్రక్షిప్తముగనున్న ధర్మసంస్కారమును గాంధిమహాత్ముడు సాత్త్వికనిరోధరూపమునను లోకమునందు ప్రతిష్ఠించుటకు బూనుకొనుచున్నాడు. భారతీయులు ప్రక్షిప్తముగ నున్న సత్త్వమును ప్రత్యక్షముచేసి శ్రద్ధాపరాయణులై సాత్త్వికనిరోధము నభ్యసించుచు సకల శుభంబులను బడయుదురు గాక!

---

...ited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G.T., Madras



దమయంతి

చిత్రకారుడు: ఏ. వెంకటేశ్వరరావు గారు, రాజమండ్రి